# Shri Siddhantha Shikhamani

Parayana text

Written by : Sri Shivayogi Shivacarya

Script : Telugu / తెలుగు





Concept & Inspiration By : Sri Kashi Jagadguruji

Publication of

**Shaiva Bharathi Shodha Pratishthana**

Shri Kashi Peeth

# D35/77, Jangamawadimath,

Jangamawadi, Varanasi 221 001

# Shri Siddhantha Shikhamani

Parayana text

Written by : Sri Shivayogi Shivacarya

Script : Telugu / తెలుగు





రిసెర్చ్ పబ్లికేషన్స్ సిరీస్-60

శ్రీశివయోగి శివాచార్య విరచితము

# శ్రీసిద్ధాంతశిఖామణి

పారాయణగ్రంథము

సంపాదనము
ఆంధ్రానువాదము
డా॥ కారేకల్ ప్రతాప్

శైవభారతీ శోధప్రతిష్ఠానమ్
వారాణసి.
2014

ప్రకాశకులు :
శైవభారతీ శోధప్రతిష్ఠానమ్
# 35/77, జంగమవాడి మఠ్,
వారాణసి – 221 001
ఫోన్ నెం. 0542–2450546

పుటలు : xxxiii + 667



ప్రథమ ముద్రణ : 2012
ద్వితీయ ముద్రణ(సవరణలతో) : 2014

ప్రతులు : 10,000
ISBN : 978-81-86768-99-8

మూల్యం : రూ. 200/–

DTP : శ్రీవారిగ్రాఫిక్స్, తిరుపతి.

ముద్రణ :
విఘ్నేశ్వర ఆర్ట్ ప్రింటర్స్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్.
సెల్ నెం. 9912277341, 040–66820662

*Research Publication Series* -60

Śrī Śivayōgi Śivācārya Viracita

# ŚRĪ SIDDHĀNTA ŚIKHĀMAṆI

## PĀRĀYAṆAGRANTHAMU

Edited
with
Telugu Translation
By
**Dr. K. PRATAP**

**SHAIVA BHARATI SHODHA PRATISTHANAM**
VARANASI - 221 001
2014

Published by :
SHAIVA BHARATI SHODHA PRATISTHANAM
# 35-77, Jangamawadimath,
Varanasi-221 001
Ph : 0542-2450546

Pages : xxxiii + 667



First Impression : 2012
Revised edition : 2014

No of Copies : 10,000

ISBN : 978-81-86768-99-8

Price : Rs. 200/-

DTP : Srivari Graphics, Tirupati.

Printed at :
Vigneswara Art Printers,
Dilsuk Nagar, Hyderabad.
Cell : 9912277341, 040-66820662

**శ్రీమత్ రంభాపురీ వీరసింహాసనాధీశ్వరులు**
**శ్రీ 1008 జగద్గురు ప్రసన్నరేణుక వీరసోమేశ్వర**
**రాజదేశికేంద్ర శివాచార్య** మహాస్వాములవారు
సుక్షేత్రము - బాళేహొన్నూరు.

---

## శుభసందేశము

శ్రీకాశీ జ్ఞానసింహాసనాధీశ్వరులు, శ్రీ1008 జగద్గురు డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాములవారు ఈ సంవత్సరము శ్రావణమాసానుష్ఠానములో భాగముగా ఆంధ్రదేశములో ప్రొఫెసర్ కె. ప్రతాప్ గారి ఆంధ్రానువాదముతో వెలువడిన 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథము'ను లోకార్పణము చేయబోవుచున్నారని తెలుసుకొని అత్యంత ఆనందమైనది. ఈ పవిత్రదేశములో మహర్షులు ఆచార్యులు కాలానుగుణముగా వివిధ సిద్ధాంతములను, ఆచరణాత్మకమైన బోధనలను అందించి సమాజమును సామాజికులను సన్మార్గములో నడిపించుచూ వచ్చారు. శ్రీ జగద్గురు రేణుకభగవత్పాదులవారు అగస్త్యమహర్షులవారి మనసులోని సందేహములను పరిహరించి సంజీవని వంటి వీరశైవధర్మ దర్శనమును అనుగ్రహించినారు. అదియే శ్రీసిద్ధాంతశిఖామణి. ఇది వీరశైవధర్మమునకు శిఖరాయమానమైన

సద్గ్రంథము. జ్ఞానమునకు సాగరమువంటిది. ఇందులో శివాద్వైతసిద్ధాంతము నూటొక్క స్థలముల రూపములో నిరూపించబడినది. కామికాది వాతులాంతములయిన ఇరవది యెనిమిది శివాగమములసారము ఇందులో నిక్షిప్తము చేయబడినది. 1403 శ్లోకములలో నిబద్ధమైన ఈ గ్రంథము జనమానసముల నలరింపచేయగలదని, గ్రంథ పారాయణము చేయు భక్తులు భోగ మోక్షములకు పాత్రులు కాగలరని హృదయపూర్వకముగా కోరుకుంటున్నాము.

శుభాకాంక్షలతో

**– శ్రీ రంభాపురీ జగద్గురువులు**

**శ్రీమదుజ్జయినీ సద్ధర్మసింహాసనాధీశ్వరులు**
**శ్రీ 1008 జగద్గురు శ్రీ సిద్ధలింగ శివాచార్య**
మహాస్వాములవారు
సుక్షేత్రము – ఉజ్జయినీ.

---

## శుభసందేశము

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయములో సంస్కృతాచార్యులుగా పదవీవిరమణ చేసిన డా॥ కారేకల్ ప్రతాప్ గారి సంపాదకత్వములో రూపుదిద్దుకున్న 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథ' ఆంధ్రానువాదమును చూచి శ్రీ సన్నిధులవారి మానసము ఆనందతుందిలమైనది. పరమతపస్సంపన్నులు లింగైక్య జగద్గురు సిద్ధలింగ భగవత్పాదుల 75వ పుణ్యసంస్మరణోత్సవ శుభసందర్భములో శ్రీకాశీజగద్గురువులు డా॥ చంద్రశేఖర శివాచార్యుల కన్నడానువాదముతో వెలువడిన 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణ గ్రంథమును 23.01.2011న బళ్ళారి పట్టణములో ఏనుగు అంబారీపై నూరేగించి నిర్వహించిన మొట్టమొదటి గ్రంథావిష్కరణకార్యక్రమము ఇప్పటికీ కన్నులకు కట్టినట్టు కదలాడుచున్నది.

లింగైక్య జగద్గురు సిద్ధలింగ భగవత్పాదులవారు వారి నిత్యలింగపూజానుష్ఠానములో ఈ గ్రంథమును పారాయణము చేసెడివారు. అందువలన సద్భక్తులందరూ పారాయణవిధి

విధానములో తెలియజేసిన మూడు పద్ధతులలో తమకు అనుకూలమైన దానిని ఎన్నుకుని, శ్రీసిద్ధాంతశిఖామణి గ్రంథమును పారాయణము చేసిన వారి జీవనము పావనమగును. శ్రీకాశీ జగద్గురువులవారు ఈ గ్రంథమును ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, తమిళ, మరియు మలయాళ భాషలలో అనువదింప చేయు కార్యక్రమమును ఆరంభించినారు. యుక్రేన్ దేశానికి చెందిన యూలియా (కుమారి గౌరి) ఈ గ్రంథమును రష్యన్ భాషలోనికి అనువదించడం నిజముగా గర్వకారణము. దీనికంతటికీ శ్రీకాశీజగద్గురువుల ప్రేరణ, ప్రోత్సాహములే మూలకారణము. శ్రీసన్నిధులవారు ఈ గ్రంథమును సప్తసముద్రములకావలి దేశములకు పరిచయం చేసినారు. వీరశైవుల షట్‌స్థలములను, నూటొక్క స్థలములలో సవివరముగా విశ్లేషించిన తొలిగ్రంథము శ్రీసిద్ధాంతశిఖామణి. అందువలన ఈ గ్రంథమును సర్వులూ ఆదరముతో పూజించి ఇష్టలింగపూజాసమయములో పారాయణము చేసి భోగమోక్షములను పొంది పునీతులు కావలయునన్నది మా ఆశంస.

ఉజ్జయినీ పీఠము
విడిది: కర్నూలు, ఆంధ్రప్రదేశ్
తేది: 07.02.2012

శుభాకాంక్షలతో
**శ్రీ ఉజ్జయినీ జగద్గురువులు**

**శ్రీమద్గిరిరాజ సూర్యసింహాసనాధీశ్వరులు**
**శ్రీ 1008 జగద్గురు డా॥ చన్నసిద్ధరామ పండితారాధ్య**
**శివాచార్య** మహాస్వాములవారు.
సుక్షేత్రము – శ్రీశైలము.

---

## శుభసందేశము

'శ్రీసిద్ధాంతశిఖామణి' పేరుకు తగినట్టుగా సర్వ సిద్ధాంతములకు మేరురత్నము వంటిది. దార్శనిక, సామాజిక సమాలోచనలతో ఈ గ్రంథము నిరూపించిన సమన్వయసిద్ధాంతమే దీనికి కారణము. ఇది వీరశైవుల షట్‌స్థల సాధనావిధానమునకు కరదీపిక వంటిది. జీవుడు ఆధ్యాత్మికసాధనలో ఆత్మసాక్షాత్కారమును పొందుటకు అనుకూలములయిన (పిండస్థలముతో ఆరంభించి జ్ఞానశూన్యస్థలమువరకు గల) నూటొక్కస్థలములను గురించిన క్రమమైన వివరణమే ఈ గ్రంథమునందలి విషయము. అసమానమైన ఈ గ్రంథమును గురించి శ్రీమత్కాశీజగద్గురువులు డా॥ చంద్రశేఖర శివాచార్య భగవత్పాదులవారు చేబట్టిన ప్రసార ప్రచారకార్యక్రమము అభూతపూర్వము! అనన్యము! అనుపమానము! అమోఘము!

'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథము' వెలువడాలన్నది వీరశైవుల చిరకాలవాంఛ. దానిని ప్రప్రథమముగా సాకారము చేసిన కీర్తి కాశీపీఠపు శైవభారతీ శోధ ప్రతిష్ఠానమునకు చెందుతుంది.

ఈ కృతికి ఆంధ్రానువాదముతో పాటు గ్రంథసంపాదనబాధ్యతను చక్కగా నెరవేర్చిన డా॥ ప్రతాప్ గారికి, వారి కుటుంబమునకు మంగళాశీర్వచనములు. క్రమము తప్పకుండా నిత్యము దీనిని పారాయణము చేయు భక్తులకు ఇహపరాలకు చెందిన ఉత్తమగతులు సంప్రాప్తములగుననుటలో సందేహము లేదు. ఈ కృతిని చక్కగా అధ్యయనము చేయువారికి మోక్షసిద్ధి కారతలామలకమగును. అర్థమయినను, కాకపోయినను, పారాయణగ్రంథమును భక్తితో అనునిత్యము పఠించు వీరశైవులు మరియు వీరశైవేతరులు కూడా శివానుగ్రహమునకు పాత్రులై భుక్తిముక్తులను రెండింటినీ పొందవలెనని ఆశీర్వాదములనందజేయుచున్నాము.

శ్రీశైల పీఠము

విడిది : కర్నూలు. ఆంధ్రప్రదేశ్.

తేది: 07.06.2012

శుభాకాంక్షలతో

**శ్రీశైలజగద్గురువులు**

**శ్రీమత్ కాశీ జ్ఞానసింహాసనాధీశ్వరులు**

**శ్రీ 1008 జగద్గురు డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాములవారు**

జంగమవాడి మఠం, వారాణసి

## ప్రస్తావన

'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథ'మును శైవభారతీ శోధప్రతిష్ఠానము తమ 56వ పుష్పముగా ప్రకటించుట మాకు చాల సంతోషముగానున్నది. 'శ్రీజగద్గురు విశ్వారాధ్య జనకల్యాణ ప్రతిష్ఠాన' మునకు అంగముగా 'శైవభారతీ శోధప్రతిష్ఠాన'ము 20.08.1992న ఆరంభించ బడినది. ఇది రాష్ట్రీయ సంస్కృత సంస్థానము(న్యూఢిల్లీ) వారిచే గుర్తించబడిన సంస్థ. ఆగమశాస్త్ర విజ్ఞాన ధురంధరులయిన పండిత వ్రజవల్లభ ద్వివేదిగారు ఈ శోధప్రతిష్ఠానమునకు నిర్దేశకులుగా వ్యవహరించుచున్నారు. పం॥ సుధాంశుశేఖర శాస్త్రిగారు, పం॥ శీతల ప్రసాద్ ఉపాధ్యాయగారు, డా॥ రమాఘోష్‌గారు, డా॥ వి. కుటుంబశాస్త్రిగారు ఈ సంస్థసలహామండలి సదస్యులుగా వున్నారు. ఇప్పటిదాకా ఈ సంస్థ హిందీ, ఇంగ్లీషు, తెలుగు, మరాఠీ మరియు కన్నడ భాషానువాదములతో యాభైకిపైగా సంస్కృతమూలగ్రంథములను ముద్రించి ప్రకటించినది. ప్రస్తుతం 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథము'ను వెలువరించు బృహత్కార్యక్రమమును చేపట్టడము మాకెంతో ఆనందమును కలుగజేయుచున్నది.

శ్రీసిద్ధాంతశిఖామణి వీరశైవుల ధార్మికగ్రంథము. ఇందులో వీరశైవధర్మమునకు సంబంధించిన అష్టావరణములు, పంచాచారములు

మరియు షట్‌స్థలసిద్ధాంతము సశాస్త్రీయముగా ప్రతిపాదించబడివున్నవి. అందువల్ల శ్రీసిద్ధాంతశిఖామణి వీరశైవధర్మప్రతిపాదకమైన మహోత్కృష్టమైన శాస్త్రగ్రంథము. షట్‌స్థలసిద్ధాంతమును నూటొక్క అవాంతరస్థలరూపములలో విస్తృతముగా వివరించుట ఈ గ్రంథపు వైశిష్ట్యమైయున్నది.

భగవంతుడైన శ్రీకృష్ణుడు అర్జునుని నిమిత్తముగా చేసుకొని శ్రీమద్భగవద్గీతను ఉపదేశించినట్టే, శ్రీజగద్గురు రేణుక భగవత్పాదులవారు అగస్త్యమహర్షిని నిమిత్తముగా చేసుకొని సమస్త మనుకులసముద్ధరణ కోసము శ్రీసిద్ధాంతశిఖామణిని ఉపదేశించినారు. గీతకు క్షత్రియుడయిన అర్జునుడు శ్రోత అయితే శ్రీసిద్ధాంతశిఖామణికి మహాతపస్వి, నిగమాగమజ్ఞానసంపన్నుడైన అగస్త్యమహర్షి శ్రోత. అలాగే శ్రీమద్భగవద్గీతను వేదవ్యాసమహర్షి ఉపనిషత్తులనాధారం చేసుకుని రచిస్తే శ్రీ శివయోగిశివాచార్యులు సిద్ధాంతాగమములను ఆధారము చేసుకుని శ్రీసిద్ధాంతశిఖామణిని రచించినారు. శ్రీమద్భగవద్గీత ఉపనిషత్తుల సారమయితే, శ్రీసిద్ధాంతశిఖామణి సిద్ధాంతాగమముల సారమైయున్నది.

పరమశివుడు ప్రమథగణములకు మరియు పార్వతీదేవికి ఉపదేశించిన శివాద్వైతసిద్దాంతము కామికాది వాతులాంతములయిన ఇరువది ఎనిమిది శైవాగమములలో నిబద్ధము చేయబడివున్నది. వీటినే సిద్దాంతాగమములని వ్యవహరిస్తున్నారు. పరమశివుని ఉపదేశమును స్వీకరించిన ప్రమథగణములలో రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేనుకర్ణ మరియు విశ్వకర్ణులను అయిదుమంది గణాధీశ్వరులు ప్రధానమైనవారు.



వీరిలో శ్రీరేణుకగణేశ్వరులు శివుని ఆజ్ఞననుసరించి భూలోకమున కొలనుపాకలోని శ్రీసోమేశ్వరలింగము నుండి ఆవిర్భవించి, తాను శివుని నుండి పొందిన శివాద్వైతజ్ఞానమును మునులైన అగస్త్యులవారికి ఉపదేశించినారు. ఇలా శివునినుండి శివగణాలకు, శివగణాలనుండి మునులకు, మునులనుండి మానవసమాజానికి పరంపరగా అందించబడిన పరమశివుని జ్ఞానప్రసాదమే ఈ 'శ్రీసిద్ధాంతశిఖామణి'.

శ్రీరేణుకాగస్త్యుల సంవాదరూపమునసాగు శ్రీసిద్ధాంతశిఖామణిని రచించిన శ్రీ శివయోగి శివాచార్యులు శివయోగసిద్ధులు, వీరశైవాచారసంపన్నులు, వేదాగమములను కరతలామలకము చేసుకున్నవారు. శివాద్వైతసిద్ధాంతప్రతిష్ఠాపనాసమర్థులయిన శివాచార్యులవంశములో శ్రీశివయోగి శివాచార్యులు జన్మించినారు. స్వయముగా శైవాగమనిష్ణాతులు, శివయోగసిద్ధులు అయిన వీరు శివభక్తిసంరక్షణా సమర్థులై, నాస్తికమతములను కారుచీకట్లను పారద్రోలు భాస్కరునివలె మహాతేజస్సంపన్నులు. వీరు కామికాది వాతులాంతములైన ఇరువది ఎనిమిది శైవాగమములను అధ్యయనము చేసి, ఆ ఆగమముల ఉత్తరభాగములందు నిక్షిప్తముచేయబడిన వీరశైవసిద్ధాంతమును క్రమబద్ధము జేసి, దానికొక శాస్త్రీయస్వరూపమును కల్పించి శ్రీరేణుకాగస్త్యసంవాద రూపమున గ్రంథస్థమొనరించినారు. ఇందులో ఇరువది ఎనిమిది శైవాగమముల పిండితార్థము శివాద్వైతసిద్ధాంతముగా నిర్ణయించ బడినందునను, దీనికన్నను శ్రేష్ఠమైన సిద్ధాంతము మరియొకటి లేనందువలనను మరియు ఈ సిద్ధాంత నిర్ణయము శిఖామణి (శిరోరత్నము)

వలె ప్రకాశించుచున్నందువలనను ఈ గ్రంథమునకు 'సిద్ధాంతశిఖామణి' అను అన్వర్థకమైన నామకరణము చేసినారు.

శ్రీ సిద్ధాంతశిఖామణి కర్తలయిన శ్రీ శివయోగి శివాచార్యులు ఒక గొప్ప సమన్వయాచార్యులు. ద్వైతాద్వైతాదివాదనలలో చిక్కుకున్న మానవుడు తన వ్యక్తిత్వవికాసమునుగాని ఆధ్యాత్మికప్రగతిని గాని ఎప్పటికీ సాధించలేడను ఉద్దేశ్యముతో, ఈ గ్రంథమున ప్రతిపాదించబడిన సాంఖ్య, యోగ, పాంచరాత్ర, వైదిక మరియు పాశుపతములను ఐదు మతములు వేదసమ్మతములే అయినందున వీటిని ఎవ్వరూ యుక్తి ప్రయుక్తులనుపయోగించి ఖండించరాదను సమన్వయసూత్రమును దార్శనిక ప్రపంచమునకు ప్రదానముచేసినారు. అలాగే శ్రీ సిద్ధాంతశిఖామణిలో ప్రతిపాదించబడిన షట్‌స్థలసిద్ధాంతము నందు ద్వైత, ద్వైతాద్వైత, అద్వైతసిద్ధాంతములను సమన్వయముచేసి, వీరశైవసిద్ధాంతము విరోధిభావనారహితమైనదని ప్రపంచమునకు చాటిచెప్పినారు. ఆ విధముగా శ్రీసిద్ధాంతశిఖామణిని సమస్తమానవాళికి మార్గదర్శిగా మలచినారు.

ఒక సాధకుడు అనేకజన్మములలో సముపార్జించిన పుణ్యవిశేషముచేత పాపరాశిని ప్రక్షాళనము చేసుకుని శుద్ధాంతఃకరుణు డౌతాడు. ఆ తరువాత ఆత్మానాత్మవివేకముతో సంసారముపట్ల విరక్తిని పొంది భవధ్వంసియైన శివభక్తిని పెంచుకొని సద్గురువుకు శరణాగతు డౌతాడు. సద్గురువుయొక్క కరుణాకటాక్షముచేత దీక్షాసంస్కారమును పొంది, అతని మార్గదర్శకత్వములో సాధనను ఆరంభించి అంగ-లింగస్థలములతో కూడుకున్న భక్త - మాహేశ్వర - ప్రసాది - ప్రాణలింగి - శరణ



మరియు ఐక్యములనబడు ఆరుస్థలముల ద్వారా శివయోగమును సాధనచేసి 'లింగాంగసామరస్య' రూపమైన ముక్తిని పొందుతాడు. ఈ విషయములు ఈ గ్రంథమున సవివరముగా ప్రతిపాదంచబడివున్నవి. అందువలన ప్రతియొక్కరు ఈ గ్రంథము యొక్క **పారాయణము**ను మరియు **స్వాధ్యాయమును** తప్పక చేయవలెను. శ్రీసిద్ధాంతశిఖామణి శ్రీరేణుకభగవత్పాదుల ఉపదేశరూపమున మానవాళికి లభించిన జ్ఞానప్రసాదగ్రంథము గనుక, దీనిని నిత్యపారాయణము మరియు స్వాధ్యాయము చేయువారికి తప్పక ఇహలోకసుఖము పరలోకముక్తి రెండూ లభించును.

మనదేశములో ధర్మగ్రంథములను, దేవతలయొక్క మహాత్ములయొక్క జీవితకథలను, నామావళులను పారాయణము చేయు విధానము అత్యంతప్రాచీనకాలమునుండి ఆచరించబడుచున్నది. 'పారాయణం' అన్న పదమునకు **'పారం అయనం యేన తత్ పారాయణమ్'** అని సంస్కృతభాషలో నిర్వచనము చెబుతారు. [**పరం = పరమార్థః, పరం ఏవ పారం, అయనం = గతిః ప్రాప్తిరితి యావత్**] అంటే గ్రంథపారాయణమును చేయు వ్యక్తి సంసారసాగరమును దాటి పరమపదమును చేరునని అర్థం. దీనినే **'పారాయణమితి ఖ్యాతం సద్యోముక్తిప్రదం నృణాం'** అని **భాగవతం** చెబుతుంది. అంటే పవిత్రగ్రంథపారాయణము మానవులకు మరుక్షణమే ముక్తిని ప్రసాదించునని భాగవతోక్తి. అందువల్లనే శ్రీమద్భగవద్గీతా, భాగవతపురాణము, శివపురాణము, దుర్గాసప్తశతి, దేవీపురాణము, శివలీలామృతము, శివసహస్రనామము,

విష్ణుసహస్రనామము, లలితాసహస్రనామము, జ్ఞానేశ్వరీ, పరమరహస్యము వంటి గ్రంథములు అనేక చోట్ల పారాయణము చేయబడుచుండుట మనకు తెలిసిన విషయమే.

**శ్రీ సిద్ధాంతశిఖామణి** కూడా ఒక జ్ఞానప్రసాదగ్రంథమైనందున అనేకమంది మహాచార్యులు, శివాచార్యులు మరియు శివభక్తిసంపన్నులైన భక్తశిరోమణులు, తమ నిత్య ఇష్టలింగార్చనలో భాగముగా ఈ గ్రంథపారాయణమును చేయుచున్నారు. ఈ ప్రాచీనసాంప్రదాయపద్ధతిని సార్వత్రికం చేసి అందరిచేత ఈ గ్రంథపారాయణమును చేయించి అందరినీ శివుని అనుగ్రహమునకు పాత్రులను చేయవలయునన్నది మా ప్రధానోద్దేశ్యమై యున్నది.

వాసగృహములలోను, మఠములలోను, మందిరములలోను, సమావేశప్రదేశములలోను భక్తులు అధికసంఖ్యలో చేరి శ్రీసిద్ధాంత శిఖామణి పారాయణము చేయుటవలన వెలువడు సామూహికధ్వని తరంగములు ఆ ప్రదేశమునంతటినీ శివమయము చేయును. ఆ ప్రదేశములో సకారాత్మకమయిన ఊర్జాశక్తి ప్రబలి అక్కడున్న అందరి మనస్సుల మీద అత్యుత్తమమయిన సాత్వికగుణములను కలుగచేయును. ఏతావతా అక్కడ నివసించువారిలో వైయక్తికమైన, సామూహికమైన సద్భావనలు పెంపొంది, వ్యక్తుల మధ్య పరస్పరప్రేమానురాగములు మొలకెత్తును. అనవసరములైన మానసికక్లేశములు దూరమగును. అంతేకాకుండా శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణము చేయు వ్యక్తుల వంశములలో ఉత్తమమైన సంతతి కలిగి వంశాభివృద్ధి జరుగును. చివరికి పరమకైవల్యము కూడా సంప్రాప్తమగును.



ఇలా భుక్తి ముక్తి ప్రదాయకమైన, జ్ఞానప్రసాదినియైన శ్రీసిద్ధాంతశిఖామణి గ్రంథమును అగౌరవపరుచు ప్రయత్నములనెవ్వరూ చేపట్టరాదు. అటువంటి ప్రయత్నములను చేయువారు అనర్థములను అనుభవించక తప్పదు. అందువలన మానవజాతికల్యాణమునకు పరమశివుని కరుణాకటాక్షము జ్ఞానరూపమును దాల్చి శ్రీసిద్ధాంతశిఖామణి రూపమున మనకు అందివచ్చినది. అందువలన అందరూ ఆదరముతో దీనినారాధించి, పారాయణమును, స్వాధ్యాయమును చేసి భుక్తిముక్తులను పొంది పునీతులు కావలెను.

ఈ పారాయణగ్రంథమునకు పంచపీఠములకు చెందిన సమానపీఠాచార్యులైన శ్రీ రంభాపురీ, శ్రీఉజ్జయినీ మరియు శ్రీశైలపీఠములకు చెందిన జగద్గురువులు తమ శుభసందేశములను దయజేసినారు. ఈ గ్రంథమును పారాయణము చేయు సమస్తభక్తసమూహము సకల ప్రయోజనములను పొందవలెనని మంగళాశీర్వాదములను అనుగ్రహించి వున్నారు. అందువలన సమానపీఠాచార్యులందరికీ అనంతనమస్కారములతో పాటు అభినందనలను కూడా తెలియజేయుచున్నాము.

శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథనిర్మాణమునకు తగుసూచనలిచ్చి సహకరించిన సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీపండిట్ జగన్నాథశాస్త్రి తైలంగ్(వారణాసి) డా॥ మల్లికార్జున పరడ్డి(ధార్వాడ్), డా॥ఎం. శివకుమారస్వామి(బెంగుళూరు) గారలకు శుభాశీస్సులు.

భుక్తి ముక్తి ప్రదాయకమైన ఈ పారాయణగ్రంథమును బైబిలులాగా ముద్రించి దేశపు నలుమూలలా ప్రచారము చేయవలయునన్నది మా

సంకల్పము. ఈ బృహత్ప్రణాళికా సాఫల్యతకోసం అనేకమంది శివాచార్యులు, నిరంజనమూర్తులు, సమాజమునందలి సద్భక్తులు, వివిధ సంఘసంస్థలు ఎంతో ఉదారముగా ముద్రణకవసరమైన ఆర్థికవనరులను సమకూర్చడం మాకు చాలా సంతోషమును కలిగించినది. పవిత్రమైన ఈ లోకకల్యాణకార్యక్రమములో భాగస్వాములైన వారందరికీ మా అనంత మంగళాశీస్సులను తెలియజేస్తున్నాము.

రెండువేలా పండ్రెండవ సంవత్సరమును 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథ అభియాన సంవత్సరము'గా ఆచరించవలయునన్నది మా పవిత్రసంకల్పము. 'శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథము'ను జాతీయ మరియు అంతర్జాతీయభాషలలోనికనువదింపజేసి విశేష ప్రచారము చేయదలచినాము. అందులో భాగముగా ప్రొ॥ ఎం.శివకుమార స్వామిగారు ఆంగ్లానువాదమును సిద్ధము చేసినారు. వీరశైవధర్మము పట్ల విశేషాసక్తితో మా ద్వారా లింగధారణదీక్షను స్వీకరించిన ఉక్రేన్ దేశానికి చెందిన కుమారి యూలియా (గౌరి) శ్రీసిద్ధాంతశిఖామణిని రష్యన్‌భాషలోనికి అనువదించినది. గత జూన్ రెండవ తేదీన రష్యా దేశపు రాజధాని మాస్కో నగరమునందలి 'అష్టాంగ యోగ కేంద్రము'లో మా సాన్నిధ్యమున గ్రంథావిష్కరణకార్యక్రమము అత్యంతవైభవముగా జరిగినది. గత ఇరువది సంవత్సరములుగా భారతీయ యోగపద్ధతులను, ప్రత్యేకముగా శివయోగమును అభ్యాసము చేయుచున్న దాదాపు రెండు వందల మంది యోగశిక్షకులు ఈ కార్యక్రమములో పాల్గొని లింగధారణదీక్షను స్వీకరించినారు. శివయోగవైశిష్ట్యము, శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణ



విధివిధానమును వారికి తెలియజేయడము జరిగినది. ఒక పరాయి దేశములో వీరశైవధర్మాచరణ కార్యక్రమము నిర్వహించబడుట భారతీయులందరికీ విశేషముగా వీరశైవసమాజమునకు గర్వకారణమని చెప్పక తప్పదు.

మా కన్నడానువాదముతో వెలువడిన ఈ ప్రసాదగ్రంథమును లక్షప్రతులు ముద్రించి, సిద్ధాంతశిఖామణిలో ప్రతిపాదించబడిన నూటొక్కస్థలములకు సంకేతసూచకముగా కర్ణాటకరాష్ట్రములోని నూటొక్క ప్రధాననగరములలో గ్రంథావిష్కరణకార్యక్రములను నిర్వహించవలెనని మా ఉద్దేశ్యము. ఇప్పటివరకు ముప్పయికిపైగా నగరములలో ఉత్సాహవంతులైన భక్తాదుల నడుమ ఈ సంరంభము వైభవోపేతముగా కొనసాగినది. ఇకముందు కొనసాగనున్నది. అదేవిధముగా 'అభియాన సంవత్సరయోజన'లో భాగముగా భారతీయభాషలలోను శ్రీసిద్ధాంతశిఖామణి అనువదించబడుచున్నది. డా॥రాధేశ్యాం చతుర్వేది, డా॥ గణేశన్, డా॥నటేశన్ గార్లు హిందీ, తమిళ, మలయాళభాషలలోనికి ఈ గ్రంథమును క్రమముగా అనువదించుచున్నారు.

కర్ణాటకరాష్ట్రము తరువాత అధికసంఖ్యలో వీరశైవజనాభా వున్న రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. అలాగే వీరశైవుల పంచపీఠాలలో మూడుపీఠాలు (వీరసింహాసనపీఠం, కొలనుపాక (నల్గొండ జిల్లా), వైరాగ్య సింహాసనపీఠం, ద్రాక్షారామం (తూ.గో.జిల్లా), సూర్యసింహాసనపీఠం, శ్రీశైలం (కర్నూలు జిల్లా) ఆంధ్రదేశములోనే వున్నందున వీరశైవధర్మము ఆంధ్ర ప్రజానీకముతో తరతరాలుగా అవినాభావసంబంధమును కలిగివున్నది. కారణాంతరముల

వల్ల, సామాజికపరిస్థితుల వల్ల వీరశైవధర్మమునకు సంబంధించిన ఆచారవిచారములవిషయములో ఆంధ్రప్రజానీకము విస్మృతికి గురియై వెనుకబడివున్నది. వారిలో ధార్మికచైతన్యమును ఉద్దీపనము చేయవలయునన్న సదాశయముతో ఇంతకుముందు హైదరాబాదు, శ్రీశైలము, మహబూబ్‌నగర్ వంటి నగరాలలో పంచాచార-యుగమానోత్సవములు, బసవేశ్వరజయంత్యుత్సవములు నిర్వహించడం జరిగినది. 2010 సంవత్సరములో షాదునగరులో శ్రావణమాస అనుష్ఠానమును కూడా నిర్వహించినాము. ఈ ప్రాంతములో ప్రచారవిస్తృతిని పెంచవలయునన్న ఉద్దేశ్యముతో సిద్ధాంతశిఖామణి పారాయణగ్రంథ ప్రచురణ కార్యక్రమమును ఆంధ్రదేశములో కూడా చేబట్టడం జరిగినది. మా ఆదేశముననుసరించి డా॥కె.ప్రతాప్ గారు ఈ గ్రంథమును తెలుగులోనికి అనువదించడముతోపాటు సంపాదకుని బాధ్యతలను కూడా ఎంతో చక్కగా నెరవేర్చినారు. వారికి, వారి కుటుంబసభ్యులకు మా అనంతమంగళాశంసనములను అందజేస్తున్నాము. గ్రంథప్రచురణకు అహమహమికతో ఆర్థికవనరులను అందజేసిన ఆంధ్రవీరశైవ సద్భక్తుల మరియు వీరశైవ సంఘసంస్థల వదాన్యత మెచ్చదగినది. ఈ యోజనలో పాల్గొని అమూల్యమైన సహకారము లందించిన వారందరికి అనంతఆశీర్వాదములు.

**-- ఇత్యనంత శివాశిషః**

## అనువాదకుని సంపాదనము

"కస్యచిదేవ కదాచిద్దయయా విషయం సరస్వతీ విదుషః కమపి యోజయతి" అని ధనుంజయుడంటాడు. మనం చేయవలసిన పనులు ముందే నిర్ణయించబడి వుంటాయి. అవి విశ్వప్రణాళికలో అంతర్భాగాలు. వాటిని మనస్ఫూర్తిగా చేయడమే మన పని. ఎలా చేశామన్నది కాలము లోకము నిర్ణయిస్తాయి. శ్రీమత్కాశీ జగద్గురువుల అభిమానానికి నోచుకోవడం అదృష్టం. నా రచనావ్యాసంగానికి వారి ఆదేశాలే ప్రేరకాలు. (2011) జూన్ పదమూడున మహబూబ్‌నగరుకు పిలిచి బైబిలు లాంటి ఎర్రట్ట పుస్తకం చేతిలో వుంచి అనువదించిపెట్టమని సభికుల హర్షధ్వానాలమధ్య శాలువా కప్పారు. ఆచార్యుల ఆదేశాలు అనుల్లంఘనీయాలు కదా! అంగీకరించాను. ఆ తరువాత నెలకో సెల్కాలు (Cell Call). ముందు మంగళాశీస్సులు. 'ఎంతవరకు వచ్చింది' అంటూ ములుగోలు నొక్కులతో ముగింపు. (చలి)కాలం అనుకూలించి అనువాదం ముగించాను. అననుకూలమైన (ఎండా)కాలంలో శుద్ధప్రతుల దిద్దుడు సాగలేదు. నెలసెల్కాలులు కాస్త దినసెల్కాలు (చెర్నాకోలు) లైనాయి. సరిగ్గా జూన్ ఏడున (2012) కర్నూలులో రుమాలు చుట్టి, ఫోటో యిచ్చి పుస్తకమెక్కడ? అని పరామర్శ! ఏం చేయాలి? నా అసహాయతకు చేతులెత్తవలసిన సమయములో ఓ అదృశ్యహస్తం తోడై శుద్ధప్రతులు దిద్ది నాకు రాబోయే అదృష్టంలో భాగం పంచుకుంది. ఆ అదృశ్యహస్తం ఓ అద్భుతశకలం కావాలని పరమేశ్వరుణ్ణి కోరుకుందాం. అక్షరయోజనం చేసిన ఆత్మబంధువులు డా॥ సముద్రాల దశరథ మరియు శ్రీ టి.గుణభూషణ్ (శ్రీవారి గ్రాఫిక్స్, తిరుపతి)గార్లకు, ముద్రణా కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్న శ్రీ జగదేవ హిరేమఠ్ (హైదరాబాద్)గార్లకు ప్రేమాభివందనాలు.

నా వెన్నంటి ముందు నడిపించే నను కన్న నా తల్లిదండ్రుల ప్రేమాశీస్సులను, అర్ధాంగి సహకారమును, చి॥ విక్రమ-ధ్రువ- శాంతి- ప్రియల అనురాగములను, తోబుట్టువుల అనుబంధములను స్మరించుకోవడం నా ధర్మం.

17-7-2012 **- ప్రతాప్**

### శ్రీసిద్ధాంతశిఖామణి

## పారాయణవిధివిధానము

స్నానాదులను ముగించి శుచిర్భూతులై నేలపై ఆసనమును ముందు పూజించి, దానిపై పూర్వాభిముఖులుగా గాని లేదా ఉత్తరాభిముఖులుగా గాని కూర్చొనవలెను. నిత్యకర్మఅయిన ఇష్టలింగపూజను ముగించిన తరువాత **శ్రీసిద్ధాంతశిఖామణి పారాయణ గ్రంథము**ను భక్తితో పూజించవలెను. గ్రంథము నందు సూచించినట్లు పంచాచార్యస్తుతిని, శ్రీసిద్ధాంతశిఖామణి న్యాసమును, శ్రీసిద్ధాంతశిఖామణి ధ్యానమును, శ్రీసిద్ధాంతశిఖామణి మాహాత్మ్యమును, శ్రీసిద్ధాంతశిఖామణిఫలశ్రుతిని వరుసగా పఠించిన తరువాత మూలగ్రంథపారాయణమును ప్రారంభించవలెను.

1. ఒక సప్తాహమున అంటే వారమురోజులలో ఈ గ్రంథ పారాయణమును ముగించవలెను. దినమునకు మూడు పరిచ్ఛేదముల వంతున పారాయణము చేసి ముగించవచ్చును. లేదా వారి వారి ఇచ్ఛానుసారము పరిచ్ఛేదముల నియయము లేకపోయినా రోజుకు ఒకటి రెండు పరిచ్ఛేదములు తక్కువగా కాని ఎక్కువగా కాని పఠించి పారాయణమును వారములో ముగించ వచ్చును. అయితే పారాయణదినములలో ఏ పరిచ్ఛేదమునుగాని మధ్యలో ఆపరాదు.

2. దినమునకు ఒక పరిచ్ఛేదము చొప్పున ఇరువదియొక్క దినములలో కూడా గ్రంథపారాయణమును ముగించవచ్చును.

3. శ్రీసిద్ధాంతశిఖామణిలో ప్రతిపాదించబడిన నూటొక్క అవాంతర స్థలములను, దినమున కొకస్థలము వంతున పారాయణము చేసి 101 దినములలో గ్రంథపారాయణమును ముగించవచ్చును.

ఇలా ఏడుదినములలోగాని, ఇరువదియొక్క దినములలోగాని, నూటొక్కదినములలోగాని తమకు వీలయిన విధానమననుసరించి పారాయణమును చేయవచ్చును. ఈ విధముగా జీవించినంతకాలము పారాయణమును కొనసాగించి తద్వారా భోగమోక్షములను రెండింటినీ పొందవచ్చును.

### స్వాధ్యాయము

**'స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్'** అన్న ఉపనిషద్వాక్యముననుసరించి వీరశైవులకు **శ్రీసిద్ధాంతశిఖామణి** పారాయణమే స్వాధ్యాయము. **శ్రీసిద్ధాంతశిఖామణి**ని స్వాధ్యాయము చేయుటకు ప్రత్యేకమైన నియమములేవీ లేవు. తమకు సాధ్యమయినన్ని శ్లోకములను పఠించి, వాటి అర్థమును మననము చేసికొని, నిదిధ్యాసము నందుంచుకొనవలెను. స్వాధ్యాయమునకు నిర్దిష్టసమయము లేదు. వారివారికనుకూలమైన సమయములలో వీలునుబట్టి, ఇష్టమైన ప్రదేశమునందు విశ్రాంతి సమయమున గాని, ప్రయాణసమయమున గాని పారాయణమును చేయవచ్చును.

## పంచాచార్యస్తుతిః



ఓం నమః పంచాచార్యేభ్యో
పంచాననముఖోద్భూతేభ్యో
పంచసూత్రకర్తృభ్యో
పంచాక్షరమనుస్వరూపేభ్యో
శివాద్వైతవిద్యాసంప్రదాయకర్తృభ్యో
వీరశైవమహామతసంస్థాపకేభ్యో
నమో జగద్గురుభ్యః ॥

## అథ శ్రీసిద్ధాంతశిఖామణిన్యాసాదిః

### (ఋష్యాదిన్యాసః)

అస్య శ్రీసిద్ధాంతశిఖామణిశాస్త్రమహామంత్రస్య భగవాన్ శ్రీశివయోగి శివాచార్యో ఋషిః ।
**అనుష్టుప్** ఛందః ।
**శ్రీ సచ్చిదానందస్వరూపః పరశివో** దేవతా।

**సచ్చిదానందరూపాయ శివాయ బ్రహ్మణే నమః** (సి.శి. 1.1) ఇతి బీజమ్।
**అమృతార్థం ప్రపన్నానాం యా సువిద్యాప్రదాయినీ**।(సి.శి. 1.2) ఇతి శక్తిః।
**శివజ్ఞానకరం వక్ష్యే సిద్ధాంతం శృణు సాదరమ్** (సి.శి. 5.2) ఇతి కీలకమ్।

### (కరన్యాసః)

**ఏక ఏవ శివస్సాక్షాచ్చిదానందమయో విభుః ।** (సి.శి. 5.34)
ఇతి అంగుష్ఠాభ్యాం నమః ।
**నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్ప్రపంచకః ।** (సి.శి. 5.34)
ఇతి తర్జనీభ్యాం నమః ।
**అనాద్యవిద్యాసంబంధాత్తదంశో జీవనామకః ।** (సి.శి. 5.34)
ఇతి మధ్యమాభ్యాం నమః ।
**దేవతిర్యఙ్మనుష్యాదిజాతిభేదే వ్యవస్థితః ।** (సి.శి. 5.35)
ఇతి అనామికాభ్యాం నమః ।
**మాయీ మహేశ్వరస్తేషాం ప్రేరకో హృది సంస్థితః ।** (సి.శి. 5.35)
ఇతి కనిష్ఠికాభ్యాం నమః ।

**బీజే యథాఽంకురః సిద్ధస్తథాఽత్మని శివః స్థితః ।** (సి.శి. 5.36)
ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

**(హృదయాదిన్యాసః)**

**ఏక ఏవ శివస్సాక్షాచ్చిదానందమయో విభుః ।** (సి.శి. 5.34)
ఇతి హృదయాయ నమః ।
**నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్ప్రపంచకః ।** (సి.శి. 5.34)
ఇతి శిరసే స్వాహా ।
**అనాద్యవిద్యాసంబంధాత్తదంశో జీవనామకః ।** (సి.శి. 5.34)
ఇతి శిఖాయై వషట్ ।
**దేవతిర్యఙ్మనుష్యాదిజాతిభేదే వ్యవస్థితః ।** (సి.శి. 5.35)
ఇతి కవచాయ హుమ్ ।
**మాయీ మహేశ్వరస్తేషాం ప్రేరకో హృది సంస్థితః ।** (సి.శి. 5.35)
ఇతి నేత్రత్రయాయ వౌషట్
**బీజే యథాఽంకురః సిద్ధస్తథాఽత్మని శివః స్థితః ।** (సి.శి. 5.36)
ఇతి అస్త్రాయ ఫట్.
శ్రీశివప్రీత్యర్థే శ్రీసిద్ధాంతశిఖామణిపారాయణే జపే వినియోగః ।



## అథ శ్రీసిద్ధాంతశిఖామణి ధ్యానమ్

**స్వస్తి శ్రీగణనాయకేన మునయేఽగస్త్యాయ తత్త్వార్థినే**
**శిష్యాయ ప్రతిబోధితే భగవతా శ్రీరేణుకేన స్వయమ్ ।**
**తాత! త్వం శివయోగివర్యసుకృతిర్మే మానసే మందిరే**
**శ్రీసిద్ధాంతశిఖామణే! వస సదా జ్ఞానప్రదీపో భవ ॥** **1**

తా ॥ గణనాయకుడైన శ్రీరేణుకభగవత్పాదులచేత, స్వయముగా తన శిష్యుడు, తత్త్వాన్వేషకుడు అయిన అగస్త్యమహామునికి ఉపదేశించబడిన మరియు శివయోగి శివాచార్యులచే రచించబడిన, ఓ సిద్ధాంతశిఖామణీ! నా మనోమందిరమున నిత్యము నివసించుచు, నాకు జ్ఞానప్రకాశమును కలిగించెదవు గాక!

**శరణాగతదీనార్తపరిత్రాణైకహేతవే ।**
**శ్రీరేణుకగణేశాయ జ్ఞానముద్రాయ తే నమః ॥** **2**

తా॥ శరణాగతులైన దీనులను, దుఃఖితులను రక్షించుటయే పరమావధిగా కలిగినవాడా! దక్షిణహస్తమున జ్ఞానముద్రను బట్టిన శ్రీరేణుకగణేశ్వరా! నీకు నమస్కారము.

**అగస్త్యసంశయవ్రాతమహాధ్వాంతాంశుమాలినమ్ ।**
**వందే శివసుతం దేవం రేణుకాఖ్యం జగద్గురుమ్ ॥** **3**

తా॥ అగస్త్యుని మనసునందున్న సంశయసమూహమను మహాచీకటిని పారద్రోలుటలో సూర్యునివంటివాడా! దేవతారూపుడా!

శివసుతుడా! శ్రీరేణుకజగద్గురువరేణ్యుడా! నీకు నమస్కారము.

**నమః శివాచార్యవరాయ తుభ్యం శ్రీవీరశైవాగమసాగరాయ ।**
**వినాఽపి తైలం భవతాఽత్ర యేన ప్రజ్వాలితో జ్ఞానమణిప్రదీపః ॥ 4**

తా॥ శివాచార్యశ్రేష్ఠుడా! వీరశైవాగమసాగరుడా! మరియు ఎటువంటి తైలము లేకుండగనే జ్ఞానమణిదీపమును వెలిగించువాడా! నీకు నమస్కారము.

**యస్మిన్నాగమశాస్త్రతత్త్వమఖిలం సమ్యక్ చ సంసూచితమ్**
**భక్తైర్వాంఛితభుక్తిముక్తిఫలదం యత్కల్పవృక్షాత్మకమ్।**
**తం శైవాగమసమ్మతం నిగమవిద్ విద్వద్భిరాసేవితమ్**
**శ్రీసిద్ధాంతశిఖామణిం ప్రతిదినం ధ్యాయేత్ సదా సాదరమ్॥ 5**

తా॥ సమస్తశైవాగమశాస్త్రతత్త్వమును చక్కగా ప్రతిపాదించునది, భక్తులు కోరుకొను భుక్తి మరియు ముక్తిఫలములను ప్రసాదించుటలో కల్పవృక్షమువంటిది, నిగమాగమవేత్తలైన విద్వాంసులందరిచేతను ఆరాధించబడినటువంటిది అయిన శ్రీసిద్ధాంతశిఖామణిని అనునిత్యము ఆదరపూర్వకముగా ధ్యానించవలెను.

**పూజ్యశ్రీ శివయోగివర్యరచితం సిద్ధాంతరత్నాకరమ్**
**సూక్ష్మం ధార్మికతాత్త్వికస్థలయుతం చైకాధికం తత్ శతమ్ ।**
**త్రైలోక్యం పదమాదిమం పరపదం సర్వాంతిమే యోజితమ్**
**శ్రీసిద్ధాంతశిఖామణిం దినదినం ధ్యాయేత్ సదా శాంతిదమ్ ॥6**



తా॥ సిద్ధాంతమునకు సాగరమువంటిది, నూటొక్కస్థలములతో కూడుకున్నది, సూక్ష్మములయిన ధార్మికతత్త్వములను ప్రతిపాదించునది, 'త్రైలోక్య'మను పదముతో ఆరంభమగునది, 'పర' అను పదముతో అంత్యమగునది, శాంతిదాయకమైనది మరియు శ్రీశివయోగిశివాచార్యుల చేత విరచింపబడినది అయిన **శ్రీసిద్ధాంతశిఖామణి**ని అనునిత్యము ధ్యానించవలెను.



## అథ శ్రీసిద్ధాంతశిఖామణి మాహాత్మ్యమ్

**యః పఠేత్ ప్రయతో నిత్యం శ్రీసిద్ధాంతశిఖామణిమ్ ।**
**శివసాయుజ్యమాప్నోతి భయశోకాదివర్జితః ॥ 1**

తా॥ శ్రీసిద్ధాంతశిఖామణిని ప్రయత్నపూర్వకముగా ప్రతినిత్యము పారాయణము చేయువాడు భయశోకాదులను తొలగించుకొని శివసాయుజ్యమును పొందుచున్నాడు.

**సదాఽధ్యయనశీలస్య శ్రీసిద్ధాంతశిఖామణేః ।**
**క్షీయంతే సర్వపాపాని పూర్వజన్మకృతాని చ ॥ 2**

తా॥ శ్రీసిద్ధాంతశిఖామణిని అనునిత్యము అధ్యయనము చేయువాడు, పూర్వజన్మములందు చేసుకున్న సమస్తపాపములను నశింపచేసుకొనుచున్నాడు.

**జలస్నానాద్ వరం పుంసాం శ్రీసిద్ధాంతశిఖామణౌ ।**
**జ్ఞానార్ణవే సదా స్నానం సంసారమలనాశనమ్ ॥ 3**

తా॥ మానవులకు సంసారమలములను(మలినములను) పోగొట్టుకొనుటకు శ్రీ సిద్ధాంతశిఖామణియను జ్ఞానసాగరమున చేయు నిరంతరస్నానము(పఠనము) జలస్నానముకన్నను శ్రేష్ఠమైనది.

**శ్రీ రేణుకగణాధ్యక్షముఖపద్మాద్వినిఃసృతః ।**
**కంఠపీఠే సదా ధార్యః శ్రీసిద్ధాంతశిఖామణిః ॥ 4**

తా॥ శ్రీరేణుకగణాధ్యక్షుల ముఖకమలము నుండి వెలువడిన శ్రీసిద్ధాంతశిఖామణి యను గ్రంథ రత్నమును ఎల్లప్పుడూ కంఠ(పీఠ)మున ధరించవలెను (అధ్యయనము చేయవలెను).

**శ్రీరేణుకగణాధ్యక్ష వచనామృతసాగరమ్ ।**
**పాయం పాయం సదా పుంసాం పునర్జన్మ న విద్యతే ॥ 5**

తా॥ శ్రీరేణుకగణాధ్యక్షుల ఉపదేశామృతమును మరల మరల పానము చేయు మానవులకు పునర్జన్మముండదు.

**సర్వాగమవ్రజోగావస్తాసాం దోగ్ధా చ రేణుకః ।**
**వత్సోఽగస్త్యః సుధీర్భోక్తా దుగ్ధం శిఖామణిర్మహాన్ ॥ 6**

తా॥ సిద్ధాంతాగమసమూహమే గోవులమంద. శ్రీరేణుకులవారే (ఆ గోవులను పిండు) గొల్లవాడు. అగస్త్యులవారే లేగదూడ. శ్రీసిద్ధాంతశిఖామణి గ్రంథమే అప్పటమయిన పాలు. బుద్ధిజీవులే అమృతమునాస్వాదించు భోక్తలు.

**ఏకం శాస్త్రం శ్రీశివాద్వైతసంజ్ఞమ్**
**ఏకోదేవః శ్రీమహాదేవ ఏవ ।**
**ఏకో మంత్రః శైవపంచాక్షరోఽయమ్**
**కర్మాప్యేకం ఇష్టలింగార్చనం హి ॥ 7**

తా॥ లోకమునందు శివాద్వైతశాస్త్రమొక్కటే శాస్త్రము. మహాదేవుడొక్కడే దేవుడు. పంచాక్షరీమంత్ర మొక్కటే శ్రేష్ఠమైన మంత్రము. ఇష్టలింగార్చన మొక్కటే నిజమైన కర్మ.



## అథ ఫలశ్రుతిః

**శ్రీవేదాగమవీరశైవసరణిం శ్రీషట్స్థలోద్యన్మణిమ్**
**శ్రీజీవేశ్వరయోగపద్మతరణిం శ్రీగోప్యచింతామణిమ్ ।**
**శ్రీసిద్ధాంతశిఖామణిం లిఖయితా యస్తం లిఖిత్వా పరాన్**
**శ్రుత్వా శ్రావయితా స యాతి విమలాం భుక్తిం చ ముక్తిం పరామ్॥**

(సి.శి. 21.55)

తా॥ శ్రీవేదాగమములందు ప్రతిపాదించబడిన వీరశైవధర్మమును నిరూపించునది, షట్స్థలమార్గమును చూపు రత్నదీపము వంటిది, శివజీవైక్యమను తామరపూవును వికసింపజేయు సూర్యుని వంటిది, గుప్తనిధి అయిన శివాద్వైతజ్ఞానమునకు చింతామణి వంటిది అయిన శ్రీసిద్ధాంతశిఖామణిశాస్త్రమును ఎవడు తాను వ్రాసి, ఇతరులతో వ్రాయింపచేయుచున్నాడో, తాను విని, ఇతరులకు వినిపింపచేయుచున్నాడో అతడు నిర్మలములయిన ప్రాపంచిక సుఖభోగములను, సర్వోత్కృష్టమైన మోక్షసామ్రాజ్యమును పొందుచున్నాడు.



శ్రీరేణుకాచార్యాయ నమః

## అవతరణికా

**అనేకవిధసిద్ధాంతశిఖామణిమనామయమ్ ।**
**శ్రీవీరశైవసిద్ధాంత మేకోత్తరశతస్థలమ్ ॥**
**రేణుకాగస్త్యసంవాదం నిగమాగమవిశ్రుతమ్ ।**
**ప్రదీపయతి గుప్తార్థముద్ధృత్య శివయోగిరాట్ ॥**

–మరితొంటదార్యః

అనేకవిధములయిన సిద్ధాంతములలో శిఖామణివలె ప్రకాశించునది, దోషరహితములైన నూటొక్క స్థలములను వివరించునది, రేణుకాగస్త్యులనడమ సాగిన సంభాషణాత్మకమైనది, నిగమాగమములందు దాగియున్న రహస్యార్థములను వెలికితీసి (శ్రీసిద్ధాంతశిఖామణి యనుగ్రంథముద్వారా) శ్రీ శివయోగి చక్రవర్తి వీరశైవసిద్ధాంతరూపమును ప్రకాశింపచేసినారు.

**– మరితొంటదార్యులు**



## విషయసూచిక

# శ్రీసిద్ధాంతశిఖామణి

## ప్రథమః పరిచ్ఛేదః

## మొదటి పరిచ్ఛేదము

### *మంగలాచరణానుక్రమప్రసంగః*

### మంగళాచరణక్రమప్రసంగము

**(32 శ్లోకములు)**

***1.*** *శివస్తుతి*

శివుని ప్రార్థన

**త్రైలోక్యసంపదాలేఖ్య**
**సముల్లేఖనభిత్తయే ।**
**సచ్చిదానందరూపాయ**
**శివాయ బ్రహ్మణే నమః ॥** **1-1**

ముల్లోకములనబడు సుసంపన్నమయిన చిత్తరువును (బొమ్మను) చిత్రించుటకు ఆధారమయిన గోడవలెనున్న, సత్తు, చిత్తు, ఆనందరూపుడు, శివస్వరూపుడు అయిన బ్రహ్మకు నమస్కారము.

**బ్రహ్మేతి వ్యపదేశస్య**
**విషయం యం ప్రచక్షతే ।**
**వేదాంతినో జగన్మూలమ్**
**తం నమామి పరం శివమ్ ॥** **1-2**

బ్రహ్మ అను శబ్దమునకు వేదాంతులు ఎవరిని విషయముగా తెలుసుకొనుచున్నారో అటువంటి జగత్తునకు మూలమయిన పరమశివునికి నమస్కరించుచున్నాను.

**యస్యోర్మిబుద్బుదాభాసః**
**షట్త్రింశత్తత్త్వసంచయః ।**
**నిర్మలం శివనామానమ్**
**తం వందే చిన్మహోదధిమ్ ॥ 1-3**

ముప్పదియారు తత్త్వసమూహము ఏ సముద్రమునందు నురుగలతో కూడిన అలలవలె భాసించుచున్నదో,అటువంటి నిర్మలుడు (మలత్రయ రహితుడు), శివుడను పేర పిలువబడుతున్న చైతన్యసాగరునికి నమస్కరించు చున్నాను. (శివునితో ఆరంభించి భూమిపర్యంతము ముప్పదియారు తత్త్వములను శైవాగమములు చెప్పుచున్నవి).

**యద్భాసా భాసతే విశ్వమ్**
**యత్సుఖేనానుమోదతే ।**
**నమస్తస్మై గుణాతీత -**
**విభవాయ పరాత్మనే ॥ 1-4**

ఈ విశ్వమంతా ఎవని ప్రకాశముచేత ప్రకాశించుచున్నదో, ఎవని ఆనందముచేత సుఖించుచున్నదో, అటువంటి గుణాతీత వైభవము గలిగిన ఆ పరమాత్మునకు నమస్కారము.



**సదాశివముఖాశేష-**
**తత్త్వోన్మేషవిధాయినే ।**
**నిష్కలంకస్వభావాయ**
**నమః శాంతాయ శంభవే ॥ 1-5**

'సదాశివ' (అను) తొలితత్త్వముతో మిగిలిన సమస్త (35) తత్త్వములను అభివ్యక్తముచేయువాడు, నిష్కలంక స్వభావుడు, శాంతస్వరూపుడు అయిన శంభువునకు నమస్కారము.

**స్వేచ్ఛావిగ్రహయుక్తాయ**
**స్వేచ్ఛావర్తనవర్తినే ।**
**స్వేచ్ఛాకృతత్రిలోకాయ**
**నమః సాంబాయ శంభవే ॥ 1-6**

స్వేచ్ఛతో(తన ఇచ్ఛాశక్తితో) దివ్యదేహ(విగ్రహ) మును ధరించినవాడు, స్వేచ్ఛగా (స్వ+ఇచ్ఛ)తో ప్రవర్తించువాడు, స్వేచ్ఛగా (సర్వస్వతంత్రునిగా) ముల్లోకములను సృజించువాడు, ఉమాసహితుడు అయిన శంభువునకు నమస్కారము.

**యత్ర విశ్రామ్యతీశత్వమ్**
**స్వాభావికమనుత్తమమ్ ।**
**నమస్తస్మై మహేశాయ**
**మహాదేవాయ శూలినే ॥ 1-7**

సహజమయిన స్వాభావికమయిన అత్యంతశ్రేష్ఠమయిన ఈశత్వము (ప్రభుత్వము) ఎవనియందు సుస్థిరమయివున్నదో (విశ్రాంతిని పొందుతున్నదో) అటువంటి మహాదేవుడు, శూలధారి అయిన మహేశునకు నమస్కారము.

ఇతి శివస్తుతి పరిసమాప్తమ్

శివుని ప్రార్థన ముగిసినది.

## *2. శక్తిస్తుతి*

### శక్తిప్రార్థన

**యామాహుః సర్వలోకానామ్**
**ప్రకృతిం శాస్త్రపారగాః ।**
**తాం ధర్మచారిణీం శంభోః**
**ప్రణమామి పరాం శివామ్ ॥ 1-8**

శాస్త్రపారంగతులు ఎవరిని సర్వలోకములకు ప్రకృతిగాను, శంభువుని సహధర్మచారిణిగాను కొనియాడుచున్నారో, అటువంటి పరాశివకు (పరాశక్తికి) ప్రణామము.

**యయా మహేశ్వరః శంభుః**
**నామరూపాదిసంయుతః ।**
**తస్యై మాయాస్వరూపాయై**
**నమః పరమశక్తయే ॥ 1-9**

యే శక్తి వలన మహేశ్వరుడయిన శంభువు నామరూపాదులతో కూడుకొని యున్నాడో అటువంటి మాయాస్వరూపిణి అయిన ఆ పరమశక్తికి నమస్కారము.



**శివాద్యాదిసముత్పన్న**
**శాన్త్యతీతపరోత్తరామ్ ।**
**మాతరం తాం సమస్తానామ్**
**వందే శివకరీం శివామ్॥ 1-10**

తొట్టతొలుత శివుని నుండి శాంత్యతీతోత్తరకళారూపిణిగా ఆవిర్భవించి (లోకమునందలి) సమస్త (జీవసమూహ) మునకు తల్లియు, శివకరి (మంగళప్రద) అయిన శివాకు (పార్వతీదేవికి) నమస్కరించుచున్నాను..

**ఇచ్ఛాజ్ఞానాదిరూపేణ**
**యా శంభోర్విశ్వభావినీ ।**
**వందే తాం పరామానంద -**
**ప్రబోధలహరీం శివామ్ ॥ 1-11**

శంభువుయొక్క ఏ శక్తి ఇచ్ఛా, జ్ఞానాదిరూపములద్వారా విశ్వమును సృజించుచున్నదో అటువంటి పరమానంద ప్రబోధలహరీ రూపిణి అయిన శివాకు నమస్కరించుచున్నాను.

**అమృతార్థం ప్రపన్నానామ్**
**యా సువిద్యాప్రదాయినీ ।**
**అహర్నిశమహం వందే**
**తామీశానమనోరమామ్॥ 1-12**

అమృతత్త్వ (మరణరాహిత్య) ప్రాప్తికై శరణాగతులయిన వారికి ఎవతె సువిద్యాప్రదానము చేయుచున్నదో, (ఎవతె) పరమేశునికి మనోరమ అయివున్నదో అటువంటి శివాకు అహర్నిశలు (రాత్రింబవళ్ళు) నమస్కరించుచున్నాను.

*ఇతి శక్తిస్తుతిః పరిసమాప్తమ్ ।*

శక్తిప్రార్థన ముగిసినది.

### *3. గ్రంథకారవంశవర్ణనమ్*

### గ్రంథకర్తయొక్కవంశవర్ణన

**కశ్చిదాచారసిద్ధానామ్**
**అగ్రణీః శివయోగినామ్ ।**
**శివయోగీతి విఖ్యాతః**
**శివజ్ఞానమహోదధిః ॥ 1-13**

ఆచారసిద్ధులయిన శివయోగులలో అగ్రగణ్యుడు, శివ జ్ఞానమునకు సముద్రము వంటివాడు, 'శివయోగి' అను పేర ప్రసిద్ధుడయిన మహాత్ముడొకడు వుండేవాడు.

**శివభక్తిసుధాసింధు -**
**జృంభణామలచంద్రికా ।**
**భారతీ యస్య విదధే**
**ప్రాయః కువలయోత్సవమ్ ॥ 1-14**



ఆ శివయోగియొక్క భారతి (వాక్కు) శివభక్తి యను సుధా సముద్రము నందు ఎగిసిపడుతున్న అలలకు నిర్మలమయిన వెన్నెలవలెను, (భూమండలము నందలి జనమానసములనెడి) కలువలకు ఆనందమును కలుగజేయునదిగను ప్రకాశించుచుండెడిది.

**తస్య వంశే సముత్పన్నో**
**ముక్తామణిరివామలః ।**
**ముద్దదేవాభిధాచార్యో**
**మూర్ధన్యః శివయోగినామ్ ॥ 1-15**

అటువంటి శివయోగి వంశమున స్వచ్ఛమయిన ముత్యపు మణివలె ప్రకాశించువాడు, శివయోగులలో పరమశ్రేష్ఠుడైన ముద్దదేవుడను పేరుగల ఆచార్యుడు జన్మించినాడు.

**ముద్దానాత్సర్వజంతూనామ్**
**ప్రణతానాం ప్రబోధతః ।**
**ముద్దదేవేతి విఖ్యాతా**
**సమాఖ్యా యస్య విశ్రుతా ॥ 1-16**

సమస్త జీవరాసులకు ముదము (సంతోషము) నిచ్చుట చేతను, (మరియు) ప్రణామము చేసినవారికి జ్ఞానోపదేశముచేయుట చేతను, అతనికి లోకమున 'ముద్దదేవ' అను పేరు ప్రసిద్ధమాయెను.

**తస్యాసీన్నందనః శాంతః**
**సిద్ధనాథాభిధః శుచిః ।**
**శివసిద్ధాంతనిర్ణేతా**
**శివాచార్యః శివాత్మకః ॥ 1-17**

ఆ ముద్దదేవునకు శాంతస్వరూపుడు, సత్ప్రవర్తనకలవాడు, శివస్వరూపుడు, శివసిద్ధాంతప్రవర్తకుడు, 'సిద్ధనాథు'డను నామము కలిగిన కుమారుడుండెను.

**వీరశైవశిఖారత్నమ్**
**విశిష్టాచారసంపదమ్ ।**
**శివజ్ఞానమహాసింధుమ్**
**యం ప్రశంసంతి దేశికాః ॥ 1-18**

అతనిని దేశికులు (శివాచార్యులు) వీరశైవశిఖారత్నమని, విశిష్టాచారసంపన్నుడని, శివజ్ఞానమునకు సముద్రమువంటివాడని ప్రశంసించెడివారు.

**యస్యాచార్యకులాజ్జాతా**
**సతామాచారమాతృకా ।**
**శివభక్తిః స్థిరా యస్మిన్**
**జజ్ఞే విగతవిప్లవా ॥ 1-19**



అటువంటి ఆచార్యునికులము సదాచారము కలిగిన సత్పురుషులకు జన్మస్థానము, దోషరహితమయిన శివభక్తికి సుస్థిరస్థానమయ్యెను.

**తస్య వీరశివాచార్య**
**శిఖారత్నస్య నందనః ।**
**అభవచ్ఛివయోగీతి**
**సింధోరివ సుధాకరః ॥ 1-20**

వీరశైవ శివాచార్యులలో శిరోరత్నమయిన అతనికి (సిద్ధనాథునకు) 'శివయోగి' యను పేరుకలిగిన కుమారుడు సముద్రమునందు ఉదయించిన చంద్రునివలె జన్మించెను.

*ఇతి కవివంశవర్ణనం సమాప్తమ్ ।*

కవివంశవర్ణనము ముగిసినది.

## *4.* కవి - కావ్యమ్

### కవి - కావ్యము

**చిదానందపరాకాశ -**
**శివానుభవయోగతః ।**
**శివయోగీతి నామోక్తిః**
**యస్య యాథార్థ్యయోగినీ ॥ 1-21**

చిదానందపరాకాశరూపమయిన శివానుభవయోగముచేత ఎవరికి 'శివయోగి' అన్నపేరు యధార్థముగా అన్వయించబడెనో-

**శివాగమపరిజ్ఞాన -**
**పరిపాకసుగంధినా ।**
**యదీయకీర్తిపుష్పేణ**
**వాసితం హరితాం ముఖమ్ ॥ 1-22**

శివాగమజ్ఞానపరిపాకమను సుగంధమును సంతరించుకున్న ఏ శివయోగి యొక్క కీర్తిపుష్పము (తన) సువాసనలను అన్ని దిక్కులా వ్యాపింపజేసెనో -

**యేన రక్షావతీ జాతా**
**శివభక్తిః సనాతనీ ।**
**బౌద్ధాదిప్రతిసిద్ధాంత-**
**మహాధ్వాంతాంశుమాలినా ॥ 1-23**

బౌద్ధాది ప్రతి సిద్ధాంతములచీకటిని పారద్రోలుటలో సూర్యుని వంటి వాడైన ఏ శివయోగిచేత సనాతనమైన శివభక్తి రక్షించబడెనో-

**స మహావీరశైవానామ్**
**ధర్మమార్గప్రవర్తకః ।**
**శివతత్త్వపరిజ్ఞాన -**
**చంద్రికావృతచంద్రమాః ॥ 1-24**

శివతత్త్వపరిజ్ఞానమను వెన్నెలచే ఆవరించబడిన చంద్రునివలె ప్రకాశించు అతను (శివయోగి శివాచార్యుడు), మహావీరశైవులకు ధర్మమార్గ ప్రవర్తకుడయినాడు.



**ఆలోక్య శైవతంత్రాణి**
**కామికాద్యాని సాదరమ్ ।**
**వాతులాంతాని శైవాని**
**పురాణాన్యఖిలాని తు ॥ 1-25**

ఆదరముతో కామికా (గమముతో ఆరంభించి) ది వాతులా (గమమువరకు గల)ంతములైన సమస్త శైవాగమములను మరియు శివసంబంధమయిన సమస్త పురాణములను పరిశీలించి -

**వేదమార్గావిరోధేన**
**విశిష్టాచారసిద్ధయే ।**
**అసన్మార్గనిరాసాయ**
**ప్రమోదాయ వివేకినామ్ ॥ 1-26**

వేదమార్గమునకు విరుద్ధముకానటువంటి, విశిష్టమైన ఆచారములను స్థాపించుటకు, చెడుమార్గములను నిరసించుటకు, వివేకవంతులకు సంతోషమును కలిగించుటకు -

**సర్వస్వం వీరశైవానామ్**
**సకలార్థప్రకాశనమ్ ।**
**అస్పృష్టమఖిలైర్దోషైః**
**ఆదృతం శుద్ధమానసైః ॥ 1-27**

వీరశైవులకు సర్వస్వమయినది, సకలార్థములను (సకల ప్రయోజనములను) ఒనగూర్చునది, సర్వదోషరహిత మయినది, పరి శుద్ధమనస్కులచేత ఆదరించబడినది –

**తేష్వాగమేషు సర్వేషు**
**పురాణేష్వఖిలేషు చ ।**
**పురా దేవేన కథితమ్**
**దేవ్యై తన్నందనాయ చ ॥ 1-28**

ఇరువది యెనిమిది ఆగమములయందు, సమస్త పురాణముల యందు, పూర్వము శివునిచేత దేవి(పార్వతి)కి మరియు కుమారుడైన కుమారస్వామికి బోధించినటువంటిది –

**తత్సంప్రదాయసిద్ధేన**
**రేణుకేన మహాత్మనా ।**
**గణేశ్వరేణ కథితమ్**
**అగస్త్యాయ పునః క్షితౌ ॥ 1-29**

వీరశైవ సంప్రదాయసిద్ధుడైన రేణుకగణేశ్వరుడను మహాత్మునిచేత మరలా భూమండలమున అగస్త్యమహర్షికి చెప్పబడినది–

**వీరశైవమహాతంత్రమ్**
**ఏకోత్తరశతస్థలమ్ ।**



**అనుగ్రహాయ లోకానామ్**
**అభ్యధాత్ సుధియాం వరః ॥ 1-30**

నూటొక్క స్థలములనుప్రతిపాదించు వీరశైవమహాతంత్రమును జ్ఞానసంపన్నులలో శ్రేష్ఠుడైన శివయోగి శివాచార్యుడు లోకములనుగ్రహించుటకై సిద్ధాంతశిఖామణి అనుగ్రంథమును రచించినాడు.

**సర్వేషాం శైవతంత్రాణామ్**
**ఉత్తరత్వాన్నిరుత్తరమ్ ।**
**నామ్నా ప్రతీయతే లోకే**
**యత్సిద్ధాంతశిఖామణిః ॥ 1-31**

సమస్త శైవతంత్రముల ఉత్తరభాగములందు ప్రతిపాదించుట చేతను, దీనికన్నా ఉత్తమమయిన మరియొక సిద్ధాంతము లేనందువలనను ఇది '**సిద్ధాంత శిఖామణి**' అను పేర ప్రసిద్ధిచెందును. (తంత్రమంటే ఆగమము, ఆగమమనగా సిద్ధాంతము, ఇవి మూడూ సమానార్థకములు).

**అనుగతసకలార్థే శైవతంత్రైః సమస్తైః**
**ప్రకటితశివబోధాద్వైతభావప్రసాదే ।**
**విదధతు మతిమస్మిన్ వీరశైవా విశిష్టాః**
**పశుపతిమతసారే పండితశ్లాఘనీయే ॥ 1-32**

(– మాలినీ)

సమస్త శైవతంత్రముల ననుసరించి సకల అర్థము (ప్రయోజనము) లను ఒనగూర్చునది,శివజ్ఞానముచే అద్వైతభావమును ప్రసాదించునది, పండితులచేత శ్లాఘించబడినది, పశుపతిమత సారభూతము అయిన ఈ (సిద్ధాంతశిఖామణి యను) గ్రంథమునందు విశిష్టులయిన వీరశైవులు తమ బుద్ధిని పెట్టుదురుగాక! (శ్రద్ధాళువులై అధ్యయనము చేయుదురుగాక!)

ఇతి గ్రంథకారవంశవర్ణనమ్ ।
గ్రంథకర్తవంశవర్ణనము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ మంగలాచరణానుక్రమప్రసంగో నామ ప్రథమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'మంగళాచరణానుక్రమప్రసంగ'మను మొదటి పరిచ్ఛేదము ముగిసినది.



# ద్వితీయః పరిచ్ఛేదః
## రెండవ పరిచ్ఛేదము
## రేణుకదారుకావతరణమ్
## రేణుకదారుకల అవతరణము
## (34 శ్లోకములు)
## సృష్టి విచారః
## సృష్టివిచారము

### *1.* మంగళాచరణమ్
### మంగళాచరణము

**సచ్చిదానందరూపాయ**
**సదసద్వ్యక్తిహేతవే ।**
**నమః శివాయ సాంబాయ**
**సగణాయ స్వయంభువే ॥** **2-1**

సదసద్రూపమయిన ప్రపంచోత్పత్తికి కారణుడు, ఉమాసహితుడు, గణములతో కూడుకున్నవాడు, స్వయంభువు, సత్-చిత్- ఆనందస్వరూపుడు అయిన శివునికి నమస్కారము (నమః శివాయ).

**సదాశివముఖాశేష -**
**తత్త్వమౌక్తికశుక్తికామ్ ।**

**వందే మాహేశ్వరీం శక్తిమ్**
**మహామాయాదిరూపిణీమ్ ॥ 2-2**

'సదాశివ' తత్త్వముతో ఆరంభమగు సమస్తతత్త్వములు అనెడి ముత్యములతో నిండిన ముత్యపుచిప్పవంటిది, మహామాయాది స్వరూపమును ధరించిన మాహేశ్వరిశక్తికి నమస్కారము.

ఇతి మంగలాచరణం పరిసమాప్తమ్ ।

మంగళాచరణము ముగిసినది.

## 2. వస్తునిర్దేశనమ్

### వస్తునిర్దేశము

**అస్తి సచ్చిత్సుఖాకారమ్**
**అలక్షణపదాస్పదమ్ ।**
**నిర్వికల్పం నిరాకారమ్**
**నిరస్తాశేషవిప్లవమ్ ॥ 2-3**

ఎటువంటి లక్షణములచేతను తెలుసుకొనుటకు వీలుకానటువంటి, నిర్వికల్పము, నిరాకారము, ఎటువంటి బాధలు లేనటువంటి సత్-చిత్-ఆనందస్వరూపమైన ఒకవస్తువు (సృష్టిపూర్వమున) వుండెడిది.

**పరిచ్ఛేదకథాశూన్యమ్**
**ప్రపంచాతీతవైభవమ్ ।**



**ప్రత్యక్షాదిప్రమాణానామ్**
**అగోచరపదే స్థితమ్ ॥ 2-4**

దేశ-కాల-వస్తు పరిచ్ఛేదములు (కొలమానములు) లేనటువంటిది, ప్రపంచమునకు అతీతమైన వైభవమును కలిగినటువంటిది, ప్రత్యక్షాది ప్రమాణముల చేత తెలుసుకొనుటకు వీలుకానిది -

**స్వప్రకాశవిరాజంతమ్**
**అనామయమనౌపమమ్ ।**
**సర్వజ్ఞం సర్వగం శాంతమ్**
**సర్వశక్తి నిరంకుశమ్ ॥ 2-5**

స్వప్రకాశముతో ప్రకాశించునది, నిరామయ (జనన మరణరూపమయిన బాధకములు లేని)మైనది, పోలికలేనిది, సర్వజ్ఞాన స్వరూపమైనది, సర్వవ్యాపకమైనది, శాంతమైనది, సర్వశక్తిచేత నిరంకుశమైనది (ఎదురులేని అధికారము గలది) -

**శివరుద్రమహాదేవ**
**భవాదిపదసంజ్ఞితమ్ ।**
**అద్వితీయమనిర్దేశ్యమ్**
**పరంబ్రహ్మ సనాతనమ్ ॥ 2-6**

శివ, రుద్ర, మహాదేవ, భవ మొదలైన పదములచేత పిలువబడుచున్నది, అద్వితీయమైనది, నిర్దేశించు(చూపు)టకు వీలుకానిది, సనాతనమైన 'పరబ్రహ్మ' అనుపదార్థం (ఒకటి) వుండెడిది.

**తత్ర లీనమభూత్ పూర్వమ్**
**చేతనాచేతనం జగత్ ।**
**స్వాత్మలీనం జగత్కార్యమ్**
**స్వప్రకాశ్యం తదద్భుతమ్ ॥ 2-7**

అందు (పరబ్రహ్మమునందు) చేతనాచేతనాత్మకమైన జగత్తు సృష్టికి ముందు లీనమైయుండెడిది. తనలో అణిగివున్న జగత్తు అను కార్యము తన వల్లనే ప్రకాశమానమగుట ఒక గొప్ప అద్భుతము.

**శివాభిధం పరంబ్రహ్మ**
**జగన్నిర్మాతుమిచ్ఛయా ।**
**స్వరూపమాదధే కించిత్**
**సుఖస్ఫూర్తిర్విజృంభితమ్ ॥ 2-8**

'శివ' అను పేరుతో వ్యవహరించబడు పరబ్రహ్మము జగన్నిర్మాణము చేయవలయునను కోరిక గలిగి సుఖస్ఫూర్తితో కూడుకున్న ఒకానొక (కించిత్) స్వరూపమును (తానే) ధరించెను.

**నిరస్తదోషసంబంధమ్**
**నిరుపాధికమవ్యయమ్ ।**
**దివ్యమప్రాకృతం నిత్యమ్**
**నీలకంఠం త్రిలోచనమ్ ॥ 2-9**



దోషము(జనన మరణము)ల సంబంధము లేనిది, ఉపాధి రహితము, అవ్యయము, అప్రాకృతము (ప్రకృతి సంబంధము లేనిది) నిత్యము, దివ్యము అయిన ఆ స్వరూపము 'నీలకంఠుడు' 'త్రిలోచనుడు' అని లోకమున ప్రసిద్ధిని బడిసెను.

**చంద్రార్ధశేఖరం శుద్ధమ్**
**శుద్ధస్ఫటికసన్నిభమ్ ।**
**శుద్ధముక్తాఫలాభాసమ్**
**ఉపాస్యం గుణమూర్తిభిః ॥ 2-10**

(అతడు) తలపై చంద్రరేఖను ధరించి, శుభ్రమైన స్ఫటికమువలె, పరిశుద్ధములైన ముత్తెపు కాంతులవలె శుద్ధుడై, ప్రకాశించుచు, గుణమూర్తు(బ్రహ్మాదు)లకు ఉపాస్యుడు (అయినాడు).

**విశుద్ధజ్ఞానకరణమ్**
**విషయం సర్వయోగినామ్ ।**
**కోటిసూర్యప్రతీకాశమ్**
**చంద్రకోటిసమప్రభమ్ ।**
**అప్రాకృతగుణాధారమ్**
**అనంతమహిమాస్పదమ్ ॥ 2-11**

పరిశుద్ధజ్ఞానమునకు అసాధారణకారణమైనవాడు, సమస్త యోగు(ల అనుభవము)లకు విషయమైనవాడు, కోటిసూర్యుల ప్రకాశమునకు సమానమైన వెలుగును, కోటిచంద్రుల కాంతికి సమానమైన కాంతిని

(చల్లదనమును) కలిగినవాడు, అప్రాకృతగుణము(సత్వాది ప్రాకృత గుణాలకన్నా భిన్నమైన సర్వజ్ఞత్వాది అనంతకల్యాణగుణము)లకు ఆధారమైనవాడు, అనంతమయిన మహిమలకు ఆశ్రయమైన శివుడు సుఖస్ఫూర్తితో స్వరూపమును ధరించవలెనని భావించినప్పుడు–

**తదీయా పరమాశక్తిః**
**సచ్చిదానందలక్షణా ।**
**సమస్తలోకనిర్మాణ–**
**సమవాయస్వరూపిణీ ॥ 2–12**

అతని యొక్క పరమాశక్తి (పరాశక్తి, విమర్శాశక్తి) సచ్చిదానంద లక్షణములతో కూడుకుని సృష్టినిర్మాణమను కార్యమునకు సమవాయ (ఉపాదాన) కారణరూపిణియైనది.

**తదిచ్ఛయాఽభవత్సాక్షాత్**
**తత్స్వరూపానుసారిణీ ।**
**స శంభుర్భగవాన్ దేవః**
**సర్వజ్ఞః సర్వశక్తిమాన్ ॥ 2–13**

**జగత్సిసృక్షుః ప్రథమమ్**
**బ్రహ్మాణం సర్వదేహినామ్ ।**
**కర్తారం సర్వలోకానామ్**
**విదధే విశ్వనాయకః ॥ 2–14**



ఈ పరమాశక్తి పరశివుని ఇచ్ఛననుసరించి సాక్షాత్ అతనివంటి స్వరూపమునే తాను కూడా ధరించినది. సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, దేవతాస్వరూపుడు, భగవంతుడు, విశ్వనాయకుడు అయిన శంభువు జగత్తును సృష్టించదలచి మొట్టమొదట సర్వలోకముల(సర్వజీవుల)కర్త అయిన బ్రహ్మదేవుని సృష్టించెను.

**తస్మై ప్రథమపుత్రాయ**
**శంకరః శక్తిమాన్ విభుః ।**
**సర్వజ్ఞః సకలా విద్యాః**
**సానుగ్రహముపాదిశత్ ।**
**ప్రాప్తవిద్యో మహాదేవాత్**
**బ్రహ్మా విశ్వనియామకాత్॥ 2–15**

శక్తిమంతుడు, విభువు, సర్వజ్ఞుడు అయిన శంకరుడు ప్రథమపుత్రు (బ్రహ్మదేవు)నకు అనుగ్రహపూర్వకంగా సమస్తవిద్యలను ఉపదేశించెను. విశ్వనియామకుడైన మహాదేవుని నుండి విద్యలను పొందిన బ్రహ్మదేవుడు–

**సమస్తలోకాన్నిర్మాతుమ్**
**సముద్యమపరోఽభవత్ ।**
**కృతోద్యోగోఽపి నిర్మాణే**
**జగతాం శంకరాజ్ఞయా ।**
**అజ్ఞాతోపాయసంపత్తేః**
**అభవన్మాయయావృతః ॥ 2–16**

సమస్తలోకములను నిర్మించుపనికి పూనుకున్నాడు. శంకరుని ఆజ్ఞననుసరించి సృష్టినిర్మాణమునకు ఉద్యుక్తుడైన బ్రహ్మ మాయచే ఆవరించబడినవాడై నిర్మాణకార్యమునకవసరమయిన ఉపాయములను గ్రహించలేక పోయాడు.

**విధాతుమఖిలాన్ లోకాన్**
**ఉపాయం ప్రాప్తుమిచ్ఛయా ।**
**పునస్తం ప్రార్థయామాస**
**దేవదేవం త్రియంబకమ్ ॥ 2-17**

అఖిలలోకములను సృష్టించుటకు (తగిన) ఉపాయమును తెలుసుకొనగోరి దేవదేవుడయిన త్రయంబకుని (ముక్కంటిని) మరలా (ఇలా) ప్రార్థించాడు –

**నమస్తే దేవదేవేశ**
**నమస్తే కరుణాకర ।**
**అస్మదాదిజగత్సర్వ –**
**నిర్మాణనవిధిక్షమ ॥ 2-18**

దేవాధిదేవా! కరుణాకరా! నాతో మొదలుకుని (నేనున్న) ఈ సమస్త ప్రపంచమును సృష్టించ సమర్థుడైనవాడా! నీకు నమస్కారములు!

**ఉపాయం వద మే శంభో**
**జగత్స్రష్టః జగత్పతే ।**



**సర్వజ్ఞః సర్వశక్తిస్త్వమ్**
**సర్వకర్తా సనాతనః ॥ 2-19**

ఓ శంభో! నీవు సర్వజ్ఞుడవు, సర్వశక్తి సమన్వితడవు, సర్వకర్తవు! సనాతనుడవు (ఆది నుండి వున్నవాడవు), జగత్పతివి! జగత్‌సృష్టికర్తవి! 'నాకు (జగత్తును) సృష్టించు ఉపాయమును తెలియజేయుము.

**ఇతి సంప్రార్థితః శంభుః**
**బ్రహ్మణా విశ్వనాయకః ।**
**ఉపాయమవదత్ తస్మై**
**లోకసృష్టిప్రవర్తనమ్ ॥ 2-20**

ఈ విధముగా బ్రహ్మదేవుని చేత ప్రార్థించబడిన విశ్వనాయకుడైన శివుడు అతనికి సృష్టినిర్మాణవిధానమును తెలియజేసెను.

**ఉపాయమీశ్వరేణోక్తమ్**
**లబ్ధ్వాఽపి చతురాననః ।**
**న సమర్థోఽభవత్ కర్తుమ్**
**నానారూపమిదం జగత్ ॥ 2-21**

**పునస్తం ప్రార్థయామాస**
**బ్రహ్మ విహ్వలమానసః ।**
**దేవదేవ! మహాదేవ!**
**జగత్ప్రథమకారణ! ।**

**నమస్తే సచ్చిదానంద**
**స్వేచ్ఛావిగ్రహరాజిత ॥ 2-22**

**భవ శర్వ మహేశాన**
**సర్వకారణకారణ! ।**
**భవదుక్తో హ్యుపాయో మే**
**న కించిత్జ్ఞాయతేఽధునా ॥ 2-23**

**సృష్టిం విధేహి భగవన్**
**ప్రథమం పరమేశ్వర ।**
**జ్ఞాతోపాయస్తతః కుర్యామ్**
**జగత్సృష్టిముమాపతే ॥ 2-24**

పరమేశ్వరునిచే ఉపదేశించబడిన సృష్టివిధానమును బ్రహ్మదేవుడు పొందినను వివిధరూపాత్మకమయిన జగత్తును సృష్టించలేక, భయవిహ్వలుడై మరలా పరమేశ్వరుని ఇట్లు ప్రార్థించినాడు. 'ఓ దేవదేవ! మహాదేవ! జగత్తుకు ఆదికారణమైనవాడా! సచ్చిదానందస్వరూపుడా! స్వ ఇచ్ఛతో (సర్వస్వతంత్రుడవై) అనంతములయిన రూపములను ధరించినవాడా! భవుడా! (జగత్సృష్టికి, లయకి కారణమైనవాడా!) నీకు నమస్కారము! భగవంతుడైన పరమేశ్వరుడా! ఓ ఉమాపతీ! నీ చే చెప్పబడిన సృష్ట్యుపాయమును నేను గ్రహించలేకున్నాను. (అందువలన) మీరే



ప్రప్రథమమున సృష్టికార్యమును ఆరంభించుదురుగాక! దానిని చూసి నేను అదే విధానమునను సరించి సృష్టి కార్యమును కొనసాగించెదను.

ఇతి వస్తునిర్దేశనం సమాప్తమ్ ।
వస్తునిర్దేశము ముగిసినది.

### *3.* ప్రమథానాం సృష్టిః
### ప్రమథుల సృష్టి

**ఇత్యేవం ప్రార్థితః శంభుః**
**బ్రహ్మణా విశ్వయోనినా ।**
**ససర్జాత్మసమప్రఖ్యాన్**
**సర్వగాన్ సర్వశక్తికాన్ ॥ 2-25**

**ప్రబోధపరమానంద**
**పరివాహితమానసాన్ ।**
**ప్రమథాన్ విశ్వనిర్మాణ**
**ప్రలయాపాదనక్షమాన్ ॥ 2-26**

ఈ విధంగా విశ్వమూలమైన బ్రహ్మచే ప్రార్థించబడిన శంభువు తనతో సమానమయిన తేజస్సుగలవారు, సర్వజ్ఞులయినవారు, సర్వశక్తి సంపన్నులయినవారు, (సర్వోత్కృష్టము సామరస్యాత్మకమయిన జ్ఞాన) ప్రబోధముచే ఏర్పడిన పరమానందప్రవాహముచే ఉప్పొంగిన మనసులు

గలవారు, జగన్నిర్మాణమునకు ప్రళయమునకు (రెంటికీ) సమర్థులయిన ప్రమథగణములను సృష్టించాడు.

**సృష్టప్రమథవర్గేషు**
**వర్ణాశ్రమ పరిక్రమాన్ ।**
**అప్రాకృత సదాచారాన్**
**ఉపాదిశతథ ప్రభుః ॥ 2-27**

తనచే సృష్టించబడిన ప్రమథగణాలలో, అతివర్ణాశ్రమధర్మములను అనుసరించుచూ, అప్రాకృతములయిన సదాచారసంపన్నులయిన, ప్రమథగణములకు ప్రభువైన పరమేశ్వరుడు ఉపదేశమును చేసెను.

**తేషు ప్రమథవర్గేషు**
**సృష్టేషు పరమాత్మనా ।**
**రేణుకో దారుకశ్చేతి**
**ద్వావభూతాం శివప్రియౌ ॥ 2-28**

తరువాత పరమాత్మునిచే సృష్టించబడిన ప్రమథగణములలో రేణుకుడు, దారకుడు అను ఇద్దరు శివునికి అత్యంత ప్రీతిపాత్రులైరి.

**సర్వవిద్యావిశేషజ్ఞౌ**
**సర్వకార్యవిచక్షణౌ ।**
**మాయామలవినిర్ముక్తౌ**
**మహిమాతిశయోజ్జ్వలౌ ॥ 2-29**



**ఆత్మానందపరిస్ఫూర్తి-**
**రసాస్వాదనలంపటౌ ।**
**శివతత్త్వపరిజ్ఞాన**
**తిరస్కృతభవామయౌ ॥ 2-30**

(వారిరువురు) సమస్తవిద్యల విశేషార్థములను చక్కగా తెలుసుకున్నవారు, సర్వకార్యకుశలురు, మాయాశక్తిచే కల్పించబడిన ఆణవాది మలత్రయ సంబంధరహితులు, మహామహిమాన్వితప్రకాశకులు, ఆత్మానంద పరిపూర్ణమైన అమృతరసాస్వాదనలో ఆసక్తులు, శివతత్త్వజ్ఞానముతో జనన-మరణములను భవరోగములను పోగొట్టుకొన్నవారు -

**నానాపథమహాశైవ-**
**తంత్రనిర్వాహతత్పరౌ ।**
**వేదాంతసారసర్వస్వ-**
**వివేచనవిచక్షణౌ ॥ 2-31**

**నిత్యసిద్ధౌ నిరాతంకౌ**
**నిరంకుశపరాక్రమౌ ।**
**తాదృశౌ తౌ మహాభాగౌ**
**సంవీక్ష్య పరమేశ్వరః ॥ 2-32**

**సమర్థౌ సర్వకార్యేషు**
**విశ్వాసపరమాశ్రితౌ ।**

**అంతఃపురద్వారపాలౌ**
**నిర్మమే నియతౌ విభుః ॥ 2-33**

అనేక శాఖలుగా విస్తరించిన మహాశైవతంత్రాన్ని (ఆచరణ ద్వారా) అనుసరించుటలో నిమగ్నులు, వేదాంత (ఉపనిషత్తుల) సారసర్వస్వాన్ని వివరించుటలో కుశలురు, నిత్యసిద్ధులు, ఎదురులేనివారు, అసమాన పరాక్రమవంతులు, సర్వకార్యసమర్థులు, పరమవిశ్వాసపాత్రులు, మహాత్ములు అయిన ఆ రేణుక-దారుకగణేశ్వరులు విభుడైన పరమేశ్వరుని అంతఃపురద్వారపాలకులుగా నియమించబడిరి.

**గణేశ్వరౌ రేణుకదారుకావుభౌ**
**విశ్వాసభూతౌ నవచంద్రమౌలేః ।**
**అంతఃపురద్వారగతౌ సదా తౌ**
**వితేనతుర్విశ్వపతేస్తు సేవామ్ ॥ 2-34**

(- వంశస్థమ్)

విశ్వాసపాత్రులయిన రేణుకాదారుక గణేశ్వరులిరువురు విశ్వపతి అయిన నవచంద్రశేఖరుని అంతఃపురద్వారపాలకులుగా తమ సేవలను నిరంతరం అందించసాగారు.

*ఇతి ప్రమథానాం సృష్టిః పరిసమాప్తమ్ ।*
ప్రమథుల సృష్టి ముగిసినది.



**ఓం తత్సత్ ఇతి**

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ రేణుకదారుకావతరణం నామ ద్వితీయః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'రేణుకదారుకావతరణ'మను రెండవ పరిచ్ఛేదము ముగిసినది.



# తృతీయః పరిచ్ఛేదః

## మూడవ పరిచ్ఛేదము

### *కైలాసవర్ణనం రేణుకావతరణకారణం చ*

### కైలాసవర్ణనము, రేణుకావతరణకారణము

**(88 శ్లోకములు)**

*1. కైలాసవర్ణనమ్*

కైలాసవర్ణనము

**కదాచిదథ కైలాసే**
**కలధౌతశిలామయే ।**
**గంధర్వవామనయనా**
**క్రీడామౌక్తికదర్పణే ॥ 3-1**

పూర్వమొకానొక కాలమున వెండిశిలలతో వెలుగొందుచు గంధర్వస్త్రీల క్రీడలకోసం ముత్యములతో అలంకరించిన అద్దము వలె ప్రకాశించుచున్న కైలాసపర్వతమున –

**మందారవకులాశోక –**
**మాకందప్రాయభూరుహే ।**
**మల్లీమరందనిష్యంద**
**పానపీనమధువ్రతే ॥ 3-2**



మందార, వకుల, అశోక, మామిడివంటి వృక్షములతో నిండినది, మల్లెపువ్వుల నుండి ప్రసరించే పరిమళాస్వాదనముతో మత్తెక్కిన తుమ్మెదలతో శోభించుచున్నది,

**కుంకుమస్తబకామోద**
**కూలంకషహరిన్ముఖే ।**
**కలకంఠకులాలాప**
**కందలద్రాగబంధురే ॥ 3-3**

ఎర్రని పూగుత్తెల సువాసనలతో నిండిన సర్వదిక్కులను గలిగినది, మధురమైన కోకిలగుంపుల పంచమస్వరాలతో మనోహరమైనది,

**కిన్నరీగీతమాధుర్య –**
**పరివాహితగహ్వరే ।**
**సానందవరయోగీంద్ర**
**వృందాలంకృతకందరే ॥ 3-4**

కిన్నెరస్త్రీల గానమాధుర్యంతో వ్యాపించిన గుహలు గలది, సానందాదిశ్రేష్ఠయోగీంద్ర సమూహాలను తన కందరాలలో వుంచుకున్నది,

**హేమారవిందకలికా –**
**సుగంధిరసమానసే ।**
**శాతకుంభమయస్తంభ**
**శతోత్తుంగవిరాజితే ॥ 3-5**

బంగారురంగు తామరమొగ్గల సుగంధముతో వ్యాపించిన మానససరోవరము గలది, బంగారముతో చేసిన ఎత్తైన శతాధిక స్తంభములతో శోభించునది,

**మాణిక్యదీపకలికా -**
**మరీచిద్యోతితాంతరే ।**
**ద్వారతోరణసంరూఢ -**
**శంఖపద్మనిధిద్వయే ॥ 3-6**

మాణిక్యదీపకాంతులతో ప్రకాశించే అంతర్భాగాలు గలది, ద్వారముల పైభాగమునన్నున్న రెండు తోరణ స్తంభాలపైన శంఖము పద్మము లనెడి నిధులను కలిగినది,

**ముక్తాతారకితోదార -**
**వితానాంబరమండితే ।**
**స్పర్శలక్షితవైడూర్య**
**మయభిత్తిపరంపరే ॥ 3-7**

నక్షత్రములవంటి ముత్యములతో అల్లబడిన వస్త్రములచే అలంకరించబడిన పైభాగములను కలిగినది, స్పర్శచేత మాత్రమే తెలుసుకొన దగిన వైడూర్యమయములైన గోడల వరుసలను కలగినది,

**సంచరత్ప్రమథశ్రేణీ -**
**పదవాచాలనూపురే ।**



**ప్రవాలవలభీశృంగ -**
**శృంగారమణిమంటపే ॥ 3-8**

(అక్కడ) తిరుగాడుతున్న ప్రమథ సమూహముల కాలిగజ్జెల సవ్వడితో నిండినది, ప్రవాళములచే పొదగబడిన శిఖరములతో అలంకరించ బడిన రత్నమంటపము నందలి సింహాసనమున (పరమేశ్వరుడు ఉపవిష్టుడై వున్నాడు.)

*ఇతి కైలాసవర్ణనం పరిసమాప్తమ్ ।*

కైలాసవర్ణనము ముగిసినది.

### *2.* సింహాసనాసీనపరమేశ్వరవర్ణనమ్

### సింహాసనమునలంకరించిన పరమేశ్వరుని వర్ణనము

**వందారుదేవముకుట-**
**మందారరసవాసితమ్ ।**
**రత్నసింహాసనం దివ్య -**
**మధ్యస్థం పరమేశ్వరమ్ ॥ 3-9**

నమస్కరిస్తున్న దేవతల కిరీటములందలి మందారపూవుల వాసనలతో పరిమళించు దివ్యమైన రత్నసింహాసనముపై కూర్చున్న పరమేశ్వరుడు -

**తమాస్థానగతం దేవమ్**
**సర్వలోకమహేశ్వరమ్ ।**

**త్రయ్యంతకమలారణ్య-**
**విహారకలహంసకమ్ ॥ 3-10**

వేదముల చివరిభాగములయిన ఉపనిషత్తులను తామరవనంలో విహరించు రాజహంసవలె సకల లోకముల కధిపతియై, దేవదేవుడై ఆస్థానమునలంకరించి వున్నాడు.

**ఉదారగుణమోంకార-**
**శుక్తికాపుటమౌక్తికమ్ ।**
**సర్వమంగలసౌభాగ్య -**
**సముదాయనికేతనమ్ ॥ 3-11**

ఉదారగుణుడు, ఓంకారమను ముత్తెపు చిప్పయందు ముత్యమువలె ప్రకాశించువాడు, సమస్త మంగళసౌభాగ్యసముదాయమునకుమందిర మైనవాడు,

**సంసారవిషమూర్ఛాలు -**
**జీవసంజీవనౌషధమ్ ।**
**నిత్యప్రకాశనైర్మల్య -**
**కైవల్యసురపాదపమ్ ॥ 3-12**

సంసారమను విషప్రభావముచేత మూర్ఛిల్లిన జీవులకు సంజీవనీ ఔషధమువంటివాడు, నిత్యప్రకాశముచేత నిర్మలమయిన ముక్తికి కల్పవృక్షము వంటివాడు,



**అనంతపరమానంద -**
**మకరందమధుప్రతమ్ ।**
**ఆత్మశక్తిలతాపుష్ప-**
**త్రిలోకీపుష్పకోరకమ్ ॥ 3-13**

అంతములేని పరమానంద రసాస్వాదనమున తుమ్మెద వంటివాడు, ఆత్మ(తనలో నిత్య సంబంధముతోనున్న)శక్తి యను తీగెకు పూచిన ముల్లోకములను మూడుమొగ్గలను కలిగినవాడు,

**బ్రహ్మాండకుండికాషండ -**
**పిండీకరణపండితమ్ ।**
**సమస్తదేవతాచక్ర-**
**చక్రవర్తిపదే స్థితమ్ ॥ 3-14**

అనంతబ్రహ్మాండములను పాత్రలసమూహములను ఒక్కటిగా సంయోజనము చేయగల సమర్థుడు, సమస్త దేవతల సముదాయమునకు చక్రవర్తివంటి వాడు,

**చంద్రబింబాయుతచ్ఛాయా -**
**దాయాదద్యుతివిగ్రహమ్ ।**
**మాణిక్యముకుటజ్యోతి -**
**ర్మంజరీపింజరాంబరమ్ ॥ 3-15**

పదివేల (అయుత) చంద్రబింబములకాంతికి సమానమైన తేజస్సుతో ప్రకాశించు శరీరవర్ణము కలవాడు, (నమస్కరించు దేవతలకిరీటము లందలి) రత్నకాంతులు తాకి విచిత్రమైన రంగులను సంతరించుకున్న వస్త్రముల ధరించినవాడు,

**చూడాలం సోమకలయా**
**సుకుమార బిసాభయా ।**
**కల్యాణపుష్పకలికా –**
**కర్ణపూరమనోహరమ్ ॥ 3–16**

కోమలమైన తామరతంతువువలెనున్న సన్నని చంద్రరేఖను శిరోభూషణముగా ధరించినవాడు, మంగళకరములైన పూమొగ్గలను కర్ణాభరణములుగా ధరించి మనోహరుడైనవాడు,

**ముక్తావలయసంబద్ధ –**
**ముండమాలావిరాజితమ్ ।**
**పర్యాప్తచంద్రసౌందర్య**
**పరిపంథిముఖశ్రియమ్ ॥ 3–17**

ముత్యాలసరములతో కూర్చిన ముండమాలను అలంకరించు కున్నవాడు, నిండుచంద్రుని సొబగును తిరస్కరించిన ముఖసౌందర్యము గలవాడు,



**ప్రాతఃసంఫుల్లకమల –**
**పరియాయత్రిలోచనమ్ ।**
**మందస్మితమితాలాప**
**మధురాధరపల్లవమ్ ॥ 3–18**

ప్రాతఃకాలమున వికసించిన తామరపూవువలె మూడుకన్నులతో ప్రకాశించువాడు, మందస్మితము, మితభాషణములచేత మధురమైన అధరపల్లవములను కలిగినవాడు,

**గండమండలపర్యంత**
**క్రీడన్మకరకుండలమ్ ।**
**కాలిమ్నా కాలకూటస్య**
**కంఠనాలే కలంకితమ్ ॥ 3–19**

చుబుకము వరకు వ్రేలాడు మకరకుండలములను ధరించిన వాడు, కాలకూటవిషముయొక్క నల్లదనము చేత కళంకితమైన కంఠముకలవాడు,

**మణికంకణకేయూర–**
**మరీచికరపల్లవైః ।**
**చతుర్భిః సంవిరాజంతమ్**
**బాహుమందారశాఖిభిః ॥ 3–20**

రత్నఖచితములైన కంకణముల, భుజకీర్తుల కాంతులతో కూడిన చిగురులవంటి కోమలములైన హస్తములతో మందారవృక్షపు కొమ్మలవలె సుందరములైన నాలుగు భుజములతో శోభిల్లువాడు,

**గౌరీపయోధరాశ్లేష -**
**కృతార్థభుజమధ్యమమ్ ।**
**సువర్ణబ్రహ్మసూత్రాంకమ్**
**సూక్ష్మకౌశేయవాససమ్ ॥ 3-21**

గౌరీదేవి వక్షస్థలమును కౌగలించుకొనుటచేత తరించిన పయ్యెదగలవాడు, అతిసన్నని బంగారుదారములతో నేసిన పలచని పట్టువస్త్రముల ధరించినవాడు,

**నాభిస్థానావలంబిన్యా**
**నవమౌక్తికమాలయా ।**
**గంగయేవ కృతాశ్లేషమ్**
**మౌలిభాగావతీర్ణయా ॥ 3-22**

శిరోభాగము నుండి దిగివచ్చిన గంగవలె నాభిస్థానమువరకు వ్రేలాడుతున్న నవమౌక్తికమాలచేత కావలించుకొనబడినవాడు (అయిన పరమశివుడు సింహాసనమున ఆశీనుడై వున్నాడు).

**పదేన మణిమంజీర-**
**ప్రభాపల్లవితశ్రియా ।**



**చంద్రవత్స్ఫాటికం పీఠమ్**
**సమావృత్య స్థితం పురః ॥ 3-23**

(ఆ సింహాసనమునకు) ముందు భాగమున రత్నములు పొదిగిన కాలి గజ్జెల కాంతులచేత శోభిల్లు పాదములచేత ఆక్రమించబడిన పాదపీఠము చంద్రునివలె శుభ్రమైన స్ఫటికలతో చేయబడినదానివలె ప్రకాశించుచున్నది.

*ఇతి సింహాసనాసీనపరమేశ్వరవర్ణనం పరిసమాప్తమ్ ।*

సింహాసనమునలంకరించిన పరమేశ్వరుని వర్ణనము ముగిసినది.

## *3.* శక్తివర్ణనమ్

### శ్రీశక్తివర్ణనము

**వామపార్శ్వనివాసిన్యా**
**మంగలప్రియవేషయా ।**
**సమస్తలోకనిర్మాణ -**
**సమవాయస్వరూపయా ॥ 3-24**

పరమశివుని శరీరమున వామార్ధభాగమునాశ్రయించినది, మంగళకరము మనోహరము అయిన వేషమును ధరించినది, సమస్తలోకములను సృజించు కార్యమునకు సమవాయకారణ(నిత్యసంబంధ) స్వరూపమైనది,

**ఇచ్ఛాజ్ఞానక్రియారూప -**
**బహుశక్తివిలాసయా ।**
**విద్యాతత్త్వప్రకాశిన్యా**
**వినాభావవిహీనయా ॥ 3-25**

ఇచ్ఛా-జ్ఞాన-క్రియాత్మకమైన అనేక శక్తులతో విరాజిల్లునది, శుద్ధవిద్యాతత్త్వమును బోధించునది, శివునితో అవినాభావసంబంధముతో ఎల్లప్పుడూ కలిసివుండునది,

**సంసారవిషకాంతార -**
**దాహదావాగ్నిలేఖయా ।**
**ధమ్మిల్లమల్లికామోద-**
**ఝంకుర్వద్భృంగమాలయా ॥ 3-26**

సంసారమను విషారణ్యమును దహించు కారుచిచ్చువంటిది, కొప్పులో ముడిచిన మల్లెపూల పరిమళానికి ఝంకరిస్తున్న తుమ్మెదల వరసలు కలిగినట్టిది,

**సంపూర్ణచంద్రసౌభాగ్య -**
**సంవాదిముఖపద్మయా ।**
**నాసామౌక్తికలావణ్య-**
**నాశీరస్మితశోభయా ॥ 3-27**



నిండుచంద్రుని సౌందర్యముతో పోటీపడుతున్న ముఖకమలము కలిగినట్టిది, ముక్కెరలోని ముత్యపు సౌందర్యముచేత ఉత్కృష్టమయిన మందహాసశోభతో ప్రకాశించునది,

**మణితాటంకరంగాంత-**
**ర్వలితాపాంగలీలయా ।**
**నేత్రద్వితయసౌందర్య-**
**నిందితేందీవరత్విషా ॥ 3-28**

రత్నఖచితకర్ణాభరణములనెడి రంగమంటప మధ్యమున ప్రసరింపజేసిన కంటికొనచూపులు గలిగినట్టిది, నల్లకలువ కాంతిని తిరస్కరించిన నేత్రద్వయసౌందర్యము కలిగినట్టిది,

**కుసుమాయుధకోదండ-**
**కుటిలభ్రూవిలాసయా ।**
**బంధూకకుసుమచ్ఛాయా-**
**బంధుభూతాధరశ్రియా ॥ 3-29**

మన్మథుని ధనస్సువలె వంకరగానున్న కనుబొమ్మలశోభను కలిగినట్టిది, మంకెనపూలరంగుతో బంధుత్వము నెరిపిన అధరసౌందర్యము గలిగినట్టిది,

**కంఠనాలజితానంగ-**
**కంబబిబ్బోకసంపదా ।**

**బాహుద్వితయసౌభాగ్య-**
**వంచితోత్పలమాలయా ॥ 3-30**

తన కంఠస్వరముతో జయించిన మన్మథుని విజయశంఖ నాదమాధుర్యమును కలిగినట్టిది, ఉత్పలపూదండలసౌకుమార్యమును తిరస్కరించిన బాహుద్వయమును కలిగినట్టిది,

**స్థిరయౌవనలావణ్య-**
**శృంగారితశరీరయా ।**
**అత్యంతకఠినోత్తుంగ-**
**పీవరస్తనభారయా ॥ 3-31**

స్థిరమైన యౌవనలావణ్యముచే అలంకరించబడిన శరీరము గలది, అత్యంత కఠినము ఉన్నతము అయిన స్తనభారముతో కూడుకున్నది,

**మృణాలవల్లరీతంతు-**
**బంధుభూతావలగ్నయా ।**
**శృంగారతటినీతుంగ-**
**పులినశ్రోణిభారయా ॥ 3-32**

తామర తీగెల తంతువులతో పోల్చదగిన (అతి సన్నని) నడుమును గలిగినట్టిది, శృంగారమను నదీతీరమందలి ఎత్తైన ఇసుకతిన్నెలవంటి నితంబముల(పిరుదుల)ను కలిగినట్టిది,



**కుసుంభకుసుమచ్ఛాయా-**
**కోమలాంబరశోభయా ।**
**శృంగారోద్యానసంరంభ-**
**రంభాస్తంభోరుకాండయా ॥ 3-33**

కుసుంబపూవుల కాంతులవలె శోభిల్లు అత్యంత కోమలములయిన వస్త్రములతో అలంకరించబడినది, శృంగారమను ఉద్యానవనములో మొలచిన అరటిస్తంభములవంటి తొడలను కలిగినట్టిది,

**చూతప్రవాలసుషమా-**
**సుకుమారపదాబ్జయా ।**
**స్థిరమంగలశృంగార-**
**భూషణాలంకృతాంగయా ॥ 3-34**

మామిడిచిగురువలె మిక్కిలి సుకుమారములయిన పాద కమలములను కలిగినట్టిది, నిత్యమంగళాత్మకములు మనోహరములు అయిన ఆభరణములతో అలంకరించబడిన శరీరము గలది,

**హారనూపురకేయూర-**
**చమత్కృతశరీరయా ।**
**చక్షురానందలతయా**
**సౌభాగ్యకులవిద్యయా ॥ 3-35**

(మెడను) హారములతోను (పాదములను) అందియలతోను, (బాహువులను) వంకీలతోను(అలంకరించుకు)న్న ప్రకాశించు దేహము కలది, (చూచువారి) కన్నులకు ఆనందలత వంటిది, సౌభాగ్యసంపదకు కులవిద్య వంటిది అయిన–

**ఉమయా సమమాసీనమ్**
**లోకజాలకుటుంబయా ।**
**అపూర్వరూపమభజన్**
**పరివారాః సమంతతః ॥ 3–36**

చరాచర జీవరాసులతో కూడిన జగత్కుటుంబిని అయిన ఉమాదేవితోపాటు ఆసీనుడైన పరమేశ్వరునిచుట్టూ పరివారదేవతలు పరివేష్టించి సేవించు చున్నారు.

ఇతి శక్తివర్ణనం పరిసమాప్తమ్ ।
శక్తివర్ణనము ముగిసినది.

## *4.* దేవతానాం సేవావర్ణనమ్
## దేవతల సేవావర్ణనము

**పుండరీకాకృతిం స్వచ్ఛమ్**
**పూర్ణచంద్రసహోదరమ్ ।**
**దధౌ తస్య మహాలక్ష్మీః**
**సితమాతపవారణమ్ ॥ 3–37**



శ్రీమహాలక్ష్మీదేవి పరమేశ్వరునికి పూర్ణచంద్రుని వలె స్వచ్ఛమైన తెల్లనైన తామరపూవు ఆకారముననున్న తెల్లని గొడుగును ఎత్తిపట్టుకున్నది..

**తంత్రీఝంకారశాలిన్యా**
**సంగీతామృతవిద్యయా ।**
**ఉపతస్థే మహాదేవమ్**
**ఉపాంతే చ సరస్వతీ ॥ 3–38**

సరస్వతీదేవి వీణానాదముతో కూడిన అమృతమువంటి గానవిద్యతో అత్యంత సమీపమున కూర్చొని మహాదేవుని రంజింప జేయుచున్నది.

**ఝణత్కంకణజాతేన**
**హస్తేనోపనిషద్వధూః ।**
**ఓంకారతాలవృంతేన**
**వీజయామాస శంకరమ్॥ 3–39**

గలగలలాడెడి గాజులసవ్వడి చేయు చేతులతో ఉపనిషత్తు అను వధువు ఓంకారమనెడి విసనకర్రతో శంకరునకు గాలిని వీచుచున్నది.

**చలచ్చామరికాహస్తా**
**ఝంకుర్వన్మణికంకణాః ।**
**ఆసేవంత తమీశాన–**
**మభితో దివ్యకన్యకాః ॥ 3–40**

సవ్వడిచేయు మణికంకణములను ధరించి, కదిలే చామరములను చేతబట్టిన దేవలోకపు దివ్యకన్నెలు పరమేశ్వరుని పరివేష్ఠించి సేవించుచున్నారు.

**చామరాణాం విలోలానామ్**
**మధ్యే తన్ముఖమండలమ్ ।**
**రరాజ రాజహంసానామ్**
**భ్రమతామివ పంకజమ్ ॥ 3-41**

(అటు ఇటు) కదలాడుతున్న చామరముల నడుమనున్న పరమేశ్వరుని ముఖమండలము తిరుగాడుతున్న రాజహంసల నడుమనున్న తామరపూవు వలె ప్రకాశించుచున్నది.

**మంత్రేణ తమసేవంత**
**వేదాః సాంగవిభూతయః ।**
**భక్త్యా చూడామణిం కాంతమ్**
**వహంత ఇవ మౌలిభిః ॥ 3-42**

(శిక్షాది) షడంగసహితములయిన వేదములు, ఉపనిషత్తులనబడు తమ శిరస్సులపై చూడామణివలె ప్రకాశించు పరమేశ్వరుని భక్తి పూర్వకముగా మంత్రములతో సేవించుచున్నవి.

**తదీయాయుధధారిణ్యః**
**తత్సమానవిభూషణాః ।**



**అంగభూతాః స్త్రియః కాశ్చిత్**
**ఆసేవంత తమీశ్వరమ్ ॥ 3-43**

(పరమాత్ముని యొక్క) ఆయుధములను ధరించి, (అతనివలెనే) ఆభరణముల నలంకరించుకున్న కొంతమంది దేవతాస్త్రీలు ఈశ్వరుని సేవించుచున్నారు.

**అష్టాధికారిణః కేచిత్**
**అనంతప్రముఖా అపి ।**
**అష్టౌ విద్యేశ్వరా దేవమ్**
**అభజంత సమంతతః ॥ 3-44**

పరమేశ్వరుని నుండి అధికారమును పొందిన అనంతుడు మొదలైన (ఎనిమిదిమంది అనంత- సూక్ష్మ- శివోత్తమ- ఏకనేత్ర-ఏకరుద్ర-త్రిమూర్తి- శ్రీకంఠ- శిఖండి) విద్యేశ్వరులు పరమేశ్వరుని పరివేష్టించి సేవించుచున్నారు.

**తతో నందీ మహాకాలః**
**చండో భృంగీ రిటిస్తతః ।**
**సేనానీర్గజవక్త్రశ్చ**
**రేణుకో దారుకస్తథా ।**
**ఘంటాకర్ణః పుష్పదంతః**
**కపాలీ వీరభద్రకః ॥ 3-45**

**ఏవమాద్యా మహాభాగా**
**మహాబలపరాక్రమాః ।**
**నిరంకుశమహాసత్త్వా**
**భేజిరే తం మహేశ్వరమ్ ॥ 3-46**

వీరితో పాటు నందీశ్వర, మహాకాల, చండ, భృంగి, రిటి, సేనాని (షణ్ముఖుడు), గజవక్త్ర, రేణుక, దారుక, ఘంటాకర్ణ, పుష్పదంత, కపాలి, వీరభద్ర వంటి మహాబలవంతులు, పరాక్రమశాలురు, నిరంకుశ సత్త్వసంపన్నులు మహామహిమాన్వితులయిన ప్రమథులు మహేశ్వరుని సేవించు చున్నారు.

**అణిమాదికమైశ్వర్యమ్**
**యేషాం సిద్ధేరపోహనమ్ ।**
**బ్రహ్మాదయః సురా యేషామ్**
**ఆజ్ఞాలంఘనభీరవః ॥ 3-47**

ఎవరి (ఏ ప్రమథుల) సిద్ధుల (శక్తుల)ముందు అణిమాది అష్టసిద్ధులు తుచ్ఛములుగా పరిగణించబడుచున్నవో, బ్రహ్మాది దేవతలు ఎవరి ఆజ్ఞలను ఉల్లంఘించుటకు భయపడుచున్నారో –

**మోక్షలక్ష్మీపరిష్వంగ –**
**ముదితా యేఽంతరాత్మనా ।**
**యేషామీషత్కరం విశ్వ-**
**సర్గసంహారకల్పనమ్ ॥ 3-48**



(ఏ ప్రమథులు) మోక్షలక్ష్మిని కౌగిలించుకొనుటచేత తమ అంతరంగమున ఆనందము ననుభవించుచున్నారో, విశ్వసృష్టి, విశ్వసంహారములనెడి క్రియలు ఎవరికి అతిసులభసాధ్యములో–

**జ్ఞానశక్తిః పరా యేషామ్**
**సర్వవస్తుప్రకాశినీ ।**
**ఆనందకణికా యేషామ్**
**హరిబ్రహ్మాదిసంపదః ॥ 3-49**

(ఏ ప్రమథుల) సర్వోత్కృష్టమయిన జ్ఞానశక్తి సమస్త వస్తువుల నిజస్వరూపమును ప్రకాశింపజేయుచున్నదో, విష్ణు బ్రహ్మాది దేవతల ఐశ్వర్యముల వలన కలుగు ఆనందము ఎవరికి లేశమాత్రములో–

**ఆకాంక్షంతే పదం యేషామ్**
**యోగినో యోగతత్పరాః ।**
**కాంక్షణీయఫలో యేషామ్**
**సంకల్పః కల్పపాదపః ॥ 3-50**

యోగతత్పరులయిన యోగులు (శివలోకమున) ఎవరి స్థానమునాకాంక్షించుచున్నారో, ఎవరి సంకల్పము అపేక్షించిన ఫలముల నొసగు కల్పవృక్షమగుచున్నదో –

**కర్మకాలాదికార్పణ్య**
**చింతా యేషాం న విద్యతే ।**

**యేషాం విక్రమసన్నాహో**
**మృత్యోరపి చ మృత్యవః ॥**
**తే సారూప్యపదం ప్రాప్తాః**
**ప్రమథా భేజిరే శివమ్ ॥ 3-51**

(ఏ ప్రమథులకు) కర్మ మరియు కాలముల గురించిన ఆలోచనలుండవో, ఎవరి పరాక్రమోద్యమములు మృత్యువుకే మృత్యువుగా పరిణమించునో, ఎవరు శివసారూప్య పదవులననుభవించుచున్నారో అటువంటి ప్రమథులు శివుని సేవించుచున్నారు.

**బ్రహ్మోపేంద్రమహేంద్రాద్యా**
**విశ్వతంత్రాధికారిణమ్ ।**
**ఆయుధాలంకృతప్రాంతాః**
**పరితస్తం సిషేవిరే ॥ 3-52**

బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదిదేవతలు తమ తమ ఆయుధములను చేబూని జగన్నిర్మాణ(కార్య)మునకధిపతి అయిన పరమశివుని పరివేష్టించి జాగరూకులై అతనిని అనేకవిధములుగా సేవించుచున్నారు.

**ఆదిత్యా వసవో రుద్రా**
**యక్షగంధర్వకిన్నరాః ।**
**దానవా రాక్షసా దైత్యాః**
**సిద్ధా విద్యాధరోరగాః ।**



**అభజంత మహాదేవమ్**
**అపరిచ్ఛిన్నసైనికాః ॥ 3-53**

(ద్వాదశ) ఆదిత్యులు, (అష్ట) వసువులు, (ఏకాదశ) రుద్రులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, దానవులు, రాక్షసులు, దైత్యులు, సిద్ధులు, విద్యాధరులు (శేషాది) సర్పజాతులు అపరిమితములయిన తమ తమ సైన్యముతో మహాదేవుని అర్చించుచున్నారు.

**వసిష్ఠో వామదేవశ్చ**
**పులస్త్యాగస్త్యశౌనకాః ।**
**దధీచిర్గౌతమశ్చైవ**
**సానందశుకనారదాః ॥ 3-54**

**ఉపమన్యుభృగువ్యాస-**
**పారాశరమరీచయః ।**
**ఇత్యాద్యాః మునయః సర్వే**
**నీలకంఠం సిషేవిరే ॥ 3-55**

వసిష్ఠ-వామదేవ-పులస్త్య-అగస్త్య-శౌనక-దధీచి-గౌతమ-సానంద- శుక-నారద-ఉపమన్యు-భృగు-వ్యాస-పరాశర-మరీచాది సమస్త మునులు నీలకంఠుని భక్తితో సేవించుచున్నారు.

**పార్శ్వస్థపరివారాణాం**
**విమలాంగేషు బింబితః ।**

**సర్వాంతర్గతమాత్మానమ్**
**స రేజే దర్శయన్నివ ॥ 3-56**

తాను సర్వాంతర్యామినని నిరూపించుటకా అన్నట్టు ఆ పరమేశ్వరుడు తనకు ఇరువైపులా నిలబడివున్న పరివార దేవతల స్వచ్ఛములు పరిశుద్ధములయిన శరీరములందు ప్రతిఫలించినాడు. (ప్రకాశించినాడు)

ఇతి దేవతానాం సేవావర్ణనం పరిసమాప్తమ్ ।
దేవతల సేవావర్ణనము ముగిసినది.

## 5. పరమేశ్వరస్య రాజవ్యాపారవర్ణనమ్
## పరమేశ్వరుని రాజ్యపాలనావ్యవహార వర్ణనము

**క్షణం స శంభుర్దేవానాం**
**కార్యభాగం నిరూపయన్ ।**
**క్షణం గంధర్వరాజానాం**
**గానవిద్యాం విభావయన్ ॥ 3-57**

పరమేశ్వరుడయిన శంభువు ఒక క్షణకాలము దేవతల కర్తవ్యములను ఆదేశింతుటలోను, ఒక క్షణము గంధర్వశ్రేష్ఠుల గానమాధుర్యమును ఆలకించుటలోను–

**బ్రహ్మవిష్ణ్వాదిభిర్దేవైః**
**క్షణమాలాపమాచరన్ ।**



**క్షణం దేవమృగాక్షీణామ్**
**లాలయన్నృత్యవిభ్రమమ్ ॥ 3-58**

ఒక క్షణం బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలతో సంభాషించుటతోను, ఒక క్షణకాలం దేవకన్యల నాట్యవైభవమును ఆస్వాదించుటలోను–

**వ్యాసాదీనాం క్షణం కుర్వన్**
**వేదోచ్చారేషు గౌరవమ్ ।**
**విదధానః క్షణం దేవ్యా**
**ముఖే బింబాధరే దృశః ॥ 3-59**

ఒక క్షణం వ్యాసాదిమహర్షులు చేయుచున్న వేదపారాయణము పట్ల గౌరవమును ప్రదర్శించుటలోను, మరోక్షణము దొండపండువంటి పెదవులు కలిగిన తన దేవి ముఖకమలమును పరికించుటలోను –

**హాస్యనృత్యం క్షణం పశ్యన్**
**భృంగిణా పరికల్పితమ్ ।**
**నందినా వేత్రహస్తేన**
**సర్వతంత్రాధికారిణా ॥ 3-60**

**అముంచతా సదా పార్శ్వమ్**
**ఆత్మాభిప్రాయవేదినా ।**
**చోదితాన్ వాసయన్ కాంశ్చిద్**
**విసృజన్ భ్రూవిలాసతః ।**

**సంభావయంస్తథా చాన్యాన్**
**అన్యానపి నియామయన్ ॥ 3-61**

ఒక క్షణము భృంగిచేత చేయబడుతున్న హాస్యనృత్యమును ఆస్వాదించుటలోను, మరోక్షణము తన కత్యంత సమీపమున వుండి తన అభిప్రాయములను బాగా ఎరిగిన సర్వకార్యనిర్వహణాధికారి, దండధారి అయిన నంది చేత కొంతమందిని ఆహ్వానించుచూ కొంతమందిని తన కనుసన్నలతో వెలుపలకు పంపుచూ, మరికొంత మందిని పలకరింపులతో పులకరింప జేయుచూ, కొంతమందిని శాసించుచూ సభామంటపమున (పరమశివుడు) విరాజిల్లుచున్నాడు.

**సమస్తభువనాధీశ –**
**మౌలిలాలితశాసనః ।**
**అకుంఠశక్తిరవ్యాజ–**
**లావణ్యలలితాకృతిః ॥ 3-62**

సమస్త(పదునాలుగు)భువనముల అధిపతులు తలదాల్చిన శాసనము కలవాడు, అప్రతిహతమయిన శక్తిసంపన్నుడు, సహజమైన లావణ్యముతో మనోహరాకారుడయినవాడు –

**స్థిరయౌవనసౌరభ్య–**
**శృంగారితకలేవరః ।**
**ఆత్మశక్త్యమృతాస్వాద**
**రసోల్లాసితమానసః ॥ 3-63**



నిత్యయౌవన తారుణ్యముతో అలరారు శరీరముగలవాడు, తనయందలి శక్తిరూపమయిన అమృతాస్వాదనముతో ఉల్లసించిన మనసు గలవాడు –

**స్వాభావికమహైశ్వర్య–**
**విశ్రామ్యపరమావధిః ।**
**నిష్కలంకమహాసత్త్వ–**
**నిర్మితానేకవిగ్రహః ॥ 3-64**

(తనలో) సహజముగా నెలకొన్న (సర్వజ్ఞత్వాది) మహాసంపదలకు పరమావధి అయినవాడు, కలంకరహితమైన మహాశక్తిచేత సృజించబడిన అనేక మంగళాకారములను పొందినవాడు–

**అఖండారాతిదోర్దండ–**
**కండూఖండనపండితః ।**
**చింతామణిః ప్రపన్నానామ్**
**శ్రీకంఠః పరమేశ్వరః ॥ 3-65**

అనేకమంది సజ్జనశతృవుల భుజముల దురదను తొలగించుటలో సమర్థుడైనవాడు, శరణాగతులయినవారికి చింతామణి స్వరూపుడు, శ్రీకంఠుడయిన పరమేశ్వరుడు సభామంటపమున ప్రకాశించుచున్నాడు.

**సభాంతరగతం తంత్రమ్**
**రేణుకం గణనాయకమ్ ।**

**ప్రసాదం సులభం దాతుమ్**
**తాంబూలం స తమాహ్వయత్॥ 3-66**

పరమేశ్వరుడు సభలో కూర్చున్న రేణుకుడనుపేర ప్రసిద్ధి చెందిన గణనాయకుని గౌరవపూర్వకమైన తాంబూలప్రదానమునకు (శిరః కంపనతో రమ్మని) ఆహ్వానించెను.

**శంభోరాహ్వానసంతోష-**
**సంభ్రమేణైవ దారుకమ్ ।**
**ఉల్లంఘ్య పార్శ్వమగమత్**
**లోకనాథస్య రేణుకః ॥ 3-67**

పరమశివుని ఆహ్వానమును అందుకున్న ఆనందాతిరేకముతో ఆ రేణుకగణేశ్వరుడు (తన ప్రక్కనే కూర్చున్న) దారుకుడను గణేశ్వరుని, దాటుకుని లోకనాథుడైన పరమేశ్వరుని సమీపమును చేరెను.

**తమాలోక్య విభుస్తత్ర**
**సముల్లంఘితదారుకమ్ ।**
**మాహాత్మ్యం నిజభక్తానామ్**
**ద్యోతయన్నిదమబ్రవీత్ ॥ 3-68**

దారుకుని దాటివచ్చిన రేణుకుని చూచి పరమశివుడు తన భక్తుల మాహాత్మ్యమును తెలియజేయుటకై ఇట్లు పలికెను –



**రే రే రేణుక దుర్బుద్ధే!**
**కథమేష త్వయాఽధునా ।**
**ఉల్లంఘితః సభామధ్యే**
**మమ భక్తో హి దారుకః ॥ 3-69**

ఆతురబుద్ధిగలిగిన ఓ రేణుకుడా! సభామధ్యముననున్న నా భక్తుడయిన దారుకుని నీవు దాటుకుని (అతిక్రమించి) వచ్చుట సమంజసమా?

**లంఘనం మమ భక్తానామ్**
**పరమానర్థకారణమ్ ।**
**ఆయుః శ్రియం కులం కీర్తిమ్**
**నిహంతి హి శరీరిణామ్ ॥ 3-70**

నా భక్తులను దాటుట లేదా అతిక్రమించుట పరమ అనర్థములకు కారణమగుచున్నది. అది ప్రాణుల ఆయుష్షును, సంపదలను, కులమును, యశస్సును హరించును.

**మమ భక్తమవజ్ఞాయ**
**మార్కండేయం పురా యమః ।**
**మత్పాదతాడనాదాసీత్**
**స్మరణీయకలేవరః ॥ 3-71**

పూర్వము యమధర్మరాజు నా భక్తుడయిన మార్కండేయుని తిరస్కరించి నా పాదతాడనముతో స్మరణీయశరీరుడైనాడు.

**భృగోశ్చ శంకుకర్ణస్య**
**మమ భక్తిమతోస్తయోః ।**
**కృత్వాఽనిష్టమభూద్విష్ణుః**
**వికేశో దశయోనిభాక్ ॥ 3-72**

నా భక్తులయిన భృగుమహర్షికి, శంకుకర్ణునికి కీడును చేసిన విష్ణువు తన ముంగురులను తొలగించుకుని పది యోనులలో జన్మించినాడు(అవతారములనెత్తినాడు).

**మద్భక్తేన దధీచేన**
**కృత్వా యుద్ధం జనార్దనః ।**
**భగ్నచక్రాయుధః పూర్వమ్**
**పరాభవముపాగమత్ ॥ 3-73**

నా భక్తుడయిన దధీచిమహర్షితో యుద్ధముచేసిన జనార్దనుడు తన చక్రాయుధమును విరగదీసుకుని పరాభవమును పొందినాడు.

**కృతాశ్వమేధో దక్షోఽపి**
**మద్భక్తాంశ్చ గణేశ్వరాన్ ।**
**అవమత్య సభామధ్యే**
**మేషవక్త్రోఽభవత్ పురా ॥ 3-74**



అశ్వమేధయాగమును నిర్వహించిన దక్షుడు కూడా నా భక్తులయిన (ప్రమథ) గణేశ్వరులను సభలో అవమానించి మేకముఖము గలవాడయినాడు.

**శ్వేతస్య మమ భక్తస్య**
**దురతిక్రమతేజసః ।**
**ఔదాసీన్యేన కాలోఽపి**
**మయా దగ్ధః పురాఽభవత్ ॥ 3-75**

అత్యంతతేజస్సంపన్నుడైన నా భక్తుడు శ్వేతుని ఉదాసీనముచేసి యముడు నాచేత కాల్చబడినాడు.

**ఏవమన్యేఽపి బహవో**
**మద్భాక్తానామతిక్రమాత్ ।**
**పరిభూతా హతాశ్చాసన్**
**భక్తా మే దురతిక్రమాః ॥ 3-76**

ఈ విధంగా నా భక్తులనతిక్రమించుట చేత లేదా అవమానించుట చేత చాలామంది తిరస్కరించబడినారు, చంపబడినారు కూడా. అందువలన నా భక్తులనెవరూ అతిక్రమించ(దాట)రాదు.

**అవిచారేణ మద్భక్తో**
**లంఘితో దారుకస్త్వయా ।**
**ఏష త్వం రేణుకానేన**
**జన్మవాన్ భవ భూతలే ॥ 3-77**

ఓ రేణుకుడా! అజ్ఞానముతో తెలియక మా భక్తుడయిన దారుకుని నీవు దాటినావు. అందువలన నీవు భూలోకమున జన్మించెదవుగాక!

ఇతి పరమేశ్వరరాజవ్యాపారవర్ణనం పరిసమాప్తమ్ ।
పరమేశ్వరుని రాజ్యపాలనావ్యవహారవర్ణనము ముగిసినది.

### *6. శ్రీరేణుకస్య శివవిజ్ఞాపనమ్*
### శివునియందు శ్రీరేణుకులవిన్నపము

**ఇత్యుక్తః పరమేశేన**
**భక్తమాహాత్మ్యశంసినా ।**
**ప్రార్థయామాస దేవేశమ్**
**ప్రణిపత్య స రేణుకః ।**
**భవదాహ్వానసంభ్రాంత్యా**
**మయాఽజ్ఞానాద్విలంఘితః ॥ 3-78**

భక్తుల మాహాత్మ్యాన్ని ప్రశంసించిన దేవాధిదేవుడైన పరమేశ్వరునకు శ్రీరేణుకుడు సాష్టాంగప్రణామముచేసి ఇలా ప్రార్థించినాడు. ఓ శంభో! మీ ఆహ్వానమును అందుకున్న సంభ్రమమున అజ్ఞానముతో (దారుకుని) లంఘనం చేయుట జరిగినది.

**దారుకోఽయం తతః శంభో**
**పాహి మాం భక్తవత్సల ।**



**మానుషీం యోనిమాసాద్య**
**మహాదుఃఖవివర్ధినీమ్ ।**
**జాత్యాయుర్భోగవైషమ్య**
**హేతుకర్మోపపాదినీమ్ ॥ 3-79**

**సమస్తదేవకైంకర్య**
**కార్పణ్యప్రసవస్థలీమ్ ।**
**మహాతాపత్రయోపేతామ్**
**వర్ణాశ్రమనియంత్రితామ్ ।**
**విహాయ త్వత్పదాంభోజ**
**సేవాం కిం వా వసామ్యహమ్ ॥ 3-80**

**యథా మే మానుషో భావో**
**న భవేత్ క్షితిమండలే ।**
**తథా ప్రసాదం దేవేశ**
**విధేహి కరుణానిధే ॥ 3-81**

ఓ భక్తవత్సలా! దారుకుని దాటిన (దోషమునుండి) నన్ను రక్షించుము. (నీ పాదకమలసేవను వదలి) మహాదుఃఖమును ప్రవర్ధమానము చేయునది, జాతి-ఆయు-భోగ-వైషమ్యములకు కారణమైన కర్మలను సంపాదించునది, సమస్తదేవతల కైంకర్యమను దీనస్థితికి కారణమైనది, తాపత్రయములతో కూడుకున్నది. వర్ణాశ్రమనియమముకు లోబడినది అయిన మానవజన్మను పొంది నేనెలా జీవించగలను?

అందువలన హే దేవేశ! కరుణానిధే! భూలోకమున నాకు మనుష్యభావము లేనివిధముగా నన్ను నీ ప్రసాదముతో అనుగ్రహించుము –

ఇతి రేణుకస్య శివవిజ్ఞాపనం పరిసమాప్తమ్ ।
శివునియందు రేణుకుల విన్నపము ముగిసినది.

### *7. అవతారప్రయోజనమ్*

**అవతారము యొక్క ఉద్దేశ్యము**

**ఇతి సంప్రార్థితో దేవో**
**రేణుకేన మహేశ్వరః ।**
**మా భైషీర్మమ భక్తానామ్**
**కుతో భీతిరిహేష్యతి ॥ 3-82**

రేణుకునిచేత ఈవిధముగా ప్రార్థించబడిన మహేశ్వరుడు (ఇలా చెప్పాడు.) ఓ రేణుకుడా! నీవు భయపడవలదు! నా భక్తులకు భయమెక్కడిది?

**శ్రీశైలస్యోత్తరే భాగే**
**త్రిలింగవిషయే శుభే ।**
**కొల్లిపాక్యభిధానోఽస్తి**
**కోఽపి గ్రామో మహత్తరః ॥ 3-83**

మంగళకరమైన త్రిలింగదేశము (ఆంధ్రదేశము)న శ్రీశైల క్షేత్రమునకు ఉత్తరదిక్కున 'కొల్లిపాక'(కొలనుపాక) అనుపేరుగల ఒకానొక పెద్ద గ్రామమున్నది.



**సోమేశ్వరాభిధానస్య**
**తత్ర వాసవతో మమ ।**
**అస్పృశన్ మానుషం భావమ్**
**లింగాత్ ప్రాదుర్భవిష్యసి ॥ 3-84**

మానుష భావమున (మానవగర్భము నుండి) కాక సోమేశ్వర లింగమను పేరున ప్రసిద్ధిచెందిన నా లింగము నుండి నీవు అవతరించెదవు.

**మదీయలింగసంభూతమ్**
**మద్భక్తపరిపాలకమ్ ।**
**విస్మితా మానుషాః సర్వే**
**త్వాం భజంతు మదాజ్ఞయా ॥ 3-85**

నా ఆజ్ఞ ననుసరించి నా సోమేశ్వరలింగము నుండి ఉద్భవించి, నా భక్తులను రక్షించు నిన్ను చూచి, మానవులందరూ ఆశ్చర్యముతో నిన్ను సేవింతురుగాక!

**మదద్వైతపరం శాస్త్రమ్**
**వేదవేదాంతసమ్మతమ్ ।**
**స్థాపయిష్యసి భూలోకే**
**సర్వేషాం హితకారకమ్ ॥ 3-86**

వేదవేదాంతసమ్మతము, అద్వైతపరము (శివాద్వైతపరము) సర్వజనహితము అయిన నా శాస్త్రమును నీవు భూలోకమున స్థాపించెదవు.

**మమ ప్రతాపమతులమ్**
**మద్భక్తానాం విశేషతః ।**
**ప్రకాశయ మహీభాగే**
**వేదమార్గానుసారతః ॥ 3-87**

"నా ప్రతాపము అసమానమైనది. నా భక్తుల ప్రతాపము నాకన్నా విశేషమైనది" అను విషయమును వేదమార్గముననుసరించి భూలోకమున ప్రకాశింపచేయుము.

**ఇత్యుక్త్వా పరమేశ్వరః స భగవాన్ భద్రాసనాదుత్థితో**
**బ్రహ్మోపేంద్రముఖాన్విసృజ్య విబుధాన్ భ్రూసంజ్ఞయా కేవలమ్।**
**పార్వత్యా సహితో గణైరభిమతైః ప్రాప స్వమంతఃపురమ్**
**క్షోణీభాగమవాతరత్ పశుపతేరాజ్ఞావశాద్రేణుకః ॥88॥**

(- శార్దూలవిక్రీడితమ్)

భగవంతు (షడ్గుణైశ్వర్య సంపన్ను)డయిన ఆ పరపమేశ్వరుడు ఈవిధముగా పలికి, సింహాసనమునుండి పైకిలేచి, కనుసన్నలతో బ్రహ్మ విష్ణువు మొదలైన దేవతలను నిష్క్రమింపజేసి, పార్వతితోపాటు ఆప్తులయిన కొంతమంది ప్రమథులు (తనను) వెంబడించిరాగా అంతఃపురమునకు బయలుదేరెను. ఇక్కడ పశుపతి ఆజ్ఞననుసరించి శ్రీరేణుకగణేశ్వరుడు భూలోకమునందవతరించెను.

*ఇతి అవతారప్రయోజనం పరిసమాప్తమ్ ।*
అవతారముయొక్క ఉద్దేశ్యము ముగిసినది.



**ఓం తత్సత్ ఇతి**

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ కైలాసవర్ణనం, రేణుకావతరణకారణం చ నామ తృతీయః పరిచ్ఛేదః.***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో కైలాసవర్ణనము, రేణుకావతరణ కారణమను మూడవ పరిచ్ఛేదము ముగిసినది.

# చతుర్థః పరిచ్ఛేదః
## నాలుగవ పరిచ్ఛేదము
## రేణుకాగస్త్యదర్శనప్రసంగః
## రేణుకాగస్త్యుల దర్శనప్రసంగము
## (54 శ్లోకములు)

***1.* రేణుకభూలోకావతరణమ్**

**రేణుకభూలోకావతరణము**

**అథ త్రిలింగవిషయే**
**కొల్లిపాక్యభిధే పురే ।**
**సోమేశ్వరమహాలింగాత్**
**ప్రాదురాసీత్ స రేణుకః ॥ 4-1**

ఆ తరువాత రేణుకగణేశ్వరుడు త్రిలింగ (తెలుగు) దేశంలోని కొల్లిపాక (కొలనుపాక) అను పురమున (వెలసిన) సోమేశ్వర మహాలింగము నుండి ఉద్భవించెను.

**ప్రాదుర్భూతం తమాలోక్య**
**శివలింగాత్ త్రిలింగజాః ।**
**విస్మితాః ప్రాణినః సర్వే**
**బభూవురతితేజసమ్ ॥ 4-2**



త్రిలింగదేశమునందలి ప్రజలందరూ సోమేశ్వర మహాలింగము నుండి అవతరించిన మహాతేజస్సంపన్నుడయిన రేణుకగణేశ్వరుని చూసి ఆశ్చర్యచకితులైనారు.

**భస్మోద్ధూలితసర్వాంగమ్**
**సారరుద్రాక్షభూషణమ్ ।**
**లింగధారణసంయుక్తమ్**
**లింగపూజాపరాయణమ్**
**జటాముకుటసంయుక్తమ్**
**త్రిపుండ్రాంకితమస్తకమ్ ॥ 4-3**

శరీరమునందలి సర్వావయవములకు విభూతిరేఖలను అలుదుకున్నవాడు, శ్రేష్ఠమయిన రుద్రాక్షమాలలను అలంకరించు కున్నవాడు, ఇష్టలింగమును ధరించినవాడు, లింగపూజాపరాయణుడు, జటామకుటముతో వున్నవాడు, త్రిపుండ్రముతో కూడిన నుదురుకలవాడు–

**కటీతటీపటీభూత –**
**కంథాపటలబంధురమ్ ।**
**దధానం యోగదండం చ**
**భస్మాధారం కమండలుమ్ ॥ 4-4**

**శివాద్వైతపరిజ్ఞాన–**
**పరమానందమోదితమ్ ।**

**నిర్ధూతసర్వసంసార-**
**వాసనాదోషపంజరమ్ ॥ 4-5**

కంధావస్త్రముతో నడుమును బిగించిన మనోహరుడు, యోగదండమును ఒక చేత, భస్మముతో నిండిన కమండలమును మరొకచేత ధరించినవాడు, లింగాంగసామరస్యాత్మకమయిన శివాద్వైతజ్ఞానప్రకాశముతో పరమానందభరితుడైనవాడు, జనన మరణరూపాత్మకమయిన సంసార వాసనాదోషసమూహమును విదిలించుకున్నవాడు -

**శివాగమసుధాసింధు-**
**సమున్మేషసుధాకరమ్ ।**
**చిత్తారవిందసంగూఢ -**
**శివపాదాంబుజద్వయమ్ ॥ 4-6**

శివాగమములను అమృతసముద్రమును ఉత్తేజపరుచుటలో చంద్రుని వంటివాడు, శివునిపాదపద్మములను తన హృదయకమలమున ప్రతిష్ఠించుకున్నవాడు-

**యమాదియోగతంత్రజ్ఞమ్**
**స్వతంత్రం సర్వకర్మసు ।**
**సమస్తసిద్ధసంతాన-**
**సముదాయశిఖామణిమ్ ॥ 4-7**



యమనియమాది(అష్టాంగ)యోగతంత్ర పారంగతుడు, కర్మనిర్వహణలో సర్వస్వతంత్రుడు, సిద్ధిని పొందిన మహాత్ముల సముదాయములో శిరోరత్నమైనవాడు -

**వీరసిద్ధాంతనిర్వాహ-**
**కృతపట్టనిబంధనమ్ ।**
**ఆలోకమాత్రనిర్భిన్న-**
**సమస్తప్రాణిపాతకమ్ ॥ 4-8**

వీరశైవసిద్ధాంత ప్రతిష్ఠాపనకై (పరమశివునిచేత) పట్టము కట్టబడినవాడు, సమస్త జీవుల పాపములను కంటిచూపుచేతనే తొలగించగల రేణుక గణేశ్వరుని చూచి త్రిలింగదేశప్రజలు ఆశ్చర్యచకితులైరి.

**తమపృచ్ఛన్ జనాః సర్వే**
**నమంతః కో భవానితి ।**
**ఇతి పృష్టో మహాయోగీ**
**జనైర్విస్మితమానసైః ॥ 4-9**

**ప్రత్యువాచ శివాద్వైత-**
**మహానందపరాయణః ।**
**పినాకినః పార్శ్వవర్తీ**
**రేణుకాఖ్యో గణేశ్వరః ॥ 4-10**

ఆనందపరవశులయిన అక్కడి ప్రజలు అతనికి నమస్కరించి 'మీరెవర'ని ప్రశ్నించారు. ఇలా విస్మితమానసులయిన వారిచేత అడగబడిన ఆ మహాయోగి, తాను శివాద్వైతమహానందానుభావిని శివుని కత్యంతసమీపమునందున్న 'రేణుకు'డను పేరు గల గణేశ్వరుడను-

**శివాదేశానుసారేణ**
**శివలింగాదిహోద్భవమ్ ।**
**నామ్నా రేణుకసిద్ధోఽహం**
**సిద్ధసంతాననాయకః ॥ 4-11**

శివుని ఆదేశముననుసరించి భూలోకమున శివలింగము నుండి అవతరించినవాడను. సిద్ధుల సముదాయమునకు నాయకుడనైన నేను 'రేణుకసిద్ధుడ' ను పేర పిలువబడుతున్నాను.

**స్వచ్ఛందచారీ లోకేఽస్మిన్**
**శివసిద్ధాంతపాలకః ।**
**ఖండయన్ జైనచార్వాక-**
**బౌద్ధాదీనాం దురాగమాన్ ॥ 4-12**

ఈ లోకమున జైన, చార్వాక, బౌద్ధాది దురాగమములను (వేదవిరుద్ధములైన సిద్ధాంతములను) ఖండించి, శివసిద్ధాంత సంరక్షణార్థము ఈలోకమున స్వేచ్ఛగా సంచరించువాడను.



**ఇత్యుక్త్వా పశ్యతాం తేషాం**
**విషయస్థిరచక్షుషామ్ ।**
**ఉత్థాయ వ్యోమమార్గేణ**
**మలయాద్రిముపాగమత్ ॥ 4-13**

ఇట్లు సమాధానమునిచ్చి ఆశ్చర్యముతో కదలికలేని చూపులు కలిగిన ప్రజలు చూచుచుండగనే లేచి నిలబడి అక్కడి నుండి ఆకాశమార్గమున మలయాద్రిపర్వతమునకు బయలుదేరెను.

ఇతి రేణుకభూలోకావతరణం పరిసమాప్తమ్ ।

రేణుకభూలోకావతరణము ముగిసినది.

## *2.* మలయాచలవర్ణనమ్
## మలయాచలవర్ణనము

**నవచందనకాంతార-**
**కందలన్మందమారుతమ్ ।**
**అభంగురభుజంగస్త్రీ**
**సంగీతరససంకులమ్ ॥ 4-14**

కొంగ్రొత్త చందనవనములను ఛేదించుకుని వీచు మందమారుతములను కలిగినది, అనవరతము నాగకన్నెల చేత వినిపింపచేయుచు సంగీతరసభరితమైనది,

**కరిపోతకరాకృష్ట-**
**స్ఫురదేలాతివాసితమ్ ।**
**వరాహదంష్ట్రికాధ్వస్త-**
**ముస్తాసురభికందరమ్ ॥ 4-15**

ఏనుగు గున్నలు తమ తొండములతో పెకిలించి వెదజల్లిన ఏలా(కు)తీగెలవాసనలతో మధురమైనది, పందులు కోరలతో పెకిలించి ధ్వంసము చేసిన దుంపల వాసనలతో నిండిన గుహలు గలిగినది,

**పటీరదలపర్యంక-**
**ప్రసుప్తవ్యాధదంపతిమ్ ।**
**మాధవీమల్లికాజాతి-**
**మంజరీరేణురంజితమ్ ॥ 4-16**

శ్రీగంధపు చిగురులతో చేసిన మంచములపై నిదురించు బోయదంపతులను కలిగినది, మాధవీ, మల్లిక, జాజులవంటి పూగుత్తెల పుప్పొడితో మనోహరమయిన మలయపర్వమును రేణుకగణేశ్వరుడు చేరుకున్నాడు.

ఇతి మలయాచలవర్ణనం సమాప్తమ్ ।

మలయాచలవర్ణనము ముగిసినది

### *3.* అగస్త్యమునేః ఆశ్రమవర్ణనమ్
### అగస్త్యమునుల ఆశ్రమవర్ణనము



**తత్ర కుత్రచిదాభోగ**
**సర్వర్తుకుసుమద్రుమే ।**
**అపశ్యదాశ్రమం దివ్యమ్**
**అగస్త్యస్య మహామునేః ॥ 4-17**

అన్ని ఋతువులలోనూ పూలు పూయుమొక్కలతో నిండిన ఆ మలయ పర్వతమునందు ఒకానొక ప్రదేశమున మహాముని అయిన అగస్త్యుల దివ్యమైన ఆశ్రమమును (రేణుక గణేశ్వరుడు) చూసెను.

**మందారచందనప్రాయై-**
**ర్మండితం తరుమండలైః ।**
**శాఖాశిఖరసంలీన -**
**తారకాగణకోరకైః ॥ 4-18**

(ఆ ఆశ్రమప్రదేశము), కొమ్మకొనలలో దాగుకున్న నక్షత్ర సమూహముల వంటి మొగ్గలు తొడిగిన, మందారము, శ్రీగంధము వంటి వృక్షసమూహములతో కూడుకున్నది -

**మునికన్యాకరానీత-**
**కలశాంబువివర్ధితైః ।**
**ఆలవాలజలాస్వాద -**
**మోదమానమృగీగణైః ॥ 4-19**

మునికన్నెలు స్వయముగా కడవలతో మోసుకువచ్చి పోసిన నీళ్లతో పెంచబడిన పూలమొక్కల పాదులలోని నీటిని త్రాగి ఆనందపరవశులయిన ఆడజింకల సమూహములతో నిండియున్నది –

**హేమారవిందనిష్యంద–**
**మకరందసుగంధిభిః ।**
**మరాలాలాపవాచాలు–**
**వీచిమాలామనోహరైః ॥ 4-20**

సువర్ణకమలములనుండి ప్రసరించు మకరందవాసనలతో గుబాళించునది – హంసపక్షుల కలకలారావముల తరంగములతో మనోహరమైనది –

**ఇందీవరవరజ్యోతి–**
**రంధీకృతహరిన్ముఖైః ।**
**లోపాముద్రాపదన్యాస–**
**చరితార్థతటాంకితైః ॥ 4-21**

నల్లకలువల కాంతులతో చీకటిమయము చేయబడిన దిక్కులు కలిగినది, లోపాముద్రా అడుగుల గుర్తులతో సార్థకము చేయబడిన తీరములున్న సరస్సులను కలిగినది –

**హారనీహారకర్పూర–**
**హరహాసామలోదకైః ।**



**నిత్యనైమిత్తికస్నాన–**
**నియమార్థైస్తపస్వినామ్ ॥ 4-22**

ముత్యాలహారము, మంచు, కర్పూరము, శివుని మందహాసము వంటి నిర్మలము స్వచ్ఛములయిన నీటితో నిండినది, మహర్షుల నిత్య, నైమిత్తిక స్నానాదివ్రతములకుపయోగపడునది –

**ప్రకృష్టమణిసోపానైః**
**పరివీతం సరోవరైః ।**
**విముక్తసత్త్వవైరస్యమ్**
**బ్రహ్మలోకమివాపరమ్ ॥ 4-23**

శ్రేష్ఠమైన రత్నములతో పొదిగిన మెట్లను కలిగిన సరస్సులతో చుట్టుముట్టినది, జాతివైరములను వీడిన జీవజంతువులతో కూడుకున్నది, రెండవ బ్రహ్మలోకమువలె వున్నటువంటిది–

**హూయమానాజ్యసంతాన–**
**ధూమగంధిమహాస్థలమ్ ।**
**శుకసంసత్సమారబ్ధ**
**శ్రుతిశాస్త్రోపబృంహణమ్ ॥ 4-24**

హోమమునందు సమర్పించబడుతున్న నేతిధారల నుండి వెలువడు ధూమపు వాసనలతో వ్యాపించినట్టిది, చిలుకల గుంపులతో

ఆరంభించబడిన వేద-శాస్త్ర-పురాణ ప్రసంగములతో కూడుకున్న అగస్త్యాశ్రమమును రేణుక గణేశ్వరుడు చూచెను.

*ఇతి అగస్త్యాశ్రమవర్ణనం పరిసమాప్తమ్ ।*

అగస్త్యాశ్రమవర్ణనము ముగిసినది.

## *4. అగస్త్యమునివర్ణనమ్*

## అగస్త్యమునివర్ణనము

**తస్య మధ్యే సమాసీనమ్**
**మూలే చందనభూరుహః ।**
**సుకుమారదలచ్ఛాయా**
**దూరితాదిత్యతేజసః ॥ 4-25**

ఆ ఆశ్రమమధ్యభాగమున సుకుమారములయిన ఆకులతో అడ్డగించబడుతున్న సూర్య ప్రకాశముగల చందనవృక్షపుమూలభాగమున (క్రింద) కూర్చొనియున్నవాడు –

**తటిత్పింగజటాభారైః**
**త్రిపుండ్రాంకితమస్తకైః ।**
**భస్మోద్ధూలితసర్వాంగైః**
**స్ఫురద్రుద్రాక్షభూషణైః ॥ 4-26**



మెరుపు వంటి నులి ఎఱ్ఱని (జడలను) జటాభారమును, నుదుట త్రిపుండ్రభస్మమును, శరీరమంతటా విభూతిని, ప్రకాశించు రుద్రాక్షలను ఆభరణములుగా ధరించినవాడు –

**నవవల్కలవాసోభిః**
**నానానియమధారిభిః ।**
**పరివీతం మునిగణైః**
**ప్రమథైరివ శంకరమ్ ॥ 4-27**

క్రొత్తవి అయిన నారుబట్టలను ధరించి, అనేక విధములయిన జప తప వ్రతముల నాచరించు ముని సమూహములచేత ప్రమథులతో శంకరునివలె పరివృతుడైనవాడు –

**సముజ్జ్వలజటాజాలైః**
**తపఃపాదపపల్లవైః ।**
**స్ఫురత్సౌదామినీకల్పైః**
**జ్వాలాజాలైరివానలమ్ ॥ 4-28**

శివప్రసాదమనబడు తపోవృక్షపు చిగురుల వలె ప్రకాశించు జటాసమూహము గలవాడును, మెరిసే విద్యుల్లతలవలెను, మంటలతో (నాలుకలతో) నున్న అగ్నివలెను ప్రకాశించెడివాడు –

**విశుద్ధభస్మకృతయా**
**త్రిపుండ్రాంకితరేఖయా ।**

**త్రిస్రోతసేవ సంబద్ధ-**
**శిలాభాగం హిమాచలమ్ ॥ 4-29**

గంగానది యొక్క మూడు ధారలతో కూడిన హిమాలయ పర్వతమువలె పరిశుద్ధమైన భస్మముతో దిద్దుకున్న త్రిపుండ్రమును ధరించిన వాడు -

**భస్మాలంకృతసర్వాంగమ్**
**శశాంకమివ భూగతమ్ ।**
**వసానం వల్కలం నవ్యమ్**
**బాలాతపసమప్రభమ్ ॥ 4-30**

భూమికి దిగివచ్చిన చంద్రునివలె శరీరము నందలి అన్ని అవయవములను భస్మముతో అలంకరించుకున్నవాడు, కొంగ్రొత్త నారచీరలతో లేతనీరెండవలె ప్రకాశించువాడు -

**వడవాగ్నిశిఖాజాల-**
**సమాలీఢమివార్ణవమ్ ।**
**సర్వాసామపి విద్యానామ్**
**సముదాయనికేతనమ్ ॥ 4-31**

వడవానల జ్వాలలను తనయందిముడ్చుకున్న సముద్రము వలె సమస్త విద్యలకు ఆలవాలమయినవాడు,



**న్యక్కృతప్రాకృతాహంతమ్**
**నిరూఢశివభావనమ్ ।**
**తృణీకృతజగజ్జాలమ్**
**సిద్ధానాముదయస్థలమ్ ॥ 4-32**

సహజముగా వుండు అహంకారమును వదలిపెట్టినవాడు, శివభావనమును (తనలో) సుస్థిరమొనరించుకున్నవాడు, ప్రాపంచికమైన భవబంధములను తృణీకరించినవాడు, సర్వసిద్ధులకు ఉత్పత్తిస్థానమైనవాడు-

**మోహాంధకారతపనమ్**
**మూలబోధమహీరుహమ్ ।**
**దదర్శ స మహాయోగీ**
**మునిం కలశసంభవమ్ ॥ 4-33**

మోహమను అంధకారమునకు సూర్యునివంటి వాడు, (మోక్షకారకమైన) మూలజ్ఞానమునకు కల్పవృక్షము వంటివాడు, కలశము నుండి జన్మించినవాడు అయిన అగస్త్యమునిని యోగీశ్వరుడయిన రేణుక గణేశ్వరుడు చూచెను.

*ఇతి అగస్త్యమునివర్ణనం పరిసమాప్తమ్ ।*

అగస్త్యమునివర్ణనము ముగిసినది.

## 5. శ్రీరేణుకపూజనమ్

### శ్రీరేణుకుల పూజ

**తమాగతం మహాసిద్ధమ్**
**సమీక్ష్య కలశోద్భవః ।**
**గణేంద్రం రేణుకాభిఖ్యమ్**
**వివేద జ్ఞానచక్షుషా ।**
**తస్యానుభావం విజ్ఞాయ**
**సహసైవ సముత్థితః ॥ 4-34**

కుంభసంభవుడైన అగస్త్యమహర్షి తన ఆశ్రమమునకు వచ్చిన మహాసిద్ధుని 'రేణుకు' డను పేరు గలిగిన గణేశ్వరునిగా గుర్తించి, అతని తపః ప్రభావమును దివ్యదృష్టితో తెలుసుకొని గౌరవపూర్వకముగా వెంటనే తన ఆసనము నుండి లేచి నిలబడెను.

**సంప్రణమ్య సమానీయ**
**స్వాసనే తం న్యవేశయత్ ।**
**లోపాముద్రాకరానీతైః**
**ఉదకైరతిపావనైః ।**
**పాదౌ ప్రక్షాలయామాస**
**స తస్య శివయోగినః ॥ 4-35**



(ఏతెంచిన మహాత్మునికి) నమస్కరించి ఆదరముతో ఆహ్వానించి తన ఆసనముపై కూర్చుండబెట్టెను. (తన అర్ధాంగి అయిన) లోపాముద్రా దేవి తీసుకువచ్చిన పవిత్రజలములతో ఆ శివయోగి పాదములను ప్రక్షాళనము చేసెను.

**సంపూజ్య తం యథాశాస్త్రమ్**
**తన్నియోగపురస్సరమ్ ।**
**మునిర్వినయసంపన్నో**
**నిషసాదాసనాంతరే ॥ 4-36**

వినయ సంపన్నుడయిన ఆ అగస్త్యమహర్షి శ్రీ రేణుకగణేశ్వరుని శాస్త్రోక్తవిధి పూజించి అతని ఆజ్ఞననుసరించి మరో ఆసనమున ఆసీనుడాయెను.

ఇతి శ్రీరేణుకపూజనం సమాప్తమ్ ।

శ్రీరేణుకుల పూజ ముగిసినది.

## 6. రేణుకాగస్త్యసంవాదః

### రేణుకాగస్త్యుల సంభాషణము

**సమాసీనం మునివరమ్**
**సర్వతేజస్వినాం విభుమ్ ।**
**ఉవాచ శాంతయా వాచా**
**రేవణః సిద్ధశేఖరః ॥ 4-37**

ఆసనముపై సమాసీనుడు, తేజస్సంపన్నులలో శ్రేష్ఠుడు అయిన అగస్త్య మునీశ్వరుని గురించి సిద్ధశ్రేష్ఠుడయిన రేణుక గణేశ్వరుడు ప్రసన్నమయిన వాక్కులతో ఇలా పరామర్శించెను.

**నిర్విఘ్నం వర్తసే కిం ను**
**నిత్యా తే నియమక్రియా ।**
**అథ వాఽగస్త్య తేజస్విన్**
**కుతః స్యుస్తేఽంతరాయకాః ॥ 4-38**

ఓ అగస్త్యమహర్షీ! మీ (తపస్సు)కు ఎటువంటి విఘ్నములు గలుగుటలేదు కదా? మీ నిత్యకర్మలు నిరంతరాయంగా కొనసాగుచున్నవి కదా? తేజస్సంపన్నులయిన మీకు అంతరాయములెట్లు కలుగును?

**వింధ్యో నిరుద్ధో భవతా**
**విశ్వోల్లంఘనవిభ్రమః ।**
**నహుషో రోషలేశాత్ తే**
**సద్యః సర్పత్వమాగతః ॥ 4-39**

విశ్వము నందన్నిటి కన్నా ఎత్తైన స్థితికి ఎదగవలెనన్న విభ్రమముతో విజృంభించిన వింధ్యపర్వతము నీచేత అడ్డుకొనబడినది. చక్రవర్తి అయిన నహుషుడు ఇసుమంతటి నీ కోపమునకు గురియై తక్షణమే సర్పమయినాడు.

**ఆచాంతే భవతా పూర్వమ్**
**పంకశేషాః పయోధయః ।**



**జీర్ణస్తే జాఠరే వహ్నౌ**
**దృప్తో వాతాపిదానవః ॥ 4-40**

పూర్వం మీ ఆచమనమాత్రముచేత సముద్రములు బురదగుంటలయినవి. వాతాపి అను మదించిన దానవుడు నీ జఠరాగ్నిలో జీర్ణమైనాడు.

**ఏవంవిధానాం చిత్రాణామ్**
**సర్వలోకాతిశాయినామ్ ।**
**కృత్యానాం తు భవాన్ కర్తా**
**కస్తేఽగస్త్య సమప్రభః ॥ 4-41**

ఇటువంటి లోకోత్తరములయిన అద్భుతకృత్యములకు నీవు కర్తవు. అందువలన ఓ అగస్త్యా! లోకములో నీకు సమానులెవ్వరు?

**శివాద్వైతపరానంద -**
**ప్రకాశనపరాయణమ్ ।**
**భవంతమేకం శంసంతి**
**ప్రకృత్యా సంగవర్జితమ్ ॥ 4-42**

ఈ లోకములోని జనులు నిన్ను మాత్రమే సహజముగా సంగవర్జితుడవని శివాద్వైతానందానుభూతిని నిరంతరమనుభవించు వాడవని ప్రశంసించుచున్నారు.

**పురా హైమవతీసూనుః**
**అవదత్ తే షడాననః ।**

**శివధర్మోత్తరం నామ**
**శాస్త్రమీశ్వరభాషితమ్ ॥ 4-43**

పూర్వము పరమశివుడు బోధించిన 'శివధర్మోత్తర'మను శాస్త్రమును పార్వతీపుత్రుడయిన షణ్ముఖుడు నీకు బోధించెను.

**భక్తిః శైవీ మహాఘోర-**
**సంసారభయహారిణీ ।**
**త్వయా రాజన్వతీ లోకే**
**జాతాఽగస్త్య మహామునే ॥ 4-44**

ఓ అగస్త్యమహర్షీ! ఘోరమైన సంసార భయమును పారద్రోలు శివభక్తి ఈ లోకములో నీచేత రాచమార్గమున ప్రవేశపెట్టబడినది.

ఇతి శ్రీరేణుకాగస్త్యసంవాదం పరిసమాప్తమ్ ।
శ్రీరేణుకాగస్త్యుల సంభాషణము ముగిసినది.

## 7. అగస్త్యముని వచనమ్
## అగస్త్యముని పలుకులు

**ఇతి తస్య వచః శ్రుత్వా**
**సిద్ధస్య మునిపుంగవః ।**
**గంభీరగుణయా వాచా**
**బభాషే భక్తిపూర్వకమ్ ॥ 4-45**



మునిపుంగవుడయిన అగస్త్యుడు (రేణుక) సిద్ధుని మాటలు విని గంభీరమైన వాక్కులతో భక్తిపూర్వకముగా ఇట్లు పలికెను.

**అహమేవ మునీంద్రాణామ్**
**లాలనీయోఽస్మి సర్వదా ।**
**భవదాగమసంపత్తిః**
**మాం వినా కస్య సంభవేత్? ॥ 4-46**

మునిశ్రేష్ఠులందరిలోనూ నేనొక్కడిని ఎల్లప్పుడూ ప్రశంసించ బడుతున్నాను. ఎందువలనంటే మీ ఆగమనమను సౌభాగ్యము నాకు తప్ప అన్యులకెవ్వరికీ లభించలేదు గనుక.

**స్థిరమద్య శివజ్ఞానమ్**
**స్థిరా మే తాపసక్రియా ।**
**భవద్దర్శనపుణ్యేన**
**స్థిరా మే మునిరాజతా ॥ 4-47**

మీ దివ్యదర్శనభాగ్యముతో నా శివజ్ఞానము సుస్థిరమైనది. నా తపస్సు, నా మునిత్వము సుస్థిరములై శాశ్వతములైనవి.

**సంసారసర్పదష్టానామ్**
**మూర్ఛితానాం శరీరిణామ్ ।**
**కటాక్షస్తవ కల్యాణమ్**
**సముజ్జీవనభేషజమ్ ॥ 4-48**

సంసారమను పాముచేత కరవబడి మూర్ఛనొందిన మానవులకు మంగళకరమైన మీ కటాక్షము సంజీవినీ ఔషధము వంటిది.

**సమస్తలోకసందాహ-**
**తాపత్రయమహానలః ।**
**త్వత్పదాంబుకణాస్వాదాత్**
**ఉపశామ్యతి దేహినామ్ ॥ 4-49**

సమస్త మానవాళిని (దేహధారులను) దహించివేయుచున్న తాపత్రయమను ప్రళయాగ్ని మీ పాదోదకబిందువులను సేవించినంత మాత్రముననే చల్లబడు (ఉపశమించు)చున్నది.

**రేణుకం త్వాం విజానామి**
**గణనాథం శివప్రియమ్ ।**
**అవతీర్ణమిమాం భూమిమ్**
**మదనుగ్రహకాంక్షయా ॥ 4-50**

నన్ను అనుగ్రహించు సంకల్పముతో ఈ భూమండలమునకు ఏతెంచిన మిమ్ము పరమశివునికత్యంత ప్రియులయిన రేణుకగణేశ్వరులని తెలుసుకున్నాను.

**భవాదృశానాం సిద్ధానామ్**
**ప్రబోధధ్వస్తజన్మనామ్ ।**



**ప్రవృత్తిరీదృశీ లోకే**
**పరానుగ్రహకారిణీ ॥ 4-51**

(శివజ్ఞానప్రబోధము చేత) జన్మబంధములను త్రెంచుకున్న మీవంటి సిద్ధపురుషులు, భూలోకమున ఇలా సంచరించుట ఇతరుల నుద్ధరించుటకే గదా!

**త్వన్ముఖాచ్ఛ్రోతుమిచ్ఛామి**
**సిద్ధాంతం శ్రుతిసమ్మతమ్ ।**
**సర్వజ్ఞ వద మే సాక్షాత్**
**శైవం సర్వార్థసాధకమ్ ॥ 4-52**

సర్వజ్ఞులైన రేణుకగణేశ్వరా! శ్రుతిసమ్మతము, సర్వాభీష్ట ప్రదాయకము, శివసంబంధము అయిన (వీరశైవ) సిద్ధాంతమును మీనుండి తెలియదలచుకున్నాను. అందువలన సాక్షాత్తు మీరే నాకు బోధించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

**సద్యః సిద్ధికరం పుంసామ్**
**సర్వయోగీంద్రసేవితమ్ ।**
**దురాచారైరనాఘ్రాతమ్**
**స్వీకృతం వేదవేదిభిః ।**
**శివాత్మైక్యమహాబోధ -**
**సంప్రదాయప్రవర్తకమ్ ॥ 4-53**

వినిన మరుక్షణమే మానవులకు సిద్ధిని ప్రసాదించునది, సమస్త యోగీంద్రులచేత స్వీకరించబడినది, దుర్మార్గులకు దుస్సాధ్యమైనది, వేదవిదుచేత ఆదరించబడునది అయిన శివజీవైక్యమును బోధించు సంప్రదాయమును నాకు బోధించుమని వేడుచున్నాను.

**ఉక్త్వా భవాన్ సకలలోకమహోపకారమ్**
**సిద్ధాంతసంగ్రహమనాదృతబాహ్యతంత్రమ్ ।**
**సద్యః కృతార్థయితుమర్హతి దివ్యయోగిన్**
**నానాగమశ్రవణవర్తితసంశయం మామ్ ॥4-54**

(- వసంతతిలకమ్)

ఓ రేణుకగణేశ్వరా! లోకములోని జీవరాసులందరికు ఉపకరించుచు, (వేదవిరుద్ధములైన) ఇతర తంత్రములను పరిహరించుచు, సిద్ధాంతసారమును బోధించుటద్వారా వివిధాగమముల అధ్యయనము వలన సందేహములతో సతమతమవుతున్న నన్ను వెంటనే అనుగ్రహింతురుగాక!

*ఇతి అగస్త్యమునివచనం పరిసమాప్తమ్ ।*

అగస్త్యముని పలుకులుముగిసినవి.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి***



***శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ రేణుకాగస్త్యదర్శనప్రసంగో నామ చతుర్థః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'శ్రీరేణుకాగస్త్యదర్శనప్రసంగ'మను నాలుగవ పరిచ్ఛేదము ముగిసినది.



# పంచమః పరిచ్ఛేదః

## అయిదవ పరిచ్ఛేదము

### *భక్తస్థలే పిండస్థలాదిస్థలత్రయప్రసంగః*

### భక్తస్థలమునందలి పిండస్థలాదిభక్తస్థలత్రయప్రసంగము

**(77 శ్లోకములు)**

***1. సిద్ధాంతకథనమ్***

**సిద్ధాంతపరిచయము**

**అథాగస్త్య వచః శ్రుత్వా**
**రేణుకో గణనాయకః ।**
**ధ్యాత్వా క్షణం మహాదేవమ్**
**సాంబమాహ సమాహితః ॥ 5-1**

అగస్త్యమహర్షుల వినతిని విన్న శ్రీరేణుక గణేశ్వరులు ఒక క్షణకాలము ఉమాపతిని ధ్యానించి ప్రసన్నముగా ఇలా చెప్పసాగారు.

**శ్రీరేణుక ఉవాచ :**

**అగస్త్య! మునిశార్దూల!**
**సమస్తాగమపారగ ।**



**శివజ్ఞానకరం వక్ష్యే**
**సిద్ధాంతం శ్రుణు సాదరమ్ ॥ 5-2**

**శ్రీరేణుకల ఉపదేశము :**

సకల ఆగమముల పారంగతుడవు, మునిశ్రేష్ఠుడవు అయిన ఓ అగస్త్యమహర్షీ! శివజ్ఞానమును ప్రబోధించు సిద్ధాంతశాస్త్రమును చెప్పెదను ఆదరముతో ఆలకించుము.

**అగస్త్య ఖలు సిద్ధాంతా**
**విఖ్యాతా రుచిభేదతః ।**
**భిన్నాచారసమాయుక్తా**
**భిన్నార్థప్రతిపాదకాః ॥ 5-3**

ఓ అగస్త్య మహర్షీ! అభిరుచులలోని భేదము వలనను, ఆచారములలోని భేదము వలనను, వివిధ ప్రయోజనములను ప్రతిపాదించు సిద్ధాంతములు లోకమున అనేక విధములుగా (వివిధనామములతో) ప్రసిద్ధిని చెందియున్నవి.

**సాంఖ్యం యోగః పాంచరాత్రమ్**
**వేదాః పాశుపతం తథా ।**
**ఏతాని మానభూతాని**
**నోపహన్యాని యుక్తిభిః ॥ 5-4**

సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రము, పాంచరాత్ర (ఆగమ)ము, వేదములు (వైదికమతము) మరియు పాశుపతశాస్త్రము ఇవి అన్నియు

ప్రామాణికములైనవే. అందువలన వీటిని తర్కము చేతను, యుక్తులచేతను తిరస్కరించరాదు (చులకన చేయరాదు).

**వేదః ప్రధానం సర్వేషామ్**
**సాంఖ్యాదీనాం మహామునే ।**
**వేదానుసరణాదేషామ్**
**ప్రామాణ్యమితి నిశ్చితమ్ ॥ 5-5**

ఓ మహర్షీ! సాంఖ్యాది శాస్త్రములన్నిటికి వేదమే ఆధారము. వేదములను అనుసరించినందువలననే (సాంఖ్యాది) శాస్త్రముల ప్రామాణ్యము అంగీకరించబడినది.

**పాంచరాత్రస్య సాంఖ్యస్య**
**యోగస్య చ తథా మునే ।**
**వేదైకదేశివర్తిత్వం**
**శైవం వేదమయం మతమ్ ॥ 5-6**

ఓ మునీ! పాంచరాత్రము, సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రము – ఇవి వేదములందలి (ఒక్కొక్క) భాగమును మాత్రమే ప్రమాణముగా అంగీకరించుటచేత ఏకదేశవర్తినులనబడినది. అయితే శైవ(సిద్ధాంత)ము వేదమునంతటినీ ప్రమాణముగా స్వీకరించినందున వేదమయమని విజ్ఞుల అభిమతము.



**వేదైకదేశవర్తిభ్యః**
**సాంఖ్యాదిభ్యో మహామునే ।**
**సర్వవేదానుసారిత్వాత్**
**శైవతంత్రం విశిష్యతే ॥ 5-7**

వేదమునందలి ఒక భాగమును మాత్రమే (ప్రమాణముగా) అంగీకరించు సాంఖ్యాదిశాస్త్రములకన్నా సమగ్రవేదమును అనుసరించు శైవ (సిద్ధాంత) శాస్త్రము విశిష్టమైనది.

**శైవతంత్రమితి ప్రోక్తమ్**
**సిద్ధాంతాఖ్యం శివోదితమ్ ।**
**సర్వవేదార్థరూపత్వాత్**
**ప్రామాణ్యం వేదవిత్ సదా ॥ 5-8**

శివునిచేత ఉపదేశించబడిన శైవతంత్రము 'సిద్ధాంత' (శాస్త్ర) మని పిలువబడుచున్నది. సర్వ వేదార్థస్వరూపమయినందున ఇది వేదమువలె ప్రామాణికమైయున్నది.

**ఆగమా బహుధా ప్రోక్తాః**
**శివేన పరమాత్మనా ।**
**శైవం పాశుపతం సోమమ్**
**లాకులం చేతి భేదతః ॥ 5-9**

పరమాత్ముడయిన శివునిచేత ఉపదేశించబడిన ఆగమములు శైవ, పాశుపత, సోమ, లాకుల అను భేదములతో వివిధరకములుగా వున్నవి.

**తేషు శైవం చతుర్భేదమ్**
**తంత్రం సర్వవినిశ్చితమ్ ।**
**వామం చ దక్షిణం చైవ**
**మిశ్రం సిద్ధాంతసంజ్ఞకమ్ ॥ 5-10**

వీటిలో (మొదటిదయిన) శైవ(శాస్త్రము) వామ, దక్షిణ, మిశ్ర, సిద్ధాంత అను నామములతో నాలుగు విధములని ఆగమజ్ఞులు నిర్ణయించారు.

**శక్తిప్రధానం వామాఖ్యమ్**
**దక్షిణం భైరవాత్మకమ్ ।**
**సప్తమాతృపరం మిశ్రమ్**
**సిద్ధాంతం వేదసమ్మతమ్ ॥ 5-11**

శక్తి ఉపాసనా ప్రధానమైనది వామతంత్రము. భైరవోపాసన ప్రధానమైనది దక్షిణతంత్రము. బ్రాహ్మీమొదలయిన సప్తమాతృకల ఉపాసనా ప్రధానమైనది మిశ్రతంత్రము. వేదసమ్మతమయిన తంత్రము సిద్ధాంతతంత్రము.

**వేదధర్మాభిధాయిత్వాత్**
**సిద్ధాంతాఖ్యః శివాగమః ।**



**వేదబాహ్యవిరోధిత్వాత్**
**వేదసమ్మత ఉచ్యతే ॥ 5-12**

సిద్ధాంత' (తంత్ర)మని పిలువబడిన శివాగమము వేదోక్తములయిన ధర్మములను అనుసరించుట వలన, వేద(బాహ్యము) విరుద్ధములయిన చార్వాకాదుల ధర్మములను నిరసించుట లేదా తిరస్కరించుట వలన, వేదసమ్మతమని చెప్పబడుచున్నది.

**వేదసిద్ధాంతయోరైక్యమ్**
**ఏకార్థప్రతిపాదనాత్ ।**
**ప్రామాణ్యం సదృశం జ్ఞేయమ్**
**పండితైరేతయోః సదా ॥ 5-13**

వేదమునందు సిద్ధాంతశాస్త్రమునందు ఒకే విషయము ప్రతిపాదించబడినందున పండితులు ఈ రెండిటినీ సమానప్రమాణిక ములుగా అంగీకరించుచున్నారు.

**సిద్ధాంతాఖ్యే మహాతంత్రే**
**కామికాద్యే శివోదితే ।**
**నిర్దిష్టముత్తరే భాగే**
**వీరశైవమతం పరమ్ ॥ 5-14**

శివునిచే ఉపదేశించబడిన కామికాగమముతో ఆరంభమై వాతులాగమముతో అంతమగు 'సిద్ధాంత' మను పేర ప్రసిద్ధమయిన

మహాతంత్రమునందలి వుత్తర(చివర)భాగమున శ్రేష్ఠమైన వీరశైవమతము ప్రతిపాదించబడి వున్నది.

**విద్యాయాం శివరూపాయామ్**
**విశేషాద్రమణం యతః ।**
**తస్మాదేతే మహాభాగా**
**వీరశైవా ఇతి స్మృతాః ॥ 5-15**

శివాత్మకమయిన విద్య(జ్ఞానము)లో ఎవరు విశేషముగా రమించుచున్నారో అటువంటివారు వీరశైవమహాత్ములుగా స్మరించబడుచున్నారు.

**వీశబ్దేనోచ్యతే విద్యా**
**శివజీవైక్యబోధికా ।**
**తస్యాం రమంతే యే శైవా**
**వీరశైవాస్తు తే మతాః ॥ 5-16**

(వీరశబ్దములోని) 'వీ' అను అక్షరము శివ-జీవుల ఐక్యతను (ఏకత్వమును) బోధించు విద్య(జ్ఞానము)ను, 'ర' అను అక్షరము ఆవిద్యలో రమించువారిని సూచించుచున్నది. శివజీవక్యైమును బోధించు విద్యలో నిరంతరము రమించు శివభక్తులు వీరశైవులని పిలువబడుచున్నారు.

**విద్యాయాం రమతే యస్మాత్**
**మాయాం హేయాం శ్వవద్రహేత్ ।**



**అనేనైవ నిరుక్తేన**
**వీరమాహేశ్వరః స్మృతః ॥ 5-17**

ఏ కారణముచేత ఈ విద్యలో (తన్మయుడై) రమించుచు, హేయమైన మాయను కుక్కవలె దూరముగా ఉంచుచున్నాడో, అటువంటివాడు వీరమాహేశ్వరుడని నిర్వచించబడినాడు.

**వేదాంతజన్యం యజ్జ్ఞానమ్**
**విద్యేతి పరికీర్త్యతే ।**
**విద్యాయాం రమతే తస్యామ్**
**వీర ఇత్యభిధీయతే ॥ 5-18**

వేదాంతము (ఉపనిషత్తుల) నుండి వుత్పన్నమయిన జ్ఞానము 'విద్య'అని పిలువబడుచున్నది. అటువంటి విద్యలో రమించువాడు ఆనందించువాడు 'వీర' అనబడుచున్నాడు.

**శైవైర్మాహేశ్వరైశ్చైవ**
**కార్యమంతర్బహిఃక్రమాత్ ।**
**శివో మహేశ్వరశ్చేతి**
**నాత్యంతమిహ భిద్యతే ॥ 5-19**

(వీర) శైవులచేతను (వీర) మాహేశ్వరులచేతను ఆచరించబడు క్రియ (ఇష్టలింగోపాసన) క్రమముగా అంతరంగము బహిరంగము అని

రెండు విధములు. శివునకు మహేశ్వరునకు భేదములేనట్లే, వీరశైవ మరియు వీరమాహేశ్వరులకు పరస్పరభేదముండదు. (ఏకాంతములో ఇష్టలింగార్చన చేయువారు వీరశైవులు. జనసామాన్యమునకు మార్గనిర్దేశము చేయుటకు బహిరంగముగా ఇష్టలింగార్చన చేయువారు వీరమాహేశ్వరులు.

**యథా తథా న భిద్యంతే**
**శైవా మాహేశ్వరా అపి ।**
**శివాశ్రితేషు తే శైవా**
**జ్ఞానయజ్ఞరతా నరాః ॥ 5-20**

**మాహేశ్వరాః సమాఖ్యాతాః**
**కర్మయజ్ఞరతా భువి ।**
**తస్మాదాభ్యంతరే కుర్యుః**
**శైవా మాహేశ్వరా బహిః ॥ 5-21**

శివుడు, మహేశ్వరుడు ఎట్లు వేరు కారో, వీరశైవులు, మాహేశ్వరులు కూడా పరస్పరం వేరు కాదు. శివుని ఆశ్రయించి జ్ఞానయజ్ఞరతులైన మానవులు 'వీరశైవు'లని కర్మయజ్ఞనిరతులయిన వారు భూ లోకమున 'వీరమాహేశ్వరు'లని పిలవబడు చున్నారు. అందువలన వీరశైవులు శివలింగార్చనను అంతరంగములోను, వీరమాహేశ్వరులు బహిరంగముగాను ఆచరించెదరు.



(ఈవిధముగా వీరశైవులు వీరమాహేశ్వరులు ఇద్దరూ జ్ఞానులు, అనుభావులు అయినా, వీరశైవుడు జ్ఞానియై తనలో తానుంటే వీరమాహేశ్వరుడు తన అనుభవజ్ఞానమును ప్రపంచమున ప్రసరింపచేయుటకు క్రియాప్రధానుడౌతాడు)

*ఇతి సిద్ధాంతకథనం పరిసమాప్తమ్ ।*

సిద్ధాంతపరిచయము ముగిసినది.

### *2. వీరశైవాః షడ్భేదాః*

### వీరశైవులు ఆరు విధములు

**వీరశైవాస్తు షడ్భేదాః**
**స్థలధర్మవిభేదతః ।**
**భక్తాదివ్యవహారేణ**
**ప్రోచ్యంతే శాస్త్రపారగైః ॥ 5-22**

స్థలధర్మమునందలి భేదములవలనను, భక్త మాహేశ్వరాది వ్యవహారభేదముల వలనను వీరశైవులు ఆరువిధములుగా వున్నారని శాస్త్రపారంగతులు చెప్పుచున్నారు.

**శాస్త్రం తు వీరశైవానామ్**
**షడ్విధం స్థలభేదతః ।**
**ధర్మభేదసమాయోగాత్**
**అధికారివిభేదతః ॥ 5-23**

(ఆయా స్థలములందు ఆచరించవలసిన) ధర్మభేదముల చేత, అటులనే వాటినాచరించవలసిన అధికారుల(సాధకుల)ందలి తారతమ్య భేదములచేత (వీరశైవశాస్త్రము) స్థలములను ఆరువిధములుగా విభజించుచున్నది.

**ఆదౌ భక్తస్థలం ప్రోక్తమ్**
**తతో మాహేశ్వరస్థలమ్ ।**
**ప్రసాదిస్థలమన్యత్తు**
**ప్రాణలింగిస్థలం తతః ।**
**శరణస్థలమాఖ్యాతమ్**
**షష్ఠమైక్యస్థలం మతమ్ ॥ 5-24**

మొదటిది భక్తస్థలము. తరువాతది మాహేశ్వరస్థలము, మరొకటి ప్రసాదిస్థలము. తరువాతది ప్రాణలింగిస్థలము. దాని తరువాతది శరణస్థలము. ఆరవది ఐక్యస్థలము.

ఇతి వీరశైవాః షడ్భేదాః పరిసమాప్తాః ।

వీరశైవుల ఆరు(విధ) స్థలములు ముగిసినవి.

# ఏకోత్తరశతస్థలాని

## అంగస్థలాని-44

# నూటొక్క స్థలములు

## అంగస్థలములు-44

## I. అథ భక్తస్థలమ్
## భక్తస్థలము

**భక్తస్థలం ప్రవక్ష్యామి**
**ప్రథమం కలశోద్భవ ।**
**తదవాంతరభేదాంశ్చ**
**సమాహితమనాః శ్రుణు ॥ 5-25**

కుంభసంభవుడవయిన అగస్త్యమహర్షీ! మొట్టమొదట భక్తస్థలమును, దాని అవాంతరస్థలభేదములను చెప్పెదను. సావధానమనస్కుడవై ఆలకించుము.

**శైవీ భక్తిః సముత్పన్నా**
**యస్యాసౌ భక్త ఉచ్యతే ।**
**తస్యానుష్ఠేయధర్మాణా-**
**ముక్తిర్భక్తస్థలం మతమ్ ॥ 5-26**

ఎవనియందు శివుని పట్ల భక్తి ఉత్పన్నమైనదో వాడు భక్తుడనబడతాడు. అతడు అనుష్ఠించవలసిన ధర్మములను వివరించు స్థలమే భక్తస్థలము.

**అవాంతరస్థలాన్యత్ర**
**ప్రాహుః పంచదశోత్తమాః ।**

**పిండతా పిండవిజ్ఞానం**
**సంసారగుణహేయతా ॥ 5-27**

**దీక్షా లింగధృతిశ్చైవ**
**విభూతేరపి ధారణమ్ ।**
**రుద్రాక్షధారణం పశ్చాత్**
**పంచాక్షరజపస్తథా ॥ 5-28**

**భక్తమార్గక్రియా చైవ**
**గురోర్లింగస్య చార్చనమ్ ।**
**జంగమస్య తథా హ్యేషామ్**
**ప్రసాదస్వీకృతిస్తథా ॥ 5-29**

**అత్ర దానత్రయం ప్రోక్తమ్**
**సోపాధినిరుపాధికమ్ ।**
**సహజం చేతి నిర్దిష్టమ్**
**సమస్తాగమపారగైః ॥ 5-30**

**ఏతాని శివభక్తస్య**
**కర్తవ్యాని ప్రయత్నతః । 5-31**

భక్తస్థలములో పదునైదు అవాంతరస్థలములున్నవి. (అవి వరుసగా) పిండస్థలము, పిండజ్ఞానస్థలము, సంసారహేయస్థలము, గురుకారుణ్యస్థలము, లింగధారణస్థలము, విభూతిధారణస్థలము,



రుద్రాక్షధారణస్థలము, పంచాక్షరజపస్థలము, భక్తమార్గక్రియాస్థలము, గురు-లింగార్చనస్థలము (ఉభయస్థలము), గురు-లింగ-జంగమార్చన స్థలము (త్రివిధ సంపత్తిస్థలము) గురు-లింగ- జంగమ- ప్రసాదస్థలము (చతుర్విధ సారాయస్థలము) త్రివిధ దానస్థలము(సోపాధిదాన స్థలము, నిరుపాధిదాన స్థలము, సహజదానస్థలము)

ఈ విధముగా సకలాగమపారంగతులచేత పదునైదు స్థలములు నిర్దేశింప బడియున్నవి. ప్రతి శివభక్తుడు ఈ స్థలములను ప్రయత్న పూర్వకముగా ఆచరించుటయే అతని కర్తవ్యము.

### *1. అథ పిండస్థలమ్*
### పిండస్థలము

**బహుజన్మకృతైః పుణ్యైః**
**ప్రక్షీణే పాపపంజరే ।**
**శుద్ధాంతఃకరణో దేహీ**
**పిండశబ్దేన గీయతే ॥ 5-32**

అనేక జన్మములందు చేసుకున్న పుణ్యవిశేషము వలన పాపమను పంజరము నాశనమైపోగా శుద్ధమైన అంతఃకరణమును కలిగిన దేహి (జీవుడు) 'పిండ'మను శబ్దముతో పిలవబడుతున్నాడు.

**శివశక్తిసముత్పన్నే**
**ప్రపంచేఽస్మిన్ విశిష్యతే ।**

**పుణ్యాధికః క్షీణపాపః**
**శుద్ధాత్మా పిండనామకః ॥ 5-33**

శివ-శక్తుల సంగమముతో రూపొందిన ఈ ప్రపంచమున అధికపుణ్యవంతుడు మరియు పాపమును నశింపచేసుకున్న శుద్ధాత్ముడైన జీవుడు 'పిండ'మను పేర ప్రత్యేకముగా గుర్తింపబడుచున్నాడు.

**ఏక ఏవ శివః సాక్షాత్**
**చిదానందమయో విభుః ।**
**నిర్వికల్పో నిరాకారో**
**నిర్గుణో నిష్ప్రపంచకః ।**
**అనాద్యవిద్యాసంబంధాత్**
**తదంశో జీవనామకః ॥ 5-34**

ఒక్కడే అయిన శివుడు చిదానందమయుడు, సర్వవ్యాపకుడు (విభువు), నిర్వికల్పుడు (వస్తుశూన్యమై శబ్దజ్ఞానావలంబియైన మనోవృత్తి కలవాడు), నిరాకారుడు, నిర్గుణుడు (సత్త్వ-రజ-తమోగుణముల కతీతుడు), నిష్ప్రపంచకుడు (మాయిక ప్రపంచశూన్యుడు) అయి వున్నాడు. సాక్షాత్ శివునియొక్క అంశమే అనాది అయిన అవిద్యాసంబంధము చేత 'జీవుడు' అని లోకమున పిలువబడుచున్నాడు.

**దేవతిర్యఙ్మనుష్యాది**
**జాతిభేదే వ్యవస్థితః ।**



**మాయీ మహేశ్వరస్తేషామ్**
**ప్రేరకో హృది సంస్థితః ॥ 5-35**

ఆ జీవుడే దేవ, పక్షి, మనుష్య మొదలయిన (84 లక్షల) జీవజాతుల రూపములలో వ్యవస్థితుడైయున్నాడు. మాయ అను శక్తితో కూడుకున్న పరమేశ్వరుడు జీవజాతులన్నిటికీ ప్రేరకుడై, ఆ జీవుల హృదయములలో నెలకొనియున్నాడు.

**చంద్రకాంతే యథా తోయమ్**
**సూర్యకాంతే యథాఽనలః ।**
**బీజే యథాఽంకురః సిద్ధః**
**తథాత్మని శివః స్థితః ॥ 5-36**

చంద్రకాంతశిలలో నీరు ఉన్నట్టు, సూర్యకాంతిశిలలో అగ్నివున్నట్టు, విత్తనములో మొలకవున్నట్టు, జీవాత్మలో శివుడు(పరమాత్ముడు)న్నాడు.

**ఆత్మత్వమీశ్వరత్వం చ**
**బ్రహ్మణ్యేకత్ర కల్పితమ్ ।**
**బింబత్వం ప్రతిబింబత్వమ్**
**యథా పూషణి కల్పితమ్ ॥ 5-37**

బింబత్వము ప్రతిబింబత్వము ఒక్క సూర్యుడిలోనే కల్పించినట్లే జీవాత్మత్వము (ఆత్మత్వము) పరమాత్మత్వము (ఈశ్వరత్వము) రెండునూ ఒకే బ్రహ్మమున కల్పించబడినవి.

**గుణత్రయవిభేదేన**
**పరతత్త్వే చిదాత్మని ।**
**భోక్తృత్వం చైవ భోజ్యత్వం**
**ప్రేరకత్వం చ కల్పితమ్ ॥ 5-38**

పరతత్త్వమయిన శుద్ధచైతన్యమునందు సత్త్వాది గుణత్రయ భేదమువలన భోక్తృత్వము, భోజ్యత్వము మరియు ప్రేరకత్వములు(మూడును) కల్పించబడినాయి.

**గుణత్రయాత్మికా శక్తిః**
**బ్రహ్మనిష్ఠా సనాతనీ ।**
**తద్వైషమ్యాత్ సముత్పన్నా**
**తస్మిన్ వస్తుత్రయాభిధా ॥ 5-39**

పరబ్రహ్మమున సనాతనముగా (అనాదిగా అవిభాజ్యముగా) వుండు త్రిగుణాత్మక శక్తి, తనయందలి సత్త్వాదిగుణముల వైషమ్యము (తరతమభావము) వలన మూడు వస్తువులుగా పరిణమించుచున్నది.

**కించిత్సత్త్వరజోరూపమ్**
**భోక్తృసంజ్ఞకముచ్యతే ।**
**అత్యంతతామసోపాధిః**
**భోజ్యమిత్యభిధీయతే ।**



**పరతత్త్వమయోపాధిః**
**బ్రహ్మచైతన్యమీశ్వరః ॥ 5-40**

కొంచెము సత్త్వగుణము, కొంచెము రజోగుణముల (ఉపాధుల) కలయిక వలన రూపొందిన వస్తువు 'భోక్తా' అని, అత్యంత తమోగుణమును ఉపాధిగా గలిగి రూపొందిన వస్తువు 'భోజ్య'మని, శుద్ధసత్త్వగుణమును ఉపాధిగా కలిగిన బ్రహ్మచైతన్యవస్తువు 'ఈశ్వరుడ'ను పేర్లతో పిలువబడుచున్నవి.

**భోక్తా భోజ్యం ప్రేరయితా**
**వస్తుత్రయమిదం స్మృతమ్ ।**
**అఖండే బ్రహ్మచైతన్యే**
**కల్పితం గుణభేదతః ॥ 5-41**

అఖండమైన బ్రహ్మచైతన్యము సత్త్వాది గుణభేదములచేత భోక్తా (జీవుడు) భోజ్యము (విషయ ప్రపంచము) మరియు ప్రేరకుడు (ఈశ్వరుడు) అను మూడు వస్తువులుగా కల్పించబడినది.

**అత్ర ప్రేరయితా శంభుః**
**శుద్ధోపాధిర్మహేశ్వరః ।**
**సమ్మిశ్రోపాధయః సర్వే**
**భోక్తారః పశవః స్మృతాః ॥ 5-42**

ఇక్కడ ప్రేరకుడైన శంభువు శుద్ధోపాధియుక్తుడైనందున మహేశ్వరుడని పిలువబడుచున్నాడు. మిశ్ర ఉపాధులను కలిగి, భోక్తలయిన సమస్త జీవులు పశువులని పిలువబడుతున్నారు.

**భోజ్యమవ్యక్తమిత్యుక్తమ్**
**శుద్ధతామసరూపకమ్ ।**
**సర్వజ్ఞః ప్రేరకః శంభుః**
**కించిజ్ఞో జీవ ఉచ్యతే ।**
**అత్యంతగూఢచైతన్యమ్**
**జడమవ్యక్తముచ్యతే ॥ 5-43**

శుద్ధ తమోరూపమయిన భోజ్యము (విషయప్రపంచము) అవ్యక్తమని పిలువబడుతున్నది. ప్రేరకుడైన శంభువు 'సర్వజ్ఞుడ'ని, అల్పజ్ఞుడయినవాడు 'జీవుడ'ని, అత్యంత గూఢచైతన్యరూపమయిన జడపదార్థము (భోజ్యము) 'అవ్యక్త'మని పిలువబడుచున్నవి.

**ఉపాధిః పునరాఖ్యాతః**
**శుద్ధాశుద్ధవిభేదతః ।**
**శుద్ధోపాధిః పరా మాయా**
**స్వాశ్రయా మోహకారిణీ ॥ 5-44**

ఉపాధి శుద్ధము అశుద్ధము అను భేదములతో రెండు విధములు. శుద్ధోపాధి అయిన మహామాయా (శక్తి) తాను ఆశ్రయించిన ఈశ్వరునిపై (ఎటువంటి) మోహమును ప్రసరింపజాలదు.



**అశుద్ధోపాధిరప్యేవమ్**
**అవిద్యాశ్రయమోహినీ ।**
**అవిద్యాశక్తిభేదేన**
**జీవా బహువిధాః స్మృతాః ॥ 5-45**

అదేవిధముగానే అశుద్ధోపాధి అయిన అవిద్యా(శక్తి) తాను ఆశ్రయించిన జీవునిపై తన మోహమును ప్రసరింపజేయును. ఈ అవిద్యాశక్తి యందలి భేదముల వలన జీవులు అనేక విధములగుచున్నారని చెప్పబడినది.

**మాయాశక్తివశాదీశో**
**నానామూర్తిధరః ప్రభుః ।**
**సర్వజ్ఞః సర్వకర్తా చ**
**నిత్యముక్తో మహేశ్వరః ॥ 5-46**

సర్వసమర్థుడయిన ఈశ్వరుడు మాయాశక్తిని ఉపాధిగా పొందినప్పుడు అనేక విధములైన లీలామూర్తి (సద్యోజాతాది లీలావిగ్రహ) రూపములను ధరించుచున్నాడు. ఈ మహేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వకర్తా, నిత్యముక్తుడు అయి వున్నాడు.

**కించిత్కర్తా చ కించిజ్ఞో**
**బద్ధోఽనాదిశరీరవాన్ ।**
**అవిద్యామోహితా జీవా**
**బ్రహ్మైక్యజ్ఞానవర్జితాః ॥ 5-47**

అనాదిగా శరీరాభిమానియై, ఆణవాదిమలపాశబద్ధుడైన జీవుడు కించిత్ కర్తృత్వమును అల్పజ్ఞత్వమును కలిగి ఉన్నాడు. అటువంటి అవిద్యామోహితులైన జీవులు బ్రహ్మైక్యజ్ఞానరహితులై యుందురు.

**పరిభ్రమంతి సంసారే**
**నిజకర్మానుసారతః ।**
**దేవతిర్యఙ్మనుష్యాది**
**నానాయోనివిభేదతః ॥ 5-48**

(ఈ జీవులు) వారి వారి కర్మానుసారము దేవ, పక్షి, మనుష్యాది అనేకవిధములయిన యోనులలందు జన్మించి సంసారచక్రములో పరిభ్రమించుచుందురు.

**చక్రనేమిక్రమేణైవ**
**భ్రమంతి హి శరీరిణః ।**
**జాత్యాయుర్భోగవైషమ్య-**
**కారణం కర్మ కేవలమ్ ॥ 5-49**

శరీరధారులైన జీవులు చక్రమునందలి అరలవలె (నానా యోనులయందు) తిరుగుతున్నారు. ఈ జీవుల జన్మ(జాతి), ఆయుష్షు (ఆయు), సుఖసంతోషాదులలోని తారతమ్యములకు వారి వారి (పూర్వజన్మల) కర్మలే కారణములగుచున్నవి.



**ఏతేషాం దేహినాం సాక్షీ**
**ప్రేరకః పరమేశ్వరః ।**
**ఏతేషాం భ్రమతాం నిత్యమ్**
**కర్మయంత్రనియంత్రణే ॥ 5-50**

ప్రేరకుడైన పరమేశ్వరుడు దేహధారులయిన జీవులందరిలోనూ సాక్షిరూపుడై వుంటాడు. సంసార(చక్రము)లో అనునిత్యము తిరుగుతున్న జీవుల కర్మయంత్రములను ఆ పరమేశ్వరుడే నియంత్రించును. (ఈశ్వరుడు జీవుల కర్మలకు, సాక్షి, ప్రేరకుడు మరియు నియంత్రకుడు కూడా అయివున్నాడు).

**దేహినాం ప్రేరకః శంభుః**
**హితమార్గోపదేశకః ।**
**పునరావృత్తిరహిత-**
**మోక్షమార్గోపదేశకః ॥ 5-51**

దేహధారులైన జీవులకు ప్రేరకుడైన శంభువు హితమార్గోప దేశకుడు మాత్రమే కాకుండా పునర్జన్మలేని మోక్షమార్గమును కూడా ఉపదేశించుచున్నాడు.

**స్వకర్మపరిపాకేన**
**ప్రక్షీణమలవాసనః ।**

**శివప్రసాదాజ్జీవో౽యమ్**
**జాయతే శుద్ధమానసః ॥ 5-52**

ఈ జీవుడు తన కర్మలు పరిపక్వమయినపుడు (త్రివిధములయిన) మలవాసనలు క్షయమయినపుడు, శివుని అనుగ్రహముచేత శుద్ధమానసము కలవాడగుచున్నాడు.

**శుద్ధాంతఃకరణే జీవే**
**శుద్ధకర్మవిపాకతః ।**
**జాయతే శివకారుణ్యాత్**
**ప్రస్ఫుటా భక్తిరైశ్వరీ ॥ 5-53**

కర్మపరిపక్వముచేత శుద్ధాంతఃకరణుడైన జీవునిలో శివకారుణ్య ప్రభావము వలన ఈశ్వరుని యందు దృఢమైన భక్తి కలుగుతుంది.

**జంతురంత్యశరీరో౽సౌ**
**పిండశబ్దాభిధేయకః ॥ 5-54**

ఈ విధంగా శుద్ధాంతఃకరణుడై 'పిండ' శబ్దమునకు వాచ్యుడైన ఈ జీవుడు 'అంత్యశరీరి' (చరమదేహి) యని చెప్పబడుచున్నాడు.

*ఇతి పిండస్థలం పరిసమాప్తమ్ ।*

పిండస్థలము ముగిసినది.



## 2. అథ పిండజ్ఞానస్థలమ్

**పిండజ్ఞానస్థలము**

**శరీరాత్మవివేకేన**
**పిండజ్ఞానీ స కథ్యతే ।**
**శరీరమేవ చార్వాకైః**
**ఆత్మేతి పరికీర్త్యతే ॥ 5-55**

శరీరము యొక్క, ఆత్మయొక్క వివేకమును తెలిసినవాడు పిండజ్ఞాని అని పిలవబడుచున్నాడు. చార్వాకులు శరీరమునే ఆత్మగా పరిగణించుచున్నారు.

**ఇంద్రియాణాం తథాత్మత్వమ్**
**అపరైః పరిభాష్యతే ।**
**బుద్ధితత్త్వగతైర్బుద్ధైః**
**బుద్ధిరాత్మేతి గీయతే ॥ 5-56**

మరికొంతమంది ఇంద్రియములనే ఆత్మ అని చెప్పుచున్నారు. బుద్ధితత్త్వవాదులయిన బౌద్ధులు బుద్ధినే ఆత్మగా భావింతురు.

**నేంద్రియాణాం న దేహస్య**
**న బుద్ధేరాత్మతా భవేత్ ।**
**అహంప్రత్యయవేద్యత్వాత్**
**అనుభూతస్మృతేరపి ॥ 5-57**

'అహం'ప్రత్యయముతో ఆత్మ (అను పదార్థం) తెలియబడు చున్నందునను, అదేరీతిగా అనుభవము మరియు స్మృతి కూడా కలుగుచున్నందునను, ఇంద్రియములుగాని, దేహముగాని, బుద్ధిగాని ఆత్మకాజాలవు (ఎందువలననగా అవి అనాత్మలు గనుక).

**శరీరేంద్రియబుద్ధిభ్యో**
**వ్యతిరిక్తః సనాతనః ।**
**ఆత్మస్థితివివేకీ యః**
**పిండజ్ఞానీ స కథ్యతే ॥ 5-58**

శరీరము- ఇంద్రియము - బుద్ధి కన్నా వేరైన సనాతనమయిన, ఆత్మయొక్క అస్తిత్వమును వివేకముతో ఎవడు తెలుసుకొనుచున్నాడో, వాడు 'పిండజ్ఞాని' అని పిలువబడుచున్నాడు.

**నశ్వరాణి శరీరాణి**
**నానారూపాణి కర్మణా ।**
**ఆశ్రితో నిత్య ఏవాసౌ**
**ఇతి జంతోర్వివేకితా ॥ 5-59**

శరీరములు నశించునవి. కర్మల తారతమ్యము చేత(జీవులు) నానావిధములైన రూపములను ధరించుచున్నారు. ఇటువంటి శరీరము నాశ్రయించివున్న ఆత్మ నిత్యమైనదని తెలుసుకొనుటయే జీవియొక్క వివేకము.



**శరీరాత్ పృథగాత్మానమ్**
**ఆత్మభ్యః పృథగీశ్వరమ్ ।**
**ప్రేరకం యో విజానాతి**
**పిండజ్ఞానీతి కథ్యతే ॥ 5-60**

ఆత్మ శరీరముకన్నా వేరైనదని, ఈశ్వరుడు ఆత్మ (జీవాత్మ)లకన్నా వేరైనవాడని, (అటువంటి ఈశ్వరుడు) ఆ జీవులకుప్రేరకుడని ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడే 'పిండజ్ఞాని' అని తెలియబడుచున్నాడు.

ఇతి పిండజ్ఞానస్థలం పరిసమాప్తమ్ ।
పిండజ్ఞానస్థలము ముగిసినది.

### *3. అథ సంసారహేయస్థలమ్*
### సంసారహేయస్థలము

**నిరస్తహృత్కలంకస్య**
**నిత్యానిత్యవివేకినః ।**
**సంసారహేయతాబుద్ధిః**
**జాయతే వాసనాబలాత్ ॥ 5-61**

హృదయమునందలి కళంకమును కడిగివేసుకుని, నిత్యానిత్య (వస్తు) వివేకమును పొందిన జీవునికి వాసనాబలముచేత సంసారముపట్ల హేయబుద్ధి కలుగును.

**ఐహికే క్షణికే సౌఖ్యే**
**పుత్రదారాదిసంభవే ।**
**క్షయిత్వాదియుతే స్వర్గే**
**కస్య వాంఛా వివేకినః ॥ 5-62**

భార్యాబిడ్డల వలన కలుగు క్షణికములయిన ప్రాపంచిక సుఖములపట్ల, మరియు క్షయపతనాది దోషములతో కూడుకున్న స్వర్గసుఖములపట్ల, వివేకి అయినవానికి కోరిక ఎట్లు కలుగును?

**జాతస్య హి ధ్రువో మృత్యుః**
**ధ్రువం జన్మ మృతస్య చ ।**
**జంతుర్మరణజన్మాభ్యామ్**
**పరిభ్రమతి చక్రవత్ ॥ 5-63**

పుట్టినవానికి మరణము నిశ్చయము. మరణించినవానికి పుట్టుక తప్పదు. అందువలన జనన మరణములకు అధీనుడైన జీవాత్మ(జంతువు) చక్రమువలె పరిభ్రమించుచున్నాడు.

**మత్స్యకూర్మవరాహాంగైః**
**నృసింహమనుజాదిభిః ।**
**జాతేన నిధనం ప్రాప్తమ్**
**విష్ణునాపి మహాత్మనా ॥ 5-64**



మహామహిమాన్వితుడయిన విష్ణువు కూడా మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, మనుష్యాది జన్మల (అవతారముల)నెత్తి మరణముననుభవించినాడు.

**భూత్వా కర్మవశాజ్జంతుః**
**బ్రాహ్మణాదిషు జాతిషు ।**
**తాపత్రయమహావహ్ని-**
**సంతాపాత్ దహ్యతే భృశమ్ ॥ 5-65**

జంతువు (జీవాత్మ) తన పూర్వజన్మములందలి కర్మలననుసరించి బ్రాహ్మణక్షత్రియాది జాతులలో జన్మించి (ఆధ్యాత్మికాది) తాపత్రయములను అగ్నిజ్వాలలలో మాడ్చబడుచున్నాడు. (ఈ శ్లోకములో బ్రాహ్మణాది వర్ణములలో జన్మించుటకు వారి వారి పూర్వజన్మకర్మలే కారణమని చెప్పబడినది. అయితే ఎవరు ఏ వర్ణమునకు చెందినవారైనా, లింగధారణ, లింగార్చనల ద్వారానే లింగ(శివ)స్వరూపులగుదురను విషయమును తరువాతి పరిచ్ఛేదములో శివయోగి శివాచార్యులవారు నిరూపించబోవుచున్నారు. అందువలన సిద్ధాంత శిఖామణి గ్రంథము వర్ణాశ్రమధర్మములను ప్రతిపాదించదు).

**కర్మమూలేన దుఃఖేన**
**పీడ్యమానస్య దేహినః ।**
**ఆధ్యాత్మికాదినా నిత్యమ్**
**కుత్ర విశ్రాంతిరిష్యతే ॥ 5-66**

కర్మలమూలముగా సంప్రాప్తమగు ఆధ్యాత్మికాది దుఃఖములతో నిత్యము పీడించబడు జీవాత్ములకు విశ్రాంతి ఎక్కడిది?

**ఆధ్యాత్మికం తు ప్రథమమ్**
**ద్వితీయం చాధిభౌతికమ్ ।**
**ఆధిదైవికమన్యచ్చ**
**దుఃఖత్రయమిదం స్మృతమ్ ॥ 5-67**

జీవుడికి మూడు విధములయిన దుఃఖములు. అందు మొదటిది ఆధ్యాత్మికదుఃఖము, రెండవది ఆధిభౌతికదుఃఖము, తరువాతది ఆధిదైవికదుఃఖము. వీటినే దుఃఖత్రయము అందురు.

**ఆధ్యాత్మికం ద్విధా ప్రోక్తమ్**
**బాహ్యాభ్యంతరభేదతః ।**
**వాతపిత్తాదిజం దుఃఖమ్**
**బాహ్యమాధ్యాత్మికం మతమ్ ॥ 5-68**

**రాగద్వేషాదిసంపన్నమ్**
**ఆంతరం పరికీర్త్యతే ।**
**ఆధిభౌతికమేతద్ధి**
**దుఃఖం రాజాదిభూతజమ్ ॥ 5-69**

ఆధ్యాత్మికదుఃఖము బాహ్యము, ఆభ్యంతరము అని రెండు విధములు. కఫ, వాత, పిత్తా (దిరోగా) దుల వలన కలుగు దుఃఖము బాహ్యమైన ఆధ్యాత్మిక దుఃఖము. రాగద్వేషాదుల వలన సంప్రాప్తమగు దుఃఖము ఆంతరిక ఆధ్యాత్మికదుఃఖము. పాలించు ప్రభువుల వలనను, క్రూరజంతువుల వలనను, పంచభూతముల వలనను కలుగు దుఃఖము ఆధి భౌతికదుఃఖము.



**ఆధిదైవికమాఖ్యాతమ్**
**గ్రహయక్షాదిసంభవమ్ ।**
**దుఃఖైరేతైరుపేతస్య**
**కర్మబద్ధస్య దేహినః ।**
**స్వర్గో వా యది వా భూమౌ**
**సుఖలేశో న విద్యతే ॥ 5-70**

గ్రహదోషముల వలనను, భూతభేతాళాది శక్తుల వలనను కలుగు దుఃఖము ఆధిదైవికదుఃఖమని చెప్పెదరు. ఈ విధములయిన మూడు దుఃఖములకు లోనై, కర్మబద్ధుడైన జీవు(దేహి)నికి భూమిపై గాని స్వర్గమునగాని లేశమాత్రమైన సుఖము కూడా ఉండదు.

**తటిత్సు వీచిమాలాసు**
**ప్రదీపస్య ప్రభాసు చ ।**
**సంపత్సు కర్మమూలాసు**
**కస్య వా స్థిరతామతిః ॥ 5-71**

విద్యుల్లతలవలె, నీటిపైని అలలవలె, దీపపుకాంతులవలె పూర్వకర్మల ఫలితముగా సంప్రాప్తమగు అస్థిరమయిన సంపదలపట్ల ఎవరికి మాత్రం స్థిరబుద్ధి కలుగుతుంది?

**మలకోశే శరీరేఽస్మిన్**
**మహాదుఃఖవివర్ధనే ।**

**తడిదంకురసంకాశే**
**కో వా రుచ్యేత పండితః ॥ 5-72**

మలమూత్రముల నిలయము, మహాదుఃఖ వర్ధకము, మేఘములందలి మెరుపువలె క్షణకాలము ప్రకాశించి నశించిపోవు ఈ శరీరమును పండితుడైనవాడెవడు ఇష్టపడతాడు?

**నిత్యానందచిదాకారమ్**
**ఆత్మతత్త్వం విహాయ కః ।**
**వివేకీ రమతే దేహే**
**నశ్వరే దుఃఖభాజనే ॥ 5-73**

నిత్యము, ఆనందమయము, చైతన్యస్వరూపము అయిన ఆత్మ తత్త్వమును వదలి వివేకవంతుడైన వాడెవ్వడూ అశాశ్వతము, దుఃఖనిలయము అయిన దేహమును అపేక్షించడు.

**వివేకీ శుద్ధహృదయో**
**నిశ్చితాత్మసుఖోదయః ।**
**దుఃఖహేతౌ శరీరేఽస్మిన్**
**కలత్రే చ సుతేషు చ ॥ 5-74**

**సుహృత్సు బంధువర్గేషు**
**ధనేషు కులపద్ధతౌ ।**



**అనిత్యబుద్ధ్యా సర్వత్ర**
**వైరాగ్యం పరమశ్నుతే ॥ 5-75**

శుద్ధహృదయుడైన వివేకవంతుడు, దుఃఖకారకములయిన శరీరమునందు, భార్యాబిడ్డలయందు, స్నేహితులయందు, బంధువర్గము నందు, ధనకనకాది వస్తువులయందు, తన కులపద్ధతుల యందు ఆనిత్యబుద్ధికలిగినవాడై, వీటిపట్ల వైరాగ్యమును పొందుచున్నాడు.

**వివేకినో విరక్తస్య**
**విషయేష్వాత్మరాగిణః ।**
**సంసారదుఃఖవిచ్ఛేద**
**హేతౌ బుద్ధిః ప్రవర్తతే ॥ 5-76**

(శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను) విషయప్రపంచముపట్ల వైరాగ్యమును పొంది ఆత్మయందనురాగము పెంచుకున్న వివేకవంతుడు సంసారదుఃఖమును సమూలముగా నాశనముచేసుకొను ఉపాయమును అన్వేషించుటకు ప్రయత్నించును.

**నిత్యానిత్యవివేకినః సుకృతినః శుద్ధాశయస్యాత్మనో**
**బ్రహ్మోపేంద్రమహేంద్రముఖ్యవిభవేష్వస్థాయితాం పశ్యతః।**
**నిత్యానందపదే నిరాకృతజగత్సంసారదుఃఖోదయే**
**సాంబే చంద్రశిరోమణౌ సముదయేద్భక్తిర్భవధ్వంసినీ ॥5-77**

- (శార్దూలవిక్రీడితమ్)

సత్కర్మపరాయణుడు, నిత్యానిత్యవస్తువివేకము కలిగినవాడు, బ్రహ్మ-విష్ణు - మహేంద్రాది దేవతల ఐశ్వర్యాది వైభవములను సైతము అస్థిరములని తెలుసుకున్న జీవాత్మునకు నిత్యానందనిలయుడు, సంసారదుఃఖ నివారకుడు, చంద్రశేఖరుడు, పార్వతీపతి అయిన పరమేశ్వరుని యందు సంసారదుఃఖవిధ్వంసకమైన భక్తి అంకురించును.

ఇతి సంసారహేయస్థలం పరిసమాప్తమ్ ।

సంసారహేయస్థలము ముగిసినది.

**ఓం తత్సత్ ఇతి**

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే*** **శ్రీసిద్ధాంతశిఖామణౌ భక్తస్థలే పిండస్థలాది స్థలత్రయప్రసంగో నామ పంచమః పరిచ్ఛేదః ।**

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'భక్తస్థలమునందలి పిండస్థలాది స్థలత్రయప్రసంగమ'ను అయిదవ పరిచ్ఛేదము ముగిసినది.



# షష్ఠః పరిచ్ఛేదః

## ఆరవ పరిచ్ఛేదము

### *గురుకారుణ్యాలింగధారణప్రసంగః*

### గురుకారుణ్యాలింగధారణప్రసంగము

**(63 శ్లోకములు)**

### *4. అథ గురుకారుణ్యస్థలమ్*

**గురుకారుణ్యస్థలము**

**తతో వివేకసంపన్నో**
**విరాగీ శుద్ధమానసః ।**
**జిజ్ఞాసుః సర్వసంసార-**
**దోషధ్వంసకరం శివమ్ ॥ 6-1**

పరిశుద్ధమనస్కుడు (పిండశబ్దవాచ్యుడు), వివేకసంపన్నుడు (పిండజ్ఞానశబ్దవాచ్యుడు), వైరాగ్యభావశరణుడు (సంసార హేయస్థల వాచ్యుడు) అయిన సాధకుడు సంసారమునకు సంబంధించిన సమస్తదోషధ్వంసకుడైన శివుని గురించి తెలుసుకోవలయునన్న గాఢమైన ఇచ్ఛతో, గురువును ఆశ్రయిస్తాడు.

**ఉపైతి లోకవిఖ్యాతమ్**
**లోభమోహవివర్జితమ్ ।**

**ఆత్మతత్త్వవిచారజ్ఞమ్**
**విముక్తవిషయభ్రమమ్ ॥ 6-2**

లోకప్రసిద్ధుడు,లోభమోహములు లేనివాడు, ఆత్మతత్త్వమును చక్కగా తెలుసుకున్నవాడు, ప్రాపంచిక భ్రమల నుండి విడువడినవాడు-

**శివసిద్ధాంతతత్త్వజ్ఞమ్**
**ఛిన్నసందేహవిభ్రమమ్ ।**
**సర్వతంత్రప్రయోగజ్ఞమ్**
**ధార్మికం సత్యవాదినమ్ ॥ 6-3**

శైవసిద్ధాంతమును అధ్యయనము చేసినవాడు, సందేహభ్రాంతులను తొలగించుకున్నవాడు, సమస్త శైవాగమతంత్రప్రయోగములను ఎరిగినవాడు, ధర్మనిష్ఠుడు, సత్యవాది -

**కులక్రమాగతాచారమ్**
**కుమార్గాచారవర్జితమ్ ।**
**శివధ్యానపరం శాంతమ్**
**శివతత్త్వవివేకినమ్ ॥ 6-4**

గురువంశక్రమము నుండి సంక్రమించిన సదాచారసంపన్నుడు, దురాచారములకు దూరముగా వుండువాడు, శివధ్యానతత్పరుడు, శాంత (మాత్సర్యరహిత) చిత్తుడు, శివతత్త్వజ్ఞాననిష్ఠుడు -



**భస్మోద్ధూలననిష్ణాతమ్**
**భస్మతత్త్వవివేకినమ్ ।**
**త్రిపుండ్రధారణోత్కంఠమ్**
**ధృతరుద్రాక్షమాలికమ్ ॥ 6-5**

భస్మోద్ధూలనక్రియలో నిష్ణాతుడు, భస్మతత్త్వవిదితుడు, త్రిపుండ్ర ధారణలో అత్యాసక్తుడు, రుద్రాక్షమాలలను ధరించినవాడు -

**లింగధారణసంయుక్తమ్**
**లింగపూజాపరాయణమ్ ।**
**లింగాంగయోగతత్త్వజ్ఞమ్**
**నిరూఢాద్వైతవాసనమ్ ।**
**లింగాంగస్థలభేదజ్ఞమ్**
**శ్రీగురుం శివవాదినమ్ ॥ 6-6**

లింగధారి అయినవాడు, లింగపూజాపరాయణుడు, లింగాంగయోగ తత్త్వమును ఎరిగినవాడు, శివాద్వైతభావనానిష్ఠుడు, లింగస్థల-అంగస్థల భేదమునవగతము చేసుకున్నవాడు, శివతత్త్వమును బోధించువాడు, షడ్గుణైశ్వర్యసంపన్నుడయిన గురువును సాధకుడు శిష్యభావనతో ఆశ్రయించవలెను.

**సేవేత పరమాచార్యమ్**
**శిష్యో భక్తిభయాన్వితః ।**

**షణ్మాసాన్ వత్సరం వాఽపి**
**యావదేష ప్రసీదతి ॥** **6-7**

భయభక్తులతో శరణాగతుడయిన శిష్యుడు ఆరునెలలుగాని లేదా ఒక సంవత్సరకాలము గాని లేదా గురుప్రసన్నుడగు వరకుగాని గురువును సేవించవలెను.

**ప్రసన్నం పరామాచార్యమ్**
**భక్త్యా ముక్తిప్రదర్శకమ్ ।**
**ప్రార్థయేదగ్రతః శిష్యః**
**ప్రాంజలిర్వినయాన్వితః ॥** **6-8**

తన భక్తికి ప్రసన్నుడయి, మోక్షమార్గమును చూపించు పరమాచార్యుని ఎదురుగా శిష్యుడు చేతులు జోడించి వినయముతో వంగి ప్రప్రథమముగా ఇట్లు ప్రార్థించవలెను.

**భో కల్యాణ మహాభాగ!**
**శివజ్ఞానమహోదధే ।**
**ఆచార్యవర్య సంప్రాప్తమ్**
**రక్ష మాం భవరోగిణమ్ ॥** **6-9**

ఓ కల్యాణస్వరుపుడా! శ్రేష్ఠమైనవాడా! శివజ్ఞానసముద్రుడైన ఆచార్యవరిష్ఠుడా! నీ చెంతకుచేరిన ఈ భవరోగిని రక్షించండి.



**ఇతి శుద్ధేన శిష్యేణ**
**ప్రార్థితః పరమో గురుః ।**
**శక్తిపాతం సమాలోక్య**
**దీక్షయా యోజయేదముమ్ ॥** **6-10**

ఈ విధముగా నిర్మలమనస్కుడయిన శిష్యునిచే ప్రార్థించబడిన పరమగురువు శిష్యుని యందలి శక్తిపాతపు (శివభక్తి యొక్క) లక్షణములను చక్కగా గమనించి అతనికి దీక్షనొసంగవలెను.

**దీయతే చ శివజ్ఞానమ్**
**క్షీయతే పాశబంధనమ్ ।**
**యస్మాదతః సమాఖ్యాతా**
**దీక్షేతీయం విచక్షణైః ॥** **6-11**

దేనిచేత శివజ్ఞానము ఇవ్వబడుచున్నదో మరియు భవబంధము త్రెంచివేయబడుచున్నదో అటువంటి సంస్కారమును 'దీక్ష' అని విచక్షణులైన శైవాగమవిశారదులు చెప్పుచున్నారు.

**సా దీక్షా త్రివిధా ప్రోక్తా**
**శివాగమవిశారదైః ।**
**వేధారూపా క్రియారూపా**
**మంత్రరూపా చ తాపస ॥** **6-12**

హే తాపసీ! శివాగమవిశారదులు దీక్షను వేధాదీక్ష, మంత్రదీక్ష, క్రియాదీక్ష అని మూడువిధములుగా చెప్పుచున్నారు.

**గురోరాలోకమాత్రేణ**
**హస్తమస్తకయోగతః ।**
**యః శివత్వసమావేశో**
**వేధాదీక్షేతి సా మతా ॥ 6-13**

సద్గురువుల యొక్క కంటి చూపుల చేతను, హస్తమస్తక సంయోగము చేతను ప్రసాదించబడు శివత్వసమావేశము 'వేధాదీక్ష' అని పిలువబడుతున్నది.

**మాంత్రీ దీక్షేతి సా ప్రోక్తా**
**మంత్రమాత్రోపదేశినీ ।**
**కుండమండలికోపేతా**
**క్రియా దీక్షా క్రియోత్తరా ॥ 6-14**

మంత్రమును ఉపదేశించు దీక్ష మంత్రదీక్ష అనబడినది. కుండ మండలములను ఏర్పరిచి (వాటి ద్వారా) క్రియా ప్రధానముగా నిర్వహించు దీక్ష క్రియాదీక్ష.(అనబడినది.)

**శుభమాసే శుభతిథౌ**
**శుభకాలే శుభేఽహని ।**



**విభూతిం శివభక్తేభ్యో**
**దత్త్వా తాంబూలపూర్వకమ్ ॥ 6-15**

(మాఘాది) శుభమాసములలో, (భద్రాది) శుభతిథులలో, (అమృతాది) శుభఘడియలలో, (సోమ, శుక్రాది) శుభవారములలో శివభక్తులకు తాంబూలపూర్వకమైన విభూతిని ఇచ్చి -

**యథావిధి యథాయోగమ్**
**శిష్యమానీయ దేశికః ।**
**స్నాతం శుక్లాంబరధరమ్**
**దంతధావనపూర్వకమ్ ॥ 6-16**

**మండలే స్థాపయేచ్ఛిష్యమ్**
**ప్రాఙ్ముఖం తముదఙ్ముఖః ।**
**శివస్య నామ కీర్తిం చ**
**చింతామపి చ కారయేత్ ॥ 6-17**

దంతధావనము తరువాత స్నానము చేసి శుభ్రమైన వస్త్రములను ధరించిన శిష్యుని గురువు తోడ్కొని వచ్చి యథావిధి, యథాయోగము (స్వస్తిక) మండలముపై తూర్పునకు గాని, ఉత్తరమునకు గాని, అభిముఖునిగా కూర్చుండబెట్టవలెను. తరువాత అతనిచేత శివనామసంకీర్తనమును, శివ ధ్యానమును చేయించవలెను.

**విభూతిపట్టం దత్త్వాఽగ్రే**
**యథాస్థానం యథావిధి ।**
**పంచబ్రహ్మమయైస్తత్ర**
**స్థాపితైః కలశోదకైః ॥ 6-18**

**ఆచార్యః సమమృత్విగ్భిః**
**త్రిః శిష్యమభిషించయేత్ ।**
**అభిషిచ్య గురుః శిష్యమ్**
**ఆసీనం పరితః శుచిమ్ ॥ 6-19**

శాస్త్రవిధి ననుసరించి, ఆ యా (శిరస్సు, కంఠము, హృదయము వంటి) ప్రదేశములందు త్రిపుండ్రపట్టమును ధరింపజేసి, అతనిముందు నేలపై పంచబ్రహ్మలకు ప్రతీకలుగా ప్రతిష్ఠంపచేసిన పంచకలశములందలి నీటితో, ఆచార్యుడు ఋత్విక్కులతో కలసి శిష్యునకు మూడు సార్లు అభిషేకమును చేయించి అభిషేకముతో శుచిర్భూతుడైన శిష్యునకు -

**తతః పంచాక్షరీం శైవీం**
**సంసారభయతారిణీమ్ ॥ 6-20**
**తస్య దక్షిణకర్ణే తు**
**నిగూఢమపి కీర్తయేత్ ।**
**ఛందో రూపమృషిం చాస్య**
**దేవతాన్యాసపద్ధతిమ్ ॥ 6-21**



సంసారభయమును తొలగించు శివసంబంధమైన పంచాక్షరీ మంత్రమును శిష్యుని కుడిచెవిలో గుప్తముగా ఉపదేశించవలెను. మంత్రముతోపాటు దాని ఛందస్సును, రూపమును, ఋషిని, దేవతను, న్యాసవిధానమును కూడా తెలియజేయవలెను.

*ఇతి గురుకారుణ్యస్థలం పరిసమాప్తమ్ ।*
గురుకారుణ్యస్థలము ముగిసినది.

### *5. అథ లింగధారణస్థలమ్*
### లింగధారణస్థలము

**స్ఫాటికం శైలజం వాపి**
**చంద్రకాంతమయం తు వా ।**
**బాణం వా సూర్యకాంతం వా**
**లింగమేకం సమాహరేత్ ॥ 6-22**

స్ఫటికముతోగాని, (శ్రీశైల)పర్వతశిలతోగాని, చంద్రకాంత శిలతోగాని, సూర్యకాంతశిలతోగాని, నర్మదానదియందు లభించు బాణలింగముతోగాని, (వీటిలో ఏదో ఒకదానితో) చేయబడిన లింగమును (దీక్ష కొరకు) సిద్ధము చేసుకొనవలెను.

**సర్వలక్షణసంపన్నే**
**తస్మిన్‌లింగే విశోధితే ।**

**పీఠస్థితేఽభిషిక్తే చ**
**గంధపుష్పాదిపూజితే ॥ 6-23**

**మంత్రపూతే కలాం శైవీం**
**యోజయేద్విధినా గురుః ।**
**శిష్యస్య ప్రాణమాదాయ**
**లింగే తత్ర నిధాపయేత్ ॥ 6-24**

సర్వలక్షణసమన్వితమయిన లింగమును స్వీకరించి గురువు శాస్త్రవిధిన పరిశుద్ధముచేసి, హస్తపీఠమునందుంచుకుని అభిషేకము చేసి, గంధపుష్పాదులతో నలంకరించి, మంత్రములతో సంస్కరించి, విధిప్రకారము శైవీకళను అందు సంయోజనము చేయవలెను. అలాగుననే హస్తమస్తక సంయోగముతో శిష్యుని ప్రాణశక్తిని లింగమునందు ప్రతిష్ఠింపజేయ వలెను.

**తల్లింగం తస్య తు ప్రాణే**
**స్థాపయేదేకభావతః ।**
**ఏవం కృత్వా గురుర్లింగమ్**
**శిష్యహస్తే నిధాపయేత్ ॥ 6-25**

అటులనే ఆ శిష్యుని ప్రాణమునందు లింగమును తాదాత్మ్యభావనతో ఐక్యము చేయవలెను. ఆ తరువాత గురువు ఆ ప్రాణలింగమును శిష్యుని చేతియందుంచి అతనికిట్లు ఆదేశించవలెను.



**ప్రాణవద్ధారణీయమ్ తత్**
**ప్రాణలింగమిదం తవ ।**
**కదాచిత్కుత్రచిద్వాపి**
**న వియోజయ దేహతః ॥ 6-26**

ఓ శిష్యుడా! ఇది నీ ప్రాణలింగము. దీనిని నీ ప్రాణమువలె ధరించవలెను. ఏ సమయమునందుగాని, ఏ ప్రదేశమునందుగాని, దీనిని నీ దేహమునుండి వేర్పరుపరాదు.

**యది ప్రమాదాత్ పతితే**
**లింగే దేహాన్మహీతలే ।**
**ప్రాణాన్ విముంచ సహసా**
**ప్రాప్తయే మోక్షసంపదః ॥ 6-27**

ప్రమాదవశమున (లేదా అజాగ్రత్తవలన)ఒకవేళ ఈ ప్రాణలింగము నీ దేహము నుండి జారి నేలపడినపక్షమున తక్షణమే మోక్షప్రాప్తికై ప్రాణమును త్యజించుము. ( అనగా దీక్ష ద్వారా పొందిన లింగమును ప్రాణముకన్నా అధికముగా భావించవలెనని తాత్పర్యము.)

**ఇతి సంబోధితః శిష్యో**
**గురుణా శాస్త్రవేదినా ।**
**ధారయేచ్ఛాంకరం లింగమ్**
**శరీరే ప్రాణయోగతః ॥ 6-28**

వీరశైవశాస్త్రమును చక్కగా తెలిసిన గురువు నుండి ఇటువంటి ఉపదేశమును విన్న శిష్యుడు (గురువనుగ్రహించిన) ఇష్టలింగమును ప్రాణమున్నంతకాలము తన శరీరముపై ధరించవలెను.

**లింగస్య ధారణం పుణ్యమ్**
**సర్వపాపప్రణాశనమ్ ।**
**ఆదృతం మునిభిః సర్వైః**
**ఆగమార్థవిశారదైః ॥ 6-29**

లింగధారణప్రక్రియ పుణ్యప్రాప్తిని, సర్వపాపవినాశనమును కలుగజేయును. శైవాగమ సారమును చక్కగా ఎరిగిన మునులందరూ దీనిని అంగీకరించి యున్నారు.

**లింగధారణమాఖ్యాతమ్**
**ద్విధా సర్వార్థసాధకైః ।**
**బాహ్యమాభ్యంతరం చేతి**
**మునిభిర్మోక్షకాంక్షిభిః ॥ 6-30**

సమస్త పురుషార్థసాధకులు మోక్షకాముకులు అయిన మునులు లింగధారణప్రక్రియను బాహ్యము (బహిరంగము) ఆభ్యంతరము (అంతరంగము) అని రెండు విధముల పేర్కొనినారు.

**చిద్రూపం పరమం లింగమ్**
**శాంకరం సర్వకారణమ్ ।**



**యత్తస్య ధారణం చిత్తే**
**తదాంతరముదాహృతమ్॥ 6-31**

సర్వమునకు కారణము, శివసంబంధము, చిద్రూప (జ్ఞానస్వరూపము) మయిన పరమలింగమును చిత్తము నందు ధారణచేయుటను 'ఆంతరలింగధారణ' మనబడుతున్నది.

**చిద్రూపం హి పరం తత్త్వమ్**
**శివాఖ్యం విశ్వకారణమ్ ।**
**నిరస్తవిశ్వకాలుష్యమ్**
**నిష్కలం నిర్వికల్పకమ్ ॥ 6-32**

విశ్వసృష్టికి కారణమయిన, 'శివు'డనుబడుముతో పిలువబడుతున్న చిద్రూప(జ్ఞానరూప)మయిన ఈ పరతత్త్వము, విశ్వకాలుష్యమును నిరసించి నిర్వికల్పమయిన నిష్కలతత్త్వమైయున్నది.

**సత్తానందపరిస్ఫూర్తి -**
**సముల్లాసకలామయమ్ ।**
**అప్రమేయమనిర్దేశ్యమ్**
**ముముక్షుభిరుపాసితమ్ ॥ 6-33**

ఆ పరతత్త్వము సత్-చిత్-ఆనంద-పరిస్ఫూర్తుల సమాహారాత్మక మయిన కలాశక్తితో కూడియున్నది. అది ప్రమాణములకందనిది, అనిర్దేశ్యము. అయినను మోక్షార్థులయిన మహర్షులచేత ఉపాసించబడు చున్నది.

**పరం బ్రహ్మ మహాలింగమ్**
**ప్రపంచాతీతమవ్యయమ్ ।**
**తదేవ సర్వభూతానామ్**
**అంతస్త్రిస్థానగోచరమ్ ॥ 6-34**

ప్రపంచమునకతీతము, అవ్యయము (నాశరహితము) అయిన పరబ్రహ్మము అని పిలువబడు ఆ మహాలింగము సమస్తజీవుల అంతరంగము లందు మూడు స్థానములలో అభివ్యక్తమగుచున్నది.

**మూలాధారే చ హృదయే**
**భ్రూమధ్యే సర్వదేహినామ్ ।**
**జ్యోతిర్లింగం సదా భాతి**
**యద్బ్రహ్మేత్యాహురాగమాః ॥ 6-35**

శైవాగమములయందు 'బ్రహ్మ'మని పిలువబడిన ఆ జ్యోతిర్లింగము సమస్తజీవులలో మూలాధార (ఆధారచక్ర) స్థానమునందు, హృదయ (అనాహతచక్ర) స్థానమునందు మరియు భ్రూమధ్య (ఆజ్ఞాచక్ర) స్థానము నందు నిరంతరము ప్రకాశించుచుండును.

**అపరిచ్ఛిన్నమవ్యక్తమ్**
**లింగం బ్రహ్మ సనాతనమ్ ।**
**ఉపాసనార్థమంతస్థమ్**
**పరిచ్ఛిన్నం స్వమాయయా ॥ 6-36**



అపరిచ్ఛిన్నము (అఖండము), అవ్యక్తము (అగోచరము), సనాతనము (ఆరంభములేని), పరబ్రహ్మము, (సర్వవ్యాపకము) అయి అంతరంగము నందుండు ఆ లింగము తన మాయాశక్తి ప్రభావముతో ఉపాసనకోసము పరిచ్ఛిన్నమయినది (ఖండితమయినది).

**లయం గచ్ఛతి యత్రైవ**
**జగదేతచ్చరాచరమ్ ।**
**పునః పునః సముత్పత్తిమ్**
**తల్లింగం బ్రహ్మ శాశ్వతమ్ ॥ 6-37**

ఈ చరాచరాత్మకమైన యీ జగత్తు ఎక్కడ లయమును పొందుచున్నదో మరల మరల ఎక్కడ నుండి ఉత్పత్తియగుచున్నదో అటువంటి శాశ్వతమయిన బ్రహ్మమే లింగమనిపించుకొనుచున్నది.

**తస్మాల్లింగమితి ఖ్యాతమ్**
**సత్తాఽఽనందచిదాత్మకమ్ ।**
**బృహత్వాత్ బృంహణత్వాచ్చ**
**బ్రహ్మశబ్దాభిధేయకమ్ ॥ 6-38**

అందువలననే సత్-చిత్-ఆనందస్వరూపమయిన ఆ పరతత్త్వము లింగమని ప్రసిద్ధమైనది. ఇది విశ్వముకన్ననూ బృహదాకారమును కలిగి యుండుట వలనను, విశ్వమునకు మహాపోషకమయినందు వలనను బ్రహ్మ

శబ్దమునకు అభిధేయమై (అర్థమై) ఉన్నది. (బ్రహ్మశబ్దముతో పిలువబడుచున్నది.)

**ఆధారే హృదయే వాఽపి**
**భ్రూమధ్యే వా నిరంతరమ్ ।**
**జ్యోతిర్లింగానుసంధానమ్**
**ఆంతరం లింగధారణమ్ ॥ 6-39**

మూలాధార(స్థాన)మునందు, హృదయ(స్థాన)మునందు భ్రూమధ్య(స్థాన)ము నందు నిరంతరము చేయు జ్యోతిర్లింగానుసంధానము ఆంతరికమయిన లింగధారణము.

**ఆధారే కనకప్రఖ్యమ్**
**హృదయే విద్రుమప్రభమ్ ।**
**భ్రూమధ్యే స్ఫటికచ్ఛాయమ్**
**లింగం యోగీ విభావయేత్ ॥ 6-40**

యోగి అయినవాడు అంతర్లింగానుసంధానముచేయునపుడు ఆధారచక్రస్థానమున జ్యోతిర్లింగమును బంగారు రంగులోను, హృదయము నందలి అనాహత చక్రస్థానమున పగడముల రంగులోను, భ్రూమధ్యము నందలి ఆజ్ఞాచక్రస్థానమున స్ఫటికరంగులోనూ భావించవలెను.



**నిరుపాధికమాఖ్యాతమ్**
**లింగస్యాంతరధారణమ్ ।**
**విశిష్టం కోటిగుణితమ్**
**బాహ్యలింగస్య ధారణాత్ ॥ 6-41**

అంతరంగమునందు చేయబడు ఈ లింగధారణము నిరుపాధికలింగధారణమని కూడా పిలువబడుచున్నది. ఇది బాహ్య లింగధారణముకన్నను కోటిరెట్లు శ్రేష్ఠమైనది.

**యే ధారయంతి హృదయే**
**లింగం చిద్రూపమైశ్వరమ్ ।**
**న తేషాం పునరావృత్తిః**
**ఘోరసంసారమండలే ॥ 6-42**

ఎవరు తన హృదయమందు చిద్రూపము, ఈశ్వర సంబంధము అయిన లింగమును ధరించుచున్నారో వారికి ఈ ఘోరసంసారచక్రమున (పునరావృత్తి) పునర్జన్మ ముండదు.

**అంతర్లింగానుసంధానమ్**
**ఆత్మవిద్యాపరిశ్రమః ।**
**గురూపాసనశక్తిశ్చ**
**కారణం మోక్షసంపదామ్ ॥ 6-43**

అంతర్లింగానుసంధానము (అంతర్లింగోపాసనము), (శ్రవణ, మనన, నిదిధ్యాసనములనతో) ఆత్మవిద్య నభ్యసించు పరిశ్రమము, గురువుల సేవించుశక్తి అను మూడు (సాధనములు) మోక్షసంపదప్రాప్తికి కారణములగుచున్నవి.

**వైరాగ్యజ్ఞానయుక్తానామ్**
**యోగినాం స్థిరచేతసామ్ ।**
**అంతర్లింగానుసంధానే**
**రుచిర్బాహ్యే న జాయతే ॥ 6-44**

వైరాగ్య, జ్ఞానములతో కూడిన స్థిరచిత్తము కలిగిన యోగసాధకులకు అంతర్లింగానుసంధానమునందే అభిరుచి (అధికముగా) వుండును. బాహ్యలింగానుసంధానమునందు అభిరుచి వుండదు.

**బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ**
**వాసవాద్యాశ్చ లోకపాః ।**
**మునయః సిద్ధగంధర్వాః**
**దానవా మానవాస్తథా ॥ 6-45**

**సర్వే చ జ్ఞానయోగేన**
**సర్వకారణకారణమ్ ।**
**పశ్యంతి హృదయే లింగమ్**
**పరమానందలక్షణమ్ ॥ 6-46**



బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రాది దిక్పాలకులు, మునులు, సిద్ధులు, గంధర్వులు, దానవులు, మానవులు అందరూ జ్ఞానయోగముచేత సమస్త కారణములకు కారణము పరమానందస్వరూపము అయిన లింగమును హృదయస్థానమున దర్శించుచున్నారు.

**తస్మాత్ సర్వప్రయత్నేన**
**శాంకరం లింగముత్తమమ్ ।**
**అంతర్విభావయేద్విద్వా-**
**నశేషక్లేశముక్తయే ॥ 6-47**

అందువలన జ్ఞాని అయినవాడు సర్వదుఃఖపరిహారమునకు ప్రయత్నపూర్వకముగా పరమశ్రేష్ఠమయిన జ్యోతిర్లింగమును అంతరంగమునందు భావించి (ధ్యానించ)వలెను.

**అంతర్ధారయితుం లింగమ్**
**అశక్తః శక్త ఏవ వా ।**
**బాహ్యం చ ధారయేల్లింగమ్**
**తద్రూపమితి నిశ్చయాత్ ॥ 6-48**

జ్యోతిర్లింగమును అంతరంగమున ధరించుటకు సమర్థుడయినా అసమర్థుడయినా, బాహ్యలింగమును మాత్రము జ్యోతిర్లింగము యొక్క స్వరూపమను దృఢభావనతో అవశ్యము ధరించవలెను.

**లింగం తు త్రివిధం ప్రోక్తమ్**
**స్థూలం సూక్ష్మం పరాత్పరమ్ ।**
**ఇష్టలింగమిదం స్థూలమ్**
**యద్బాహ్యే ధార్యతే తనౌ ॥ 6-49**

ఈ లింగము స్థూలము, సూక్ష్మము, పరాత్పరము అని మూడు విధములు. శరీరముపై ధరించబడు స్థూలలింగము ఇష్టలింగమన బడుచున్నది.

**ప్రాణలింగమిదం సూక్ష్మమ్**
**యదంతర్భావనామయమ్ ।**
**పరాత్పరం తు యత్ప్రోక్తమ్**
**తృప్తిలింగం తదుచ్యతే ॥ 6-50**

సూక్ష్మమయినలింగము ప్రాణలింగమనబడు చున్నది. అంతరంగములో భావనామయముగా వుండు పరాత్పరలింగము. అదియే తృప్తిలింగము, భావలింగము అని కూడా అనబడుచున్నది.

**భావనాతీతమవ్యక్తమ్**
**పరబ్రహ్మ శివాభిధమ్ ।**
**ఇష్టలింగమిదం సాక్షాత్**
**అనిష్టపరిహారతః ।**



**ధారయేదవధానేన**
**శరీరే సర్వదా బుధః ॥ 6-51**

భావనకు అతీతము, రూపాదులచేత తెలియుటకు వీలుకానిది (అవ్యక్తము), 'శివ' అనే శబ్దముతో పిలువబడుతున్న పరబ్రహ్మమే ఈ ఇష్టలింగము. ఇది సాక్షాత్తు ప్రాపంచికమయిన దుఃఖములను పరిహరించుచున్నందువలన బుద్ధిమంతు(జ్ఞానులు)లయినవారు నిరంతరము జాగురూకతతో దీనిని తమ శరీరములపై ధరించుచున్నారు.

**మూర్ధ్ని వా కంఠదేశే వా**
**కక్షే వక్షఃస్థలేఽపి వా ।**
**కుక్షౌ హస్తస్థలే వాఽపి**
**ధారయేల్లింగమైశ్వరమ్ ॥ 6-52**

శివసంబంధమైన ఈ ఇష్టలింగమును శిరసుపైగాని, కంఠము నందుగాని, భుజము నందుగాని, వక్షఃస్థలమునందుగాని, కడుపుపై భాగము నందుగాని లేదా చేతియందుగాని ధరించవలెను.

**నాభేరధస్తాల్లింగస్య**
**ధారణం పాపకారణమ్ ।**
**జటాగ్రే త్రికభాగే చ**
**మలస్థానే న ధారయేత్ ॥ 6-53**

నాభికి క్రింద ప్రదేశమున లింగమును ధరించుట పాపమునకు కారణమగును. జటకు పైభాగమున గాని, వెన్నుపైభాగమునగాని, మలవిసర్జనస్థానములందుగాని దీనిని ధరించరాదు.

**లింగధారీ సదా శుద్ధో**
**నిజలింగం మనోరమమ్ ।**
**అర్చయేద్గంధపుష్పాద్యైః**
**కరపీఠే సమాహితః ॥ 6-54**

(ఇష్ట)లింగమును ధరించినవాడు ఎల్లకాలము పరిశుద్ధుడుగా పరిగణించబడతాడు. అతడు మనోహరమయిన తన ఇష్టలింగమును (ఎడమ) అరచేతియందుంచుకొని గంధపుష్పములతో ఏకాగ్రమైన మనసుతో పూజించవలెను.

**బాహ్యపీఠార్చనాదేతత్**
**కరపీఠార్చనం వరమ్ ।**
**సర్వేషాం వీరశైవానామ్**
**ముముక్షూణాం నిరంతరమ్ ॥ 6-55**

మోక్షమునభిలషించు సమస్త వీరశైవులు బాహ్య (పూజా గృహములలో ఏర్పాటు చేసుకున్న) పీఠములపై ఇష్టలింగమునుంచి పూజించుటకన్నను (ఎడమ అరచేతి) కరపీఠముపై నుంచుకొని అర్చించుట శ్రేష్ఠప్రదము.



**బ్రహ్మవిష్ణ్వాదయో దేవా**
**మునయో గౌతమాదయః ।**
**ధారయంతి సదా లింగమ్**
**ఉత్తమాంగే విశేషతః ॥ 6-56**

బ్రహ్మ, విష్ణువు మొదలయిన దేవతలు, గౌతమాది మునులు, నిరంతరము ఇష్టలింగమును తమ శిరస్సుల (ఉత్తమాంగముల) పై విశేషముగా ధరించుచున్నారు.

**లక్ష్మ్యాదిశక్తయః సర్వాః**
**శివభక్తివిభావితాః ।**
**ధారయంత్యలికాగ్రేషు**
**శివలింగమహర్నిశమ్ ॥ 6-57**

శివభక్తిపరాయణురాలైన లక్ష్మీ మొదలైన శక్తి దేవతలును తమ లలాటములపై రాత్రింబవళ్ళు శివలింగములను ధరించుచున్నారు.

**వేదశాస్త్రపురాణేషు**
**కామికాద్యాగమేషు చ ।**
**లింగధారణమాఖ్యాతమ్**
**వీరశైవస్య నిశ్చయాత్ ॥ 6-58**

వేద-శాస్త్ర-పురాణములందు, కామికాది ఇరువది ఎనిమిది శివాగమములందు వీరశైవునకు లింగధారణము అనివార్యముగా విధించబడి యున్నది.

**ఋగిత్యాహ పవిత్రం తే**
**వితతం బ్రహ్మణస్పతే ।**
**తస్మాత్పవిత్రం తల్లింగమ్**
**ధార్యం శైవమనామయమ్ ॥ 6-59**

బ్రహ్మపదవాచ్యమైన ఇష్టలింగమునందు అధిష్ఠించబడిన పరశివ తత్త్వరూపమైన 'ఓ బ్రహ్మణస్పతీ! నీ స్వరూపము సర్వవ్యాపకమైనది! నీవు పవిత్రమైనవాడవు' అని ఋగ్వేదము ప్రశంసించుచున్నది. అందువలన దోష రహితము (అనామయము), శివరూపము (మంగళమయము) అయిన ఆ లింగమును (అవశ్యము) ధరించవలెను.

**బ్రహ్మేతి లింగమాఖ్యాతమ్**
**బ్రహ్మణః పతిరీశ్వరః ।**
**పవిత్రం తద్ధి విఖ్యాతమ్**
**తత్సంపర్కాత్తనుః శుచిః ॥ 6-60**

(సృష్టికర్త అయిన) బ్రహ్మకు (అధి)పతి ఈశ్వరుడు. అతడే బ్రహ్మ అని, 'లింగ'మని చెప్పబడినాడు. అటువంటి లింగముయొక్క సంపర్కము చేత శరీరము శుచిర్భూత (పంచక్లేశరహిత) మగుచున్నది.

**అతప్తతనురజ్ఞో వై**
**ఆమః సంస్కారవర్జితః ।**
**దీక్షయా రహితః సాక్షాత్**
**నాప్నుయాల్లింగముత్తమమ్ ॥ 6-61**



అతప్తతనువు అంటే తపస్సుచేయనివాడు (పిండస్థలము నందుండనివాడు), అజ్ఞుడు (జ్ఞానరహితుడు) పిండజ్ఞానస్థలము నెరుగనివాడు, వైరాగ్యములేనివాడు లేదా సంసారహేయస్థలమునకు యోగ్యుడుకానివాడు (ఆమః), దీక్షాసంస్కారము లేకుండా తనకుతానుగా ఉత్తమమయిన (ఇష్ట) లింగమును ధరించరాదు.

**అఘోరాఽపాపకాశీతి**
**యా తే రుద్ర శివా తనూః ।**
**యజుషా గీయతే యస్మాత్**
**తస్మాచ్ఛైవోఽఘవర్జితః ॥ 6-62**

'ఓ రుద్రుడా! మంగళకరము, శాంతి స్వరూపమై (అఘోర), లింగాకారమునందున్న నీ శరీరము పాపముక్తులయిన భక్తుల దేహములపై ప్రకాశించుచున్నది'(అపాపకాశీ) అని యజుర్వేదమున చెప్పబడినది. అందువల్ల (ఇష్టలింగధారి అయిన) శైవుడు పాపరహితుడని (అఘవర్జితుడు) తెలియవలెను.

**యో లింగధారీ నియతాంతరాత్మా**
**నిత్యం శివారాధనబద్ధచిత్తః ।**
**స ధారయేత్ సర్వమలాపహత్యై**
**భస్మామలం చారు యథాప్రయోగమ్ ॥ 6-63**

(- వంశస్థమ్)

ఇష్టలింగధారి అయినవాడు అంతరాత్మను(మనస్సును) వశమునందుంచుకొని, అనునిత్యము శివారాధనయందు ఆసక్తిని కలిగినవాడై, సర్వమల(పాప)నివృత్తికై సుందరమయిన నిర్మలమయిన విభూతిని శాస్త్రోక్తముగా(నుదుట) ధరించవలెను.

*ఇతి లింగధారణస్థలం పరిసమాప్తమ్*

లింగధారణస్థలము ముగినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ గురుకారుణ్యలింగధారణప్రసంగో నామ షష్ఠః పరిచ్ఛేదః॥***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'గురుకారుణ్యలింగధారణప్రసంగ'మను ఆరవ పరిచ్ఛేదము ముగిసినది.



# సప్తమః పరిచ్ఛేదః

## ఏడవ పరిచ్ఛేదము

### *భస్మరుద్రాక్షధారణప్రసంగః*

### భస్మరుద్రాక్షధారణప్రసంగము

**(68 శ్లోకములు)**

***6. అథ భస్మధారణస్థలమ్***

**భస్మధారణస్థలము**

**భస్మధారణసంయుక్తః**
**పవిత్రో నియతాశయః ।**
**శివాభిధానం యత్రోక్తమ్**
**భాసనాద్భసితం తథా ॥ 7-1**

భస్మధారణముతో నున్నవాడు పవిత్రుడు, మనస్సంయమనము కలిగినవాడు అగుచున్నాడు. ఏది శివుని నామముగా (పేరుగా) పేర్కొనబడుచున్నదో అది శివతత్త్వమును ప్రకాశింపచేయుటవలన 'భసిత'మని పిలువబడుచున్నది.

**మహాభస్మేతి సంచింత్య**
**మహాదేవం ప్రభామయమ్ ।**
**వర్తంతే యే మహాభాగాః**
**ముఖ్యాస్తే భస్మధారిణః ॥ 7-2**

ప్రకాశరూపుడయిన మహాదేవుని 'మహాభస్మ'మని భావించి ఏ మహానుభావులు స్థిరచిత్తులై విరాజిల్లుచున్నారో, వారు, ప్రముఖులైన భస్మధారులుగా పరిగణించబడుచున్నారు. (వీరే నిరుపాధిక భస్మధారులు).

**శివాగ్న్యాదిసముత్పన్నమ్**
**మంత్రన్యాసాదియోగతః ।**
**తదుపాధికమిత్యాహుః**
**భస్మతంత్రవిశారదాః ॥ 7-3**

పంచబ్రహ్మమంత్రముల యొక్క న్యాసాదులను వినియోగించి శివమంత్రములచేత సంస్కరించబడిన అగ్నినుండి ఉత్పత్తిచేసిన భస్మమును శైవాగమవిశారదులు సోపాధికభస్మమని చెప్పుచున్నారు.

**విభూతిర్భసితం భస్మ**
**క్షారం రక్షేతి భస్మనః ।**
**ఏతాని పంచనామాని**
**హేతుభిః పంచభిర్భృశమ్ ॥ 7-4**

నిర్దిష్టములయిన అయిదుకారణములచేత ఈ భస్మము విభూతి, భసిత, భస్మ, క్షార, రక్షా అని అయిదు (పర్యాయ) పదములతో పిలువబడుచున్నది.

**విభూతిర్భూతిహేతుత్వాత్**
**భసితం తత్త్వభాసనాత్ ।**



**పాపానాం భర్త్సనాద్భస్మ**
**క్షరణాత్ క్షారమాపదామ్ ।**
**రక్షణాత్ సర్వభూతేభ్యో**
**రక్షేతి పరిగీయతే ॥ 7-5**

అణిమాది ఐశ్వర్యములకు(భూతికి) కారణమయినందున 'విభూతి'యని, శివతత్త్వమును ప్రకాశింపచేయుచున్నందున 'భసిత'మని, పాపములను భయపెట్టుట (భర్త్సన)చేత 'భస్మ'మని, ఆపదలను తొలగించుట వలన 'క్షార'మని, మరియు సృష్టియందలి సమస్త ప్రాణులనుండి రక్షణను కలిగించుట చేత, 'రక్షా' అని పిలువబడుచున్నది.

**నందా భద్రా చ సురభిః**
**సుశీలా సుమనాస్తథా ।**
**పంచ గావో విభోర్జాతాః**
**సద్యోజాతాదివక్త్రతః ॥ 7-6**

సర్వవ్యాపకుడైన (విభువు) శివునియొక్క సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనే పంచముఖములనుండి వరుసగా నందా, భద్రా, సురభి, సుశీలా, సుమనా అనే అయిదు గోవులు ఉద్భవించాయి.

**కపిలా కృష్ణా చ ధవలా**
**ధూమ్రా రక్తా తథైవ చ ।**

**నందాదీనాం గవాం వర్ణాః**
**క్రమేణ పరికీర్తితాః ॥ 7-7**

నందా మొదలైన ఆ అయిదు గోవులు వరుసగా పసుపు మించిన ఎరుపు (కపిలా), నలుపు (కృష్ణ), తెలుపు (ధవల), బూడిద (ధూమ్ర), ఎఱుపు (రక్త), రంగులను కలిగి వుండెడివి.

**సద్యోజాతాద్విభూతిశ్చ**
**వామాద్భసితమేవ చ ।**
**అఘోరాద్భస్మ సంజాతమ్**
**తత్పురుషాత్ క్షారనామ చ ॥ 7-8**

**రక్షా చేశానవక్త్రాచ్చ**
**నందాదిద్వారతోఽభవత్ ॥ 7-9**

సద్యోజాతముఖమునుండి ఉద్భవించిన నందాగోవునుండి విభూతి, వామదేవముఖము నుండి వెలువడిన భద్రాగోవునుండి భసితము, అఘోరముఖమునుండి వెలువడిన సురభిగోవునుండి భస్మము, తత్పురుష ముఖము నుండి వెలువడిన సుశీలాగోవునుండి క్షారము, ఈశానముఖము నుండి వెలువడిన సుమనాగోవునుండి రక్షాయను విభూతి వెలువడినవి.

**ధారయేన్నిత్యకార్యేషు**
**విభూతిం చ ప్రయత్నతః ।**



**నైమిత్తికేషు భసితం**
**క్షారం కామ్యేషు సర్వదా ॥ 7-10**

**ప్రాయశ్చిత్తేషు సర్వేషు**
**భస్మ నామ యథావిధి ।**
**రక్షా చ మోక్షకార్యేషు**
**ప్రయోక్తవ్యా సదా బుధైః ॥ 7-11**

విజ్ఞులయినవారు నిత్యకర్మల ననుష్ఠించునపుడు 'విభూతి' భస్మమును, నైమిత్తిక కర్మలననుష్ఠించునపుడు 'భసిత'మనుభస్మమును, కామ్యకర్మలనాచరించునపుడు ప్రయత్నపూర్వకముగా 'క్షార'మనుభస్మమును ధరించవలెను. అన్నివిధములయిన ప్రాయశ్చిత్తకర్మల నాచరించునపుడు 'భస్మ'మను విభూతిని మరియు మోక్షసంబంధమయిన కార్యములందు 'రక్షా'యను భస్మమును విధియుక్తముగా ధరించవలెను.

**నందాదీనాం తు యే వర్ణాః**
**కపిలాద్యాః ప్రకీర్తితాః ।**
**త ఏవ వర్ణా విఖ్యాతా**
**భూత్యాదీనాం యథాక్రమమ్ ॥ 7-12**

నందాదిగోవులకు కపిలాది ఏ రంగులు (వర్ణాలు) సూచించబడినాయో అవే రంగులు క్రమముగా విభూత్యాది భస్మములకు కూడా చెప్పబడినాయి.

భస్మోత్పాదనముద్దిష్టమ్
చతుర్ధా తంత్రవేదిభిః ।
కల్పం చైవానుకల్పం తు
ఉపకల్పమకల్పకమ్ ॥ 7-13

ఏషామాదిమముత్కృష్టమ్
అన్యత్ సర్వమభావతః ।
యథాశాస్త్రోక్తవిధినా
గృహీత్వా గోమయం నవమ్ ॥ 7-14

ఆగమవిశారదులు భస్మోత్పత్తి పద్ధతులను కల్ప, అనుకల్ప, ఉపకల్ప, అకల్ప అనే నాలుగు విధాలుగా పేర్కొనినారు. వీటిలో మొదటి దయిన కల్పభస్మోత్పత్తి ఉత్కృష్టమైనది. అది లభించనపుడు మిగిలిన ఇతర పద్ధతుల ద్వారా తయారుచేసిన భస్మములను ఉపయోగించుకొనవచ్చును. శాస్త్రమునందు చెప్పిన ప్రకారము అప్పుడే వేసిన గోమయమును (పేడను) సేకరించవలెను.

సద్యేన వామదేవేన
కుర్యాత్పిండమనుత్తమమ్ ।
శోషయేత్పురుషేణైవ
దహేద్ఘోరాచ్ఛివాగ్నినా ।



తదీశానమంత్రేణ
బిల్వపాత్రే నిధాపయేత్ ॥ 7-15

కల్పం తద్భస్మ విజ్ఞేయమ్
అనుకల్పమథోచ్యతే ॥ 7-16

సద్యోజాతమంత్రమును పఠించుచు, అప్పుడే వేసిన గోమయమును (పేడను) తీసుకుని, వామదేవమంత్రముతో దానిని చిన్న చిన్న ముద్దలు (పిండం) గా చేయవలెను. తత్పురుషమంత్రమును ఉచ్చరించుచు వాటిని ఎండబెట్టవలెను. అఘోరమంత్రమును పఠించుచూ ఆ ముద్దలను అగ్నిలో కాల్చవలెను. ఆ తరువాత ఈశానమంత్రమును చదువుచూ కాలిన గోమయ ముద్దలను బిల్వపు పాత్రలో వుంచవలెను. దీనినే కల్పభస్మనిర్మాణవిధానమని తెలుసుకొనవలెను. దీని తరువాత అనుకల్పభస్మోత్పత్తి విధానము చెప్పబడును.

వనేషు గోమయం యచ్చ
శుష్కం చూర్ణీకృతం తథా ।
దగ్ధం చైవానుకల్పాఖ్యం
ఆపణాదిగతం తు యత్ ॥ 7-17

వస్త్రేణోత్తారితం భస్మ
గోమూత్రాబద్ధపిండితమ్ ।
దగ్ధం ప్రాగుక్తవిధినా
భవేద్భస్మోపకల్పకమ్ ॥ 7-18

అడవులలో ఎండిన గోమయమును(పేడను) సేకరించి, దానిని పిండిచేసి కాల్చిన భస్మమును అనుకల్పభస్మము అందురు. అంగళ్ళలో లభించు భస్మమును పొడిచేసి గుడ్డలో వడగట్టి దానిని గోమూత్రముతో ముద్దలుగా చేసి, ఇంతకుముందు కల్పభస్మనిర్మాణములో చెప్పినట్టు కాల్చి తయారుచేసిన భస్మము, ఉపకల్పభస్మమనబడును.

**అన్యైరాపాదితం భస్మ**
**అకల్పమితి నిశ్చితమ్ ।**
**ఏష్వేకతమమాదాయ**
**పాత్రేషు కలశాదిషు ॥ 7-19**

**త్రిసంధ్యమాచరేత్ స్నానమ్**
**యథాసంభవమేవ వా ।**
**స్నానకాలే కరౌ పాదౌ**
**ప్రక్షాల్య విమలాంభసా ॥ 7-20**

ఇతరులచే తయారుచేయబడిన భస్మమును అకల్పభస్మమని తెలియవలెను. ఈ భస్మములను వేరు వేరు పాత్రలలో వుంచి వాటిలో ఏదైనా ఒక దానిని తీసుకుని మూడు సంధ్యలలో (ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము) గాని లేదా తనకు వీలయినన్ని సారులు యథాశక్తి భస్మస్నానము నాచరించవలెను. భస్మస్నానమునకు ముందు శుద్ధమైన నీటితో కరచరణాదులను కడుగుకొనవలెను.



**వామహస్తతలే భస్మ**
**క్షిప్త్వాఽఽచ్ఛాద్యాన్యపాణినా ।**
**అష్టకృత్వాఽథ మూలేన**
**మౌనీ భస్మాభిమంత్ర్య చ ॥ 7-21**

**శిర ఈశానమంత్రేణ**
**పురుషేణ ముఖం తథా ।**
**హృత్ప్రదేశమఘోరేణ**
**వామదేవేన గుహ్యకమ్ ॥ 7-22**

ఎడమచేతి అరచేతిలో భస్మమును వుంచుకుని, దానిని కుడి అరచేతితో మూసి వుంచి, మౌనముగా పంచాక్షరీమూలమంత్రమును ఎనిమిదిసార్లు జపించి లేదా అభిమంత్రణము చేసి, ఈశానమంత్రముతో శిరస్సును, తత్పురుషమంత్రముతో ముఖమును, అఘోరమంత్రముతో హృదయమును వామదేవమంత్రముతో గుహ్యస్థానమును –

**పాదౌ సద్యేన సర్వాంగమ్**
**ప్రణవేనైవ సేచయేత్ ।**
**భస్మనా విహితం స్నానమ్**
**ఇదమాగ్నేయముత్తమమ్ ॥ 7-23**

సద్యోజాతమంత్రముతో పాదములకు, ప్రణవముతో సర్వాంగములకు భస్మమును ధరించి, భస్మస్నానమును చేయవలెను. ఇలా భస్మముతో చేయు స్నానము ఉత్తమమైన ఆగ్నేయస్నానముగా పరిగణించబడుచున్నది.

స్నానేషు వారుణాద్యేషు
ముఖ్యమేతన్మలాపహమ్ ।
భస్మస్నానవతాం పుంసామ్
యథాయోగం దినే దినే । 7-24

నీరు మొదలైనవాటితో చేయు (ఏడు విధములైన) స్నానములలో సర్వమలములను సమూలముగా తొలగించు భస్మస్నానము ప్రధానమైనది. శాస్త్రోక్తవిధిననుసరించి ప్రతినిత్యము భస్మస్నానమును చేయువారికి –

వారుణాద్యైరలం స్నానైః
బాహ్యదోషాపహారిభిః ।
ఆగ్నేయం భస్మనా స్నానమ్
యతిభిస్తు విధీయతే ॥ 7-25

(శరీరమున కేర్పడు) బాహ్య దోషములను తొలగించుటకు వారుణా(జలా)ది స్నానములు చాలును. (ఇది అంత ప్రయోజనకారి కాదు). అయితే ఆగ్నేయస్నానమని పిలువబడు భస్మస్నానమును సర్వదోష పరిహారకమని యతులు నిర్ణయించినారు.

ఆర్ద్రస్నానాత్ పరం భస్మ
ఆర్ద్రే జంతువధో ధ్రువమ్ ।
ఆర్ద్రం తు ప్రకృతిం విద్యాత్
ప్రకృతిం బంధనం విదుః ॥ 7-26



ఆర్ద్ర (జల)స్నానముకన్నా భస్మస్నానము శ్రేష్ఠమైనది. ఆర్ద్ర స్నానములో ప్రాణివధ వున్నట్టు తెలిసినదే. ఆర్ద్రత (జలము)ను ప్రకృతిగా తెలియవలెను. అందుకే విజ్ఞులు ప్రకృతిని బంధనముగా భావించినారు.

ప్రకృతేస్తు ప్రహాణార్థమ్
భస్మనా స్నానమిష్యతే ।
బ్రహ్మాద్యా విబుధాః సర్వే
మునయో నారదాదయః ॥ 7-27

యోగినః సనకాద్యాశ్చ
బాణాద్యా దానవా అపి ।
భస్మస్నానయుతాః సర్వే
శివభక్తిపరాయణాః ।
నిర్ముక్తదోషకలిలాః
నిత్యశుద్ధా భవంతి హి ॥ 7-28

ప్రకృతి నుండి విడువడుటకు భస్మస్నానము స్వీకరించ బడినది. శివభక్తిపరాయణులయిన బ్రహ్మాది సమస్తదేవతలు, నారదాది మునులు, సనకాది యోగులు, బాణాసురాది రాక్షసులు, భస్మస్నానము నాచరించి దోషసమూహముల నుండి విముక్తులై నిత్యశుద్ధస్వరూపులుగా వెలుగొందుచున్నారు.

**నమశ్శివాయేతి భస్మ**
**కృత్వా సప్తాభిమంత్రితమ్ ।**
**ఉద్ధూలయేత్ తేన దేహమ్**
**త్రిపుండ్రం చాపి ధారయేత్ ॥ 7-29**

'నమః శివాయ' అను మంత్రముతో భస్మమును ఏడుసార్లు అభిమంత్రించి, దానితో శరీరమును ఉద్ధూలనము (భస్మకణములను శరీరముపై పులుముకొనుట) చేసుకొనవలెను. అటులనే మూడు వేళ్ళతో భస్మమును పూసుకొని త్రిపుండ్రమును ధరించవలెను.

**సర్వాంగోద్ధూలనం చాపి**
**న సమానం త్రిపుండ్రకైః ।**
**తస్మాత్ త్రిపుండ్రమేవైకమ్**
**లిఖేదుద్ధూలనం వినా ॥ 7-30**

(శరీరము నందలి) సర్వాంగములను ఉద్ధూలనము చేసుకొన్ననూ, అది త్రిపుండ్రమునకు సమానము కాజాలదు. అందువలన ఉద్ధూలనము లేకుండా త్రిపుండ్రమును మాత్రము ధరించవలెను.

**త్రిపుండ్రం ధారయేన్నిత్యమ్**
**భస్మనా సలిలేన చ ।**
**స్థానేషు పంచదశసు**
**శరీరే సాధకోత్తమః ॥ 7-31**



ఉత్తమమయిన సాధకుడు నీటితో తడిపిన భస్మమును శరీరముపై పదునైదు స్థానములలో త్రిపుండ్రమును ధరించవలెను.

**ఉత్తమాంగే లలాటే చ**
**శ్రవణద్వితయే తథా ।**
**గలే భుజద్వయే చైవ**
**హృది నాభౌ చ పృష్ఠకే ॥ 7-32**

**బాహుయుగ్మే కకుద్దేశే**
**మణిబంధద్వయే తథా ।**
**త్రిపుండ్రం భస్మనా ధార్యమ్**
**మూలమంత్రేణ సాధకైః ॥ 7-33**

(సాధకుడు తన) తల, నుదురు, రెండు చెవులు, కంఠము, రెండు భుజములు, హృదయము, నాభి, వెన్ను, రెండుచేతులు (బాహువులు), రెండు ముంజేతులు, మెడ ఈ పదునైదు ప్రదేశములలో పంచాక్షరీ మూలమంత్రమును ఉచ్చరించుచూ భస్మముతో త్రిపుండ్రమును ధరించవలెను.

**వామహస్తతలే భస్మ**
**క్షిప్త్వాఽఽచ్ఛాద్యాన్యపాణినా ।**
**అగ్నిరిత్యాదిమంత్రేణ**
**స్పృశన్ వారాఽభిమంత్ర్య చ ॥ 7-34**

**త్రిపుంద్రముక్తస్థానేషు**
**దధ్యాత్ సజలభస్మనా ।**
**శివం శివంకరం శాంతమ్**
**స ప్రాప్నోతి న సంశయః ॥ 7-35**

తన ఎడమ అరచేతిలో భస్మమును వుంచుకొని, కుడి అరచేతితో దానిని మూసివుంచి, 'అగ్నిరితి భస్మ' మొదలైనమంత్రములతో భస్మమును స్పర్శించి, నీటితో ఏడుసార్లు అభిమంత్రించవలెను. నీటితో కలుపుకున్న భస్మమును పైన పేర్కొనిన స్థానములలో త్రిపుంద్రమును ధరించవలెను. ఇలా భస్మధారణచేసినవాడు శాంతచిత్తుడు, మంగళకరుడు అయిన శివుని చేరుకుంటాడు. ఈ విషయమున ఎటువంటి సందేహము లేదు.

**మధ్యాంగులిత్రయేణైవ**
**స్వదక్షిణకరస్య తు ।**
**షడంగులాయతం మానమ్**
**అపి వాऽలికమానకమ్ ॥ 7-36**

**నేత్రయుగ్మప్రమాణేన**
**ఫాలే దధ్యాత్ త్రిపుంద్రకమ్ ।**
**మధ్యమానామికాంగుష్ఠైః**
**అనులోమవిలోమతః ॥ 7-37**



**ధారయేద్యస్త్రిపుంద్రాంకమ్**
**స రుద్రో నాత్ర సంశయః ॥ 7-38**

తన కుడిచేతి నడుమనున్న మూడు వేళ్ళతో ఆరు అంగుళముల పొడువుగా లేదా ఫాలభాగప్రమాణమున రెండు కనుబొమ్మల చివరల వరకు త్రిపుంద్రమును ధరించవలెను లేదా కుడిచేతి మధ్యమ, అనామిక మరియు అంగుష్ఠ–ఈ మూడు వేళ్ళతో అనులోమ, విలోమ పద్ధతిలో త్రిపుంద్రమును నుదుటిపై ధరించువాడు రుద్రుడే అగుచున్నాడు. ఇందులో సందేహము లేదు.

**ఋజు శ్వేతమనువ్యాప్తమ్**
**స్నిగ్ధం శ్రోత్రప్రమాణకమ్ ।**
**ఏవం సల్లక్షణోపేతమ్**
**త్రిపుంద్రం సర్వసిద్ధిదమ్ ॥ 7-39**

సరళము, శుభ్రము, అఖండము, స్నిగ్ధము రెండుచెవులవరకు విస్తరించినట్టి సులక్షణములతో కూడుకున్న త్రిపుంద్రము సర్వసిద్ధులను కలుగజేయును.

**ప్రాతఃకాలే చ మధ్యాహ్నే**
**సాయాహ్నే చ త్రిపుంద్రకమ్ ।**
**కదాచిద్భస్మనా కుర్యాత్**
**స రుద్రో నాత్ర సంశయః ॥ 7-40**

ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము ఈ మూడుకాలములయందు లేదా ఏదైనా ఒకసమయమున త్రిపుండ్రమును ధరించినవాడు రుద్రస్వరూపుడే అగుచున్నాడు. ఇందు సంశయములేదు.

**ఏవంవిధం విభూత్యా చ**
**కురుతే యస్త్రిపుండ్రకమ్ ।**
**స రౌద్రధర్మసంయుక్తః**
**త్రయీమయ ఇతి శ్రుతిః ॥ 7-41**

**బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ**
**దేవాః శక్రపురోగమాః ।**
**త్రిపుండ్రం ధారయంత్యేవ**
**భస్మనా పరికల్పితమ్ ॥ 7-42**

పైన చెప్పిన ప్రకారము ఎవరు విభూతియను భస్మముతో త్రిపుండ్రమును ధరింతురో వారు శివాచార(రుద్రధర్మ)ముతో కూడుకున్న వేదస్వరూపు(త్రయీమయు)లగుచున్నారని శ్రుతులు చాటుచున్నవి. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు భస్మముతో దిద్దుకున్న త్రిపుండ్రమును ధరించుచున్నారు.

**వసిష్ఠాద్యా మహాభాగా**
**మునయః శ్రుతికోవిదాః ।**



**ధారయంతి సదాకాలమ్**
**త్రిపుండ్రం భస్మనా కృతమ్ ॥ 7-43**

అటులనే వేదశాస్త్రపారంగతులు, మహానుభావులు అయిన వసిష్ఠాదిమునులు ఎల్లకాలము నుదుట భస్మత్రిపుండ్రమును ధరించు చున్నారు.

**శైవాగమేషు వేదేషు**
**పురాణేష్వఖిలేషు చ ।**
**స్మృతీతిహాసకల్పేషు**
**విహితం భస్మపుండ్రకమ్ ।**
**ధారణీయం సమస్తానామ్**
**శైవానాం చ విశేషతః ॥ 7-44**

కామికాది వాతులాంత్యములయిన 28 శివాగమములలోను, అన్ని వేదములలోను, సమస్తపురాణములలోను, స్మృతి-ఇతిహాస- కల్పశాస్త్రాదులలోను, భస్మత్రిపుండ్రధారణము విధించబడియున్నది. అందువలన మానవులందరు విశేషముగా (వీర) శైవభక్తులు తప్పక ధరించవలెను.

**నాస్తికో భిన్నమర్యాదో**
**దురాచారపరాయణః ।**
**భస్మత్రిపుండ్రధారీ చేత్**
**ముచ్యతే సర్వకిల్బిషైః ॥ 7-45**

నాస్తికుడు, శాస్త్రనియమములను ఉల్లంఘించువాడు, దురాచారములందు ఆసక్తికలవాడు కూడా భస్మత్రిపుండ్రమును ధరించినచో సమస్త పాపములనుండి ముక్తుడగుచున్నాడు.

ఇతి భస్మధారణస్థలం పరిసమాప్తమ్

భస్మధారణస్థలము ముగిసినది.

## 7. అథ రుద్రాక్షధారణస్థలమ్

### రుద్రాక్షధారణస్థలము

**భస్మనా విహితస్నానః**
**త్రిపుండ్రాంకితమస్తకః ।**
**శివార్చనపరో నిత్యమ్**
**రుద్రాక్షమపి ధారయేత్ ॥ 7-46**

భస్మస్నానము చేసి, నుదుట త్రిపుండ్రధారణమును చేసుకున్న శివపూజానిరతుడైన సాధకుడు అనునిత్యము రుద్రాక్షలను కూడా ధరించవలెను.

**రుద్రాక్షధారణాదేవ**
**ముచ్యంతే సర్వపాతకైః ।**
**దుష్టచిత్తా దురాచారా**
**దుష్ప్రజ్ఞా అపి మానవాః ॥ 7-47**



దుష్టచిత్తులు, దురాచారులు మరియు హీనబుద్ధికలిగిన మానవులు కూడా రుద్రాక్షలను ధరించిన మాత్రముననే సర్వపాతకముల నుండి విముక్తులగుచున్నారు.

**పురా త్రిపురసంహారే**
**త్రినేత్రో జగతాం పతిః ।**
**ఉదపశ్యత్ పురాం యోగ-**
**మున్మీలితవిలోచనః ॥ 7-48**

త్రినేత్రధారి, జగత్పతి అయిన శివుడు పూర్వకాలమున త్రిపురాసురుని సంహరించుటకు ముఖమును పైకెత్తి, మూడు కన్నులను తెరిచి త్రిపురములపై తన దృష్టిని ప్రసరింపజేసినాడు.

**నిపేతుస్తస్య నేత్రేభ్యో**
**బహవో జలబిందవః ।**
**తేభ్యో జాతా హి రుద్రాక్షా**
**రుద్రాక్షా ఇతి కీర్తితాః ॥ 7-49**

ఇలా (ఉన్ముఖుడై) చూచుచున్న శివుని (రుద్రుని) మూడుకన్నుల (అక్షుల) నుండి అనేక జలబిందువులు భూమిపై రాలిపడినవి. ఆ జలబిందువులే రుద్రాక్షలుగా రూపొందినవి. అందువలననే అవి రుద్రాక్షలని ప్రసిద్ధిచెందినవి.

**రుద్రనేత్రసముత్పన్నా**
**రుద్రాక్షా లోకపావనాః ।**
**అష్టత్రింశత్ప్రభేదేన**
**భవంత్యుత్పత్తిభేదతః ॥ 7-50**

రుద్రుని నేత్రములనుండి ఉత్పన్నములయిన రుద్రాక్షలు లోకమునందలి జీవులను పవిత్రలనొనరించుచున్నవి. ఇవి, వీటి ఉత్పత్తి భేదములననుసరించి ముప్పది యెనిమిది రకములుగా నున్నవి.

**నేత్రాత్ సూర్యాత్మనః శంభోః**
**కపిలా ద్వాదశోదితాః ।**
**శ్వేతాః షోడశసంజాతాః**
**సోమరూపాద్విలోచనాత్ ॥ 7-51**

శంభుని సూర్యనేత్రమునుండి కపిల రంగులో పన్నెండు విధములయిన రుద్రాక్షలు, చంద్రనేత్రమునుండి తెలుపు రంగులో పదునారు విధములయిన రుద్రాక్షలు ఉత్పన్నములైనవి.

**కృష్ణా దశవిధా జాతా**
**వహ్నిరూపాద్విలోచనాత్ ।**
**ఏవముత్పత్తిభేదేన**
**రుద్రాక్షా బహుధా స్మృతాః ॥ 7-52**



శివుని (ఫాల)అగ్ని నేత్రము నుండి నలుపు రంగులో పది విధములయిన రుద్రాక్షలు వెలువడినవి. ఈవిధముగా వాటి ఉత్పతిస్థానములననుసరించి రుద్రాక్షలు అనేక రకములుగా చెప్పబడినవి.

**అచ్ఛిద్రం కనకప్రఖ్యమ్**
**అనన్యధృతముత్తమమ్ ।**
**రుద్రాక్షం ధారయేత్ ప్రాజ్ఞః**
**శివపూజాపరాయణః ॥ 7-53**

రంధ్రములేని (పురుగులు తొలచని), బంగారు రంగులోనుండు, మరియొకరు ధరించని రుద్రాక్షలు శ్రేష్ఠమైనవి. శివపూజాపరాయణుడయిన బుద్ధిమంతుడు, అటువంటి రుద్రాక్షలను ధరించవలెను.

**యథాస్థానం యథావక్త్రమ్**
**యథాయోగం యథావిధి ।**
**రుద్రాక్షధారణం వక్ష్యే**
**రుద్రసాయుజ్యసిద్ధయే ॥ 7-54**

రుద్రు(శివు)ని సాయుజ్యరూపమైన ముక్తిని పొందుటకు శరీరము నందలి ఏయే స్థానమునందు ఎన్నెన్నిముఖములు కలిగిన ఎన్నిరుద్రాక్షలు, ఏ క్రమములో ధరించవలయునో, ఆ విధివిధానమును శాస్త్రోక్తముగా వివరించెదను.

**శిఖాయామేకమేకాస్యమ్**
**రుద్రాక్షం ధారయేద్బుధః ।**
**ద్విత్రిద్వాదశవక్త్రాణి**
**శిరసి త్రీణి ధారయేత్ ॥ 7-55**

శిఖాస్థానమున ఒకే ముఖము కలిగిన ఒకే రుద్రాక్షను, రెండు, మూడు మరియు పండ్రెండు ముఖములు గల మూడు రుద్రాక్షలను మస్తకము (శిరస్సు)నందు బుధుడయిన భక్తుడు ధరించవలెను.

**షట్త్రింశద్ధారయేన్మూర్ధ్ని**
**నిత్యమేకాదశాననాన్ ।**
**దశసప్తపంచవక్త్రాన్**
**షట్ షట్ కర్ణద్వయే వహేత్ ॥ 7-56**

పదకొండు ముఖములుగల ముప్పది యారు రుద్రాక్ష(మా)లను తలపై ధరించవలెను. అటులనే పది, ఏడు మరియు ఐదు ముఖములు గల రెండు రెండు రుద్రాక్షలను (మొత్తము) ఆరు ఒక్కొక్క చెవిలో ధరించవలెను.

**షడష్టవదనాన్ కంఠే**
**ద్వాత్రింశద్ధారయేత్ సదా ।**
**పంచాశద్ధారయేత్ విద్వాన్**
**చతుర్వక్త్రాణి వక్షసి ॥ 7-57**



**త్రయోదశముఖాన్ బాహ్వోః**
**ధరేత్ షోడశ షోడశ ।**
**ప్రత్యేకం ద్వాదశ వహేత్**
**న వా స్యాన్మణిబంధయోః ॥ 7-58**

అదేప్రకారము ఆరు మరియు ఎనిమిది ముఖములు గల పదహారు పదహారు (మొత్తము 32) రుద్రాక్ష(మా)లను ఎల్లప్పుడూ కంఠమున ధరించవలెను. నాలుగు ముఖములు గల యాభై రుద్రాక్ష(మా)లను వక్షస్థలమున ధరించవలెను.

పదమూడు ముఖములగల పదనారు పదునారు రుద్రాక్షలున్న (రెండు) మాలలను రెండు భుజములచుట్టు ధరించవలెను. తొమ్మిది ముఖములుగల పండ్రెండు పండ్రెండు రుద్రాక్ష(మాల)లను రెండు ముంజేతులలోను ధరించవలెను.

**చతుర్దశముఖం యజ్ఞ-**
**సూత్రమష్టోత్తరం శతమ్ ।**
**ధారయేత్ సర్వకాలం తు**
**రుద్రాక్షం శివపూజకః ॥ 7-59**

**ఏవం రుద్రాక్షధారీ యః**
**సర్వకాలే తు వర్తతే ।**
**తస్య పాపకథా నాస్తి**
**మూఢస్యాపి న సంశయః ॥ 7-60**

పదునాలుగు ముఖములు గల, నూట ఎనిమిది రుద్రాక్షల మాలను యజ్ఞోపవీతమువలె సర్వకాలములలోను ధరించవలెను.

ఈవిధముగా (పూర్వోక్త)శాస్త్రవిధిననుసరించి ఎల్లప్పుడు రుద్రాక్ష(మాల)లను శరీరముపై ధరించువాడు, మూఢుడైనను వాడికి పాపపు సంబంధమే అంటదు. ఇందులో సందేహము లేదు.

**బ్రహ్మహా మద్యపాయీ చ**
**స్వర్ణహృద్గురుతల్పగః ।**
**మాతృహా పితృహా చైవ**
**భ్రూణహా కృతఘాతకః ।**
**రుద్రాక్షధారణాదేవ**
**ముచ్యతే సర్వపాతకైః ।** **7-61**

బ్రహ్మహత్య, మద్యపానము, స్వర్ణహరణము, గురుపత్ని గమనము, మాతృహత్య, పితృహత్య, భ్రూణహత్య మరియు విశ్వాసఘాతకము మొదలైన పాపకార్యములను చేసినవాడు సైతము రుద్రాక్షధారణచేసినచో సమస్త పాపములనుండి విముక్తుడగుచున్నాడు.

**దర్శనాత్ స్పర్శనాచ్చైవ**
**స్మరణాదపి పూజనాత్ ।**
**రుద్రాక్షధారణాల్లోకే**
**ముచ్యంతే పాతకైర్జనాః ॥** **7-62**



రుద్రాక్షలను దర్శించుటచేతను, స్పర్శించుటచేతను, స్మరించుట చేతను, పూజించుట చేతను మరియు ధరించుటచేతను లోకమునందలి జనులు పాతకములనుండి ముక్తులగుచున్నారు.

**బ్రాహ్మణో వాఽంత్యజో వాఽపి**
**మూర్ఖో వా పండితోఽపి వా ।**
**రుద్రాక్షధారణాదేవ**
**ముచ్యతే సర్వపాతకైః ॥** **7-63**

బ్రాహ్మణుడైనా అంత్యజుడైనా, మూర్ఖుడైనా పండితుడైనా రుద్రాక్షధారణముచేత సర్వపాపముల నుండి ముక్తి నొందుచున్నాడు.

**గవాం కోటిప్రదానస్య**
**యత్ఫలం భువి లభ్యతే ।**
**తత్ఫలం లభతే మర్త్యో**
**నిత్యం రుద్రాక్షధారణాత్ ॥** **7-64**

కోటిగోవులను దానముచేయుట వలన లభించు ఫలమును భూలోకమున నిత్యము రుద్రాక్షలను ధరించు మానవుడు పొందుచున్నాడు.

**మృత్యుకాలే తు రుద్రాక్షమ్**
**నిష్పీడ్య సహ వారిణా ।**

**యః పిబేచ్చింతయన్ రుద్రమ్**
**రుద్రలోకం స గచ్ఛతి ॥ 7-65**

మరణకాలమున రుద్రుని స్మరించుచు రుద్రాక్షను కడిగిన నీటిని పానముచేసినవాడు రుద్రలోకమును పొందుచున్నాడు.

**భస్మోద్ధూలితసర్వాంగాః**
**ధృతరుద్రాక్షమాలికాః ।**
**యే భవంతి మహాత్మానః**
**తే రుద్రా నాత్ర సంశయః ॥ 7-66**

సర్వాంగములయందు భస్మోద్ధూలనముచేసుకుని, రుద్రాక్ష మాలలను ధరించిన మహాత్ములయినవారు నిస్సందేహముగా సాక్షాత్తు రుద్రులే అగుచున్నారు.

**నిత్యాని కామ్యాని నిమిత్తజాని**
**కర్మాణి సర్వాణి సదాఽపి కుర్వన్ ।**
**యోఽభస్మరుద్రాక్షధరో యది స్యాత్**
**ద్విజో న తస్యాస్తి ఫలోపపత్తిః ॥ 7-67**

భస్మ-రుద్రాక్షలను ధరించని ద్విజుడు నిత్య-కామ్య-నిమిత్తకర్మలను అనునిత్యము క్రమము తప్పక ఆచరించినను, ఆ కర్మల ఫలము అతనికి లభించదు.



**సర్వేషు వర్ణాశ్రమసంగతేషు**
**నిత్యం సదాచారపరాయణేషు ।**
**శ్రుతిస్మృతిభ్యామిహ చోద్యమానో**
**విభూతిరుద్రాక్షధరః సమానః ॥ 7-68**

(వంశస్థమ్)

అన్ని వర్ణములకు, అన్ని ఆశ్రమములకు చెందిన సదాచార పరాయణులైన సమస్తజనులలో విభూతి రుద్రాక్షలను ధరించినవారు మాత్రమే గౌరవాస్పదులని శ్రుతిస్మృతులచేత పొగడబడినది. (ఏ వర్ణాశ్రమములకు చెందినా భస్మరుద్రాక్షలను ధరించినవాడే శ్రేష్ఠుడని తాత్పర్యము).

ఇతి రుద్రాక్షధారణస్థలం పరిసమాప్తమ్ ।

రుద్రాక్షధారణస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ భస్మరుద్రాక్షధారణప్రసంగో నామ సప్తమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'భస్మరుద్రాక్షధారణ ప్రసంగ'మను ఏడవ పరిచ్ఛేదము ముగిసినది.



# అష్టమః పరిచ్ఛేదః

## ఎనిమిదవ పరిచ్ఛేదము

### పంచాక్షరీజపస్థలప్రసంగః

### పంచాక్షరీజపస్థలప్రసంగము

**(49 శ్లోకములు)**

***8.* అథ పంచాక్షరీజపస్థలమ్**

**పంచాక్షరీజపస్థలము**

**శ్రీరేణుక ఉవాచ ।**

**ధృతశ్రీభూతిరుద్రాక్షః**
**ప్రయతో లింగధారకః ।**
**జపేత్ పంచాక్షరీవిద్యామ్**
**శివతత్త్వప్రబోధినీమ్ ॥ 8-1**

శ్రీ రేణుకాచార్యులు చెప్పుచున్నారు –

మంగళకరము, సాంప్రదాయకము అయిన విభూతి రుద్రాక్షలను ధరించి పవిత్రుడైన ఇష్టలింగధారి ప్రయత్నపూర్వకముగా శివతత్త్వమును బోధించు పంచాక్షరీ విద్య (మంత్రము)ను జపించవలెను.

**శివతత్త్వాత్ పరం నాస్తి**
**యథా తత్త్వాంతరం మహత్ ।**

**తథా పంచాక్షరీమంత్రాత్**
**నాస్తి మంత్రాంతరం మహత్ ॥ 8-2**

శివతత్త్వము కన్నా శ్రేష్ఠమైన మహిమాన్వితమైన తత్త్వము వేరొకటి లేనట్లే పంచాక్షరీ మంత్రముకన్నా మహత్తరమైన వేరొక మంత్రము లోకమున లేదు.

**జ్ఞాతే పంచాక్షరీమంత్రే**
**కిం వా మంత్రాంతరైః ఫలమ్ ।**
**జ్ఞాతే శివే జగన్మూలే**
**కిం ఫలం దేవతాంతరే ॥ 8-3**

జగత్తునకంతటికీ మూలకారణమయిన (పరమ) శివుని గురించి తెలుసుకున్న తరువాత ఇతరదేవతలను గురించి తెలుసుకొనవలసిన అవసరమేటుల వుండదో, అటులనే పంచాక్షరీమంత్రమును గురించి తెలుసుకున్న తరువాత ఇతర మంత్రములను గురించి తెలుసుకొనుట వలన ఏమిటి ప్రయోజనం?

**సప్తకోటిషు మంత్రేషు**
**మంత్రః పంచాక్షరో మహాన్ ।**
**బ్రహ్మవిష్ణ్వాదిదేవేషు**
**యథా శంభుర్మహత్తరః ॥ 8-4**



బ్రహ్మ, విష్ణువు మొదలయిన దేవతలలో శంభువు (మహేశుడు) ఎట్లు సర్వోత్తముడో, అటులనే ఏడుకోట్ల మంత్రములలో పంచాక్షరీమంత్రమే సర్వోత్తమమైనది.

**అశేషజగతాం హేతుః**
**పరమాత్మా మహేశ్వరః ।**
**తస్య వాచకమంత్రోఽయమ్**
**సర్వమంత్రైకకారణమ్ ॥ 8-5**

సమస్త బ్రహ్మాండమునకు పరమాత్ముడైన మహేశ్వరుడు కారణమైనట్లే, అతని వాచకమంత్రమయిన ఈ పంచాక్షరీమంత్రము అన్ని మంత్రములకు మూలకారణమైయున్నది.

**తస్యాభిధానమంత్రోఽయమ్**
**అభిధేయశ్చ స స్మృతః ।**
**అభిధానాభిధేయత్వాత్**
**మంత్రాత్ సిద్ధః పరః శివః ॥ 8-6**

ఈ పంచాక్షరీమంత్రము పరశివునకు ఒక అభిధానము (పేరు) అయివున్నది. పరశివుడు (ఈ మంత్రమునకు) అభిధేయుడు (తెలియజేయబడువాడు) అయివున్నాడు. ఇలా అభిధాన-అభిధేయ సంబంధము వలన ఈ మంత్రముచేత పరమశివుడు సాధించబడుచున్నాడు. (ప్రకాశిస్తున్నాడు).

**నమఃశబ్దం వదేత్పూర్వమ్**
**శివాయేతి తతః పరమ్ ।**
**మంత్రః పంచాక్షరో హ్యేష**
**సర్వశ్రుతిశిరోగతః ॥ 8-7**

'నమః' అను శబ్దమును ముందుగా చెప్పవలెను. ఆ తరువాత 'శివాయ' పదమునుచ్చరించవలెను. ('నమః శివాయ' అను) ఈ పంచాక్షర మంత్రము సకలవేదములకు తలమానికమైయున్నది.

**ఆదితః పరిశుద్ధత్వాత్**
**మలత్రయవియోగతః ।**
**శివ ఇత్యుచ్యతే శంభుః**
**చిదానందఘనప్రభుః ॥ 8-8**

ఆదికాలము (ఆరంభము) నుండి మలత్రయ సంబంధము లేనందువలన, సదా పరిశుద్ధుడు సచ్చిదానందఘనస్వరూపుడు, ప్రభువు (స్వతంత్రుడు) అయిన శంభువే శివుడని పిలువబడుచున్నాడు.

**ఆస్పదత్వాదశేషాణామ్**
**మంగలానాం విశేషతః ।**
**శివశబ్దాభిధేయో హి**
**దేవదేవస్త్రియంబకః ॥ 8-9**



అశేషము (సృష్టి-స్థితి-లయ) లకు ఆస్పదుడు (కారణమైనవాడు), విశేషముగా సర్వమంగళనిలయుడు, త్రియంబకుడు (మూడు కన్నుల వాడు) అయిన దేవాధిదేవుడయిన మహేశ్వరుడు 'శివ' శబ్దముచే అభిధేయుడై యున్నాడు. ('శివు'డనుపేర పిలువబడుచున్నాడు.)

**శివ ఇత్యక్షరద్వంద్వమ్**
**పరబ్రహ్మప్రకాశకమ్ ।**
**ముఖ్యవృత్త్యా తదన్యేషామ్**
**శబ్దానాం గుణవృత్తయః ॥ 8-10**

'శివ' అను రెండక్షరములు ముఖ్యవృత్తితో సాక్షాత్తు పరబ్రహ్మను ప్రకాశింప (తెలియ)చేయుచున్నవి. శివుని (నీలకంఠ, మృత్యుంజయాది) ఇతర నామములు (పేర్లు) అతని గుణములను తెలియజేయుట ద్వారా పరోక్షముగా (గుణవృత్తి ద్వారా) అతనిని సూచించుచున్నవి.

**తస్మాన్ముఖ్యతరం నామ**
**శివ ఇత్యక్షరద్వయమ్ ।**
**సచ్చిదానందరూపస్య**
**శంభోరమితతేజసః ।**
**ఏతన్నామావలంబేన**
**మంత్రః పంచాక్షరః స్మృతః ॥ 8-11**

అపరిమితతేజస్సంపన్నుడు, సచ్చిదానందస్వరూపుడు అయిన శంభువునకు 'శివ' అను రెండక్షరములతో ఏర్పడిన పేరు అత్యంత ప్రధానమై యున్నది. ఈ 'శివ' అను అక్షరములను ఆశ్రయించియే పంచాక్షరమంత్రము రూపొందినది.

**యస్మాదతః సదా జప్యో**
**మోక్షాకాంక్షిభిరాదరాత్ ॥ 8-12**

**యథాఽనాదిర్మహాదేవః**
**సిద్ధః సంసారమోచకః ।**
**తథా పంచాక్షరో మంత్రః**
**సంసారక్షయకారకః ॥ 8-13**

'శివ' నామముతో కూడి యున్నందుననే మోక్షమునపేక్షించువారి చేత ఈ మంత్రము నిరంతరము జపించబడుచున్నది. అనాది అయిన మహాదేవుడు సంసారమోచకుడని ప్రసిద్ధుడైనటులనే ఈ పంచాక్షరమంత్రము కూడా సంసారక్షయమునకు కారకమైయున్నది. (సంసారము నుండి తరింపచేయునని తాత్పర్యము).

**పంచభూతాని సర్వాణి**
**పంచతన్మాత్రకాణి చ ।**
**జ్ఞానేంద్రియాణి పంచాపి**
**పంచకర్మేంద్రియాణి చ ॥ 8-14**



**పంచబ్రహ్మాణి పంచాపి**
**కృత్యాని సహకారణైః ।**
**బోధ్యాని పంచభిర్వర్ణైః**
**పంచాక్షరమహామనోః ॥ 8-15**

(పృథ్వి, అప్, తేజస్, వాయు, ఆకాశమనే) పంచమహాభూతాలు, (రూప, రస, గంధ, స్పర్శ, శబ్ద అనే) పంచతన్మాత్రలు, (చక్షు- శ్రోత్ర- ఘ్రాణ- రసన-త్వక్ అనే) పంచజ్ఞానేంద్రియాలు, (వాక్-పాణి- పాద-పాయు-ఉపస్థ అనే) పంచకర్మేంద్రియాలు, (సద్యోజాత-వామదేవ - అఘోర-తత్పురుష-ఈశాన అనే) పంచబ్రహ్మలు, (సృష్టి-స్థితి-లయ- తిరోధాన-అనుగ్రహ అనే) పంచకృత్యాలు - ఇవి అన్నియూ పంచాక్షరీమహామంత్రమునందలి అయిదు అక్షరములచేత బోధించబడుచున్నవి. (అంటే 'నమఃశివాయ' అనే పంచాక్షరములు సృష్టికంతటికీ మూలకారణమని తాత్పర్యము).

**పంచధా పంచధా యాని**
**ప్రసిద్ధాని విశేషతః ।**
**తాని సర్వాణి వస్తూని**
**పంచాక్షరమయాని హి ॥ 8-16**

ఈ ప్రపంచమునందు ప్రత్యేకముగా అయిదు అనే సంఖ్య మరియు అయిదు వస్తువులను కలిగివున్న సమస్త పదార్థములు పంచాక్షరమయములే అయివున్నవి. (పంచాక్షరమంత్రముల నుండియే ప్రాదుర్భవించినవి.)

**ఓంకారపూర్వో మంత్రోఽయం**
**పంచాక్షరమయః పరః ।**
**శైవాగమేషు వేదేషు**
**షడక్షర ఇతి స్మృతః ॥ 8-17**

పవిత్రమయిన ఈ పంచాక్షరమహామంత్రము 'ఓం'కారముతో కూడినపుడు షడక్షరమంత్రమగునని వేదములందు, శైవాగమములందు చెప్పబడియున్నది.

**మంత్రన్యాసాదిభూతేన**
**ప్రణవేన మహామనోః ।**
**ప్రబోధ్యతే మహాదేవః**
**కేవలశ్చిత్సుఖాత్మకః ॥ 8-18**

షడక్షర మహామంత్రమునందలి అక్షరముల కూర్పులో తొలి అక్షరమయిన 'ఓం'కారము (ప్రణవము) సచ్చిదానందస్వరూపుడయిన పరమాత్మునే తెలియజేయుచున్నది.

**ప్రణవేనైకవర్ణేన**
**పరబ్రహ్మ ప్రకాశ్యతే ।**
**అద్వితీయం పరానందమ్**
**శివాఖ్యం నిష్ప్రపంచకమ్ ॥ 8-19**



అద్వితీయము (ఒక్కటే), పరమానందస్వరూపము, ప్రాపంచిక భేదశూన్యము (నిష్ప్రపంచకము), 'శివ' అను శబ్దముచే వ్యవహరించ బడుతున్న పరబ్రహ్మము ఒక్క ప్రణవము చేతనే ప్రకాశమానమగుచున్నది.

**పరమాత్మమనుర్జ్ఞేయః**
**సోఽహంరూపః సనాతనః ।**
**జాయతే హంసయోర్లోపాత్**
**ఓమిత్యేకాక్షరో మనుః ॥ 8-20**

'సోహం' అను శబ్దము శివ-జీవుల అభేదమును బోధించు పరమాత్మరూపమైన మంత్రము. ఇది సనాతనమైనది. ఈ మంత్రమునందలి 'హ'కార 'స'కారములు లోపించినపుడు 'ఓం' అను ఏకాక్షరమంత్ర ముత్పన్నమగు చున్నది.

**ప్రణవేనైవ మంత్రేణ**
**బోధ్యతే నిష్కలః శివః ।**
**పంచాక్షరేణ మంత్రేణ**
**పంచబ్రహ్మతనుస్తథా ॥ 8-21**

ఈ ప్రణవమంత్రముచేత నిష్కలుడైన (నిరాకారుడైన)శివుడు బోధించబడుచున్నాడు. అటులనే పంచాక్షరమంత్రముచేత శివుని సద్యోజాతాది పంచబ్రహ్మస్వరూపము చెప్పబడుచున్నది.

**నిష్కలః సంవిదాకారః**
**సకలో విశ్వమూర్తికః ।**
**ఉభయాత్మా శివో మంత్రే**
**షడక్షరమయే స్థితః ॥ 8-22**

నిష్కలుడైన(నిరాకారుడైన) శివుడు సంవిత్ (జ్ఞాన, ప్రజ్ఞా) స్వరూపుడు. సకలుడైన పంచబ్రహ్మ, విశ్వస్వరూపుడు. ఇలా శివుని రెండు (నిష్కల-సకల, నిరాకార - సాకార) రూపములు ఈ షడక్షరమంత్రముచేత నిరూపించబడినవి.

**మూలం విద్యా శివః శైవమ్**
**సూత్రం పంచాక్షరస్తథా ।**
**ఏతాని నామధేయాని**
**కీర్తితాని మహామనోః ॥ 8-23**

ఈ మహామంత్రమునకు మూలమంత్రము, విద్యామంత్రము, శివమంత్రము, శైవసూత్రమంత్రము మరియు పంచాక్షరీమంత్రము అని అయిదు పేర్లు ప్రసిద్ధములైయున్నవి. (ప్రపంచమునకు మూలకారణ మయినందున మూలమంత్రమని, ఈ మంత్రజపముచేత శివ-జీవైక్యజ్ఞానము సిద్ధించుటచేత విద్యామంత్రమని, లోకమునకు మంగళదాయకమయి నందున శివమంత్రమని, శివునికి సంబంధించిన సమస్త విషయములు ఇందులో సూత్రప్రాయముగా నిరూపించబడినందు వలన శైవసూత్ర మంత్రమని, అయిదు అక్షరములున్నందున పంచాక్షర మంత్రమని ప్రసిద్ధి).



**పంచాక్షరీమిమాం విద్యామ్**
**ప్రణవేన షడక్షరీమ్ ।**
**జపేత్ సమాహితో భూత్వా**
**శివపూజాపరాయణః ॥ 8-24**

**ప్రాణాయామత్రయం కృత్వా**
**ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా ।**
**చింతయన్ హృదయాంభోజే**
**దేవదేవం త్రియంబకమ్ ॥ 8-25**

**సర్వాలంకారసంయుక్తమ్**
**సాంబం చంద్రార్ధశేఖరమ్ ।**
**జపేదేతాం మహావిద్యామ్**
**శివరూపామనన్యధీః ॥ 8-26**

శివపూజా నిరతుడయినవాడు ప్రణవము(ఓంకారము)తో కూడిన ఈ పంచాక్షరీమంత్రమును (షడక్షరమంత్రమును) సమాధానచిత్తముతో జపించవలెను. సాధకుడు తూర్పు లేదా ఉత్తర దిక్కునకు అభిముఖముగా కూర్చొని మూడుసార్లు ప్రాణాయామము చేసి ఆ తరువాత తన హృదయకమలములో దేవదేవుడు, త్రయంబకుడు, సర్వాలంకారశోభితుడు, ఉమాసమేతుడు (సాంబుడు), చంద్రశేఖరుడు అయిన పరమశివుని ఏకాగ్రమైన మనస్సుతో ఈ షడక్షరమహామంత్రమును జపించవలెను.

**జపస్తు త్రివిధః ప్రోక్తో**
**వాచికోపాంశుమానసః ।**
**శ్రూయతే యస్తు పార్శ్వస్థైః**
**యథా వర్ణసమన్వయః ॥ 8-27**

**వాచికః స తు విజ్ఞేయః**
**సర్వపాపప్రభంజనః ।**
**ఈషత్స్పృష్ట్వాధరపుటమ్**
**యో మందమభిధీయతే ॥ 8-28**

**పార్శ్వస్థైరశ్రుతః సోఽయమ్**
**ఉపాంశుః పరికీర్తితః ।**
**అస్పృష్ట్వాధరమస్పంది**
**జిహ్వాగ్రం యోఽంతరాత్మనా ।**
**భావ్యతే వర్ణరూపేణ**
**స మానస ఇతి స్మృతః ॥ 8-29**

జపము వాచిక, ఉపాంశు, మానసికమని మూడు విధములుగా చెప్పబడినది. ప్రక్కనున్నవ్యక్తికి వినుబడునట్లు మంత్రమును ఉచ్చరించినచో అది వాచికజపమని తెలియవలెను. ఈ జపము సర్వపాపనాశకము. (మంత్రమును జపించునపుడు) రెండు పెదవులు కదలికను కలిగివుండి, ప్రక్కనున్న వ్యక్తికి వినిపించకుండా చేయబడు జపము ఉపాంశు



జపమనబడుచున్నది. పెదవులు గాని కొననాలుకగాని ఎటువంటి కదలిక లేకుండా తన లోపలనే మనస్సులో మంత్రాక్షరములను భావించుచు చేయుజపము మానసిక జపమనబడినది.

**యావంతః కర్మయజ్ఞాద్యా**
**వ్రతదానతపాంసి చ ।**
**సర్వే తే జపయజ్ఞస్య**
**కలాం నార్హంతి షోడశీమ్ ॥ 8-30**

వ్రత, దాన, తపములను ఎన్ని కర్మయజ్ఞములున్నవో, ఆ యజ్ఞములన్నిటినీ కలిపిననూ జపయజ్ఞపు (పదునారుకళలలోని) ఒక్క కళకు కూడా సరిసమానము కాజాలవు.

**మాహాత్మ్యం వాచికస్యైతత్**
**జపయజ్ఞస్య కీర్తితమ్ ।**
**తస్మాచ్ఛతగుణోపాంశుః**
**సహస్రో(సహస్రం) మానసః స్మృతః ॥ 8-31**

వాచిక జపయజ్ఞముయొక్కమాహాత్మ్యము ముందే చెప్పబడినది. (28) వాచిక జపముకన్నను వందపాళ్ళు ఫలదాయకమైనది ఉపాంశు జపము. ఉపాంశుజపముకన్నను వేయిపాళ్ళు ఎక్కువ ఫలదాయకమైనది మానసికజపము.

**వాచికాత్ తదుపాంశోశ్చ**
**జపాదస్య మహామనోః ।**
**మానసో హి జపః శ్రేష్ఠో**
**ఘోరసంసారనాశకః ॥ 8-32**

(ఈ షడక్షరమంత్రముయొక్క) వాచిక, ఉపాంశు జపముల కన్నా ఘోరసంసారనాశకమైన మానసికజపమే సర్వశ్రేష్ఠమైనది.

**ఏతేష్వేతేన విధినా**
**యథాభావం యథాక్రమమ్ ।**
**జపేత్ పంచాక్షరీమేతామ్**
**విద్యాం పాశవిముక్తయే ॥ 8-33**

పైన పేర్కొనిన (జప) విధివిధానములలో వరుసగాను భావపూర్ణముగాను (మల, మాయా, కర్మలను) పాశములను తొలగించు కొనుటకు పంచాక్షరీ (విద్యను)మంత్రమును జపించవలెను.

**అనేన మూలమంత్రేణ**
**శివలింగం ప్రపూజయేత్ ।**
**నిత్యం నియమసంపన్నః**
**ప్రయతాత్మా శివాత్మకః ॥ 8-34**



ప్రతినిత్యము (యమ) నియమాదులతో కూడుకున్నవాడై, శివభావ సంపన్నుడై, ప్రయత్నపూర్వకముగా ఈ మూలమంత్రముతో తన (ఇష్ట) శివలింగమును పూజించవలెను.

**భక్త్యా పంచాక్షరేణైవ**
**యః శివం సకృదర్చయేత్ ।**
**సోఽపి గచ్ఛేచ్ఛివస్థానమ్**
**మంత్రస్యాస్యైవ గౌరవాత్ ॥ 8-35**

భక్తియుక్తుడై ఎవడు ఈ పంచాక్షరమంత్రముతో శివుని (ఇష్టలింగమును కనీసము) ఒక్కసారియైనను పూజించుచున్నాడో, వాడు ఈ మంత్రమహిమతో శివలోకమును పొందుచున్నాడు.

**అబ్భక్షా వాయుభక్షాశ్చ**
**యే చాన్యే వ్రతకర్శితాః ।**
**తేషామేతైర్వ్రతైర్నాస్తి**
**శివలోకసమాగమః ॥ 8-36**

జలభక్షకులు (జలమును మాత్రమే ఆహారముగా స్వీకరించువారు), వాయుభక్షకులు (గాలిని మాత్రమే ఆహారముగా స్వీకరించువారు)గా వుండి (కృచ్ఛ్ర చాంద్రాయణాది) వ్రతములనాచరించి తమ శరీరములను కృశింపచేసుకున్నవారికి ఆయా వ్రతముల వలన శివలోకప్రాప్తి కలుగదు.

**తస్మాత్తపాంసి యజ్ఞాశ్చ**
**వ్రతాని నియమాస్తథా ।**
**పంచాక్షరార్చనస్యైతే**
**కోట్యంశేనాపి నో సమాః ॥ 8-37**

అందువలన మహామంత్రమయిన పంచాక్షరీమంత్రముతో శివుని పూజించుట వలన కలుగు ఫలములో కోటిలో ఒక్క అంశమునకు కూడా తపో-యజ్ఞ-వ్రత-నియమముల వలన కలుగు ఫలములు, సమానములు కాజాలవు.

**అశుద్ధో వా విశుద్ధో వా**
**సకృత్ పంచాక్షరేణ యః ।**
**పూజయేత్ పతితో వాఽపి**
**ముచ్యతే నాత్ర సంశయః ॥ 8-38**

అపరిశుద్ధుడుగాని, పరిశుద్ధుడుగాని, పతితుడైనవాడు గాని, ఒక్కసారి ఈ పంచాక్షరమంత్రముతో శివలింగ(ఇష్టలింగ)మును పూజించినవాడు నిస్సంశయముగా (పాప) ముక్తుడగుచున్నాడు.

**సకృదుచ్చారమాత్రేణ**
**పంచాక్షరమహామనోః ।**
**సర్వేషామపి జంతూనామ్**
**సర్వపాపక్షయో భవేత్ ॥ 8-39**



ఈ పంచాక్షరమహామంత్రమును ఒక్కసారి ఉచ్చరించిన మాత్రముననే సమస్త జీవజంతువుల అన్ని విధములయిన పాపములు నశించిపోవుచున్నవి.

**అన్యేపి బహవో మంత్రా**
**విద్యంతే సకలాగమే ।**
**భూయో భూయః సమభ్యాసాత్**
**పురుషార్థప్రదాయినః ॥ 8-40**

సకల శివాగమములలో వివిధరకములైన అనేక మంత్రములున్నవి. వాటిని మరల మరల జపాభ్యాసము చేసినప్పుడు అవి (ధర్మ-అర్థ-కామ-మోక్షములను) పురుషార్థములను అనుగ్రహించగలుగు చున్నవి.

**ఏష మంత్రో మహాశక్తిః**
**ఈశ్వరప్రతిపాదకః ।**
**సకృదుచ్చారణాదేవ**
**సర్వసిద్ధిప్రదాయకః ॥ 8-41**

ఈశ్వర(స్వరూప)ప్రతిపాదకమయిన ఈ (పంచాక్షరీ) మంత్రము మహాశక్తిసంపన్నమైనది. దీనిని ఒక్కసారి ఉచ్చరించిననే సర్వసిద్ధులను ప్రసాదించు సామర్థ్యమును కలిగియున్నది.

**పంచాక్షరీం సముచ్చార్య**
**పుష్పం లింగే వినిక్షిపేత్ ।**
**యస్తస్య వాజపేయానామ్**
**సహస్రఫలమిష్యతే ॥ 8-42**

ఈ పంచాక్షరీమహామంత్రమును ఉచ్చరించుచూ ఒక్కొక్క పుష్పమును శివలింగమునకు సమర్పించిన, వాజపేయయాగము వలన కలుగు ఫలము కన్నను వేయిరెట్ల ఎక్కువ ఫలము ప్రాప్తించును.

**అగ్నిహోత్రం త్రయో వేదా**
**యజ్ఞాశ్చ బహుదక్షిణాః ।**
**పంచాక్షరజపస్యైతే**
**కోట్యంశేనాపి నో సమాః ॥ 8-43**

ప్రతినిత్యము చేయు అగ్నిహోత్ర(యాగ)ము వలనను, మూడు వేదముల అధ్యయనము వలనను, ఎక్కువ దక్షిణలతో చేయు జ్యోతిష్టోమాది యాగముల వలనను పొందు ఫలములు, పంచాక్షరీమంత్రజపము వలన లభించు ఫలమునందలి కోట్యంశమున ఒక్క భాగమునకు కూడా సమానములు కాజాలవు.

**పురా సానందయోగీంద్రః**
**శివజ్ఞానపరాయణః ।**



**పంచాక్షరం సముచ్చార్య**
**నారకానుదతారయత్ ॥ 8-44**

పూర్వకాలమున శివజ్ఞానపరాయణుడైన సానందుడనే యోగీంద్రుడు పంచాక్షరమహామంత్రమునుచ్చరించి నరకమునందున్న పాపులను ఉద్ధరించినాడు.

**సిద్ధ్వా పంచాక్షరస్యాస్య**
**శతానందః పురా మునిః ।**
**నరకం స్వర్గమకరోత్**
**సంగిరస్యాపి పాపినః ॥ 8-45**

పూర్వకాలమున శతానందుడను మునివర్యుడు ఈ పంచాక్షర మంత్రమును సిద్ధింపచేసుకుని సంగిరుడనే పాపాత్మునికోసం నరకమునే స్వర్గముగా మార్చినాడు.

**ఉపమన్యుః పురా యోగీ**
**మంత్రేణానేన సిద్ధిమాన్ ।**
**లబ్ధవాన్ పరమేశానాత్**
**శైవశాస్త్రప్రవక్తృతామ్ ॥ 8-46**

ఉపమన్యుడను యోగిపుంగవుడు పూర్వకాలమున పంచాక్షర మహామంత్రముచేత సిద్ధిని పొంది (సాక్షాత్తు) శివునిచేత శైవశాస్త్ర ప్రవర్తకత్వాన్ని సాధింపచేసుకున్నాడు.

**వసిష్ఠవామదేవాద్యా**
**మునయో ముక్తకిల్బిషాః ।**
**మంత్రేణానేన సంసిద్ధాః**
**మహాతేజస్వినోఽభవన్ ॥ 8-47**

ఈ పంచాక్షరమహామంత్ర(జప)ము చేత పాపముక్తులయిన వశిష్ఠ వామదేవాది మహర్షులు సిద్ధులను పొంది మహాతేజస్సంపన్నులైనారు.

**బ్రహ్మాదీనాం చ దేవానామ్**
**జగత్సృష్ట్యాదికర్మణి ।**
**మంత్రస్యాస్యైవ మాహాత్మ్యాత్**
**సామర్థ్యముపజాయతే ॥ 8-48**

బ్రహ్మ(విష్ణురుద్రా)ది దేవతలు ఈ మహామంత్ర మాహాత్మ్యముచేత జగత్ సృష్టికార్యమును నిర్వహించు సామర్థ్యమును సంపాదించుకున్నారు.

**కిమిహ బహుభిరుక్తైర్మంత్రమేవం మహాత్మా**
**ప్రణవసహితమాదౌ యస్తు పంచాక్షరాఖ్యమ్ ।**
**జపతి పరమభక్త్యా పూజయన్ దేవదేవమ్**
**స గతదురితబంధో మోక్షలక్ష్మీం ప్రయాతి ॥ 8-49**

– (మాలినీ)



పంచాక్షరమంత్రమును గురించి ఎంతచెప్పిన ఏమి ప్రయోజనము! ఏ మహాత్ముడు దేవదేవుడయిన మహాదేవుని పూజించుచూ పరమభక్తితో ప్రణవమును ముందుగా కలిగిన పంచాక్షరమహామంత్రమును జపించుచున్నాడో, అతడు పాపబంధమునుండి విముక్తుడై మోక్షలక్ష్మిని పొందుచున్నాడు.

ఇతి పంచాక్షరీజపస్థలం పరిసమాప్తమ్
పంచాక్షరీజపస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ పంచాక్షరీజపస్థల ప్రసంగోనామ అష్టమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైత విద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'పంచాక్షరీజపప్రసంగ'మను ఎనిమిదవ పరిచ్ఛేదము ముగిసినది.



# నవమః పరిచ్ఛేదః

## తొమ్మిదవ పరిచ్ఛేదము

### *భక్తమార్గక్రియాదిసప్తవిధస్థలప్రసంగః*

### భక్తమార్గక్రియాదిసప్తవిధస్థలప్రసంగము

**(94 శ్లోకములు)**

***9. అథ భక్తమార్గక్రియాస్థలమ్***

**భక్తమార్గక్రియాస్థలము**

**భూతిరుద్రాక్షసంయుక్తో**
**లింగధారీ సదాశివః ।**
**పంచాక్షరజపోద్యోగీ**
**శివభక్త ఇతి స్మృతః ॥ 9-1**

విభూతి రుద్రాక్షలతోపాటు ఇష్టలింగమును (తన శరీరముపై) ధరించి ఎల్లప్పుడు మంగళస్వరూపుడై పంచాక్షరమంత్రమును జపించువాడు శివభక్తుడని పిలువబడుచున్నాడు.

**శ్రవణం కీర్తనం శంభోః**
**స్మరణం పాదసేవనమ్।**
**అర్చనం వందనం దాస్యం**
**సఖ్యమాత్మనివేదనమ్ ॥ 9-2**

**ఏవం నవవిధా భక్తిః**
**ప్రోక్తా దేవేన శంభునా ।**
**దుర్లభా పాపినాం లోకే**
**సులభా పుణ్యకర్మణామ్॥ 9-3**

దేవాధిదేవుడైన శంభువు చేత చెప్పబడిన ఈ భక్తి శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము మరియు ఆత్మనివేదనము అని తొమ్మిది విధములు. ఈ లోకములో ఇది పాపాత్ములకు దుర్లభము. పుణ్యాత్ములకు సులభముగా లభించును.

**అధమే చోత్తమే వాఽపి**
**యత్ర కుత్రచిదూర్జితా ।**
**వర్తతే శాంకరీ భక్తిః**
**స భక్త ఇతి గీయతే ॥ 9-4**

**భక్తిః స్థిరీకృతా యస్మిన్**
**మ్లేచ్ఛే వా ద్విజసత్తమే ।**
**శంభోః ప్రియః స విప్రశ్చ**
**న ప్రియో భక్తివర్జితః ॥ 9-5**

అధము(నీచు)డయినా లేదా ఉత్తముడయినా, ఎవరైనాగాని, శివుని యందు భక్తి వున్నవాడు భక్తుడని పరిగణించబడతాడు. మ్లేచ్ఛ(అంత్యజు)డైనా, బ్రాహ్మణుడైనా, దృఢమైన శివభక్తి వున్నవాడే శంభువుకు ప్రీతిపాత్రుడు. భక్తిలేని బ్రాహ్మణుడయినా శివునికి ప్రీతిపాత్రుడు కాడు.

**సా భక్తిర్ద్వివిధా జ్ఞేయా**
**బాహ్యాభ్యన్తరభేదతః ।**
**బాహ్యా స్థూలాంతరా సూక్ష్మా**
**వీరమాహేశ్వరాదృతా ॥ 9-6**

ఆ శివభక్తి బాహ్య(బహిరంగ)మని, ఆభ్యంతర (అంతరంగ)మని రెండు విధములు. బాహ్యాభక్తి స్థూలమైనది. అంతరంగభక్తి సూక్ష్మమైనది. ఈ సూక్ష్మభక్తియే వీరమాహేశ్వరులచేత అనుసరించబడుచున్నది.

**సింహాసనే శుద్ధదేశే**
**సురమ్యే రత్నచిత్రితే ।**
**శివలింగస్య పూజా యా**
**సా బాహ్యా భక్తిరుచ్యతే॥ 9-7**

మనోహరమైన, (గోమయాదులచేత) పరిశుద్ధము చేయబడిన ప్రదేశమున (నవ)రత్నములతో అలంకరించిన సింహాసనమున కూర్చొని శివ(ఇష్ట)లింగమును పూజించునది బాహ్య(బహిరంగ) భక్తి.



**లింగే ప్రాణం సమాధాయ**
**ప్రాణే లింగం తు శాంభవమ్।**
**స్వస్థం మనస్తథా కృత్వా**
**న కించిచ్చింతయేద్యది॥ 9-8**

**సాభ్యంతరా భక్తిరితి**
**ప్రోచ్యతే శివయోగిభిః।**
**సా యస్మిన్ వర్తతే తస్య**
**జీవనం భ్రష్టబీజవత్॥ 9-9**

ఇష్టలింగమునందు తన ప్రాణమును, తన ప్రాణమునందు శివకలాయుక్తమైన లింగమును సంయోజనము చేసుకొని (అంటే లింగ-ప్రాణములను సమరసము చేసుకుని) మనసును స్థిరము చేసి, ఇతరములైన ఏ ఆలోచనలులేకుండా ఏకాగ్రతతో చేయు (ఇష్టలింగ)పూజ అభ్యంతర (అంతరంగ) పూజయని శివయోగులు చెప్పుచున్నారు. ఇటువంటి భక్తి ఎవనియందున్నదో అటువంటివాని జీవనము కాల్చిన విత్తనము వంటిది. (అనగా అతనికి పునర్జన్మ ముండదు. కాల్చిన విత్తనము మొలకెత్తదు)

**బహునాత్ర కిముక్తేన**
**గుహ్యాద్ గుహ్యతరా పరా ।**
**శివభక్తిర్న సందేహః**
**తయా యుక్తో విముచ్యతే ॥ 9-10**

అంతరంగభక్తిని గురించి ఎక్కువుగా చెప్పుట వలన ప్రయోజనమేమి? ఇది అత్యంత రహస్యమైనది. ఈ శివభక్తి సంపన్నుడు ముక్తుడగునను విషయమున సందేహము లేదు.

**ప్రసాదాదేవ సా భక్తిః**
**ప్రసాదో భక్తిసంభవః ।**
**యథైవాంకురతో బీజమ్**
**బీజతో వా యథాఽంకురః॥ 9-11**

**ప్రసాదపూర్వికా యోఽయమ్**
**భక్తిర్ముక్తివిధాయినీ।**
**నైవ సా శక్యతే ప్రాప్తుమ్**
**నరైరేకేన జన్మనా॥ 9-12**

విత్తనము నుండి అంకురము (మొలక), అంకురము నుండి విత్తనము ఉత్పన్నమయినట్టే, శివుని అనుగ్రహ(ప్రసాదము)ము నుండి భక్తి మరియు (సాధకుని)భక్తి నుండి (శివుని)ప్రసాదము ఉత్పన్నము లగుచున్నవి. (శివ)ప్రసాద(అనుగ్రహ)ము వలన సిద్ధించిన భక్తి ముక్తినివ్వగలిగిన సామర్థ్యమును కలిగిఉన్నది. అటువంటి ఆ భక్తి మానవులకు ఒక్క జన్మమునందే పొందుటకు సాధ్యము కాదు.

**అనేకజన్మశుద్ధానామ్**
**శ్రౌతస్మార్తానువర్తినామ్ ।**



**విరక్తానాం ప్రబుద్ధానామ్**
**ప్రసీదతి మహేశ్వరః ॥ 9-13**

అనేక జన్మలలో (శివపూజాదులను చేయుటవలన) పరిశుద్ధులైనవారికి శ్రుతి స్మృతులయందు విధించిన (నిత్య-నైమిత్తిక) కర్మలను ఆచరించినవారికి, వైరాగ్యభావము కలిగినవారికి, శివజ్ఞానసంపన్నులయిన ప్రబుద్ధులకు మాత్రమే మహేశ్వరుడు ప్రసన్నుడగుచున్నాడు.

**ప్రసన్నే సతి ముక్తోఽభూత్**
**ముక్తః శివసమో భవేత్।**
**అల్పభక్త్యాపి యో మర్త్యః**
**తస్య జన్మత్రయాత్పరమ్॥ 9-14**

శివుడు ప్రసన్నుడయినపుడే (సాధకుడు) ముక్తిని పొందగలడు. ముక్తుడయినవాడు శివునితో సమానుడగుచున్నాడు. (శివస్వరూపుడగుచున్నాడు). శివునిపట్ల అల్పభక్తి కలిగినవాడు మూడు జన్మముల తరువాత ముక్తిని పొందుతాడు.

**న యోనియంత్రపీడా వై**
**భవేన్నైవాత్ర సంశయః ।**
**సాంగాఽన్యూనా చ యా సేవా**
**సా భక్తిరితి కథ్యతే॥ 9-15**

ఇలా (తొమ్మిది విధములైన) అంగములచేత పరిపుష్టమైనదే సాంగా(పూర్ణ) భక్తి. తొమ్మిది ప్రకారములలో ఏదైనా ఒకటి తక్కువైన అది న్యూనభక్తి అనబడును. ఇటువంటి న్యూనభక్తి గలవానికి (కూడా) పునర్జన్మ (యోనియంత్రపీడ) దుఃఖము కలుగదు. ఇది సత్యము. సందేహము లేదు.

**సా పునర్భిద్యతే త్రేధా**
**మనోవాక్కాయసాధనైః ।**
**శివరూపాదిచింతా యా**
**సా సేవా మానసీ స్మృతా ।**
**జపాది వాచికీ సేవా**
**కర్మపూజా చ కాయికీ ॥ 9-16**

మరల ఇదే భక్తి (మరోవిధముగా) మానసికభక్తి, వాచికభక్తి, కాయికభక్తి అని మూడు విధములు. మనస్సులో శివుని స్వరూపాదులను ధ్యానించు మానసికమయిన సేవ మానసిక భక్తి అనబడును. మాటలతో లేదా వాగ్రూపములో చేయు శివపంచాక్షరీమంత్రజపము మరియు శివస్తోత్రపఠనాదులు వాచికభక్తి. ఇక (శరీరముచేత చేయబడు) కర్మలను ప్రధానముగా కలిగినది కాయికభక్తి. (ఇష్టలింగపూజ కాయిక భక్తిగా చెప్పబడినది)

**బాహ్యమాభ్యంతరం చైవ**
**బాహ్యాభ్యంతరమేవ వా ।**



**మనోవాక్కాయభేదైశ్చ**
**త్రిధా తద్భజనం విదుః ॥ 9-17**

పైన పేర్కొన్న ఒక్కొక్క (మానసిక, వాచిక, కాయిక) భక్తిరూపము మరలా బాహ్యమని, ఆభ్యంతరమని మరియు బాహ్యాభ్యంతరమని మూడు మూడు ప్రకారములగుచున్నది.

**మనో మహేశధ్యానాఢ్యమ్**
**నాన్యధ్యానరతం మనః।**
**శివనామరతా వాణీ**
**వాఙ్మతా చైవ నేతరా ॥ 9-18**

**లింగైః శివస్య చోద్దిష్టైః**
**త్రిపుండ్రాదిభిరంకితః ।**
**శివోపచారనిరతః**
**కాయః కాయో న చేతరః ॥ 9-19**

ధ్యానమున మహేశుని యందు ఆసక్తమయిన మనసే నిజమైన మనస్సు. ఇతర విషయములమీద ధ్యానాసక్తిని కలిగిన మనసు మనస్సు కాదు. శివనామ జపమున నిరతమయిన వాణియే నిజమైన వాక్కు. అన్యులను స్తుతించువాణి నిజమైన వాణికాదు. అదేవిధముగా శివచిహ్నములయిన శివలింగమును, రుద్రాక్షలను, త్రిపుండ్రాదులను ధరించి శివార్చనయందు

ఆసక్తికలిగిన కాయమే నిజమైన కాయము(శరీరము). ఇతర కర్మలయందు ఆసక్తి కలిగిన శరీరము శరీరమే కాదు.

**అన్యాత్మవిదితం బాహ్యమ్**
**శంభోరభ్యర్చనాదికమ్ ।**
**తదేవ తు స్వసంవేద్యమ్**
**ఆభ్యన్తరముదాహృతమ్ ।**
**మనో మహేశప్రవణమ్**
**బాహ్యాభ్యంతరముచ్యతే ॥ 9-20**

ఇతరులకు తెలియునట్టు చేయు శివార్చన(పూజ) బాహ్యభక్తి అనబడును. తనకు మాత్రమే తెలియునట్లు (స్వసంవేద్యముగా) చేయు అర్చన ఆభ్యంతరభక్తి. మహేశునుద్దేశించి (అంతరంగమున)చేయు ధ్యానము మరియు (బహిరంగమైన) అర్చనాసక్తమైన మనస్సు బాహ్యాభ్యంతరభక్తి అనబడును.

**పంచధా కథ్యతే సద్భిః**
**తదేవ భజనం పునః ।**
**తపః కర్మ జపో ధ్యానమ్**
**జ్ఞానం చేత్యనుపూర్వకమ్॥ 9-21**

(పైన పేర్కొన్న భక్తియే మరోవిధముగా) తపస్సు, కర్మ, జపము, ధ్యానము, జ్ఞానము అని అయిదువిధములుగా చెప్పబడినది.



**శివార్థే దేహసంశోషః**
**తపః కృచ్ఛ్రాది నో మతమ్ ।**
**శివార్చా కర్మ విజ్ఞేయమ్**
**బాహ్యం యాగాది నోచ్యతే॥ 9-22**

శివుని అర్చించుటకై దేహమును కష్టపెట్టుట (దండించుట) తపస్సుగాని, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములనాచరించుట తపస్సు కాదు. ఇష్టలింగమును నిత్యకర్మగా అర్చించుటయే కర్మగాని, బాహ్యకర్మలయిన యాగాదులు నిత్యకర్మలుకావు.

**జపః పంచాక్షరాభ్యాసః**
**ప్రణవాభ్యాస ఏవ వా ।**
**రుద్రాధ్యాయాదికాభ్యాసో**
**న వేదాధ్యయనాదికమ్॥ 9-23**

పంచాక్షరీమంత్రమును అభ్యాసము(మరల మరల ఆవృత్తి) చేయుట లేదా ప్రణవమును (ఓంకారమును) గాని రుద్రాధ్యాయభాగములను అభ్యాసము చేయుట జపమనబడును. వేదాధ్యయనాదులు జపము కాదు.

**ధ్యానం శివస్య రూపాది-**
**చింతా నాత్మాదిచింతనమ్ ।**
**శివాగమార్థవిజ్ఞానమ్**
**జ్ఞానం నాన్యార్థవేదనమ్।**

**ఇతి పంచప్రకారో౽యమ్**
**శివయజ్ఞః ప్రకీర్తితః ॥ 9-24**

ధ్యానమంటే శివుని రూపములను చింతనచేయుటయే గాని, ఆత్మాదులను గురించి ఆలోచించుట కాదు. శైవాగమముల తాత్పర్యమును తెలుసుకొనుటయే జ్ఞానముకాని, అన్యశాస్త్రములను అధ్యయనము చేయుట జ్ఞానము కాదు. ఇలా ఈ శివయజ్ఞము తపస్సు, కర్మ, జపము, ధ్యానము మరియు జ్ఞానమని అయిదు విధములుగా పేర్కొనబడినది.

**అనేన పంచయజ్ఞేన**
**యః పూజయతి శంకరమ్ ।**
**భక్త్యా పరమయా యుక్తః**
**స వై భక్త ఇతీరితః॥ 9-25**

ఎవడు పైన పేర్కొనిన అయిదు విధములయిన యజ్ఞముచేత పరమోన్నతమైన భక్తితో శంకరుని పూజించుటున్నాడో, వాడు నిజమైన భక్తుడనిచెప్పబడినాడు.

**పూజనాచ్ఛివభక్తస్య**
**పుణ్యా గతిరవాప్యతే ।**
**అవమానాన్మహాఘోరో**
**నరకో నాత్ర సంశయః ॥ 9-26**



శివభక్తుని పూజించుట వలన పుణ్యలోకములను పొందుచున్నారు. శివభక్తుని అవమానించినవారు మహాఘోరము భయంకరము అయిన నరకమును అనుభవించుచున్నారు. ఇందులో సందేహములేదు.

**శివభక్తో మహాతేజాః**
**శివభక్తిపరాఙ్ముఖాన్।**
**న స్పృశేన్నైవ వీక్షేత**
**న తైః సహ వసేత్ క్వచిత్॥ 9-27**

మహాతేజస్సంపన్నుడైన శివభక్తుడు శివభక్తి విహీనులను తాకరాదు, చూడరాదు మరియు ఎటువంటి పరిస్థితులలోను వారితో సహవాసము చేయరాదు. (ఇక్కడ పంచాచారములలోని లింగాచారము, సదాచారము, శివాచారము, భృత్యాచారము, గణాచారముల వివరములకు – 'చంద్రజ్ఞానాగమము', 'పరమరహస్యము', చూడవలయును).

**యదా దీక్షాప్రవేశః స్యాత్**
**లింగధారణపూర్వకః ।**
**తదాప్రభృతి భక్తో౽సౌ**
**పూజయేత్ స్వాగమస్థితాన్॥ 9-28**

గురువు నుండి దీక్షాసంస్కారమును పొంది లింగధారణమును చేసుకున్న నాటి నుండి శివభక్తుడు, శివాగమములు ప్రతిపాదించు

ఆచారములను పాటించుచు, శివాచార్యులను, శివశరణులను, శివభక్తులను పూజించవలెను.

**స్వమార్గాచారనిరతాః**
**సజాతీయా ద్విజాస్తు యే ।**
**తేషాం గృహేషు భుంజీత**
**నేతరేషాం కదాచన॥ 9-29**

వీరశైవధర్మమునను సరించి దీక్షాసంస్కారములను పొందిన తన కులబాంధువుల గృహములందు మాత్రమే భుజించవలెను గాని, ఇతరుల గృహములందు ఏ పరిస్థితులలోనూ భుజించరాదు.

**స్వమార్గాచారవిముఖైః**
**భవిభిః ప్రాకృతాత్మభిః ।**
**ప్రేషితం సకలం ద్రవ్యమ్**
**ఆత్మలీనమపి త్యజేత్॥ 9-30**

వీరశైవధర్మాచారములపట్ల విముఖులు, లింగధారులు కాని ఇతర సామాన్యమానవులు సమర్పించిన ద్రవ్యాదులు తన వశమునందున్ననూ, వాటిని త్యజించవలెను.

**నార్చయేదన్యదేవాంస్తు**
**న స్మరేన్న చ కీర్తయేత్ ।**



**న తన్నివేద్యమశ్నీయాత్**
**శివభక్తో దృఢవ్రతః ॥ 9-31**

దృఢవ్రతుడైన శివభక్తుడు శివుని దప్ప అన్యదేవతలను అర్చించరాదు. స్మరించరాదు. వారి గుణగణములను కీర్తించరాదు. అలాగే ఇతరదేవతలకు అర్పించిన నైవేద్యములను సైతము స్వీకరించరాదు.

**యద్గృహేష్వన్యదేవోఽస్తి**
**తద్గృహాణి పరిత్యజేత్।**
**నాన్యదేవార్చకాన్ మర్త్యాన్**
**పూజాకాలే నిరీక్షయేత్॥ 9-32**

శివుడుగాక ఇతర దేవతలనారాధించు ఇళ్ళను పరిత్యజించవలెను. (అటువంటి ఇళ్లలో ప్రవేశించరాదు). అటులనే(శివుని తప్ప) ఇతర దేవతలనారాధించు వారిని ఇష్టలింగపూజాసమయములో చూడరాదు.

**సదా శివైకనిష్ఠానామ్**
**వీరశైవాధ్వవర్తినామ్ ।**
**నహి స్థావరలింగానామ్**
**నిర్మాల్యాద్యుపయుజ్యతే॥ 9-33**

ఎల్లప్పుడూ శివైకనిష్ఠను కలిగి, వీరశైవధర్మమార్గములో పయనించువారు స్థావరలింగముల నిర్మాల్యాదులను (పత్ర, పుష్ప,

ప్రసాదాదులను) పరిగ్రహించరాదు.

**యత్ర స్థావరలింగానామ్**
**అపాయః పరివర్తతే ।**
**అథవా శివభక్తానామ్**
**శివలాంఛనధారిణామ్ ॥ 9-34**

**తత్ర ప్రాణాన్ విహాయాపి**
**పరిహారం సమాచరేత్ ।**
**శివార్థం ముక్తజీవశ్చేత్**
**శివసాయుజ్యమాప్నుయాత్॥ 9-35**

దేవాలయములందలి స్థావరలింగములకు గాని, (ఇష్టలింగ, భస్మ, రుద్రాక్షాది) శివచిహ్నములను ధరించిన శివభక్తులకు గాని, ఎక్కడ ఎటువంటి అపాయము జరిగినను, అక్కడ తన ప్రాణములనుసైతము ఎదురొడ్డి అపాయమును తొలగించవలెను. శివునికై ప్రాణములను త్యజించినవాడు శివసాయుజ్యమును పొందుచున్నాడు.

**శివనిందాకరం దృష్ట్వా**
**ఘాతయేదథవా శపేత్ ।**
**స్థానం వా తత్పరిత్యజ్య**
**గచ్ఛేద్ యద్యక్షమో భవేత్॥ 9-36**



(శివభక్తుడయినవాడు) శివనిందను చేయు వానిని తక్షణమే సంహరించవలెను. లేదా శపించవలెను. ఒకవేళ ఈ రెండింటిలో దేనినీ చేయలేనివాడు ఆ ప్రదేశమును వీడి వెళ్ళవలెను.

**యత్ర చాచారనిందాఽస్తి**
**కదాచిత్తత్ర న వ్రజేత్ ।**
**యద్గృహే శివనిందాఽస్తి**
**తద్గృహాణి పరిత్యజేత్॥ 9-37**

శివాచారము నిందించబడు ప్రదేశములకు ఎటువంటి పరిస్థితులలోనూ వెళ్ళరాదు. అంతేకాదు, శివనింద జరుగు ఇళ్ళను పరిత్యజించవలెను. (నిషేధించవలెను).

**యః సర్వభూతాధిపతిమ్**
**విశ్వేశానం వినిందతి।**
**న తస్య నిష్కృతిః శక్యా**
**కర్తుం వర్షశతైరపి॥ 9-38**

సమస్తప్రాణులకు అధిపతి అయిన విశ్వేశ్వరుని నిందించు వారు, వందేళ్ళపాటు ప్రాయశ్చిత్తము(నిష్కృతి) చేసుకున్ననూ నిందవలన కలిగిన దోషము తొలగదు.

**శివపూజాపరో భూత్వా**
**పూర్వకర్మ విసర్జయేత్ ।**

**అథవా పూర్వకర్మ స్యాత్**
**సా పూజా నిష్ఫలా భవేత్॥ 9-39**

శివ(ఇష్టలింగ)పూజాపరుడయినవాడు తన పూర్వకర్మలను అతడు వదలిపెట్టవలెను. అట్లుగాక ఒకవేళ పూర్వకర్మలను కొనసాగించిన అతడు చేయు శివపూజ నిష్ఫలమగును.

**ఉత్తమాం గతిమాశ్రిత్య**
**నీచాం వృత్తిం సమాశ్రితః।**
**ఆరూఢపతితో జ్ఞేయః**
**సర్వకర్మబహిష్కృతః ॥ 9-40**

(శివపూజాపరమయిన) ఉన్నతమార్గమును ఆశ్రయించిన తరువాత కూడా నీచ(క్రిందస్థాయి)కర్మల నాచరించువానిని, సర్వకర్మబహిష్కృతుడని (ఎటువంటి కర్మలను ఆచరించుటకు అయోగ్యుడని), ఆరూఢపతితుడని తెలుసుకొనవలెను.

**పంచాక్షరోపదేశీ చ**
**నరస్తుతికరో యది ।**
**సోఽలింగీ స దురాచారీ**
**కుకవిః స తు విశ్రుతః ॥ 9-41**

(సద్గురువు నుండి దీక్షద్వారా) పంచాక్షరమహామంత్రోపదేశమును పొందిన తరువాత (కూడా), సామాన్యమానవులను(సంతోష పరుచుటకు)



స్తుతించువాడు, 'అలింగి'అని, 'దురాచారి' అని, 'కుకవి' అని పిలువబడుతున్నాడు.

**చర్మపాత్రే జలం తైలమ్**
**న గ్రాహ్యం భక్తితత్పరైః ।**
**గృహ్యతే యది భక్తేన**
**రౌరవం నరకం వ్రజేత్ ॥ 9-42**

శివభక్తితత్పరుడయినవాడు చర్మముతోచేసిన పాత్రల నుండి నీరు, నూనె మొదలయినవాటిని ఉపయోగించరాదు. ఒకవేళ తద్విరుద్ధముగా ప్రవర్తించిన భక్తుడు రౌరవనరకమును పొందుచున్నాడు.

**న తస్య సూతకం కించిత్**
**ప్రాణలింగాంగసంగినః ।**
**జన్మోత్థం మృతోత్థం చ**
**విద్యతే పరమార్థతః ॥ 9-43**

తన శరీరము(అంగము)పై ఇష్టలింగమును ధరించి 'ప్రాణలింగి' అనిపించుకున్న భక్తునికి జననము వలన గాని మరణము వలన గాని సంభవించు సూతకములు యథార్థమునకు ఏమాత్రము వుండవు లేదా అంటవు.

**లింగార్చనరతాయాశ్చ**
**ఋతౌ నార్యా న సూతకమ్ ।**

**తథా ప్రసూతికాయాశ్చ**
**సూతకం నైవ విద్యతే॥ 9-44**

లింగార్చనా నిరతులయిన వీరశైవస్త్రీలకు ఋతుకాలములందు రజస్సూతకముగాని, ప్రసవసమయములందు ప్రసూతికాసూతకము గాని వుండవు.

**గృహే యస్మిన్ ప్రసూతా స్త్రీ**
**సూతకం నాత్ర విద్యతే।**
**శివపాదాంబుసంస్పర్శాత్**
**సర్వపాపం ప్రణశ్యతి॥ 9-45**

ప్రసవించిన స్త్రీ వుండు ఏ ఇంటికీ ఎటువంటి సూతకము వుండదు. సద్గురువులయిన శివజ్ఞానుల పాదోదకస్పర్శ సమస్త పాపములను నశింపజేయును.

**శివస్థానాని తీర్థాని**
**విశిష్టాని శివార్చకః ।**
**శివయాత్రోత్సవం నిత్యం**
**సేవేత పరయా ముదా ॥ 9-46**

శివార్చ(ఇష్టలింగార్చ)కుడైన శివభక్తుడు, శివుని కత్యంత ప్రీతిపాత్రములయిన శ్రీశైల, కాశీ, కేదారాది క్షేత్రములను దర్శించుచు,



పరమపావనములయిన గంగా మొదలైన తీర్థములలో స్నానముల నాచరించుచు అక్కడ జరుగు వుత్సవములలో పాల్గొని నిత్యము శివుని సేవించవలెను.

**శివక్షేత్రోత్సవమహా-**
**యాత్రాదర్శనకాంక్షిణామ్ ।**
**మార్గేఽన్నపానదానం చ**
**కుర్యాన్మాహేశ్వరో జనః॥ 9-47**

శివక్షేత్రములను, ఉత్సవములను చూచుటకు వెళ్ళు మార్గమున, మాహేశ్వరులయిన శివభక్తులు యాత్రికులకు అన్నపానాదులను ఏర్పాటు చేయవలెను.

**నాన్నతోయసమం దానమ్**
**న చాహింసాపరం తపః ।**
**తస్మాన్మాహేశ్వరో నిత్యం**
**అన్నతోయప్రదో భవేత్ ॥ 9-48**

అన్నపానాదుల దానమునకు సమానమైన దానము గాని, అహింసతో సమానమయిన తపస్సు గాని మరొకటి లేదు. అందువలన మాహేశ్వరులు ప్రతినిత్యము అన్నదానము నీటిదానమును చేయవలెను.

**స్వమార్గాచారవర్తిభ్యః**
**స్వజాతిభ్యః సదా వ్రతీ ।**

**దద్యాత్ తేభ్యః సమాదద్యాత్**
**కన్యాం కులసముద్భవామ్॥ 9-49**

శివాచారవ్రతసంపన్నుడయిన శివభక్తుడు తన వలెనే శివాచారమార్గము ననుసరించి జీవించు తన జాతివానికి తన కులమునందు జన్మించిన కన్యను కన్యాదానం చేయవలెను. అలాగే వారి నుండి అటువంటి కన్యను తానూ పరిగ్రహించవలెను.

**ఏవమాచారసంయుక్తో**
**వీరశైవో మహావ్రతీ ।**
**పూజయేత్ పరయా భక్త్యా**
**గురుం లింగం చ సంతతమ్॥ 9-50**

ఈ విధమయిన ఆచారమును పాటించుచు, 'మహావ్రతి' అనిపించుకున్న వీరశైవుడు పరమభక్తితో తన గురువును, మరియు ఇష్టలింగమును ఎల్లప్పుడూ పూజించుచుండవలెను.

*ఇతి భక్తమార్గక్రియాస్థలం పరిసమాప్తమ్*
భక్తమార్గక్రియాస్థలము ముగిసినది.

## *10.* అథ ఉభయస్థలమ్
### ఉభయస్థలము

**గురోరభ్యర్చనేనాపి**
**సాక్షాదభ్యర్చితః శివః ।**



**తయోర్నాస్తి భిదా కించిత్**
**ఏకత్వాత్ తత్త్వరూపతః ॥ 9-51**

గురువును అర్చించుట ద్వారా సాక్షాత్ శివుడే అర్చించబడు చున్నాడు. తాత్త్వికముగా వారిలో ఏకత్వమున్నందున వారిద్దరికీ ఏమాత్రమూ భేదముండదు.

**యథా దేవే జగన్నాథే**
**సర్వానుగ్రహకారకే ।**
**తథా గురువరే కుర్యాత్**
**ఉపచారాన్ దినే దినే ॥ 9-52**

శివభక్తుడు అందరినీ అనుగ్రహించు జగన్నాథుడైన భగవంతుని ప్రతినిత్యము ఉపచారములతో పూజించినట్లే గురువును కూడా పూజించాలి.

**అప్రత్యక్షో మహాదేవః**
**సర్వేషామాత్మమాయయా।**
**ప్రత్యక్షో గురురూపేణ**
**వర్తతే భక్తిసిద్ధయే ॥ 9-53**

తన మాయాప్రభావముతో అందరికీ అగుపించని (అప్రత్యక్షుడైన) పరమేశ్వరుడు, భక్తులలో భక్తిని సిద్ధింపచేయుటకు గురురూపమున ప్రత్యక్షముగా అగుపించుచున్నాడు.

**శివజ్ఞానం మహాఘోర-**
**సంసారార్ణవతారకమ్ ।**
**దీయతే యేన స గురుః**
**కస్య వంద్యో న జాయతే ॥ 9-54**

మహాభయంకరమైన సంసారసాగరతీరమును చేర్చు శివజ్ఞానమును ప్రసాదించు వాడే గురువు. అటువంటి గురువు ఎవడికి పూజ్యుడు కాదు? (అంటే అతడు అందరికీ వంద్యుడని తాత్పర్యము)

**యత్కటాక్షకలామాత్రాత్**
**పరమానందలక్షణమ్ ।**
**లభ్యతే శివరూపత్వమ్**
**స గురుః కేన నార్చితః ॥ 9-55**

గురువుయొక్క కృపాకటాక్షలేశమాత్రము చేతనే పరమానంద స్వరూపమయిన శివస్వరూపము లభించుచున్నది, అటువంటి గురువు ఎవరిచేత అర్చించబడదు? (అంటే అతడు అందరికి ఆరాధ్యుడు).

**హితమేవ చరేన్నిత్యమ్**
**శరీరేణ ధనేన చ ।**
**ఆచార్యస్యోపశాంతస్య**
**శివజ్ఞానమహానిధేః ॥ 9-56**

శివజ్ఞానమహానిధి, శాంతచిత్తుడు అయిన ఆచార్యునకు



(శిష్యుడయినవాడు) తన శరీరముచేతను, సంపదచేతను అనునిత్యము హితమును (సుఖమును) మాత్రమే కలుగచేయవలెను.

**గురోరాజ్ఞాం న లంఘేత**
**సిద్ధికామీ మహామతిః ।**
**తదాజ్ఞాలంఘనేనాపి**
**శివాజ్ఞాచ్ఛేదకో భవేత్ ॥ 9-57**

మోక్షమును కోరు వివేకవంతుడైన శిష్యుడు, గురువు యొక్క ఆజ్ఞను జవదాటరాదు. ఒకవేళ గురు ఆజ్ఞను దాటినవాడు శివునాజ్ఞను ఉల్లంఘించినవాడవుతాడు.

ఇతి ఉభయస్థలం పరిసమాప్తమ్
ఉభయస్థలము ముగిసినది

## *11. అథ త్రివిధసంపత్తిస్థలమ్*
## త్రివిధసంపత్తిస్థలము

**యథా గురౌ యథా లింగే**
**భక్తిమాన్ పరివర్తతే ।**
**జంగమే చ తథా నిత్యమ్**
**భక్తిం కుర్యాద్ విచక్షణః ॥ 9-58**

విచక్షణు(వివేకసంపన్ను)డైన శివభక్తుడు తన గురువుపట్ల,

ఆరాధించు ఇష్టలింగముపట్ల ఎటువంటి భక్తిని కలిగి వున్నాడో, అటువంటి భక్తిని జంగముని పట్లనూ ప్రతినిత్యము ప్రదర్శించవలెను.

**ఏక ఏవ శివః సాక్షాత్**
**సర్వానుగ్రహకారకః ।**
**గురుజంగమలింగాత్మా**
**వర్తతే భుక్తిముక్తిదః ॥ 9-59**

ఒక్కడే అయిన శివుడు స్వయముగా తానే గురు-లింగ-జంగములను మూడు రూపములను ధరించి, (తన నర్చించు) భక్తులకు భుక్తిని ముక్తిని ప్రసాదించుచున్నాడు.

**లింగం చ ద్వివిధం ప్రోక్తమ్**
**జంగమాజంగమాత్మనా ।**
**అజంగమే యథా భక్తిః**
**జంగమే చ తథా స్మృతా ॥ 9-60**

జంగమలింగము, అజంగమలింగము అని లింగము రెండు విధములు. అజంగమలింగము (స్థిరలింగము) నందు భక్తిని కలిగివున్నట్లే జంగమలింగమునందును భక్తిని కలిగివుండవలెను.

**అజంగమం తు యల్లింగమ్**
**మృచ్ఛిలాదివినిర్మితమ్ ।**



**తద్వరం జంగమం లింగమ్**
**శివయోగీతి విశ్రుతమ్॥ 9-61**

మట్టి, శిలలు వంటి పదార్థములతో తయారుచేయబడిన లింగము అజంగమలింగము. దానికన్ననూ శ్రేష్ఠమైనది జంగమలింగము. అదియే శివయోగి యని ప్రసిద్ధమైయున్నది.

**అచరే మంత్రసంస్కారాత్**
**లింగే వసతి శంకరః ।**
**సదాకాలం వసత్యేవ**
**చరలింగే మహేశ్వరః ॥ 9-62**

అచర(అజంగమ)లింగములో మంత్రసంస్కారముల ప్రభావముతోశంకరుడు నివసించును. ఇక చరలింగము(శివయోగి)లో మహేశ్వరుడు ఎల్లకాలము నివసించుచుండును.

**శివయోగిని యద్దత్తమ్**
**తదక్షయఫలం భవేత్ ।**
**తస్మాత్ సర్వప్రయత్నేన**
**తస్మై దేయం మహాత్మనే ॥ 9-63**

శివయోగికి ఇవ్వబడు దానము అక్షయమైన (అనంతమైన) ఫలితముల నిచ్చును. అందువలన అన్ని విధములా ప్రయత్న పూర్వకముగా మహాత్ముడైన శివయోగికి దానమీయవలెను.

**యత్ఫలం లభతే జంతుః**
**పూజయా శివయోగినః ।**
**తదక్షయమితి ప్రోక్తమ్**
**సకలాగమపారగైః ॥ 9-64**

(అటువంటి) శివయోగులనర్చించుట వలన జీవుడు పొందు ఫలము అక్షయమైనదని ఆగమవిదులు వక్కాణించుచున్నారు.

**నావమన్యేత కుత్రాపి**
**శివయోగినమాగతమ్ ।**
**అవమానాద్భవేత్తస్య**
**దుర్గతిశ్చ న సంశయః ॥ 9-65**

యింటికివచ్చిన శివయోగిని (అంతరంగ బహిరంగములలో) ఎటువంటి పరిస్థితులలోను అవమానించరాదు. అవమానించినవాడు నిస్సందేహముగా దుర్గతిని పొందుచున్నాడు.

**శివయోగీ శివః సాక్షాత్**
**ఇతి కైంకర్యభక్తితః ।**
**పూజయేదాదరేణైవ**
**యథా లింగం యథా గురుః ॥ 9-66**

ఇష్టలింగమును, (దానిని ప్రసాదించిన) గురువును ఎంతటి



ఆదరముతో శివభక్తుడు పూజించుచున్నాడో, అంతే ఆదరముతో, భక్తితో శివయోగిని (సాక్షాత్ శివునిగా భావించి) కింకరభావముతో పూజించవలెను.

ఇతి త్రివిధసంపత్తిస్థలం పరిసమాప్తమ్ ।
త్రివిధసంపత్తిస్థలము ముగిసినది.

## *12.* అథ చతుర్విధసారాయస్థలమ్

### చతుర్విధసారాయస్థలము

**పాదోదకం యథా భక్త్యా**
**స్వీకరోతి మహేశితుః ।**
**తథా శివాత్మనోర్నిత్యమ్**
**గురుజంగమయోరపి ॥ 9-67**

శివభక్తుడైనవాడు మహేశుని (ఇష్టలింగముయొక్క) పాదోదకమును ఎంతటి భక్తితో స్వీకరించుచున్నాడో, అంతటి భక్తితో శివస్వరూపులయిన గురు, జంగముల పాదోదకమును కూడా నిత్యము స్వీకరించవలెను.

**సర్వమంగలమాంగల్యమ్**
**సర్వపావనపావనమ్ ।**
**సర్వసిద్ధికరం పుంసామ్**
**శంభోః పాదాంబుధారణమ్॥ 9-68**

శంభుని (ఇష్టలింగముయొక్క) పాదోదకమును ధరించుట

(స్వీకరించుట) సమస్త మంగళములకన్ననూ మంగళకరమైనది, పవిత్రమైన వాటికన్నా అతిపవిత్రమైనది. సాధనచేయు మానవులకు సర్వసిద్ధులను కలుగజేయుచున్నది.

**శిరసా ధారయేద్యస్తు**
**పత్రం పుష్పం శివార్పితమ్ ।**
**ప్రతిక్షణం భవేత్ తస్య**
**పౌండరీకక్రియాఫలమ్॥ 9-69**

శివునికి సమర్పించిన పత్ర, పుష్పాదులను ఎవరు తమ తలలపై ధరించుచున్నారో వారు ప్రతిక్షణము పౌండరీక యాగము చేసినవారు పొందు ఫలమును పొందుచున్నారు.

**భుంజీయాద్ రుద్రభుక్తాన్నమ్**
**రుద్రపీతం జలం పిబేత్।**
**రుద్రాఘ్రాతం సదా జిఘ్రేత్**
**ఇతి జాబాలికీ శ్రుతిః॥ 9-70**

'రుద్రభుక్తమైన (రుద్రునికి నివేదించిన) అన్నప్రసాదమునే భుజించవలెను. రుద్రపీతమైన (రుద్రునికర్పించిన) నీటినే త్రాగవలెను. రుద్రదాస్వాదించిన పుష్పగంధాదులనే ఆస్వాదించవలెను' అని జాబాలికీ శ్రుతి (జాబాలోపనిషత్) చెప్పుచున్నది.



**అర్పయిత్వా నిజే లింగే**
**పత్రం పుష్పం ఫలం జలమ్।**
**అన్నాద్యం సర్వభోజ్యం చ**
**స్వీకుర్యాద్ భక్తిమాన్నరః॥ 9-71**

భక్తిసంపన్నుడైన మానవుడు పత్రము-పుష్పము-ఫలము- జలము- అన్నము మొదలైన సమస్తభోజ్యపదార్థములను నిజ (ఇష్ట)లింగమునకు సమర్పించిన తరువాతనే (తాను) భుజించవలెను.

**గురుత్వాత్ సర్వభూతానామ్**
**శంభోరమితతేజసః ।**
**తస్మై నివేదితం సర్వమ్**
**స్వీకార్యం తత్పరాయణైః ॥ 9-72**

అపరిమితతేజస్సంపన్నుడైన శంభువు సమస్తజీవులకు (జ్ఞానదాత అయిన) గురువు. అందువలన అతని యందు శ్రద్ధాభక్తులు గలవారు అతనికి నైవేద్యముగా నివేదించిన సమస్తమును భక్తితో స్వీకరించవలెను.

**యే లింగధారిణో లోకే**
**యే శివైకపరాయణాః ।**
**తేషాం తు శివనిర్మాల్యమ్**
**ఉచితం నాన్యజంతుషు॥ 9-73**

లోకములో ఇష్టలింగధారులయినవారికి శివుని పరదైవముగా అర్చించువారికి మాత్రమే శివనిర్మాల్యము సేవించదగినది. ఇతర జీవులకు (శివభక్తులు కానివారికి) అది యోగ్యమైనది కాదు.

**అన్నజాతే తు భక్తేన**
**భుజ్యమానే శివార్పితే ।**
**సిక్థే సిక్థేఽశ్వమేధస్య**
**యత్ఫలం తదవాప్యతే॥ 9–74**

శివునికి నివేదించిన అన్నాదులను భుజించు శివభక్తుడు ఒక్కొక్క ముద్దకు ఒక్కొక్క అశ్వమేధయాగ ఫలమును పొందుచున్నాడు.

**నిర్మాల్యం నిర్మలం శుద్ధమ్**
**శివేన స్వీకృతం యతః।**
**నిర్మలైస్తత్పరైర్ధార్యమ్**
**నాన్యైః ప్రాకృతజంతుభిః॥ 9–75**

శివుని చేత స్వీకరించబడిన నిర్మాల్యము (మలరహితమై) పరిశుద్ధమయినది. నిర్మలురు శివతత్పరులు అయిన శివభక్తులు మాత్రమే నిర్మాల్యమును ధరించ సమర్థులు. సామాన్యులయిన ఇతర జీవులు దానిని స్వీకరించ యోగ్యులు కారు.



**శివభక్తివిహీనానామ్**
**జంతూనాం పాపకర్మణామ్ ।**
**విశుద్ధే శివనిర్మాల్యే**
**నాధికారోఽస్తి కుత్రచిత్ ॥ 9–76**

శివభక్తిరహితులు, పాపకర్ములు అయిన మానవులకు విశుద్ధమైన శివనిర్మాల్యమును పొందు అధికారము ఎప్పుడూ కలగదు.

**శివలింగప్రసాదస్య**
**స్వీకారాద్యత్ఫలం భవేత్।**
**తథా ప్రసాదస్వీకారాద్**
**గురుజంగమయోరపి ॥ 9–77**

శివలింగము(ఇష్టలింగము)యొక్క ప్రసాదస్వీకారము వలన ఏ ఫలము పొందబడుచున్నదో, అదే ఫలము గురువు మరియు జంగముల ప్రసాదస్వీకారము వలనను కూడా సిద్ధించును.

**తస్మాద్ గురుం మహాదేవమ్**
**శివయోగినమేవ చ ।**
**పూజయేత్ తత్ప్రసాదాన్నమ్**
**భుంజీయాత్ ప్రతివాసరమ్॥ 9–78**

అందువలన గురువును, మహాదేవుని (ఇష్టలింగమును), శివయోగిని ప్రతినిత్యము పూజించవలెను. అటులనే వారి ప్రసాదమును భుజించవలెను.

ఇతి చతుర్విధసారాయస్థలం పరిసమాప్తమ్ ।

చతుర్విధసారాయస్థలము ముగిసినది.

## దానత్రయస్థలమ్
## దానత్రయస్థలము

### *13.* అథ సోపాధిదానస్థలమ్
### సోపాధిదానస్థలము

**శివలింగే శివాచార్యే**
**శివయోగిని భక్తిమాన్ ।**
**దానం కుర్యాద్ యథాశక్తి**
**తత్ప్రసాదయుతః సదా॥ 9-79**

భక్తిసంపన్నుడయిన సాధకుడు శివలింగమును (లింగ), శివాచార్యులను (గురు), శివయోగులను (జంగమ) పూజించి, ప్రసాదమును పొందినవాడై, వారలకు తన శక్త్యానుసారము దానములీయవలెను.

**దానం చ త్రివిధం ప్రోక్తమ్**
**సోపాధినిరుపాధికమ్।**
**సహజం చేతి సర్వేషామ్**
**సర్వతంత్రవిశారదైః॥ 9-80**



సర్వతంత్రవిశారదులు (శివాగమవేత్తలు) భక్తులందరికీ సోపాధికదానము, నిరుపాధికదానము, సహజదానము అను మూడు విధములైన దానములను విధించియున్నారు.

**ఫలాభిసంధిసంయుక్తమ్**
**దానం యద్విహితం భవేత్।**
**తత్ సోపాధికమాఖ్యాతమ్**
**ముముక్షుభిరనాదృతమ్॥ 9-81**

కేవలం ఫలాపేక్షతో చేయు దానము సోపాధికదానమని పిలువబడినది. ముముక్షువులయిన వారికి ఈ దానము ఆచరించదగినది కాదు.

ఇతి సోపాధిదానస్థలం పరిసమాప్తమ్ ।

సోపాధిదానస్థలము ముగిసినది.

### *14.* అథ నిరుపాధిదానస్థలమ్
### నిరుపాధిదానస్థలము

**ఫలాభిసంధినిర్ముక్తమ్**
**ఈశ్వరార్పితకాంక్షితమ్।**
**నిరుపాధికమాఖ్యాతమ్**
**దానం దానవిశారదైః॥ 9-82**

ఎటువంటి ఫలాపేక్ష నాశించక కేవలము ఈశ్వరార్పణబుద్ధితో చేయు దానము నిరుపాధికదానమని దానవిశారదులచేత చెప్పబడినది.

ఇతి నిరుపాధిదానస్థలం పరిసమాప్తమ్ ।

నిరుపాధిదానస్థలము ముగిసినది.

## *15. అథ సహజదానస్థలమ్*

## సహజదానస్థలము

**అదాతృదాతృదేయానామ్**
**శివభావం విచింతయన్ ।**
**ఆత్మనోఽ కర్తృభావం చ**
**యద్దత్తం సహజం భవేత్॥ 9-83**

దానమును స్వీకరించువాడు, దానమునిచ్చువాడు, దానముగా ఇవ్వబడు వస్తువు ఈ మూడింటిని శివస్వరూపములని భావించి, తనయందు అకర్తృత్వభావనతో (నేను చేయుచున్నానను భావము లేకుండా) చేయు దానము సహజదానము.

**సహజం దానముత్కృష్టమ్**
**సర్వదానోత్తమోత్తమమ్ ।**
**శివజ్ఞానప్రదం పుంసామ్**
**జన్మరోగనివర్తకమ్॥ 9-84**



ఈ సహజదానము సర్వోత్కృష్టమైనది, దానములన్నిటిలోను ఉత్తమోత్తమమైనది. సహజదానము చేయు మానవులకు అది శివజ్ఞానప్రదాయకము, జన్మ(భవ)రోగ నివారకము అగుచున్నది.

**శివాయ శివభక్తాయ**
**దీయతే యది కించన ।**
**భక్త్యా తదపి విఖ్యాతమ్**
**సహజం దానముత్తమమ్॥ 9-85**

శివునకు లేదా శివభక్తునకు అత్యంతభక్తితో ఎటువంటి దానమునిచ్చినను, అది ఉత్తమమయిన సహజదానమని పేర్కొనబడినది.

**దానాత్ స్వర్ణసహస్రస్య**
**సత్పాత్రే యత్ఫలం భవేత్।**
**ఏకపుష్పప్రదానేన**
**శివే తత్ఫలమిష్యతే॥ 9-86**

సత్పాత్రుడైన అర్తికి వేయిబంగారు నాణెములను దానముచేయుట వలన సిద్ధించు ఫలము శివునికి (శివలింగమునకు) ఒక్క పుష్పమును సమర్పించుట వలన పొందవచ్చును.

**శివ ఏవ పరం పాత్రమ్**
**సర్వవిద్యానిధిర్గురుః ।**

**తస్మై దత్తం తు యత్కించిత్**
**తదనంతఫలం భవేత్ ॥ 9-87**

సర్వ విద్యానిలయుడు, అందరికీ గురుస్థానమునందున్న శివుడొక్కడే (దానమునకు) సత్పాత్రుడు. అందువలన అతనికి దానమిచ్చు వస్తువు ఎంత చిన్నదయినను అనంతఫలములను కలుగజేయుచున్నది.

**శివయోగీ శివః సాక్షాత్**
**శివజ్ఞానమహోదధిః ।**
**యత్కించిద్దీయతే తస్మై**
**తద్దానం పారమార్థికమ్ ॥ 9-88**

శివజ్ఞానసముద్రుడైన శివయోగియు సాక్షాత్తు పరమశివుడే. అటువంటివానికి ఏ చిన్న వస్తువును దానముచేసినా అది పారమార్థికమైన సహజదానమనబడును.

**శివయోగీ మహత్పాత్రమ్**
**సర్వేషాం దానకర్మణి ।**
**తస్మాన్నాస్తి పరం కించిత్**
**పాత్రం శాస్త్రవిచారతః ॥ 9-89**

దానము చేయువారందరికీ శివయోగి ఒక్కడే మహా(దాన) పాత్రుడు. అందువలన శాస్త్రవిధిననుసరించి, శివయోగికన్నను శ్రేష్ఠులైన దానపాత్రులు లేనేలేరు.



**భిక్షామాత్రప్రదానేన**
**శాంతాయ శివయోగినే ।**
**యత్ఫలం లభ్యతే నైతద్**
**యజ్ఞకోటిశతైరపి॥ 9-90**

శాంతస్వభావుడైన శివయోగికి భిక్ష పెట్టినందువలన కలుగు ఫలము శతకోటియజ్ఞముల చేసిననూ లభించదు.

**శివయోగిని సంతృప్తే**
**తృప్తో భవతి శంకరః ।**
**తత్తృప్త్యా తన్మయం విశ్వమ్**
**తృప్తిమేతి చరాచరమ్॥ 9-91**

శివయోగి సంతృప్తుడైన శంకరుడు సంతృప్తుడగును. శంకరుడు సంతృప్తుడయిన అతనిలో అణిగివున్న చరాచరప్రపంచమంతయు సంతృప్తిని పొందును.

**తస్మాత్ సర్వప్రయత్నేన**
**యేన కేనాపి కర్మణా ।**
**తృప్తిం కుర్యాత్ సదా కాలమ్**
**అన్నాద్యైః శివయోగినః॥ 9-92**

అందువలన ప్రతి యొక్కరు అన్నివిధములా ప్రయత్నించి ఏదో

ఒక కర్మ ననుసరించి శివయోగిని అన్నాదులతో అనునిత్యము సంతృప్తుని చేయవలెను.

**నిరుపాధికచిద్రూప-**
**పరానందాత్మవస్తుని ।**
**సమాప్తం సకలం యస్య**
**స దానీ శంకరః స్వయమ్॥ 9-93**

ఉపాధిరహితము,చైతన్యరూపము, పరానందస్వరూపము అయిన ఆత్మపదార్థములో ఏ దాతయొక్క సమస్తవస్తువులు సమాప్తములగుచున్నవో అటువంటి వదాన్యుడు స్వయముగా శంకరుడే అగుచున్నాడు.

**ఉక్తాఖిలాచారపరాయణోఽసౌ**
**సదా వితన్వన్ సహజం తు దానమ్ ।**
**బ్రహ్మాదిసంపత్సు విరక్తచిత్తో**
**భక్తో హి మాహేశ్వరతాముపైతి ॥ 9-94**

(-ఇంద్రవజ్రా)

భక్తస్థలమునందు విధించిన ఆచారములలో (పిండస్థలముతో ఆరంభించి సహజదానస్థలము వరకు వున్న స్థలములలో) విహరించు భక్తస్థలసాధకుడు ఎల్లప్పుడూ సహజదానమును చేయుచు, బ్రహ్మ, విష్ణువు మొదలయిన దేవతల సంపదలపట్ల విరక్తచిత్తుడై (నిస్పృహుడై) మాహేశ్వరస్థితిని పొందుచున్నాడు.



ఇతి సహజదానస్థలం పరిసమాప్తమ్ ।

సహజదానస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ భక్తమార్గక్రియాదిసప్తవిధస్థల ప్రసంగోనామ నవమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'భక్తమార్గ క్రియాదిసప్తవిధస్థల ప్రసంగ'మను తొమ్మిదివ పరిచ్ఛేదము ముగిసినది.



# దశమః పరిచ్ఛేదః

## పదియవ పరిచ్ఛేదము

### మాహేశ్వరస్య నవవిధస్థలప్రసంగః

### మాహేశ్వరుని నవవిధస్థలప్రసంగము

**(79 శ్లోకములు)**

**II. మాహేశ్వరస్థలమ్**

**మాహేశ్వరస్థలము**

**అగస్త్య ఉవాచ :-**

**భక్తస్థలం సమాఖ్యాతమ్**
**భవతా గణనాయక ।**
**కేన వా ధర్మభేదేన**
**భక్తో మాహేశ్వరో భవేత్ ॥ 10-1**

**అగస్త్యుల విన్నపము –**

రేణుక గణనాయకా! భక్తస్థలమును గురించి మీరు చక్కగా వివరించినారు. ఇలా (శివునిపట్ల ఆసక్తిని పెంచుకున్న) భక్తుడు ఎటువంటి ధర్మములను అనుసరించుట వలన మాహేశ్వరుడగుచున్నాడో తెలియజేయ కోరుచున్నాను.



**శ్రీరేణుక ఉవాచ :-**

**కేవలే సహజే దానే**
**నిష్ణాతః శివతత్పరః ।**
**బ్రహ్మాదిస్థానవిముఖో**
**భక్తో మాహేశ్వరః స్మృతః ॥ 10-2**

**శ్రీరేణుకుల సమాధానము –**

కేవలము సహజదానములో నిష్ణాతుడై, శివునియందు మాత్రమే ఏకనిష్ఠతను కలిగి, బ్రహ్మాది పదవులపట్ల విముఖుడైన (నిస్పృహుడైన) భక్తుడు 'మాహేశ్వరుడ'ని పిలువబడుచున్నాడు.

**భక్తేర్యదా సముత్కర్షో**
**భవేద్ వైరాగ్యగౌరవాత్ ।**
**తదా మాహేశ్వరః ప్రోక్తో**
**భక్తః స్థిరవివేకవాన్ ॥ 10-3**

వైరాగ్యభావనాతిశయము వలన భక్తియందు ఉత్కృష్టస్థితిని పొందినప్పుడు స్థిరమైనవివేకము కలిగిన భక్తుడు మాహేశ్వరుడని పిలువబడుచున్నాడు.

**మాహేశ్వరస్థలం వక్ష్యే**
**యథోక్తం శంభునా పురా ।**

మాహేశ్వరప్రశంసాఽఽదౌ
లింగనిష్ఠా తతః పరమ్ ॥ 10-4

పూర్వాశ్రయనిరాసశ్చ
తథాద్వైతనిరాకృతిః ।
ఆహ్వానవర్జనం పశ్చాత్
అష్టమూర్తినిరాకృతిః ॥ 10-5

సర్వగత్వనిరాసశ్చ
శివత్వం శివభక్తయోః ।
ఏవం నవవిధం ప్రోక్తమ్
మాహేశ్వరమహాస్థలమ్॥ 10-6

ఆదితః క్రమశో వక్ష్యే
స్థలభేదస్య లక్షణమ్ ।
సమాహితేన మనసా
శ్రూయతాం భవతా మునే॥ 10-7

పూర్వము శివునిచేత చెప్పబడిన రీతిగా మాహేశ్వరస్థలమును గురించి చెప్పెదను. (మాహేశ్వరస్థలము తొమ్మిది విధములు.) మొదటిది మాహేశ్వరప్రశంసాస్థలము, రెండవది లింగనిష్ఠాస్థలము, మూడవది



పూర్వాశ్రనిరసనస్థలము, నాలుగవది అద్వైతనిరసనస్థలము, అయిదవది ఆహ్వాననిరసనస్థలము, ఆరవది అష్టమూర్తినిరసనస్థలము, ఏడవది సర్వగత్వనిరసనస్థలము, ఎనిమిదవది శివత్వస్థలము (శివజగన్మయ స్థలము), తొమ్మిదవది శివభక్తస్థలము (భక్తదేహికలింగస్థలము). ఈ విధముగా మాహేశ్వరస్థలములో తొమ్మిది అవాంతరస్థలములున్నవి. మొదటి దానితో ఆరంభించి వరుసగా ఆయా స్థలముల లక్షణములను చెప్పెదను. ఓ మునిసత్తమా! ఏకాగ్రమైన మనసుతో వినుము.

### *16. అథ మాహేశ్వరప్రశంసాస్థలమ్*

### మాహేశ్వరప్రశంసాస్థలము

విశ్వస్మాదధికో రుద్రో
విశ్వానుగ్రహకారకః ।
ఇతి యస్య స్థిరా బుద్ధిః
స వై మాహేశ్వరః స్మృతః ॥ 10-8

'రుద్రుడు విశ్వముకన్నా గొప్పవాడు, విశ్వమును అనుగ్రహించ గల సమర్థుడు' అన్న భావనలు ఎవని బుద్ధిలో స్థిరముగా పాదుచేసుకున్నవో అటువంటి భక్తుడే 'మాహేశ్వరుడు' అని స్మరించబడినాడు.

బ్రహ్మాద్యైర్మలినప్రాయైః
నిర్మలే పరమేశ్వరే ।

**సామ్యోక్తిం యో న సహతే**
**స వై మాహేశ్వరాభిధః॥ 10-9**

(ఏదో ఒక దోషముతో) మలినప్రాయులయిన బ్రహ్మాదిదేవతలు, నిర్మలుడైన పరమేశ్వరుడు, వీరిద్దరూ సమానులని చెప్పు వాక్కును ఎవడు సహించడో వాడు మాహేశ్వరుడు.

**ఈశ్వరః సర్వభూతానామ్**
**బ్రహ్మాదీనాం మహానితి।**
**బుద్ధియోగాత్ తదాసక్తో**
**భక్తో మాహేశ్వరః స్మృతః ॥ 10-10**

సమస్త ప్రాణికోటికి, బ్రహ్మాదిదేవతలకు ఈశ్వరుడే నాయకుడు అను విషయమును బుద్ధియోగముతో గ్రహించి అటువంటి ఈశ్వరుని యందు ఆసక్తుడైన భక్తుడే మాహేశ్వరుడు అని పిలువబడినాడు.

**బ్రహ్మాదిదేవతాజాలమ్**
**మోహితం మాయయా సదా ।**
**అశక్తం ముక్తిదానే తు**
**క్షయాతిశయసంయుతమ్ ॥ 10-11**

బ్రహ్మాదిదేవతాసమూహము ఎల్లప్పుడూ మాయచేత కప్పబడి క్షయాతిశయాదులను కలిగియుండును. (గనుక వారు ముక్తి నొసగ సమర్థులుకారని అర్థము).



**అనాదిముక్తో భగవాన్**
**ఏక ఏవ మహేశ్వరః ।**
**ముక్తిదశ్చేతి యో వేద**
**స వై మాహేశ్వరః స్మృతః॥ 10-12**

భగవంతు(షడ్గుణైశ్వర్యసంపన్ను)డయిన మహేశ్వరుడు ఒక్కడే అనాదిముక్తుడు (నిత్యముక్తుడు). మహేశ్వరుడొక్కడే ఇతరులకు ముక్తి నివ్వగలిగినవాడు అని ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడే మాహేశ్వరుడు అని అనబడినాడు.

**క్షయాతిశయసంయుక్తా**
**బ్రహ్మవిష్ణ్వాదిసంపదః ।**
**తృణవన్మన్యతే యుక్త్యా**
**వీరమాహేశ్వరః సదా ॥ 10-13**

బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతల సంపదలు (పదవులు) క్షయ మరియు అతిశయముల(ఉత్థానపతనముల)తో కూడుకున్నవి. ఈ పదవులను యుక్తితో గడ్డిపోచలవలె తిరస్కరించువాడే వీరమాహేశ్వరుడు.

**శబ్దస్పర్శాదిసంపన్నే**
**సుఖలేశే తు నిఃస్పృహః ।**
**శివానందే సముత్కంఠో**
**వీరమాహేశ్వరో భవేత్॥ 10-14**

శబ్ద స్పర్శాది విషయముల వలన కలుగు అల్పసుఖములపట్ల నిస్పృహుడై, నిరాసక్తుడై నిత్యమైన శివానందప్రాప్తిపట్ల తీవ్రమైన ఉత్కంఠను కలిగివున్నవాడే వీరమాహేశ్వరుడు అవుతాడు.

**పరస్త్రీసంగనిర్ముక్తః**
**పరద్రవ్యపరాఙ్ముఖః ।**
**శివార్థకార్యసంపన్నః**
**శివాగమపరాయణః॥ 10-15**

పరస్త్రీసంగమము చేయనివాడు, పరుల ద్రవ్యాదుల (వస్తువుల) పట్ల విముఖుడు (పరాఙ్ముఖుడు), సదాశివునికి సంబంధించిన కార్యముల నిర్వహించువాడు, శివాగమములను అధ్యయనము చేయువాడు–

**శివస్తుతిరసాస్వాద –**
**మోదమానమనాః శుచిః ।**
**శివోత్కర్షప్రమాణానామ్**
**సంపాదనసముద్యతః॥ 10-16**

శివ స్తోత్రరసాస్వాదము చేత సంతుష్టుడైన మనస్సుకలవాడు, శివుని సర్వశ్రేష్ఠత్వమును నిరూపించుటకు అవసరమైన ప్రమాణముల అన్వేషణమున నిమగ్నుడు –

**నిర్మమో నిరహంకారో**
**నిరస్తక్లేశపంజరః ।**



**అస్పృష్టమదసంబంధో**
**మాత్సర్యావేశవర్జితః ॥ 10-17**

మమకారరహితుడు, అహంకారములేనివాడు, (అవిద్యా–అస్మితా–రాగ– ద్వేష–అభినివేశమను) అయిదు క్లేశములతో కూడుకున్న శరీర పంజరమును త్యజించినవాడు, మదాదుల సంబంధస్పర్శ లేనివాడు, మాత్సర్యాది ఆవేశములకు లోనుకానివాడు –

**నిరస్తమదనోన్మేషో**
**నిర్ధూతక్రోధవిప్లవః ।**
**సదా సంతుష్టహృదయః**
**సర్వప్రాణిహితే రతః॥ 10-18**

కామోద్రేకములు లేనివాడు, క్రోధ(కోప)ము వలన కలుగు వికారములను విదిలించుకున్నవాడు, నిరంతరము సంతుష్టమైన హృదయము కలవాడు, సమస్తజీవుల సంక్షేమసాధనలో మునిగినవాడు –

**నివారణసముద్యోగీ**
**శివకార్యవిరోధినామ్ ।**
**సహచారీ సదాకాలమ్**
**శివోత్కర్షాభిధాయిభిః॥ 10-19**

శివ(శుభ) కార్యములను విరోధించువారిని వారించుటలో సదా

ఉద్యుక్తుడైనవాడు, శివాధిక్యతను శివోత్కృష్టతను లోకములో ప్రచారము చేయువారికి ఎల్లవేళలా సహకరించువాడు –

**శివాపకర్షసంప్రాప్తౌ**
**ప్రాణత్యాగేఽప్యశంకితః।**
**శివైకనిష్ఠః సర్వాత్మా**
**వీరమాహేశ్వరో భవేత్॥ 10-20**

శివునికి ఆపాదించబడిన అపనిందను పరిహరించుటకై ప్రాణత్యాగము చేయుటకైనను వెనకాడనివాడు, శివుని (ఇష్టలింగము) యందు ఏకాగ్రచిత్తము గలవాడు, సర్వమును పరమాత్మస్వరూపముగా భావించువాడు, వీరమాహేశ్వరుడని పిలువబడుచున్నాడు.

*ఇతి మాహేశ్వరప్రశంసాస్థలం పరిసమాప్తమ్ ।*

మాహేశ్వరప్రశంసాస్థలము ముగిసినది

## *17. అథ లింగనిష్ఠాస్థలమ్*

## లింగనిష్ఠాస్థలము

**అస్య మాహేశ్వరస్యోక్తమ్**
**లింగనిష్ఠామహాస్థలమ్ ।**
**ప్రాణాత్యయేఽపి సంపన్నే**
**యదత్యాజ్యం విధీయతే ॥ 10-21**



(ఇంతకు ముందు చెప్పబడిన లక్షణములు గల) మాహేశ్వరుడయినవాడు ప్రాణత్యాగముచేయవలసివచ్చినను విడువకూడని విధులును ఈ లింగనిష్ఠామహాస్థలమున తెలుపబడుచున్నవి.

**అపగచ్ఛతు సర్వస్వమ్**
**శిరశ్ఛేదనమస్తు వా ।**
**మాహేశ్వరో న ముంచేత**
**లింపూజామహావ్రతమ్॥ 10-22**

తన సర్వసంపదలూ నశించినను, లేదా శిరశ్ఛేదము జరిగినను, (ఇష్ట)లింగపూజామహావ్రతమును మాత్రము వీరమాహేశ్వరుడు వదలరాదు.

**లింగపూజామకృత్వా తు**
**యే న భుంజంతి మానవాః।**
**తేషాం మహాత్మనాం హస్తే**
**మోక్షలక్ష్మీరుపస్థితా॥ 10-23**

ఇష్టలింగపూజను చేయనిదే ఏ మానవుడు భుజించడో అటువంటి మహాత్ముని హస్తమున మోక్షరూపమైన లక్ష్మి ఎల్లప్పుడు స్థిరనివాసముగా నుండును.

**కిమన్యైర్ధర్మకలిలైః**
**కీకషార్థప్రదాయిభిః।**

**సాక్షాన్మోక్షప్రదః శంభోః**
**ధర్మో లింగార్చనాత్మకః ॥ 10-24**

క్షుద్రఫలములను సంపాదించిపెట్టు ఇతర క్షుద్రములయిన ధర్మములననుసరించుట వలన ప్రయోజనమేమి? శివుని (ఇష్ట)లింగార్చనా రూపమయిన ధర్మము సాక్షాత్తుగా మోక్షమును ప్రసాదించుచున్నది.

**అర్పితేనాన్నపానేన**
**లింగే నియమపూజితే ।**
**యే దేహవృత్తిం కుర్వన్తి**
**మహామాహేశ్వరా హి తే ॥ 10-25**

(గురువు చెప్పిన) నియమములననుసరించి ఇష్టలింగమునకు సమర్పించిన అన్నపానాదులచేతనే దేహవృత్తిని సాగించు వారే వీరమాహేశ్వరులు.

**చిన్మయే శాంకరే లింగే**
**స్థిరం యేషాం మనః సదా।**
**విముక్తేతరసర్వార్థమ్**
**తే శివా నాత్ర సంశయః॥ 10-26**

ఎవరి మనస్సు (స్వర్గాది ఇతర యే) ఫలములను ఆశించకుండా ఎల్లప్పుడు చిన్మయమైన శివలింగము(ఇష్టలింగము)నందే స్థిరముగ నున్నదో



అటువంటి వారు సాక్షాత్తు శివస్వరూపులే. ఇందేమాత్రము సంశయము లేదు.

**లింగే యస్య మనో లీనమ్**
**లింగస్తుతిపరా చ వాక్ ।**
**లింగార్చనపరౌ హస్తౌ**
**స రుద్రో నాత్ర సంశయః ॥ 10-27**

ఎవరి మనస్సు (ఇష్ట) లింగపూజలో లీనమైయున్నదో, ఎవని వాక్కు శివస్తుతితో తన్మయమైయున్నదో, ఎవని చేతులు లింగార్చనలో నిరతములై యున్నవో అటువంటివాడు సాక్షాత్తు రుద్రుడే. అందులో సందేహము లేదు.

**లింగనిష్ఠస్య కిం తస్య**
**కర్మణా స్వర్గహేతునా ।**
**నిత్యానందశివప్రాప్తిః**
**యస్య శాస్త్రేషు నిశ్చితా॥ 10-28**

ఎవనికి శాస్త్రములందు నిత్యానందరూపమైన శివప్రాప్తి నిశ్చయించబడివున్నదో అటువంటి ఇష్టలింగార్చన నిష్ఠుడైన మాహేశ్వరునికి స్వర్గహేతువులైన (యజ్ఞయాగాది) కర్మలతో నేమిపని?

**లింగనిష్ఠాపరం శాంతమ్**
**భూతిరుద్రాక్షసంయుతమ్ ।**

**ప్రశంసంతి సదాకాలమ్**
**బ్రహ్మాద్యా దేవతా ముదా॥ 10-29**

విభూతిరుద్రాక్షలను ధరించి శాంతస్వభావముతో ఇష్టలింగార్చనా పరుడైన మాహేశ్వరుని బ్రహ్మాదిదేవతలు ఆనందముతో నిరంతరం ప్రశంసించుచున్నారు.

*ఇతి లింగనిష్ఠాస్థలం పరిసమాప్తమ్ ।*

లింగనిష్ఠాస్థలము ముగిసినది.

## *18. అథ పూర్వాశ్రయనిరసనస్థలమ్*

## పూర్వాశ్రయనిరసనస్థలము

**లింగైకనిష్ఠహృదయః**
**సదా మాహేశ్వరో జనః ।**
**పూర్వాశ్రయగతాన్ ధర్మాన్**
**త్యజేత్ స్వాచారరోధకాన్॥ 10-30**

ఎల్లప్పుడు హృదయమునందు ఇష్టలింగముపట్ల అత్యంత నిష్ఠను కలిగివున్న మాహేశ్వరుడు తన వీరశైవసిద్ధాంత ఆచరణకు ప్రతిబంధకములైన పూర్వాశ్రయపు ధర్మములను వదలిపెట్టవలెను.

**స్వజాతికులజాన్ ధర్మాన్**
**లింగనిష్ఠావిరోధినః ।**



**త్యజన్ మాహేశ్వరో జ్ఞేయః**
**పూర్వాశ్రయనిరాసకః॥ 10-31**

ఇష్టలింగనిష్టకు విరుద్ధములైన తన (పూర్వపు) జాతి మరియు కులమునకు సంబంధించిన (జనన మరణ సమయములందు పాటించు సూతకాది) ధర్మములను వదలిపెట్టిన మాహేశ్వరుడే పూర్వాశ్రయ నిరాసకుడని తెలియవలెను.

**శివసంస్కారయోగేన**
**విశుద్ధానాం మహాత్మనామ్।**
**కిం పూర్వకాలికైర్ధర్మైః**
**ప్రాకృతానాం హి తే మతాః॥ 10-32**

శివసంస్కారయోగము చేత పరిశుద్ధులైన మహాత్ములకు పూర్వాశ్రయము లేదా పూర్వకాలమున ఆచరించిన ధర్మము(కర్మము)లతో నేమి పని? ఆ పూర్వధర్మములు ప్రాకృతు (శివదీక్షా సంస్కారరహితు)లైన వారికి మాత్రమే సంబంధించినవి.

**శివసంస్కారయోగేన**
**శివధర్మానుషంగిణామ్ ।**
**ప్రాకృతానాం న ధర్మేషు**
**ప్రవృత్తిరుపపద్యతే ॥ 10-33**

శివ(దీక్షాది) సంస్కారయోగము వలన శివధర్మము ననుష్టించు వారికి ప్రాకృతములయిన ధర్మముల ననుసరించుట పొసగదు.

**విశుద్ధాః ప్రాకృతాశ్చేతి**
**ద్వివిధా మానుషాః స్మృతాః।**
**శివసంస్కారిణః శుద్ధాః**
**ప్రాకృతా ఇతరే మతాః॥ 10-34**

మానవులు విశుద్ధులని ప్రాకృతులని రెండు విధములు. శివదీక్షాదులచేత సంస్కృతులైనవారు శుద్ధులు. దీక్షాసంస్కారములు పొందని ఇతరులు ప్రాకృతులు అనబడుతున్నారు.

**వర్ణాశ్రమాదిధర్మాణామ్**
**వ్యవస్థా హి ద్విధా మతా ।**
**ఏకా శివేన నిర్దిష్టా**
**బ్రహ్మణా కథితాపరా ॥ 10-35**

వర్ణాశ్రమాది ధర్మాచరణవ్యవస్థ రెండు విధములు.ఒకటి శివునిచేత నిర్దిష్టమైనది, రెండవది బ్రహ్మచేత చెప్పబడినది.

**శివోక్తధర్మానిష్ఠా తు**
**శివాశ్రమనిషేవిణామ్ ।**



**శివసంస్కారహీనానామ్**
**ధర్మః పైతామహః స్మృతః॥ 10-36**

శివునిచే చెప్పబడిన ధర్మాచరణవ్యవస్థ శివాశ్రమ తత్పరులైన శివభక్తులకు (వీరశైవులకు) సంబంధించినది. శివసంస్కారము లేనివారికి ధర్మాచరణవ్యవస్థ బ్రహ్మచేత ప్రతిపాదించబడినది.

**శివసంస్కారయుక్తేషు**
**జాతిభేదో న విద్యతే ।**
**కాష్ఠేషు వహ్నిదగ్ధేషు**
**యథారూపం న విద్యతే ॥ 10-37**

అగ్నిలో కాల్చబడిన కట్టెలలో వాటి పూర్వరూపమెట్లు వుండదో, అలాగుననే శివసంస్కారమును పొందిన వారి(వీరశైవుల)లో వారి పూర్వపుజాతిభేదములు వుండవు.

**తస్మాత్సర్వ ప్రయత్నేన**
**శివసంస్కారసంయుతః ।**
**జాతిభేదం న కుర్వీత**
**శివభక్తే కదాచన ॥ 10-38**

అందువలన ప్రయత్నపూర్వకముగా శివసంస్కారసంపన్నులైన శివభక్తులలో ఏనాడును జాతిభేదములను ఎంచరాదు.

ఇతి పూర్వాశ్రయనిరసనస్థలమ్ ।

పూర్వాశ్రయనిరసనస్థలము ముగిసినది.

## 19. అథ సర్వాద్వైతనిరసనస్థలమ్

### సర్వాద్వైతనిరసనస్థలము

**పూజ్యపూజకయోర్లింగ-**
**జీవయోర్భేదవర్జనే ।**
**పూజాకర్మాద్యసంపత్తేః**
**లింగనిష్ఠావిరోధతః॥ 10-39**

పూజ్య (పూజింపబడేది), పూజకుడు (పూజించేవాడు)అయిన లింగము మరియు జీవుల మధ్య భేదము లేకపోతే (వేరనుభావన లేకపోతే) లింగనిష్ఠకు విరోధము మాత్రమే కాదు, పూజాదికర్మలకు కూడా అవకాశమే వుండదు.

**సర్వాద్వైతవిచారస్య**
**జ్ఞానాభావే వ్యవస్థితేః ।**
**భవేన్మాహేశ్వరః కర్మీ**
**సర్వాద్వైతనిరాసకః॥ 10-40**

సర్వాద్వైతవాదనకు అవసరమయిన తత్త్వజ్ఞానము యొక్క అభావము వీనియందు వుండుటచేత (ఇష్టలింగపూజా) కర్మి అయిన మాహేశ్వరుడు సర్వాద్వైతనిరాసకుడౌతాడు.



**ప్రేరకం శంకరం బుద్ధ్వా**
**ప్రేర్యమాత్మానమేవ చ ।**
**భేదాత్ తం పూజయేన్నిత్యమ్**
**న చాద్వైతపరో భవేత్॥ 10-41**

శంకరుని ప్రేరకునిగాను, తనను ప్రేరేపించబడినవాని (ప్రేర్యం)గాను తెలుసుకొని (భావించి) ప్రతి నిత్యము భేదభావముతోనే శివుని (ఇష్టలింగమును) పూజించవలెను. అంతేగాని అద్వైతభావనాపరుడు కారాదు.

**పతిః సాక్షాన్మహాదేవః**
**పశురేష తదాశ్రయః ।**
**అనయోః స్వామిభృత్యత్వమ్**
**అభేదే కథమిష్యతే ॥ 10-42**

సాక్షాత్తు మహాదేవుడయిన పరమేశ్వరుడు పతి (అధికారి). అతనిని ఆశ్రయించిన జీవుడు పశువు. వీరి మధ్య స్వామి-సేవక సంబంధమే గాని అభేద(ఐక్య)భావము ఎట్లు పొసగును?

**సాక్షాత్కృతం పరం తత్త్వమ్**
**యదా భవతి బోధతః ।**
**తదాఽద్వైతసమాపత్తిః**
**జ్ఞానహీనస్య న క్వచిత్ ॥ 10-43**

తత్త్వబోధ వలన పరతత్త్వము సాక్షాత్కారమయినపుడు అద్వైతస్థితి కలుగును. అయితే జ్ఞానహీనుడైన వానికి అది (అద్వైతస్థితి) ఏనాడూ కలుగదు.

**భేదస్య కర్మహేతుత్వాత్**
**వ్యవహారః ప్రవర్తతే ।**
**లింపూజాదికర్మస్థో**
**న చాద్వైతం సమాచరేత్ ॥ 10-44**

జీవేశ్వరులనడుమనున్న భేద వ్యవహారము శివపూజాది కర్మలకు హేతువగుచున్నది. అందువలన లింగపూజాది కర్మలందు నిరతుడైన మాహేశ్వరుడు అద్వైతమును అనుసరించరాదు.

**పూజాదివ్యవహారః స్యాత్**
**భేదాశ్రయతయా సదా ।**
**లింగపూజాపరస్తస్మాత్**
**నాద్వైతే నిరతో భవేత్ ॥ 10-45**

శివపూజాదివ్యవహారము భేదమునాశ్రయించిననే సాధ్యమగును. అందువలన లింగపూజాపరుడైన మాహేశ్వరుడు అద్వైతభావనా (సక్తుడు) నిరతుడు కారాదు.

ఇతి సర్వాద్వైతనిరసనస్థలం పరిసమాప్తమ్ ।

సర్వాద్వైతనిరసనస్థలము ముగిసినది.



## 20. అథ ఆహ్వాననిరసనస్థలమ్

### ఆహ్వాననిరసనస్థలము

**లింగార్చనపరః శుద్ధః**
**సర్వాద్వైతనిరాసకః ।**
**స్వేష్టలింగే శివాకారే**
**న తమావాహయేచ్ఛివమ్ ॥ 10-46**

(సదా) లింగార్చనాతత్పరుడై, (తద్వారా) నిత్యపరిశుద్ధుడై, సర్వాద్వైతభావనానిరాసకుడయిన మాహేశ్వరుడు శివస్వరూపమైన తన యిష్టలింగమునందు ఆ పరమశివుని (వచ్చి నివసించమని) ఆహ్వానించరాదు.

**యదా శివకలాయుక్తమ్**
**లింగం దద్యాన్మహాగురుః ।**
**తదారభ్య శివస్తత్ర**
**తిష్ఠత్యాహ్వానమత్ర కిమ్ ॥ 10-47**

మహాగురువు శివకలాత్మకమయిన ఇష్టలింగమును దీక్షద్వారా భక్తునికి ప్రదానము చేసిన క్షణము నుండి ఇష్ట లింగములో శివుడు ఉపస్థితుడై వున్నందున అతనిని మరలా ఆహ్వానించుట వలన ప్రయోజనమేమి? (ప్రయోజనము లేదని భావము).

**ససంస్కారేషు లింగేషు**
**సదా సన్నిహితః శివః ।**
**తత్రాహ్వానం న కర్తవ్యమ్**
**ప్రతిపత్తివిరోధకమ్ ॥ 10-48**

(గురువుచేత) సంస్కరించబడిన లింగములలో శివుడు సదా సన్నిహితుడై వుంటాడు. అందుచేత (ఒకసారి ఆహ్వానించిన తరువాత విసర్జన చేయనందున మరలా ఆహ్వానించడమన్నది) ప్రతిపత్తికి (భక్తికి) విరుద్ధమయినందున ఆహ్వానము చేయరాదు.

**నాహ్వానం న విసర్గం చ**
**స్వేష్టలింగే తు కారయేత్ ।**
**లింగనిష్ఠాపరో నిత్యం**
**ఇతి శాస్త్రస్య నిశ్చయః ॥ 10-49**

గనుక లింగనిష్ఠాపరుడైనవాడు తన ఇష్టలింగమునకు ఆహ్వానమునుగాని, విసర్జనను గాని ఎప్పుడూ చేయరాదని (వీరశైవ) శాస్త్ర నిర్ణయము.

ఇతి ఆహ్వాననిరసనస్థలం పరిసమాప్తమ్ ।
ఆహ్వాననిరసనస్థలము ముగిసినది.



## *21.* అథ అష్టమూర్తినిరసనస్థలమ్

### అష్టమూర్తినిరసనస్థలము

**యథాఽఽత్మశివయోరైక్యమ్**
**న మతం కర్మసంగినః ।**
**తథా శివాత్ పృథివ్యాదేః**
**అద్వైతమపి నేష్యతే ॥ 10-50**

కర్మసంగి (ఇష్టలింగపూజాత్మకమయిన కర్మనిష్ఠుడు) అయిన మాహేశ్వరునకు మరియు పరమశివునకు ఐక్యము (అద్వైతభావము) ఎట్లు సమ్మతము కాదో, అటులనే శివునకు పృథివ్యాది మహాభూతములకును అద్వైతము సమ్మతము కాదు (పొసగదు).

**పృథివ్యాద్యష్టమూర్తిత్వమ్**
**ఈశ్వరస్య ప్రకీర్తితమ్ ।**
**తదధిష్ఠాతృభావేన**
**న సాక్షాదేకభావతః ॥ 10-51**

పృథివ్యాదులు ఈశ్వరునియొక్క అష్టమూర్తులుగా చెప్పబడినవి. పృథివ్యాది మహాభూతములే సాక్షాత్తు ఈశ్వరుడు కావు. పృథివ్యాది మహాభూతములకు ఈశ్వరుడు అధిష్ఠాతృవు (ఆధారము) అయిఉన్నాడు.

**పృథ్వ్యాదికమిదం సర్వమ్**
**కార్యం కర్తా మహేశ్వరః ।**
**నైతత్సాక్షాన్మహేశో౭యమ్**
**కులాలో మృత్తికా యథా॥ 10-52**

పృథివ్యాదిసర్వభూతములు కార్యరూపములు. వీటికి (కారణమైన) కర్త పరమేశ్వరుడు. మట్టికుండ, కుమ్మరి వానికంటే వేరైనట్టే మహేశ్వరుడు పృథివ్యాదులకన్నా భిన్నమైనవాడు.

**పృథివ్యాద్యాత్మపర్యంత**
**ప్రపంచో హ్యష్టధా స్థితః ।**
**తనురీశస్య చాత్మా౭యమ్**
**సర్వతత్త్వనియామకః ॥ 10-53**

పృథివితో ఆరంభించి ఆత్మవరకు గల ప్రపంచము ఎనిమిది (నేల, నీరు, వెలుగు, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, జీవాత్మ) పదార్థములతో నున్నది. ఈ ప్రపంచము పరమాత్ముని శరీరము. సర్వతత్త్వ నియామకుడైన పరమాత్మ ఈ శరీరమునకు ఆత్మరూపుడై ఉన్నాడు.

**శరీరభూతాదేతస్మాత్**
**ప్రపంచాత్ పరమేష్ఠినః ।**
**ఆత్మభూతస్య దేవస్య**
**నాభేదో న పృథక్ స్థితిః॥ 10-54**



పరశివుని శరీరరూపమైన ఈ ప్రపంచముకన్నా, (ప్రపంచపు) ఆత్మ రూపమయిన శివుడు, ప్రపంచము తోటి అభిన్నుడు (ఐక్యుడు) కాడు, భిన్నుడుకాడు.

**అచేతనత్వాత్ పృథ్వ్యాదేః**
**అజ్ఞత్వాదాత్మనస్తథా ।**
**సర్వజ్ఞస్య మహేశస్య**
**నైకరూపత్వమిష్యతే ॥ 10-55**

పృథివ్యాదులు అచేతనము(జడము)లయినందువలనను, మరియు ఆత్మ (జీవాత్మ) అల్పజ్ఞుడయినందువలనను, సర్వజ్ఞుడైన మహేశ్వరునితో వీటికి (పృథివ్యాదులకు, జీవాత్మకు)ఏకరూపత్వము లేదా ఐక్యము పొసగదు.

**ఇతి యశ్చింతయేన్నిత్యమ్**
**పృథ్వ్యాదేరష్టమూర్తితః ।**
**విలక్షణం మహాదేవమ్**
**సో౭ష్టమూర్తినిరాసకః॥ 10-56**

ఈ విధముగా పృథివితో నారంభించి ఆత్మవరకు గల అష్టమూర్తుల కన్నా మహాదేవుడు విలక్షణమైనవాడు లేదా వేరైనవాడు అని నిరంతరము భావించువాడు అష్టమూర్తినిరాసకుడు.

ఇతి అష్టమూర్తినిరసనస్థలం పరిసమాప్తమ్ ।

అష్టమూర్తినిరసనస్థలము ముగిసినది.

## 22. అథ సర్వగత్వనిరసనస్థలమ్

### సర్వగత్వనిరసనస్థలము

**సర్వగత్వే మహేశస్య**
**సర్వత్రారాధనం భవేత్ ।**
**న లింగమాత్రే తన్నిష్ఠో**
**న శివం సర్వగం స్మరేత్ ॥ 10-57**

మహేశ్వరుడు సర్వగతు (అంతటా వ్యాపించివున్నవాడు)నిగా అంగీకరించినచో అన్నిచోట్ల (అతని) ఆరాధనను చేయవలసి వుండును. కేవలము ఇష్టలింగమున మాత్రమే పూజచేయుట కుదరదు. అందువలన లింగనిష్ఠుడైన శివుని సర్వగతునిగా భావించరాదు.

**సర్వగో౽పి స్థితః శంభుః**
**స్వాధారే హి విశేషతః।**
**తస్మాదన్యత్ర విముఖః**
**స్వేష్టలింగే యజేచ్ఛివమ్ ॥ 10-58**

శంభువు సర్వవ్యాపి అయినను, అతనికి ఆధారమయిన ఇష్టలింగమునందు విశేషమైన స్థితిలో నివసించుచున్నాడు. అందువలన మాహేశ్వరుడయినవాడు ఇతర ప్రదేశములందు పరమేశునారాధించు విధానముపట్ల విముఖుడై తన ఇష్టలింగమునందే శివుని పూజించవలెను.



**శివః సర్వగతశ్చాపి**
**స్వాధారే వ్యజ్యతే భృశమ్ ।**
**శమీగర్భే యథా వహ్నిః**
**విశేషేణ విభావ్యతే ॥ 10-59**

అన్ని వృక్షములలోను అగ్ని అంతర్గతముగా అణిగివున్ననూ, శమీవృక్షమునందు అది విశేషముగా ప్రకాశమానమైనట్లే, సర్వగతుడైన శివుడు తన కాధారమైన ఇష్టలింగమునందు విశేషముగా అభివ్యక్తుడగుచున్నాడు.

**సర్వగత్వం మహేశస్య**
**సర్వశాస్త్రవినిశ్చితమ్ ।**
**తథాప్యాశ్రయలింగాదౌ**
**పూజార్థమధికా స్థితిః ॥ 10-60**

మహేశ్వరుడు సర్వవ్యాపకుడని సర్వశాస్త్రముల చేత నిశ్చయించ బడినది. అయినను, తన కాధారమయిన ఇష్టలింగమునందు పూజించుట కనుకూలముగా అతని అస్తిత్వము విశేషముగా నిక్షిప్తమైనది.

**నిత్యం భాసి తదీయస్త్వమ్**
**యా తే రుద్ర శివా తనూః।**
**అఘోరా౽పాపకాశీతి**
**శ్రుతిరాహ సనాతనీ ॥ 10-61**

'ఓ రుద్రుడా! లింగరూపమయిన నీ శరీరము అఘోర (శాంత) స్వరూపమైనది. అంతేకాదు పాపరహితులైన భక్తుల శరీరములపై ఎప్పుడూ ప్రకాశించుచున్నావు' అని సనాతనమైన శ్రుతి ఘోషించుచున్నది. అందువలననే నీవు నిత్యము నీ భక్తుల శరీరములపై భాసించుచున్నావు.

**తస్మాత్ సర్వప్రయత్నేన**
**సర్వస్థానపరాఙ్ముఖః ।**
**స్వేష్టలింగే మహాదేవమ్**
**పూజయేత్ పూజకోత్తమః॥ 10-62**

అందువలన ఉత్తమ ఆరాధకుడైన మాహేశ్వరుడు ప్రయత్నపూర్వకముగా ఇతర (సమస్త బహిరంగ) స్థానములందు ఈశ్వరు నారాధించువిధానమునకు విముఖుడై, తన ఇష్టలింగమునందే మహాదేవుని పూజించవలెను.

**శివస్య సర్వగత్వేఽపి**
**సర్వత్ర రతివర్జితః ।**
**స్వేష్టలింగే యజన్ దేవమ్**
**సర్వగత్వనిరాసకః ॥ 10-63**

శివుడు సర్వవ్యాపకుడైననూ, అతనిని అన్నిచోట్లా ఆరాధించు ప్రయత్నము వదలిపెట్టి, మాహేశ్వరుడు తన ఇష్టలింగమునందే శివుని పూజించుచూ సర్వగత్వనిరాసకుడు కావలెను.



ఇతి సర్వగత్వనిరసనస్థలం పరిసమాప్తమ్ ।

సర్వగత్వనిరసనస్థలము ముగిసినది.

## 23. అథ శివజగన్మయస్థలమ్

### శివజగన్మయస్థలము

**పూజావిధౌ నియమ్యత్వాత్**
**లింగమాత్రే స్థితం శివమ్ ।**
**పూజయన్నపి దేవస్య**
**సర్వగత్వం విభావయేత్ ॥ 10-64**

శివపూజావిధానములో విధించినట్టి నియమము ననుసరించి ఇష్టలింగమునందున్న (నిత్యము స్థితుడైయున్న) శివుని పూజించుచున్ననూ, మాహేశ్వరుడు దేవుడయినశివుని సర్వగతునిగా భావించవలెను.

**యస్మాదేతత్ సముత్పన్నమ్**
**మహాదేవాచ్చరాచరమ్ ।**
**తస్మాదేతన్న భిద్యేత**
**యథా కుంభాదికం మృదః॥ 10-65**

మట్టితో తయారుచేసిన కుండలు మట్టికన్నా వేరుకానట్టే, మహాదేవుని నుండి సముత్పన్నమయిన ఈ చరాచరప్రపంచము అతనికన్నా వేరుగా నుండదు.

**శివతత్త్వాత్ సముత్పన్నమ్**
**జగదస్మాన్న భిద్యతే ।**
**ఫేనోర్మిబుద్బుదాకారమ్**
**యథా సింధోర్న భిద్యతే ॥ 10-66**

సముద్రమునందు ఉత్పన్నమయిన అలలు, నురుగలు సముద్రము కన్నా వేరుగానట్టే, శివతత్త్వమునుండి ఉత్పన్నమయిన ఈ ప్రపంచము కూడా శివునికన్నా భిన్నమైనది, వేర్పైది కాదు.

**యథా తంతుభిరుత్పన్నః**
**పటస్తంతుమయః స్మృతః ।**
**తథా శివాత్ సముత్పన్నమ్**
**శివ ఏవ చరాచరమ్॥ 10-67**

దారపు పోగులతో నేయబడిన వస్త్రము దారపుమయమై ఉన్నట్టే, శివుని నుండి సముత్పన్నమయిన ఈ చరాచరప్రపంచము కూడా శివమయమే అయియున్నది.

**ఆత్మశక్తివికాసేన**
**శివో విశ్వాత్మనా స్థితః ।**
**కుటీభావాద్ యథా భాతి**
**పటః స్వస్య ప్రసారణాత్॥ 10-68**



వస్త్రము, తన ప్రసరణధర్మముచేత ఎట్లు ఉత్తరీయము, గుడారము(కుటి) వంటి వివిధరూపములను సంతరించుకొనుచున్నదో అట్లే శివుడు కూడా తనయొక్క శక్తివికాసముచేత విశ్వాత్మకుడుగా ప్రకాశించు ఉన్నాడు.

**తస్మాచ్ఛివమయం సర్వమ్**
**జగదేతచ్చరాచరమ్ ।**
**తదభిన్నతయా భాతి**
**సర్పత్వమివ రజ్జుతః ॥ 10-69**

(ఆరోపించబడిన) సర్పత్వము త్రాటిలో ఐక్యమై కనిపించినట్టుగా చరాచరాత్మకమైన ఈ ప్రపంచమంతయూ శివమయముగా ప్రకాశించుచున్నది..

**రజ్జౌ సర్పత్వవద్భాతి**
**శుక్తౌ చ రజతత్వవత్ ।**
**చోరత్వవదపి స్థాణౌ**
**మరీచ్యాం చ జలత్వవత్ ॥ 10-70**
**గంధర్వపురవద్వ్యోమ్ని**
**సచ్చిదానందలక్షణే ।**
**నిరస్తభేదసద్భావే**
**శివే విశ్వం విరాజతే ॥ 10-71**

త్రాటి యందు సర్పత్వము, ముత్తెపు చిప్పయందు రజతత్వము, స్థాణువునందు చోరత్వము, మృగతృష్ణలో జలత్వము, ఆకాశమునందు గంధర్వనగరము కనిపించినట్టుగానే సచ్చిదానందస్వరూపుడు, భేదరహితుడు అయిన శివునియందు విశ్వము ప్రకాశమానమగుచున్నది.

**పత్రశాఖాదిరూపేణ**
**యథా తిష్ఠతి పాదపః ।**
**తథా భూమ్యాదిరూపేణ**
**శివ ఏకో విరాజతే ॥ 10-72**

ఆకులు, కొమ్మలు, రెమ్మలరూపములో వృక్షమెలా కనబడుచున్నదో, అలాగుననే భూమ్యాదిరూపములలో ఒక్కడే అయిన శివుడు విరాజిల్లుచున్నాడు.

*ఇతి శివజగన్మయస్థలం పరిసమాప్తమ్ ।*
శివజగన్మయస్థలము ముగిసినది.

## *24.* అథ భక్తదేహికలింగస్థలమ్
## భక్తదేహికలింగస్థలము

**సమస్తజగదాత్మాఽపి**
**శంకరః పరమేశ్వరః ।**
**భక్తానాం హృదయాంభోజే**
**విశేషేణ విరాజతే ॥ 10-73**



(సమస్తజీవురాసులకు సుఖమును ప్రసాదించు) శంకరుడైన పరమేశ్వరుడు సమస్తజగత్తుకు ఆత్మరూపుడయినా భక్తుల హృదయకమలములలో విశేషముగా విరాజిల్లుచున్నాడు.

**కైలాసే మందరే చైవ**
**హిమాద్రౌ కనకాచలే ।**
**హృదయేషు చ భక్తానామ్**
**విశేషణ వ్యవస్థితః ॥ 10-74**

కైలాసపర్వతమునందు, మందరపర్వతమునందు, హిమాలయ పర్వతమునందు, మేరు(కనకాచల)పర్వతమునందు మరియు భక్తుల హృదయములయందు శివుడు విశేషముగా నివసించుచున్నాడు.

**సర్వాత్మాఽపి పరిచ్ఛిన్నో**
**యథా దేహేషు వర్తతే ।**
**తథా స్వకీయభక్తేషు**
**శంకరో భాసతే సదా ॥ 10-75**

శంకరుడు సర్వాత్ముడైననూ, సమస్తజీవుల శరీరములందు ఎలా పరిచ్ఛిన్నుడుగా ప్రకాశించుచున్నాడో అలాగుననే తన భక్తుల హృదయములలో కూడా ఎల్లప్పుడు ప్రకాశిస్తూ వున్నాడు.

**నిత్యం భాతి త్వదీయేషు**
**యా తే రుద్ర శివా తనూః।**

**అఘోరాఽపాపకాశీతి**
**శ్రుతిరాహ సనాతనీ॥ 10-76**

'ఓ రుద్రుడా! లింగరూపమైన నీ శరీరము అఘోర(శాంత స్వరూప)మైనది. అంతేకాదు, పాపరహితులైన భక్తుల శరీరము పైన నిరంతరము ప్రకాశించుచున్నది' అని సనాతనమైన శ్రుతి వాక్యము ఘోషించుచున్నది. అందువలన నీవు అనునిత్యము భక్తుల దేహములపై ప్రకాశించుచున్నావు.

**విశుద్ధేషు విరక్తేషు**
**వివేకిషు మహాత్మసు ।**
**శివస్తిష్ఠతి సర్వాత్మా**
**శివలాంఛనధారిషు ॥ 10-77**

పరిశుద్ధులయందు, విరక్తులయందు, వివేకులయందు మహాత్ములయందు, శివలాంఛనధారులయందు సర్వాత్ముడయిన శివుడు నివసించుచున్నాడు.

**నిత్యం సంతోషయుక్తానామ్**
**జ్ఞాననిర్ధూతకర్మణామ్ ।**
**మాహేశ్వరాణామంతస్థో**
**విభాతి పరమేశ్వరః ॥ 10-78**



నిత్యసంతోషులు, జ్ఞానము ద్వారా కర్మబంధములను త్రెంచుకున్న మాహేశ్వరుల అంతరంగములలో పరమేశ్వరుడు ఎల్లప్పుడు విశేషముగా ప్రకాశించుచున్నాడు.

**అన్యత్ర శంభోరతిమాత్రశూన్యో**
**నిజేష్టలింగే నియతాంతరాత్మా ।**
**శివాత్మకం విశ్వమిదం విబుధ్యన్**
**మాహేశ్వరోఽసౌ భవతి ప్రసాదీ ॥ 10-79**

(-ఇంద్రవజ్రా)

శివునియందుతప్ప ఇతరదేవతలయందు ఎటువంటి ప్రీతిలేశము లేనివాడు, తన ఇష్టలింగమునందే ఏకాగ్రచిత్తమునుంచినవాడు, ఈ విశ్వమునంతటిని శివస్వరూపముగా తెలుసుకున్న మాహేశ్వరుడే (ఆ తరువాత) ప్రసాది అవుతాడు.

ఇతి భక్తదేహికలింగస్థలం పరిసమాప్తమ్ ।
భక్తదేహికలింగస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ మాహేశ్వరస్య నవవిధ్ధుల ప్రసంగోనామ దశమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'మాహేశ్వరుని నవవిధస్థలప్రసంగ'మను పదియవ పరిచ్ఛేదము ముగిసినది

.



# ఏకాదశః పరిచ్ఛేదః

## పదకొండవ పరిచ్ఛేదము

### ప్రసాదినః సప్తవిధస్థలప్రసంగః

### ప్రసాదియొక్క సప్తవిధస్థలప్రసంగము

**(77 శ్లోకములు)**

**III. అథ ప్రసాదిస్థలమ్**
**ప్రసాదిస్థలము**

*అగస్త్య ఉవాచ :*

**ఉక్తో మాహేశ్వరః సాక్షాత్**
**లింగనిష్ఠాదిధర్మవాన్ ।**
**కథమేష ప్రసాదీతి**
**కథ్యతే గణనాయక ॥ 11-1**

**అగస్త్యులవారి ప్రశ్న –**

ఓ గణనాయకులైన రేణుకులారా! లింగనిష్ఠాదిధర్మములను సంతరించుకున్న సాక్షాత్ మాహేశ్వరుని స్వరూపమును తెలియజేసినారు. ఈ మాహేశ్వరుడు ఎట్లు ప్రసాది అగుచున్నాడో తెలుపగలరు.

**రేణుక ఉవాచ :**

**లింగనిష్ఠాదిభావేన**
**ధ్వస్తపాపనిబంధనః ।**
**మనఃప్రసాదయోగేన**
**ప్రసాదీత్యేష కథ్యతే ॥ 11-2**

**శ్రీరేణుకులు వివరించుచున్నారు**

లింగనిష్ఠాదిస్థలములను భావించుట (అర్థం చేసుకుని ఆచరణ యందుంచుట) ద్వారా పాపపుబంధములను త్రెంచుకొని, అదేవిధముగా మనస్సును ప్రసన్నము చేసుకొన్న మాహేశ్వరుడు ప్రసాది అని పిలువబడుచున్నాడు.

**ప్రసాదిస్థలమిత్యేతత్**
**అస్య మాహాత్మ్యబోధకమ్ ।**
**అంతరస్థలభేదేన**
**సప్తధా పరికీర్తితమ్ ॥ 11-3**

ఈ ప్రసాదిస్థలము తన మాహాత్మ్యవైశిష్ట్యాదులను ఏడు అవాంతరస్థలములలో వివరించుచున్నది.

**ప్రసాదిస్థలమాదౌ తు**
**గురుమాహాత్మ్యకం తతః ।**



**తతో లింగప్రశంసా చ**
**తతో జంగమగౌరవమ్ ॥ 11-4**

**తతో భక్తస్య మాహాత్మ్యమ్**
**తతః శరణకీర్తనమ్ ।**
**శివప్రసాదమాహాత్మ్యమ్**
**ఇతి సప్తప్రకారకమ్ ।**
**క్రమాల్లక్షణమేతేషామ్**
**కథయామి మహామునే ॥ 11-5**

మొదటిది ప్రసాదిస్థలము, రెండవది గురుమాహాత్మ్యస్థలము, మూడవది లింగప్రశంసాస్థలము, నాలుగవది జంగమగౌరవస్థలము (జంగమ మాహాత్మ్యస్థలము), అయిదవది భక్త మాహాత్మ్యస్థలము, ఆరవది శరణమాహాత్మ్యస్థలము, ఏడవది శివప్రసాదమాహాత్మ్యస్థలము, ఇవి ఏడు అవాంతరస్థలములు. ఓ మహామునీ! ఈ ఏడింటి లక్షణములను క్రమముగా చెప్పెదను ఆలకించుము!

## 25 అథ ప్రసాదిస్థలమ్

**ప్రసాదిస్థలము**

**నైర్మల్యం మనసో లింగమ్**
**ప్రసాద ఇతి కథ్యతే ।**

**శివస్య లింగరూపస్య**
**ప్రసాదాదేవ సిధ్యతి ॥ 11-6**

మనస్సు యొక్క నిర్మలత్వపు చిహ్నమే (గుర్తే) ప్రసాదమనబడును. ఇది ఈ (మనోనైర్మల్యము) లింగరూపుడైన శివుని ప్రసాదము(ప్రసాదమును స్వీకరించుట) వలననే సిద్ధించును.

**శివప్రసాదం యద్ద్రవ్యమ్**
**శివాయ వినివేదితమ్ ।**
**నిర్మాల్యం తత్తు శైవానామ్**
**మనోనైర్మల్యకారణమ్ ॥ 11-7**

శివునికి (నైవేద్యంగా) నివేదించిన పదార్థ విశేషమే శివప్రసాదము. ఆ శివప్రసాదరూపమైన నిర్మాల్యము శివభక్తుల మనోనైర్మల్యమునకు కారణమవుతున్నది.

**మనఃప్రసాదసిద్ధ్యర్థమ్**
**నిర్మలజ్ఞానకారణమ్ ।**
**శివప్రసాదం స్వీకుర్వన్**
**ప్రసాదీత్యేష కథ్యతే ॥ 11-8**

నిర్మలజ్ఞానమునకు కారణమైన శివప్రసాదమును మనస్సు యొక్క ప్రసన్నతకోసం స్వీకరించు మాహేశ్వరుడు ప్రసాది అని పిలువబడుతాడు.



**అన్నశుద్ధ్యా హి సర్వేషామ్**
**తత్త్వశుద్ధిరుదాహృతా ।**
**విశుద్ధమన్నజాతం హి**
**యచ్ఛివాయ సమర్పితమ్ ॥ 11-9**

అన్నశుద్ధి ద్వారానే జీవులందరికీ తత్త్వ(దేహేంద్రియాదుల) శుద్ధి కలుగునని చెప్పబడినది. శివునికి సమర్పించబడిన అన్నమే విశుద్ధమైన అన్నము(అన్నశుద్ధి).

**తదేవ సర్వకాలం తు**
**భుంజానో లింగతత్పరః ।**
**మనఃప్రసాదమతులమ్**
**లభతే జ్ఞానకారణమ్ ॥ 11-10**

లింగ(పూజా)నిష్ఠుడైన ప్రసాదిస్థలసాధకుడు ఎల్లప్పుడు ఆ ఇష్టలింగమునకర్పించిన అన్నమును భుజించుటవలననే జ్ఞానమునకు కారణమైన అసమానమైన మనోప్రసన్నతను పొందుతున్నాడు.

**ఆత్మభోగాయ నియతమ్**
**యద్యద్ ద్రవ్యం సమాహితమ్ ।**
**తత్తత్ సమర్ప్య దేవాయ**
**భుంజీతాత్మవిశుద్ధయే ॥ 11-11**

తన భోగము(ఆనందము)నకు ఏ ఏ ద్రవ్యములు నిర్ణయించ బడివున్నవో వాటిని తాను (కష్టపడి) సంపాదించిన ధనముతో సేకరించి, ఆయా ద్రవ్యములను తన మనశ్శుద్ధికోసము (ఆత్మశుద్ధికోసము) తన దైవమునకు (ఇష్టలింగమునకు) నివేదనచేసి తాను భుజించవలెను.

**నిత్యసిద్ధేన దేవేన**
**భిషజా జన్మరోగిణామ్ ।**
**యద్యత్ ప్రసాదితం భుక్త్వా**
**తత్తజ్జన్మరసాయనమ్ ॥ 11-12**

జన్మ (భవ)రోగులకు వైద్యుడు, నిత్యసిద్ధుడు (ఇష్టలింగము నందు సదా సన్నిహితుడు) అయిన దేవు(శివు)నికి నివేదించబడిన ప్రసాదమును భుజించువానికి అది భవరోగమును పరిహరించు దివ్యౌషధ (రసాయన) మగుచున్నది.

**ఆరోగ్యకారణం పుంసామ్**
**అంతఃకరణశుద్ధిదమ్ ।**
**తాపత్రయమహారోగ-**
**సముద్ధరణభేషజమ్ ॥ 11-13**

(ఈ ప్రసాదము) సమస్త జీవులకు ఆరోగ్యకారణమై యున్నది. అంతఃకరణమును శుద్ధమొనర్చుచున్నది.(అంతేకాదు) తాపత్రయమను మహారోగమును నిర్మూలించు దివ్యౌషధము అయివున్నది.



**విద్యావైశద్యకరణమ్**
**వినిపాతవిఘాతనమ్ ।**
**ద్వారం జ్ఞానావతారస్య**
**మోహచ్ఛేదస్య కారణమ్ ॥ 11-14**

(ఈ ప్రసాదము) విద్యను వికసింపజేయును. వినిపాతములను (కష్టములను) నశింపచేయును. జ్ఞానప్రాప్తికి మహాద్వారమై, మోహమును తొలగించుటకు కారణమమగును.

**వైరాగ్యసంపదో మూలమ్**
**మహానందప్రవర్ధనమ్ ।**
**దుర్లభం పాపచిత్తానామ్**
**సులభం శుద్ధకర్మణామ్ ॥ 11-15**

(ఈ ప్రసాదము) వైరాగ్యమను సంపదకు మూలకారణము. మహానందవర్ధకము. ఇది పాపాత్ములకు దుర్లభము. శుద్ధకర్ములకు (పుణ్యాత్ములకు) సులభము (గా లభించును).

**ఆదృతం బ్రహ్మవిష్ణ్వాద్యైః**
**వసిష్ఠాద్యైశ్చ తాపసైః ।**
**శివస్వీకృతమన్నాద్యమ్**
**స్వీకార్యం సిద్ధికాంక్షిభిః ॥ 11-16**

ఈ ప్రసాదము బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలచేతను, వశిష్టుడు మొదలైన మహర్షుల చేతను స్వీకరించబడినది. గనక శివస్వీకృత (భుక్త)మైన అన్నాదులను సిద్ధికాంక్షులు (మోక్షాపేక్షితులు) అవశ్యము స్వీకరించవలెను.

**పత్రం పుష్పం ఫలం తోయమ్**
**యచ్ఛివాయ నివేదితమ్ ।**
**తత్తత్స్వీకారయోగేన**
**సర్వపాపక్షయో భవేత్ ॥ 11-17**

శివునికి సమర్పించిన పత్ర-పుష్ప-ఫల-జలాదులను స్వీకరించుట వలన సర్వపాపము నాశనమగును.

**యథా శివప్రసాదాన్నమ్**
**స్వీకార్యం లింగతత్పరైః ।**
**తథా గురోః ప్రసాదాన్నమ్**
**తథైవ శివయోగినామ్॥ 11-18**

లింగతత్పరు(లింగపూజానిష్ఠు)లయిన ప్రసాదిస్థల సాధకులు ఏ రీతిగా శివుని ప్రసాదరూపమైన అన్నమును స్వీకరించుచున్నారో, అదేరీతిగా గురువులయొక్క, శివయోగులయొక్క ప్రసాదాన్నమును కూడా స్వీకరించవలెను. (లింగ-గురు-జంగముల ప్రసాదములను స్వీకరించవలెను).



ఇతి ప్రసాదిస్థలం పరిసమాప్తమ్

ప్రసాదిస్థలము ముగిసినది.

## *26. అథ గురుమాహాత్మ్యస్థలమ్*

## గురుమాహాత్మ్యస్థలము

**గురురేవాత్ర సర్వేషామ్**
**కారణం సిద్ధికర్మణామ్ ।**
**గురురూపో మహాదేవో**
**యతః సాక్షాదుపస్థితః ॥ 11-19**

లోకమునందు (భోగ-మోక్షరూపములయిన) సిద్ధులను పొందుటకు ప్రయత్నించు సాధకులందరికీ గురువే (మూల) కారణుడు. అటువంటి గురురూపమును ధరించి మహాదేవు(డైన శివు)డే సాక్షాత్తు మనముందున్నాడు.

**నిష్కలో హి మహాదేవో**
**నిత్యజ్ఞానమహోదధిః ।**
**సకలో గురురూపేణ**
**సర్వానుగ్రాహకో భవేత్ ॥ 11-20**

నిత్యజ్ఞానసముద్రుడయిన మహాదేవుడు నిష్కలు (నిరాకారు)డై యున్నాడు. అతడే సకలు(సాకారు)డై గురురూపమున అందరినీ

అనుగ్రహించుచున్నాడు. (స్వస్వరూపజ్ఞానరూపమైన అనుగ్రహమును ప్రసాదించుచూ భోగ, మోక్షములను కలుగచేయుచున్నాడు.)

**యః శివః స గురుర్జ్ఞేయో**
**యో గురుః స శివః స్మృతః ।**
**న తయోరంతరం కుర్యాత్**
**జ్ఞానావాప్తౌ మహామతిః ॥ 11-21**

శివుని గురువుగాను, గురువును శివునిగాను తెలుసుకొనవలెను. మహామతి అయిన ప్రసాది జ్ఞానప్రాప్తికి వారిరువురి నడుమ ఎటువంటి అంతరము(భేదము)ను చూడరాదు.

**హస్తపాదాదిసామ్యేన**
**నేతరైః సదృశం వదేత్ ।**
**ఆచార్యం జ్ఞానదం శుద్ధమ్**
**శివరూపతయా స్థితమ్ ॥ 11-22**

జ్ఞానప్రదాత, పరమశుద్ధుడు, శివరూపమునందున్న ఆచార్యుని (గురువును), కాళ్ళుచేతులు వున్నవనుకారణమున ఇతరులతో సమానుడని (సామాన్యమానవుడని) చెప్పరాదు.

**ఆచార్యస్యావమానేన**
**శ్రేయఃప్రాప్తిర్విహన్యతే ।**



**తస్మాన్నిఃశ్రేయసప్రాప్త్యై**
**పూజయేత్ తం సమాహితః ॥ 11-23**

ఆచార్యుని (గురువును) అవమానించిన శ్రేయస్సును (మోక్షమును) పొందుట అసంభవము. అందువలన మోక్షమును పొందగోరువాడు ప్రసన్నమైన మనస్సుతో గురువును పూజించవలెను.

**గురుభక్తివిహీనస్య**
**శివభక్తిర్న జాయతే ।**
**తతః శివే యథా భక్తిః**
**తథా భక్తిర్గురావపి ॥ 11-24**

గురుభక్తి లేనివానికి శివభక్తి కలుగదు. అందువల్ల శివుని యందెటువంటి భక్తిని కలిగివున్నాడో అటువంటి భక్తినే గురువునందును కలిగివుండవలెను.

*ఇతి గురుమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్ ।*

గురుమాహాత్మ్యస్థలము ముగిసినది.

## *27. అథ లింగమాహాత్మ్యస్థలమ్*

## లింగమాహాత్మ్యస్థలము

**గురుమాహాత్మ్యయోగేన**
**నిజజ్ఞానాతిరేకతః ।**

**లింగస్యాపి చ మాహాత్మ్యమ్**
**సర్వోత్కృష్టం విభావ్యతే ॥ 11-25**

గురుమాహాత్మ్యమును తెలుసుకొనుటచేతను, తనకు కలిగిన శివజ్ఞానముయొక్క ఔన్నత్య(అతిశయ)ము చేతను, లింగము యొక్క మాహాత్మ్యము కూడా సర్వోత్కృష్టముగా భావించబడుచున్నది.

**శివస్య బోధలింగం యద్**
**గురుబోధితచేతసా ।**
**తదేవ లింగం విజ్ఞేయమ్**
**శాంకరం సర్వకారణమ్ ॥ 11-26**

శివుని చైతన్య చిహ్నమే శాంకర లింగము. ఇదియే సమస్తమునకు కారణమై యున్నది. దీనిని గురూపదేశముతో మేల్కొల్పబడిన జ్ఞానము చేతనే తెలుసుకొనవలెను.

**పరం పవిత్రమమలమ్**
**లింగం బ్రహ్మ సనాతనమ్ ।**
**శివాభిధానం చిన్మాత్రమ్**
**సదానంద నిరంకుశమ్ ॥ 11-27**

పరమపవిత్రము, నిర్మలము, సనాతనము అయిన బ్రహ్మమే లింగము. చిద్రూపము, సదానందరూపము అయిన ఈ లింగము శివుడు అను



నామధేయము (పేరు)తో పిలువబడుచు నిరంకుశమై యున్నది. (లింగతత్త్వమే సమస్తమును శాసించుట వలన, దీనిని శాసించునది మరియొకటి లేనందువలన ఇది నిరంకుశమనబడినది.)

**కారణం సర్వలోకానామ్**
**వేదానామపి కారణమ్ ।**
**పూరణం సర్వతత్త్వస్య**
**తారణం జన్మవారిధేః ॥ 11-28**

ఈ లింగము సర్వ(పదునాల్గు)భువనములకు, (సమస్త) వేదములకు కారణమైయున్నది. ఇది సర్వతత్త్వములను తనలో ఇముడ్చుకున్న పరిపూర్ణతత్త్వము మరియు సంసారసాగరతీరములకు చేర్చు మహత్తర సాధనము అయివున్నది.

**జ్యోతిర్మయమనిర్దేశ్యమ్**
**యోగినామాత్మని స్థితమ్ ।**
**కథం విజ్ఞాయతే లోకే**
**మహాగురుదయాం వినా ॥ 11-29**

యోగుల హృదయములలో జ్యోతివలె ప్రకాశించుచు, ఇతరులకు చూపించుటకువీలుకాని లింగతత్త్వము లోకమునందు మహా(త్ముడైన) గురువుయొక్క దయలేనిదే తెలుసుకొనుట ఎలా సాధ్యం? (సాధ్యముకాదని అర్థము).

**బ్రహ్మణా విష్ణునా పూర్వమ్**
**యల్లింగం జ్యోతిరాత్మకమ్ ।**
**అపరిచ్ఛేద్యమభవత్**
**కేన వా పరిచోద్యతే ॥ 11-30**

పూర్వము బ్రహ్మచేతను విష్ణువు చేతను (కూడా) తెలుసుకొనుటకు సాధ్యము కాని జ్యోతిస్వరూపమైన ఈ లింగము సామాన్యులచే ఎట్లు తెలియదగును?

**బహునాఽత్ర కిముక్తేన**
**లింగం బ్రహ్మ సనాతనమ్ ।**
**యోగినో యత్ర లీయంతే**
**ముక్తపాశనిబంధనాః ॥ 11-31**

ఈ లింగము గురించి ఎంతజెప్పిన ఏమి ప్రయోజనము! (సంసార) పాశబంధనమునుండి విముక్తులైన యోగులు ఎక్కడ లయ(లీన)మగుచున్నారో, అదియే సనాతనము, బ్రహ్మ అని పిలువబడిన లింగము.

**పీఠికా పరమా శక్తిః**
**లింగం సాక్షాత్ పరః శివః ।**
**శివశక్తిసమాయోగమ్**
**విశ్వం లింగం తదుచ్యతే॥ 11-32**



పీఠిక (పానవట్టము) పరమశక్తి స్వరూపము. లింగము సాక్షాత్ పరమశివుని స్వరూపము. ఈ శివశక్తి సంయుక్తమైన లింగమే ఈ విశ్వమనిచెప్పబడినది. (అఖండచేతనాత్మక శక్తిస్వరూపమే ఈ విశ్వమని గ్రహించవలెను)

**బ్రహ్మాదయః సురాః సర్వే**
**మునయః శౌనకాదయః ।**
**శివలింగార్చనాదేవ**
**స్వం స్వం పదమవాప్నుయుః ॥ 11-33**

బ్రహ్మాది సమస్తదేవతలు, శౌనకాది మహర్షులు, ఈ లింగార్చనము చేతనే తమ తమ పదవు(స్థానము)లను సంపాదించుకున్నారు.

**విశ్వాధిపత్యమీశస్య**
**లింగమూర్తేః స్వభావజమ్ ।**
**అనన్యదేవసాదృశ్యమ్**
**శ్రుతిరాహ సనాతనీ ॥ 11-34**

ఇతర దేవతలకు అసదృశమైన (అసాధ్యమైన) విశ్వాధిపత్యము లింగమూర్తి అయిన ఈశ్వరునికి స్వభావ(సహజ)సిద్ధమైనది' అని సనాతనమయిన శ్రుతి చాటుతున్నది.

*ఇతి లింగమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్ ।*

లింగమాహాత్మ్యస్థలము ముగిసినది.

## 28. అథ జంగమమాహాత్మ్యస్థలమ్
### జంగమమాహాత్మ్యస్థలము

**గురుశిష్యసమారూఢ**
**లింగమాహాత్మ్యసంపదః ।**
**సర్వం చిద్రూపవిజ్ఞానాత్**
**జంగమాధిక్యముచ్యతే ॥ 11-35**

గురుశిష్యులనడుమ నెలకొన్న(ఏర్పడిన) లింగమాహాత్మ్య రూపమయిన (జ్ఞాన)సంపద ద్వారా సమస్తవిశ్వము చిద్రూపమే లేదా చైతన్యవికాసమే అను అనుభవమునకు కారణమైనదే జంగమాధిక్య స్థలమని చెప్పబడినది.

**జానంత్యతిశయాద్ యే తు**
**శివం విశ్వప్రకాశకమ్ ।**
**స్వస్వరూపతయా తే తు**
**జంగమా ఇతి కీర్తితాః ॥ 11-36**

విశ్వప్రకాశకుడైన శివుని ఎవరు తన స్వస్వరూపమని దృఢముగా తెలుసుకొనుచున్నారో వారే జంగములని కీర్తించబడినారు.

**యే పశ్యంతి జగజ్జాలమ్**
**చిద్రూపం శివయోగతః ।**
**నిర్ధూతమలసంస్పర్శాః**



**తే స్మృతాః శివయోగినః ॥ 11-37**

శివయోగముచేత ఈ జగజ్జాలమునంతటిని చిద్రూపముగా తెలుసుకొని, ఆణవాది మలసంబంధములను సమూలముగా తొలగించుకొన్న జంగములే శివయోగులని పిలువబడుతున్నారు.

**ఘోరసంసారతిమిర-**
**పరిధ్వంసనకారణమ్ ।**
**యేషామస్తి శివజ్ఞానమ్**
**తే మతాః శివయోగినః ॥ 11-37**

భయంకరమైన సంసారరూపమైన చీకట్లను చీల్చి చెండాడు (సమూలముగా నాశనము చేయు)టకు కారణమైన శివజ్ఞానము ఎవరి యందున్నదో వారే శివయోగులు.

**జితకామా జితక్రోధా**
**మోహగ్రంథివిభేదినః ।**
**సమలోష్టాశ్మకనకాః**
**సాధవః శివయోగినః॥ 11-38**

కామక్రోధాదులను జయించినవారు, మోహమను ముడులను విప్పుకున్నవారు, రాయి, అప్ప, బంగారములను ఒకేరీతిగా (సమానముగా) చూడగలిగిన సాధువులే శివయోగులు.

**సమౌ శత్రౌ చ మిత్రే చ**
**సాక్షాత్కృతశివాత్మకాః ।**
**నిస్పృహా నిరహంకారా**
**వర్తంతే శివయోగినః॥ 11-40**

అహంకార రహితులు, ప్రాపంచిక సుఖాలపట్ల ఆసక్తిలేనివారు (నిస్పృహులు), శివుని తమ(ఆత్మ)రూపాలుగా సాక్షాత్కరించుకున్న శివయోగులు, మిత్రులపట్ల శత్రువులపట్ల ఒకే విధముగా (సమానముగా) వ్యవహరింతురు.

**దుర్లభం హి శివజ్ఞానమ్**
**దుర్లభం శివచింతనమ్ ।**
**యేషామేతద్ ద్వయం చాస్తి**
**తే హి సాక్షాచ్ఛివాత్మకాః ॥ 11-41**

శివజ్ఞానము దుర్లభమైనది. అలాగే శివచింతనము కూడా దుర్లభమే. ఎవరు శివజ్ఞానము, శివచింతనమును కలిగివున్నారో వారు సాక్షాత్తు శివస్వరూపులే.

**పాదాగ్రరేణవో యత్ర**
**పతంతి శివయోగినామ్ ।**
**తదేవ సదనం పుణ్యమ్**
**పావనం గృహమేధినామ్ ॥ 11-42**



శివయోగుల పాదధూళి (ఏ యింట) పడుచున్నదో ఆ గృహస్థుని యిల్లు పవిత్రమైన క్షేత్రమగుచున్నది.

**సర్వసిద్ధికరం పుంసామ్**
**దర్శనం శివయోగినామ్ ।**
**స్పర్శనం పాపశమనమ్**
**పూజనం ముక్తిసాధనమ్ ॥ 11-43**

శివయోగులదర్శనము మానవులకు సర్వసిద్ధులను కలుగ జేయును. (వారి) స్పర్శ పాపములను నశింపజేయును. (వారి) పూజ ముక్తికి సాధనమగును.

**మహతాం శివతాత్పర్య**
**వేదినామనుమోదినామ్ ।**
**కిం వా ఫలం న సిద్ధ్యేత**
**సంపర్కాచ్ఛివయోగినామ్ ॥ 11-44**

శివ(తత్త్వపు)తాత్పర్యమును తెలుసుకుని, (దానిని) అనుభవించి ఆనందతన్మయులయిన శివయోగుల సంపర్కము లేదా సాంగత్యము సిద్ధింపచేయని దేమున్నది?

*ఇతి జంగమమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్ ।*

జంగమమాహాత్మ్యస్థలము ముగిసినది.

## 29. అథ భక్తమాహాత్మ్యస్థలమ్
## భక్తమాహాత్మ్యస్థలము

**గురోర్లింగస్య మాహాత్మ్య-**
**కథనాచ్ఛివయోగినామ్ ।**
**సిద్ధం భక్తస్య మాహాత్మ్యమ్**
**తథాప్యేష ప్రశస్యతే॥ 11-45**

శ్రీ గురువుయొక్క, లింగముయొక్క, శివయోగు(జంగము)ల యొక్క మాహాత్మ్యములను వివరించినప్పుడే (ఆరాధకుడైన) భక్తునియొక్క మాహాత్మ్యముకూడా సిద్ధమగుచున్నది. అయినా అతని మాహాత్మ్యము (ఈ క్రిందివిధముగా) ప్రశంసించబడుచున్నది.

**యే భజంతి మహాదేవమ్**
**పరమాత్మానమవ్యయమ్ ।**
**కర్మణా మనసా వాచా**
**తే భక్తా ఇతి కీర్తితాః ॥ 11-46**

అవ్యయుడు (నాశము లేనివాడు), పరమాత్ముడు (సర్వాత్ముడు) అయిన మహాదేవుని ఎవరు మనో-వాక్-కర్మ (త్రికరణము)లతో భజించుచున్నారో (పూజించుచున్నారో) వారే భక్తులు అని పిలువబడినారు.

**దుర్లభా హి శివే భక్తిః**
**సంసారభయతారిణీ ।**



**సా యత్ర వర్తతే సాక్షాత్**
**స భక్తః పరిగీయతే ॥ 11-47**

సంసారభయమును తొలగించు శివుని పట్ల భక్తి నిస్సంశయముగా దుర్లభమైనది. అటువంటి భక్తి సాక్షాత్తుగా ఎవనియందున్నదో వాడే భక్తుడు అని విశేషముగా పరిగణించబడుచున్నాడు.

**కిం వేదైః కిం తతః శాస్త్రైః**
**కిం యజ్ఞైః కిం తపోవ్రతైః ।**
**నాస్తి చేచ్ఛాంకరీ భక్తిః**
**దేహినాం జన్మరోగిణామ్ ॥ 11-48**

జన్మరోగ(భవరోగ) పీడితులైన దేహు(జీవు)లకు శాంకరీ (శివుని యందు)భక్తి లేనట్టయితే వేదాధ్యయనము వలనగాని, శాస్త్ర జ్ఞానమువలన గాని, యజ్ఞములు చేయుటవలన గాని, తపోవ్రతముల నాచరించుటవలన గాని ఎటువంటి ప్రయోజనములేదు. (భక్తి లేని క్రియలు నిరర్థకములని భావము.)

**శివభక్తివిహీనస్య**
**సుకృతం చాపి నిష్ఫలమ్ ।**
**విపరీతఫలం చ స్యాద్**
**దక్షస్యాపి మహాధ్వరే ॥ 11-49**

శివభక్తిలేనివాడు చేసిన పుణ్యకర్మము కూడా నిష్ఫలమే అగును. అంతయే కాదు (ఒక్కొక్కసారి) విపరీతఫలములను కూడా కలుగుజేయును. ఉదాహరణకు దక్షబ్రహ్మ మహాయజ్ఞమును నిర్వహించినను విపరీతఫలమునే అనుభవించవలసివచ్చెను.

**అత్యంతపాపకర్మాఽపి**
**శివభక్త్యా విశుధ్యతి ।**
**చండో యథా పురా భక్త్యా**
**పితృహాఽపి శివోఽభవత్ ॥ 11-50**

అత్యంత పాపకర్మలను చేసినవాడు సైతము శివభక్తిని కలిగి వున్న పరిశుద్ధుడగును. ఉదాహరణకు పూర్వము చండుడనువాడు తన తండ్రిని సంహరించినను శివభక్తి చేత(చివరికి) తానే శివుడైనాడు.

**సుకృతం దుష్కృతం చాపి**
**శివభక్తస్య నాస్తి హి ।**
**శివభక్తివిహీనానామ్**
**కర్మపాశనిబంధనమ్ ॥ 11-51**

శివభక్తుడయినవానికి సుకృత (పుణ్య)ముగాని, దుష్కృత (పాప)ము గానీ(రెండూ) ఉండవు. శివభక్తి లేనివారినే కర్మపాశము బంధించును.



**శివాశ్రితానాం జంతూనామ్**
**కర్మణా నాస్తి సంగమః ।**
**వాజినాం దిననాథస్య**
**కథం తిమిరజం భయమ్ ॥ 11-52**

దిననాథు(సూర్యు)ని గుఱ్ఱములకు చీకటివల్ల కలిగు భయం లేనట్టే శివుని ఆశ్రయించిన జీవులకు పుణ్యపాపకర్మల 'సంగము' (సంబంధము) ఉండదు.

**నిరోద్ధుం న క్షమం కర్మ**
**శివభక్తాన్ విశృంఖలాన్ ।**
**కథం మత్తగజాన్ రుంధేత్**
**శృంఖలా బిసతంతుజా ॥ 11-53**

తామర తూడల(తంతువు)లతో పేనిన శృంఖలము(గొలుసు) మదించిన ఏనుగునెలా నియంత్రించ(బంధించ)జాలదో, అలాగుననే మలబంధముల నుండి విముక్తులైన శివభక్తులను కర్మలు నిరోధించజాలవు.

**బ్రాహ్మణః క్షత్రియో వాఽపి**
**వైశ్యో వా శూద్ర ఏవ వా ।**
**అంత్యజో వా శివే భక్తః**
**శివవన్మాన్య ఏవ సః ॥ 11-54**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అంత్యజులలో ఎవరైనా గాని శివునియందు భక్తిని కలిగివున్నవాడు శివునివలె మాన్యుడౌతాడు (గౌరవించబడతాడు.)

**శివభక్తిసమావేశే**
**క్వ జాతిపరికల్పనా ।**
**ఇంధనేష్వగ్నిదగ్ధేషు**
**కో వా భేదః ప్రకీర్త్యతే ॥ 11-55**

అగ్నియందు కాలిబూడిదయిన ఎండుకట్టెలు ఏ వృక్షజాతికి చెందినవో గుర్తించుట ఎట్లు సాధ్యము కాదో, అటులనే శివభక్తులలో పూర్వపు (బ్రాహ్మణాది)జాతిభేదముల పట్టింపు వుండదు.

**శుద్ధా నియమసంయుక్తాః**
**శివార్పితఫలాగమాః ।**
**అర్చయంతి శివం లోకే**
**విజ్ఞేయాస్తే గణేశ్వరాః ॥ 11-56**

(దీక్షాసంస్కారము ద్వారా) శుద్ధులై యథానియమము శివార్చనానిరతులై, సమస్త కర్మఫలములను శివునికే సమర్పించువారిని గణేశ్వరు(శివగణు)లని తెలియవలెను.

*ఇతి భక్తమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్ ।*
భక్తమాహాత్మ్యస్థలము ముగిసినది.



### *30.* అథ శరణమాహాత్మ్యస్థలమ్
### శరణమాహాత్మ్యస్థలము

**గురులింగాదిమాహాత్మ్య-**
**బోధాన్వేషణసంగతః ।**
**సర్వాత్మనా శివాపత్తిః**
**శరణస్థానముచ్యతే ॥ 11-57**

గురులింగాది (గురు-లింగ-జంగమ-భక్తస్థల) మాహాత్మ్యములను చక్కగా తెలుసుకొనుటచేత సమస్తము శివస్వరూపమేనను భావనతో శివునికి శరణాగతుడైన వాడే శరణస్థానీయుడని చెప్పబడుచున్నాడు.

**బ్రహ్మాదివిబుధాన్ సర్వాన్**
**ముక్త్వా ప్రాకృతవైభవాన్ ।**
**ప్రపద్యతే శివం యత్తు**
**శరణం తదుదాహృతమ్ ॥ 11-58**

బ్రహ్మాదిదేవతలనందరినీ ప్రాకృతమైన సంపన్నులుగా భావించి, ఎవడు (అప్రాకృతుడైన) శివునికి శరణాగతుడగుచున్నాడో అతడే శరణుడు అని పిలువబడినాడు.

**శరణ్యః సర్వభూతానామ్**
**శంకరః శశిశేఖరః ।**

**సర్వాత్మనా ప్రపన్నస్తమ్**
**శరణాగత ఉచ్యతే ॥ 11-59**

సర్వభూతము (ప్రాణు)లకు చంద్రశేఖరుడైన శంకరుడే సంరక్షకుడు (శరణ్యుడు) అయినందున సర్వాత్మభావముతో శంకరునికి ప్రపన్నుడయిన (ఆశ్రయించిన)వాడే శరణాగతుడనబడుచున్నాడు.

**విముక్తభోగలాలస్యో**
**దేవతాంతరనిస్పృహః।**
**శివమభ్యర్థయన్ మోక్షమ్**
**శరణార్థీతి గీయతే ॥ 11-60**

(బ్రహ్మాదిపదవీసుఖ) భోగముల ననుభవించవలెనను కోరికల నుండి ముక్తుడైనవాడు,ఇతర దేవతల యందెటువంటి ఆసక్తి లేనివాడు, కేవలము మోక్షమునపేక్షించి మాత్రమే శివుని ప్రార్థించువాడు శరణార్థి యని పేర్కొనబడుచున్నాడు.

**యే ప్రపన్నా మహాదేవమ్**
**మనోవాక్కాయకర్మభిః ।**
**తేషాం తు కర్మజాతేన**
**కిం వా దేవాదితర్పణైః ॥ 11-61**

మనసు-మాట-చేతల (మనోవాక్కాయములను త్రికరణము)తో మహాదేవునికి ప్రపన్ను(శరణాగతు)లైన వారికి ఇతర కర్మాచరణముల వలన



గాని ఇతర దేవతార్చనల వలన గాని ఏమి ప్రయోజనము? (వాటి అవసరము లేదని భావము).

**సర్వేషామపి యజ్ఞానామ్**
**క్షయః స్వర్గః ఫలాయతే ।**
**అక్షయం ఫలమాప్నోతి**
**ప్రపన్నః పరమేశ్వరమ్ ॥ 11-62**

అన్ని విధములైన యజ్ఞములకు క్షయము(అంతము)కలిగిన స్వర్గమే ఫలమైయున్నది. అయితే పరమేశ్వరునకు ప్రపన్ను (శరణు)డైనవాడు అక్షయ(శాశ్వతము, అనంత)ములైన ఫలములను పొందుచున్నాడు.

**ప్రపన్నపారిజాతస్య**
**భవస్య పరమాత్మనః।**
**ప్రపత్త్యా కిం న జాయేత**
**పాపినామపి దేహినామ్ ॥ 11-63**

ప్రపన్ను(శరణాగతు)ల పాలిటి కల్పవృక్షమైన, పరబ్రహ్మ స్వరూపుడైన పరమశివుని శరణుకోరిన పాపాత్ములైన మానవు(దేహు)లు పొందనిదేమున్నది? (వారికి సమస్త సిద్ధులు లభించునని తాత్పర్యము).

**ప్రపన్నానాం మహాదేవమ్**
**పరిపక్వాంతరాత్మనామ్ ।**

**జన్మైవ జన్మ నాన్యేషామ్**
**వృథా జననసంగినామ్ ॥ 11-64**

పరిపక్వమయిన అంతఃకరణము(ఆత్మ)తో మహాదేవునికి ప్రపన్నులయిన(శరణుకోరిన)వారి జన్మమే నిజమైన జన్మ. ఇతరుల జన్మము వ్యర్థము. (శివునికి శరణులగుట వలననే జన్మము సార్థకమని భావము).

**దుర్లభం మానుషం ప్రాప్య**
**జననం జ్ఞానసాధనమ్ ।**
**యే న జానంతి దేవేశమ్**
**తేషామాత్మా నిరర్థకః ॥ 11-65**

(మోక్షకారణమైన) జ్ఞానప్రాప్తికి సాధనము మరియు (సామాన్య జీవులకు) దుర్లభము అయిన మానవజన్మను పొందికూడా ఎవడు దేవాధిదేవుడైన ఈశ్వరుని తెలుసుకొనలేడో వాడి జన్మము నిరర్థకమని తెలియవలెను.

**తత్కులం హి సదా శుద్ధమ్**
**సఫలం తస్య జీవితమ్ ।**
**యస్య చిత్తం శివే సాక్షాత్**
**విలీనమబహిర్ముఖమ్॥ 11-66**



ఏ శరణు(ప్రపన్ను)ని చిత్తము బహిర్ముఖము గాక, సాక్షాత్ శివునియందే విలీన(అంతర్ముఖ)మగుచున్నదో ఆ శరణుని కులమే సదా ధన్యమైనది. అతని జీవితమే సార్థకమైనది.

ఇతి శరణమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్ ।

శరణమాహాత్మ్యస్థలము ముగిసినది.

## *31.* అథ ప్రసాదమాహాత్మ్యస్థలమ్
## ప్రసాదమాహాత్మ్యస్థలము

**గురులింగాదిమాహాత్మ్య-**
**విశేషానుభవస్థితిః ।**
**యస్మాచ్ఛివప్రసాదాత్ స్యాత్**
**తదస్య మహిమోచ్యతే ॥ 11-67**

గురులింగాది (గురు-లింగ-జంగమ-భక్త-) శరణుల వైశిష్ట్యము (గొప్పదనము)ను చక్కగా తెలుసుకొని వాటిని అనుభవమునకు తెచ్చుకొను స్థితి ఏ శివప్రసాదము వలన కలుగుచున్నదో అటువంటి శివప్రసాద మహిమ ఇప్పుడు చెప్పబడుచున్నది.

**సదా లింగైకనిష్ఠానామ్**
**గురుపూజానుషంగిణామ్ ।**
**ప్రపన్నానాం విశుద్ధానామ్**
**ప్రసీదతి మహేశ్వరః ॥ 11-68**

ఎల్లప్పుడు లింగమునందే ఏకాగ్రచిత్తులై, గురుపూజా తత్పరులై, పరిశుద్ధులై, శరణాగతు(ప్రపన్ను)లైన వారికే మహేశ్వరుడు ప్రసన్నుడవుతాడు.

**ప్రసాదోఽపి మహేశస్య**
**దుర్లభః పరికీర్త్యతే ।**
**ఘోరసంసారసంతాప**
**నివృత్తిర్యేన జాయతే॥ 11-69**

భయంకర(ఘోర)మైన సంసారసంతాపము యొక్క నివృత్తి (విడుదల) ఎవని ప్రసాదము వలన కలుగునో అటువంటి మహేశుని ప్రసాదము దుర్లభమని తెలియుము. (అందరికీ లభించదని తాత్పర్యము).

**యజ్ఞాస్తపాంసి మంత్రాణామ్**
**జపశ్చింతా ప్రబోధనమ్ ।**
**ప్రసాదార్థం మహేశస్య**
**కీర్తితాని న సంశయః॥ 11-70**

యజ్ఞములు, తపస్సు, మంత్రజపము, ధ్యానము, జ్ఞానము (వంటి సాధనములు) అన్నియు మహేశుని ప్రసాదమును పొందుటకే విధించబడినవి. ఇందు ఎటువంటి సందేహములేదు.

**ప్రసాదమూలా సర్వేషామ్**
**భక్తిరవ్యభిచారిణీ ।**



**శివప్రసాదహీనస్య**
**భక్తిశ్చాపి న సిద్ధ్యతి ॥ 11-71**

అవ్యభిచారిణియైన (అనన్యమైన) శివభక్తి అందరికీ శివప్రసాదము వలననే లభించుచున్నది. శివప్రసాదము లేని వారికి శివభక్తి కూడా సిద్ధించదు.

**గర్భస్థో జాయమానో వా**
**జాతో వా బ్రాహ్మణోఽథవా।**
**అంత్యజో వాఽపి ముచ్యేత**
**ప్రసాదే సతి శాంకరే ॥ 11-72**

శంకరుని ప్రసాదము లభించినవాడు గర్భమునందున్న వాడైనా, అప్పుడే పుట్టిన శిశువైనా, (జాతిచేత) బ్రాహ్మణుడైనా, అంత్యజుడైనా వాడు ముక్తుడే అగుచున్నాడు.

**బ్రహ్మాద్యా విబుధాః సర్వే**
**స్వస్వస్థాననివాసినః।**
**నిత్యసిద్ధా భవంత్యేవ**
**ప్రసాదాత్ పారమేశ్వరాత్ ॥ 11-73**

తమ తమ (అధికార) స్థానములందు సుస్థితులైన బ్రహ్మాది సమస్త దేవతలు పరమేశ్వరుని ప్రసాద(అనుగ్రహ)ము వలననే నిత్యసిద్ధులగు చున్నారు.

**ప్రసాదే శాంభవే సిద్ధే**
**పరమానందకారణే ।**
**సర్వం శివమయం విశ్వమ్**
**దృశ్యతే నాత్ర సంశయః॥ 11-74**

పరమానందమునకు కారణమైన శివుని ప్రసాదము సిద్ధించినచో సమస్త విశ్వము శివమయముగానే కనబడును. అందులో ఎటువంటి సందేహము లేదు.

**సంసారచక్రనిర్వాహ-**
**నిమిత్తం కర్మ కేవలమ్ ।**
**ప్రసాదేన వినా శంభోః**
**న కస్యాపి నివర్తతే ॥ 11-75**

సంసారమను చక్రభ్రమణమనకు కర్మ కారణమైయున్నది. శివుని ప్రసాదము లేకుండా ఏ (వ్యక్తి యొక్క) కర్మ గాని నివృత్తి కాజాలదు.

**బహునాఽత్ర కిముక్తేన**
**నాస్తి నాస్తి జగత్త్రయే ।**
**సమానమధికం చాపి**
**ప్రసాదస్య మహేశితుః॥ 11-76**



ఈ (శివ)ప్రసాదవిషయమును గురించి ఎంత చెప్పిన ఏమి ప్రయోజనము? ముల్లోకములలోను మహేశుని ప్రసాదముతో సమానమైనది గాని, దానికన్నా అధికమైనది గాని మరియొకటి వుండదు.

**శివప్రసాదే సతి యోగభాజి**
**సర్వం శివైకాత్మతయా విభాతి।**
**స్వకర్మముక్తః శివభావితాత్మా**
**స ప్రాణలింగీతి నిగద్యతేఽసౌ॥ 11-77**

(– ఉపేంద్రవజ్రా)

(సామరస్యరూపమైన శివ)యోగమును పొందినవానికి శివ ప్రసాదము తోడైతే సమస్తమూ శివాత్మకముగానే కనబడును. తన (పూర్వ)కర్మల నుండి విడువడిన లేదా ముక్తుడైన సాధకుడు శివభావితాత్ముడై 'ప్రాణలింగి' అని పిలువబడుచున్నాడు.

ఇతి ప్రసాదమాహాత్మ్యస్థలం పరిసమాప్తమ్
ప్రసాదమాహాత్మ్యస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ ప్రసాదినః సప్తవిధస్థలప్రసంగోనామ ఏకాదశః పరిచ్ఛేదః॥***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'ప్రసాదియొక్క సప్తవిధస్థలప్రసంగ'మను పదునుకొండవ పరిచ్ఛేదము ముగిసినది.



# ద్వాదశః పరిచ్ఛేదః

## పంద్రెండవ పరిచ్ఛేదము

## ప్రాణలింగినః పంచవిధస్థలప్రసంగః

## ప్రాణలింగియొక్క పంచవిధస్థలప్రసంగము

**(48 శ్లోకములు)**

### *IV. అథ ప్రాణలింగిస్థలమ్*

### ప్రాణలింగిస్థలము

**అగస్త్య ఉవాచ –**

**భక్తో మాహేశ్వరశ్చేతి**
**ప్రసాదీతి నిబోధితః ।**
**ఏక ఏవ కథం చైషః**
**ప్రాణలింగీతి కథ్యతే ॥ 12–1**

**అగస్త్యుల ప్రశ్న –**

(ఓ గణాధీశ్వరుడా) ఒక్కడే అయిన సాధకుని భక్తుడని, మాహేశ్వరుడని మరియు ప్రసాది యని వేరు వేరు పేర్లతో సంబోధించినారు. అదే సాధకుని ప్రాణలింగి అని కూడా చెప్పుచున్నారు. అదెట్లు సాధ్యము?

**శ్రీరేణుక ఉవాచ –**

**భక్తో మాహేశ్వరశ్చైష**
**ప్రసాదీతి చ కీర్తితః ।**
**కర్మప్రాధాన్యయోగేన**
**జ్ఞానయోగోఽస్య కథ్యతే ॥ 12–2**

**శ్రీరేణుకుల సమాధానము.**

సాధకుడు చేయవలసిన కర్మలయందలి ప్రాధాన్యతలకు సంబంధించిన తారతమ్యము వలన భక్తుడు, మాహేశ్వరుడు, ప్రసాది అని పిలువబడుచున్నాడు. ఇపుడు అదే సాధకునికి (కర్మయోగానంతరము) జ్ఞానయోగము చెప్పబడుచున్నది.

**లింగం చిదాత్మకం బ్రహ్మ**
**తచ్ఛక్తిః ప్రాణరూపిణీ ।**
**తద్రూపలింగవిజ్ఞానీ**
**ప్రాణలింగీతి కథ్యతే॥ 12–3**

చిదాత్మక(సంవిద్రూప)మైన బ్రహ్మమే లింగము. లింగముయొక్క శక్తియే ప్రాణరూపమైయున్నది. (శివశక్త్యాత్మకమైన) లింగవిజ్ఞానమును అనుభవించు అనుభావియే ప్రాణలింగి అని పిలువబడుచున్నాడు.

**ప్రాణలింగిస్థలం చైతత్**
**పంచస్థలసమన్వితమ్ ।**



**ప్రాణలింగిస్థలం చాదౌ**
**ప్రాణలింగార్చనం తతః ॥ 12–4**

**శివయోగసమాధిశ్చ**
**తతో లింగనిజస్థలమ్ ।**
**అంగలింగస్థలం చాథ**
**క్రమాదేషాం భిదోచ్యతే ॥ 12–5**

ఈ ప్రాణలింగిస్థలము అయిదు అవాంతరస్థలములను కలిగి వున్నది. అందు మొదటిది ప్రాణలింగిస్థలము. (రెండవది) ప్రాణలింగార్చన స్థలము. (మూడవది) శివయోగసమాధిస్థలము. (నాలుగవది) లింగనిజ స్థలము. చివరిది అంగలింగస్థలము. వరుసగా ఈ భేదములు వివరించుబడుచున్నవి.

### *32. అథ ప్రాణలింగిస్థలమ్*

**ప్రాణలింగిస్థలము**

**ప్రాణాపానసమాఘాతాత్**
**కందమధ్యాద్యదుత్థితమ్ ।**
**ప్రాణలింగం తదాఖ్యాతమ్**
**ప్రాణాపాననిరోధిభిః ॥ 12–6**

ప్రాణ మరియు అపాన (వాయువుల) సమాఘాతము (కలయిక) వలన కందమధ్యము(నాభి) నుండి వుత్పన్నమయిన జ్యోతియే 'ప్రాణలింగ'మని ప్రాణాపానములను నియంత్రించు శివయోగులు చెప్పుచున్నారు.

**ప్రాణో యత్ర లయం యాతి**
**భాస్కరే తుహినం యథా ।**
**తత్ర్పాణలింగముద్దిష్టమ్**
**తద్ధారీ స్యాత్ తదాకృతిః ॥ 12-7**

సూర్యునిలో మంచు కరిగిపోవునట్లు ఏ జ్యోతిలో ప్రాణము లయ మగుచున్నదో అదియే 'ప్రాణలింగ'మని చెప్పబడినది. దానిని ధరించినవాడు 'ప్రాణలింగి' అనబడుచున్నాడు.

**జ్ఞానినాం యోగయుక్తానామ్**
**అంతఃస్ఫురతి దీపవత్ ।**
**చిదాకారం పరం బ్రహ్మ**
**లింగమజ్ఞైర్న భావ్యతే ॥ 12-8**

శివయోగమును సాధించిన జ్ఞానుల అంతరంగములలో (హృదయములలో) చిద్రూపమైన పరబ్రహ్మము దీపమువలె స్ఫురించును. అటువంటి ప్రాణలింగము జ్ఞానరహితులచేత భావించ సాధ్యముకాదు.

**అంతఃస్థితం పరం లింగమ్**
**జ్యోతీరూపం శివాత్మకమ్ ।**
**విహాయ బాహ్యలింగస్థా**
**విమూఢా ఇతి కీర్తితాః ॥ 12-9**



అంతరంగమునందలి జ్యోతిరూపము, శివాత్మకము, శ్రేష్ఠము అయిన ప్రాణలింగమును వదలి, బాహ్యమునందుండు స్థావరలింగముపై ఆసక్తిని కలిగినవారు మూఢులనబడుచున్నారు.

**సంవిల్లింగపరామర్శీ**
**బాహ్యవస్తుపరాఙ్ముఖః ।**
**యః సదా వర్తతే యోగీ**
**ప్రాణలింగీ స ఉచ్యతే ॥ 12-10**

అందువలన ఎల్లప్పుడు బాహ్యవస్తు(స్థావరలింగము మరియు దానినర్చించు పూజాపరికరము)ల పట్ల విముఖుడై సంవిల్లింగ (జ్ఞాన రూపమైన ప్రాణలింగ)మును గురించి ఆలోచించు యోగి 'ప్రాణలింగి'యని పిలువబడుచున్నాడు.

**మాయావికల్పజం విశ్వమ్**
**హేయం సంచింత్య నిత్యశః ।**
**చిదానందమయే లింగే**
**విలీనః ప్రాణలింగవాన్ ॥ 12-11**

మాయ యొక్క వికల్పము(గుణభేదముల) నుండి పుట్టిన ఈ విశ్వము హేయమైన(త్యజించతగిన)దని అనునిత్యము భావించుచు, సత్-చిత్-ఆనందాత్మకమైన ప్రాణలింగమునందు విలీనమైన (మనోలయమును చేసుకున్న)వాడు 'ప్రాణలింగి' అనబడతాడు. (చిద్రూపమే తాను అను ఎరుకను కలిగినవాడే ప్రాణలింగి.)

**సత్తా ప్రాణమయీ శక్తిః**
**సద్రూపం ప్రాణలింగకమ్ ।**
**తత్సామరస్యవిజ్ఞానాత్**
**ప్రాణలింగీతి కథ్యతే ॥ 12-12**

సత్తాత్మక (ఉన్నది అను) భావరూపమే ప్రాణమయమయినశక్తి. సద్రూపమే ప్రాణలింగము. సత్తా సద్రూపముల (శక్తి, శివుల) సామరస్య (అనుభవ)జ్ఞానము కలవాడే 'ప్రాణలింగి' యని పిలువబడుచున్నాడు. (సద్వస్తుభావమే సత్తా. అదియే శక్తి. సద్వస్తువు శివుడు. సత్తాభావమేశక్తి. ఈ రెండు దీపము, దీపకాంతులవలె అవినాభావసంబంధముతో నున్నవని తెలుసుకొనుటయే విజ్ఞానము. అటువంటి విజ్ఞానము కలవాడే ప్రాణలింగి).

*ఇతి ప్రాణలింగిస్థలం పరిసమాప్తమ్ ।*

ప్రాణలింగిస్థలము ముగిసినది.

## *33. అథ ప్రాణలింగార్చనస్థలమ్*
## ప్రాణలింగార్చనస్థలము

**అంతర్గతం చిదాకారమ్**
**లింగం శివమయం పరమ్ ।**
**పూజ్యతే భావపుష్పైర్యత్**
**ప్రాణలింగార్చనం హి తత్ ॥ 12-13**



అంతరంగమునందున్న చిదాకార(చైతన్య)రూపము, సర్వశ్రేష్ఠము, శివరూప(మంగళకర)మయిన (ప్రాణ)లింగమునకు భావపుష్పములతో చేయు పూజయే ప్రాణలింగార్చన మనబడును.

**అంతః పవనసంస్పృష్టే**
**సుసూక్ష్మాంబరశోభితే ।**
**మూర్ధన్యచంద్రవిగలత్**
**సుధాసేకాతిశీతలే ॥ 12-14**

**బద్ధేంద్రియనవద్వారే**
**బోధదీపే హృదాలయే ।**
**పద్మపీఠే సమాసీనమ్**
**చిల్లింగం శివవిగ్రహమ్ ।**
**భావయిత్వా సదాకాలమ్**
**పూజయేత్ భావవస్తుభిః ॥ 12-15**

నవద్వారములను బంధించుకొని, ధ్యానమున కూర్చున్న సాధకుడు బ్రహ్మరంధ్రము నందలి చంద్రమండలము నుండి స్రవించు అమృతధారలతో చల్లనైన, అత్యంత సూక్ష్మమైన ఆకాశములో ప్రకాశించుచున్న అంతరంగమున ప్రాణవాయువుచే ఆవరించబడిన, హృదయమంటపమున జ్ఞానదీపమై వెలుగు అష్టదళకమలమున ఆసీనమైయున్న చిల్లింగమును (ప్రాణలింగమును) నిరంతరము భావించుచు, భావనామయ వస్తువులతో పూజించవలెను. (14-15)

క్షమాఽభిషేకసలిలమ్
వివేకో వస్త్రముచ్యతే ।
సత్యమాభరణం ప్రోక్తమ్
వైరాగ్యం పుష్పమాలికా ॥ 12-16

గంధః సమాధిసంపత్తిః
అక్షతా నిరహంకృతిః ।
శ్రద్ధా ధూపో మహాజ్ఞానమ్
జగద్భాసిప్రదీపికా ॥ 12-17

భ్రాంతిమూలప్రపంచస్య
నివేద్యం తన్నివేదనమ్ ।
మౌనం ఘంటాపరిస్పందః
తాంబూలం విషయార్పణమ్ ॥ 12-18

విషయభ్రాంతిరాహిత్యమ్
తత్ప్రదక్షిణకల్పనా ।
బుద్ధేస్తదాత్మికా శక్తిః
నమస్కారక్రియా మతా ॥ 12-19

ఏవంవిధైర్భావశుద్ధైః
ఉపచారైరదూషితైః।



ప్రత్యున్ముఖమనా భూత్వా
పూజయేల్లింగమాంతరమ్॥ 12-20

ఈ ప్రాణలింగపూజకు, క్షమా(గుణమే) అభిషేకజలము, వివేకమే వస్త్రము, సత్యమును పలుకుటయే ఆభరణము, వైరాగ్యమే పుష్పమాల, సమాధిస్థితిని పొందుటయే గంధము, అహంకారరాహిత్యమే అక్షతలు, శ్రద్ధయే ధూపము, విశ్వమును ప్రకాశింపచేయు మహాజ్ఞానమే దీపము, భ్రాంతిమూలమైన ప్రపంచమను నివేదించడమే నైవేద్యము (నేను నాది యను భావనలను నివేదించుట), మౌనమే ఘంటానాదము, శబ్దస్పర్శాది భౌతికవిషయములను అర్పించుటయే తాంబూలసమర్పణము, (ప్రాపంచిక) విషయభ్రాంతులను వదలిపెట్టుటయే ప్రదక్షిణము, బుద్ధిని తాదాత్మ్యము చేయుటయే నమస్కారము. ఈ విధముగా, దోషరహితములయిన శుద్ధభావనలను ఉపచారములతో అంతర్ముఖమైన మనస్సుతో అంతరంగము నందలి ప్రాణలింగమును పూజించవలెను.

*ఇతి ప్రాణలింగార్చనస్థలం పరిసమాప్తమ్ ।*

ప్రాణలింగార్చనస్థలము ముగిసినది.

### *34. అథ శివయోగసమాధిస్థలమ్*

### శివయోగసమాధిస్థలము

అంతఃక్రియారతస్యాస్య
ప్రాణలింగార్చనక్రమైః ।

**శివాత్మధ్యానసంపత్తిః**
**సమాధిరితి కథ్యతే ॥ 12-21**

ప్రాణలింగార్చనక్రమమున అంతరంగక్రియలలో తన్మయుడైన ప్రాణలింగికి సిద్ధించిన శివాత్మధ్యానసంపదయే (శివజీవుల సమాన సమరస రూపమైన ధ్యానమే) సమాధి అనబడుచున్నది.

**సర్వతత్త్వోపరిగతమ్**
**సచ్చిదానందభాసురమ్ ।**
**స్వప్రకాశమనిర్దేశ్యమ్**
**అవాఙ్మనసగోచరమ్ ॥ 12-22**

**ఉమాఖ్యయా మహాశక్త్యా**
**దీపితం చిత్స్వరూపయా ।**
**హంసరూపం పరాత్మానమ్**
**సోఽహంభావేన భావయేత్ ।**
**తదేకతానతాసిద్ధిః**
**సమాధిః పరమో మతః॥ 12-23**

సర్వ(ముప్పదియారు)తత్త్వములకు అగ్రభాగము నందుండువాడు, సత్-చిత్-ఆనంద స్వరూపముతో ప్రకాశించువాడు, స్వయం ప్రకాశుడు, చూపుటకు వీలుకానివాడు, వాక్కుకు మనస్సుకు అందనివాడు, చిత్ (చైతన్య)స్వరూపిణియైన 'ఉమా' అను పేరుగలిగిన మహాశక్తిచేత



ప్రకాశింపబడువాడు. హంసరూపుడు అయిన పరమాత్మను 'సోఽహం' అనుభావనతో భావించవలెను. (ఈ భావనతో) ఏర్పడిన తాదాత్మ్యసిద్ధియే ఉత్తమమైన 'సమాధి' అని నిర్ణయించబడినది.

**పరబ్రహ్మ మహాలింగమ్**
**ప్రాణో జీవః ప్రకీర్తితః।**
**తదేకభావమననాత్**
**సమాధిస్థః ప్రకీర్తితః॥ 12-24**

మహాలింగము అనగా పరబ్రహ్మము. ప్రాణమనగా జీవుడు. ఈ రెండింటి ఐక్య(ఒక్కటే అను)భావనను (నిరంతరము) మననము చేసుకొనువాడు 'సమాధిగతు'డు అని పిలువబడినాడు (ప్రాణారూఢాత్ భవేత్ జీవః – అని ఆగమవచనము).

**అంతః షట్చక్రరూఢాని**
**పంకజాని విభావయేత్ ।**
**బ్రహ్మాదిస్థానభూతాని**
**భ్రూమధ్యాంతాని మూలతః ॥ 12-25**

**భ్రూమధ్యాదూర్ధ్వభాగే తు**
**సహస్రదలమంబుజమ్ ।**
**భావయేత్తత్ర విమలమ్**
**చంద్రబింబం తదంతరే ॥ 12-26**

**సూక్ష్మరంధ్రం విజానీయాత్**
**తత్కైలాసపదం విదుః।**
**తత్రస్థం భావయేచ్ఛంభుమ్**
**సర్వకారణకారణమ్ ॥ 12-27**

అంతరంగమున (జీవేశ్వరులకు ఆశ్రయమైన సూక్ష్మదేహమున) మూలము (మూలాధారచక్రము) నుండి భ్రూమధ్యము (అజ్ఞాచక్రము) వరకు విస్తరించిన, బ్రహ్మాది దేవతాస్థానములైన ప్రదేశములను ఆరు తామర పూవులుగా భావించవలెను. భ్రూమధ్యముయొక్క ఊర్ధ్వ(పై)భాగమున (బ్రహ్మరంధ్రమున) సహస్రదళ కమలమును భావించవలెను. ఆ కమలమధ్యమున నిర్మలమైన చంద్రబింబమును భావించి అందులోని సూక్ష్మరంధ్రమును దర్శించవలెను. అదియే కైలాసము. ఆ కైలాసమునందు సర్వకారణకారణుడైన శంభువును భావించవలెను.

**బహిర్వాసనయా విశ్వమ్**
**వికల్పార్థం ప్రకాశతే ।**
**అంతర్వాసితచిత్తానామ్**
**ఆత్మానందః ప్రకాశతే ॥ 12-28**

బాహ్యవాసనా(శబ్ద, స్పర్శాది విషయవాసనా)ప్రభావముచేత విశ్వము వికల్ప(ఇష్టాయిష్టాత్మక)ముగా ప్రకాశించును. అంతరంగ వాసనా (శివోఽహంభావనా)ప్రభావముతో కలిగిన చిత్తముగలవారికి ఆత్మానందము ప్రకాశించును.



**ఆత్మారణిసముత్థేన**
**ప్రమోదమథనాత్ సుధీః।**
**జ్ఞానాగ్నినా దహేత్ సర్వమ్**
**పాశజాలం జగన్మయమ్ ॥ 12-29**

బుద్ధివంతుడైన ప్రాణలింగి, ఆత్మ అను అరణి (యజ్ఞ ప్రక్రియలో అగ్నిని రాజేయుట ఉపయోగించు రెండు కొయ్యల)పై ప్రమోదమును (శివోఽహం భావనతో) మథించుటచే పుట్టిన జ్ఞానాగ్ని, ప్రపంచమునకు సంబంధించిన పాశజాలమునంతటినీ దహించివేయుచున్నది.

**సంసారవిషవృక్షస్య**
**పంచక్లేశపలాశినః ।**
**ఛేదనే కర్మమూలస్య**
**పరశుః శివభావనా ॥ 12-30**

పంచక్లేశ(అవిద్యా-అస్మితా- రాగ-ద్వేష-అభినివేశ)ములను (పలాశ)ఆకులచే కూడి, కర్మమూలమైన విషవృక్షమును నరికివేయుటకు (శివోఽహం అను) శివభావనయే పరశు(గొడ్డలి)వై యున్నది.

**అజ్ఞానరాక్షసోన్మేష-**
**కారిణః సంహృతాత్మనః ।**

**శివధ్యానం తు సంసార-**
**తమసశ్చండభాస్కరః ।**
**తదేకతానతాసిద్ధిః ।**
**సమాధిః పరమో మతః ॥ 12-31**

ఆత్మను ఆవరించిన అజ్ఞానరాక్షసుని కన్నులను తెరిపించుటకు, సంసారమను గాఢాంధకారమును తొలగించుటకు శివధ్యానము ప్రచండుడైన సూర్యుని వంటిది. అటువంటి శివునితో తాదాత్మ్యరూపమైన సిద్ధిని సాధించుటయే ఉత్తమమయిన 'సమాధి' అనబడుచున్నది.

*ఇతి శివయోగసమాధిస్థలం పరిసమాప్తమ్ ।*

శివయోగసమాధిస్థలము ముగిసినది.

### *35. అథ లింగనిజస్థలమ్*

**లింగనిజస్థలము**

**స్వాంతస్థశివలింగస్య**
**ప్రత్యక్షానుభవస్థితిః ।**
**యస్యైవ పరలింగస్య**
**నిజమిత్యుచ్యతే బుధైః॥ 12-32**

తన అంతరంగము(హృదయకమలము)నందున్న శివలింగ (ప్రాణలింగ)మయొక్క ప్రత్యక్షానుభవస్థితియే ఆ పరలింగము(మహాలింగ) యొక్క నిజమైన స్వరూపమని విజ్ఞులు చెప్పుచున్నారు.



**బ్రహ్మవిష్ణ్వాదయో దేవాః**
**సర్వే వేదాదయస్తథా ।**
**లీయంతే యత్ర గమ్యంతే**
**తల్లింగం బ్రహ్మ కేవలమ్ ॥ 12-33**

బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలు, వేదాగమాది సర్వశాస్త్రములు, ఎక్కడ లయమునొందుచున్నవో, మరలా ఎక్కడి నుండి ఉద్భవించుచున్నవో ఆ పరబ్రహ్మమే లింగము.

**చిదానందమయః సాక్షాత్**
**శివ ఏవ నిరంజనః ।**
**లింగమిత్యుచ్యతే నాన్యత్**
**యతః స్యాద్విశ్వసంభవః ॥ 12-34**

ఎక్కడి నుండి (సమస్త) విశ్వము ఉత్పన్నమగుచున్నదో, ఎవడు సచ్చిదానందస్వరూపుడో, ఎవడు నిరంజనుడో (దోషరహితమైనవాడో) అటువంటి శివుడే లింగము అని పిలువబడినాడు. మరి యొకటి కాదు.

**బహునాఽత్ర కిముక్తేన**
**లింగమిత్యుచ్యతే బుధైః ।**
**శివాభిధం పరం బ్రహ్మ**
**చిద్రూపం జగదాస్పదమ్ ॥ 12-35**

ఎక్కువగా ఎంతచెప్పిననేమి ప్రయోజనము? జగత్తున కాశ్రయమై, చేతనాత్మకమై, 'శివుడ'ను పేర వ్యవహరించబడుచున్న పరబ్రహ్మమునే 'లింగ'మని బుధులు (జ్ఞానులు) చెప్పుచున్నారు.

**వేదాంతవాక్యజాం విద్యామ్**
**లింగమాహుస్తథాఽపరే।**
**తదసద్జ్ఞేయరూపత్వాత్**
**లింగస్య బ్రహ్మరూపిణః ॥ 12-36**

కొంతమంది (వేదాంతులు) ('ప్రజ్ఞానం బ్రహ్మ' 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాఽస్మి', 'అయమాత్మా బ్రహ్మ' అను) వేదాంతవాక్యముల వలన కలిగిన విద్యను (జ్ఞానమునే) లింగమని చెప్పుచున్నారు. అయితే అది అసత్యము. ఎందువలననగా పరబ్రహ్మస్వరూపమైన లింగము వేదాంతవాక్యముల ద్వారా కలిగిన జ్ఞానమునకు జ్ఞేయమై (తెలియదగిన వస్తువై) ఉన్నది. (వేదాంతవాక్యములు జ్ఞాపకములు, లింగము జ్ఞేయము) అని తాత్పర్యము.)

**అవ్యక్తం లింగమిత్యాహుః**
**జగతాం మూలకారణమ్ ।**
**లింగీ మహేశ్వరశ్చేతి**
**మతమేతదసంగతమ్ ॥ 12-37**

జగత్తునకు మూలకారణమైన అవ్యక్త(ప్రకృతిని)మును లింగమని, మరియు మహేశ్వరుని లింగి అని (కొంతమంది) చెప్పుచున్నారు. (సాంఖ్యుల) ఈ మతము కూడా అసంగతము(సరియైనదికాదు).



**న సూర్యో భాతి తత్రేందుః**
**న విద్యున్న చ పావకః ।**
**న తారకా మహాలింగే**
**ద్యోతమానే పరాత్మని ॥ 12-38**

పరమాత్మస్వరూపమై ఈ మహాలింగము ప్రకాశించుచుండగా అక్కడ సూర్యుడు గాని, చంద్రుడు గాని, విద్యుత్ గాని, అగ్నిగాని నక్షత్రములు గాని ప్రకాశింపజాలవు. (ఆ మహాలింగప్రకాశముముందు సూర్యచంద్రాదులు తేజోహీనులని భావము.)

**జ్యోతిర్మయం పరం లింగమ్**
**శ్రుతిరాహ శివాత్మకమ్ ।**
**తస్య భాసా సర్వమిదమ్**
**ప్రతిభాతి న సంశయః ॥ 12-39**

శివాత్మకమైన ఆ పరలింగము జ్యోతిర్మయమని శ్రుతి (వేదము) చెప్పుచున్నది.(అందుచేత) విశ్వమంతయూ అతనివలననే ప్రకాశించు చున్నది. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

**లింగాన్నాస్తి పరం తత్త్వమ్**
**యదస్మాజ్జాయతే జగత్ ।**
**యదేతద్రూపతాం ధత్తే**
**యదత్ర లయమశ్నుతే ॥ 12-40**

**తస్మాల్లింగం పరం బ్రహ్మ**
**సచ్చిదానందలక్షణమ్ ।**
**నిజరూపమితి ధ్యానాత్**
**తదవస్థాప్రజాయతే ॥ 12-41**

లింగతత్త్వముకన్నా శ్రేష్ఠమైన తత్త్వము వేరొకటి లేదు. ఈ (చరాచర) విశ్వమంతయూ ఆ లింగతత్త్వమునుండియే ఉద్భవించుచున్నది. ఏది ఈ జగద్రూపముగా పరిణమించుచున్నదో, ఎందులో ఈ జగమంతయు లయమగుచున్నదో (అదియే మహాలింగము). అటువంటి సచ్చిదానందలక్షణము గలిగిన పరబ్రహ్మమే లింగము. అటువంటి లింగమును తన నిజస్వరూపముగా భావించి, ధ్యానించుట వలననే 'లింగనిజస్థితి' ప్రాప్తమగుచున్నది.

*ఇతి లింగనిజస్థలం పరిసమాప్తమ్ ।*
లింగనిజస్థలము ముగిసినది.

## *36. అథ అంగలింగస్థలమ్*
## అంగలింగస్థలము

**జ్ఞానమంగమితి ప్రాహుః**
**జ్ఞేయం లింగం సనాతనమ్ ।**
**విద్యతే తద్ద్వయం యస్య**
**సోఽఙ్గలింగీతి కీర్తితః ॥ 12-42**



జ్ఞానమున్నవానిని 'అంగ'ము అందురు. సనాతనమయిన లింగమును జ్ఞేయము (జ్ఞానము ద్వారా తెలియదగినది) అందురు. ఈ రెండు ఉన్నవాడు 'అంగలింగి' అని పిలువబడతాడు.

**అంగే లింగం సమారూఢమ్**
**లింగే చాంగముపస్థితమ్ ।**
**ఏతదస్తి ద్వయం యస్య**
**స భవేదంగలింగవాన్ ॥ 12-43**

అంగమునందు లింగము (సమరసముగా) సమారూఢమై (ఆశ్రయించి) యున్నది. (మరియు) లింగమునందు అంగము (సమరసముగా) ఉపస్థితమై(స్థాపించబడి)యున్నది. ఎవనియందు ఈ రెండునూ వున్నవో వాడే 'అంగలింగస్థలి' అని పిలువబడినాడు. (అంగమున లింగమును, లింగమున అంగమును సామరస్య స్థితిలో వుంచుకున్నవాడే అంగలింగి).

**జ్ఞాత్వా యః సతతం లింగమ్**
**స్వాంతస్థం జ్యోతిరాత్మకమ్ ।**
**పూజయేత్ భావయేన్నిత్యమ్**
**తం విద్యాదంగలింగినమ్ ॥ 12-44**

తన హృదయకమలమునందు జ్యోతిర్మయమయిన లింగమును (శ్రుతి, గురు, స్వానుభవముల ద్వారా) తెలుసుకుని నిత్యము ఎవడు దానిని భావించి పూజించుచున్నాడో అతనినే 'అంగలింగి'యని తెలుసుకొనవలెను.

**జ్ఞాయతే లింగమేవైకమ్**
**సర్వైః శాస్త్రైః సనాతనైః ।**
**బ్రహ్మేతి విశ్వధామేతి**
**విముక్తేః పదమిత్యపి॥ 12-45**

సనాతనములయిన సమస్తశాస్త్రములు ఒక్కటే అయిన ఆ లింగమునే బ్రహ్మమని, విశ్వమునకాధారమని, ముక్తికి స్థానమని చాటుచున్నవి.

**ముక్తిరూపమిదం లింగమ్**
**ఇతి యస్య మనఃస్థితిః ।**
**స ముక్తో దేహయోగేఽపి**
**స జ్ఞానీ స మహాగురుః ॥ 12-46**

ఈ లింగము ముక్తిస్వరూపమని ఎవరి మనస్సున స్థిరమైయున్నదో అతడు దేహసంబంధము కలిగివున్ననూ ముక్తుడే అగుచున్నాడు. అతడే జ్ఞాని మరియు అతడే మహాగురువు.

**అనాదినిధనం లింగం**
**కారణం జగతామితి ।**
**యే న జానంతి తే మూఢా**
**మోక్షమార్గబహిష్కృతాః ॥ 12-47**

ఆది, అంతములు లేనటువంటి ఈ లింగము జగత్తున కంతటికీ కారణమని ఎవరు తెలుసుకొనరో వారు మూఢులు, మోక్షమార్గ బహిష్కృతులని



(మోక్షమార్గమునకు అనర్హులని) తెలియవలెను.

**యః ప్రాణలింగార్చనభావపూర్వైః**
**ధర్మైరుపేతః శివభావితాత్మా ।**
**స ఏవ తుర్యః పరికీర్తితోఽసౌ**
**సంవిద్విపాకాచ్ఛరణాభిధానః॥ 12-48**

– (ఇంద్రవజ్రా)

ప్రాణలింగార్చనస్థలమున పేర్కొనిన భావపూర్ణమైన ధర్మా (క్షమాది) గుణములను కలిగి, తురీయావస్థలో ఆత్మయందు శివభావనచేయు ప్రాణలింగిస్థలమునందలి సాధకుడే జ్ఞానముయొక్క పరిపక్వస్థితిని పొంది 'శరణు'డని పిలువబడుచున్నాడు.

ఇతి అంగలింగస్థలం పరిసమాప్తమ్
అంగలింగస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ ప్రాణలింగినః పంచవిధస్థల ప్రసంగోనామ ద్వాదశః పరిచ్ఛేదః***

।

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో 'ప్రాణలింగియొక్క పంచవిధస్థల ప్రసంగ'మను పంద్రెండవ పరిచ్ఛేదము ముగిసినది.



# త్రయోదశః పరిచ్ఛేదః

## పదమూడవ పరిచ్ఛేదము

## శరణస్య చతుర్విధస్థలప్రసంగః

## శరణుని చతుర్విధస్థలప్రసంగము

**(37 శ్లోకములు)**

### V. అథ శరణస్థలమ్
### శరణస్థలము

**అగస్త్య ఉవాచ –**

**మాహేశ్వరః ప్రసాదీతి**
**ప్రాణలింగీతి బోధితః।**
**కథమేష సమాదిష్టః**
**పునః శరణసంజ్ఞకః॥** **13-1**

**అగస్త్యుల ప్రశ్న :**

(ఓ గణాధీశ్వరుడా!) 'ప్రసాదీ' అని, 'ప్రాణలింగి' అని సంబోధించబడిన మాహేశ్వరుడు ఏ కారణముచేత 'శరణు'డని పిలవబడుచున్నాడు?

**శ్రీరేణుక ఉవాచ**

**అంగలింగీ జ్ఞానరూపః**
**సతీ జ్ఞేయః శివః పతిః ।**

యత్సౌఖ్యం తత్సమావేశే
తద్వాన్ శరణనామవాన్ ॥ 13-2

**శ్రీరేణుకుల సమాధానము**

(శివ) జ్ఞానస్వరూపుడైన అంగలింగి తనను సతి(భార్య)గాను శివుని పతి(భర్త)గాను భావించుకుని, వీరిద్దరి సమావేశము నందెటువంటి సౌఖ్యము అనుభవించబడుచున్నదో, అటువంటి (సమరసరూపమైన) సుఖస్థితిని పొందినవాడే 'శరణు'డను పేర పిలువబడుచున్నాడు.

స్థలమేతత్సమాఖ్యాతమ్
చతుర్ధా ధర్మభేదతః ।
ఆదౌ శరణమాఖ్యాతమ్
తతస్తామసవర్జనమ్ ॥ 13-3

తతో నిర్దేశముద్దిష్టమ్
శీలసంపాదనం తతః ।
క్రమాల్లక్షణమేతేషామ్
కథయామి నిశామ్యతామ్ ॥ 13-4

ఈ శరణస్థలము (ఆచార) ధర్మభేదముల ననుసరించి నాలుగు విధములుగా చెప్పబడినది. వాటిలో మొదటిది శరణస్థలము, రెండవది తామసనిరసనస్థలము, మూడవది నిర్దేశస్థలము, నాలుగవది శీలసంపాదన స్థలము. ఈ వివిధస్థలముల లక్షణములను వరుసగా తెలిపెదను వినుము.



## 37. అథ శరణస్థలమ్

**శరణస్థలము**

సతీవ రమణే యస్తు
శివే శక్తి విభావయన్ ।
తదన్యవిముఖః సోఽయమ్
జ్ఞాతః శరణనామవాన్ ॥ 13-5

ఎవడు, పతిపట్ల సతివలె, శివుని పట్ల తనను శక్తి(సతి) గా భావించుకొని, ఇతర విషయముల(దేవతల)పట్ల విముఖతను కలిగి వున్న వాడు 'శరణుడు' అను పేర పిలువబడుచున్నాడు.

పరిజ్ఞాతే శివే సాక్షాత్
కో వాఽన్యమభికాంక్షతి ।
నిధానే మహతి ప్రాప్తే
కః కాచం యాచతేఽన్యతః ॥ 13-6

సాక్షాత్తు శివుడినే తెలుసుకొన్న తరువాత ఇక ఇతరదేవతలను గురించి ఆలోచించువాడెవ్వడు? అమూల్యమైన నిధియే లభించినప్పుడు (మెరిసెడి) గాజుముక్కకై ఇతరులను యాచించువాడెవ్వడు?

శివానందం సమాసాద్య
కో వాఽన్యముపతిష్ఠతే ।

**గంగామృతం పరిత్యజ్య**
**కః కాంక్షేన్మృగతృష్ణికామ్ ॥ 13-7**

శివానందము పొందిన తరువాత అన్యదేవతల నాశ్రియించు వాడెవ్వడు? గంగానదీ జలమును వదలిపెట్టి మృగతృష్ణలోని నీటిని అపేక్షించువాడెవ్వడు?

**సంసారతిమిరచ్ఛేదే**
**వినా శంకరభాస్కరమ్ ।**
**ప్రభవంతి కథం దేవాః**
**ఖద్యోతా ఇవ దేహినామ్ ॥ 13-8**

జీవుల సంసార తిమిరములను (చీకటిని) పారద్రోలుటకు శంకరుడను సూర్యుడుదప్ప, మిణుగురు(ఖద్యోత)పురుగులవంటి ఇతర దేవతలెట్లు సమర్థులగుదురు?

**సంసారార్తః శివం యాయాద్**
**బ్రహ్మాద్యైః కిం ఫలం సురైః ।**
**చకోరస్తృషితః పశ్యేత్**
**చంద్రం కిం తారకా అపి ॥ 13-9**

సంసారదుఃఖితుడు శివునకు శరణాగతుడు కావలెనేగాని బ్రహ్మాది ఇతరదేవతలనాశ్రయించి ప్రయోజనమేమి? దప్పికగొన్న చకోరము చంద్రునికై తపించునే గాని, తారకల నాశ్రయించదు గదా!



**శివ ఏవ సమస్తానామ్**
**శరణ్యః శరణార్థినామ్ ।**
**సంసారోరగదష్టానామ్**
**సర్వజ్ఞః సర్వదోషహా ॥ 13-10**

**శివజ్ఞానే సముత్పన్నే**
**పరానందః ప్రకాశతే ।**
**తదాసక్తామనా యోగీ**
**నాన్యత్ర రమతే సుధీః॥ 13-11**

సంసారమను సర్పముచేత కరవబడి శరణాగతులైన సమస్త జీవుల సర్వదోషములను పరిహరించుటకు సర్వజ్ఞుడైన శివుడొక్కడే శరణ్యుడు (శరణు కోరతగినవాడు). శివజ్ఞానము కలిగినప్పుడు పరమానందము ప్రకాశమానమగును. పరానందప్రకాశముపట్ల ఆసక్తమయి మనస్సు గల జ్ఞానయోగి ఇతర విషయములపట్ల అనురక్తుడు కాలేడు.

**తస్మాత్ సర్వప్రయత్నేన**
**శంకరం శరణం గతః।**
**తదనంతసుఖం ప్రాప్య**
**మోదతే నాన్యచింతయా ॥ 13-12**

అందువలన అన్నివిధములా ప్రయత్నించి శంకరునకు శరణాగతుడైన శరణుడు శివుని అనంతసుఖమును పొంది ఇతరములనాలోచించక ఆనందమున రమించుచున్నాడు.

ఇతి శరణస్థలం పరిసమాప్తమ్ ।

శరణస్థలము ముగిసినది.

## 38. అథ తామసనిరసనస్థలమ్

### తామసనిరసనస్థలము

**శివాసక్తపరానంద-**
**మోదినా గురుణా యతః ।**
**నిరస్యంతే తమోభావాః**
**స తామసనిరాసకః ॥ 13-13**

శివాసక్తి(శివసామ్యత)వలన కలిగిన పరమానందానుభవముతో గురుత్వమును (శ్రేష్ఠత్వమును) పొందిన సాధకుడు, తనయందు మిగిలియున్న తమోగుణభావనలను తొలగించుకొనుటకు ప్రయత్నించును. అతడే 'తామసనిరాసకుడు' (అని వ్యవహరించబడుచున్నాడు).

**యస్య జ్ఞానం తమోమిశ్రమ్**
**న తస్య గతిరిష్యతే ।**
**సత్త్వం హి జ్ఞానయోగస్య**
**నైర్మల్యం విదురుత్తమాః ॥ 13-14**



ఎవరి జ్ఞానము తమోగుణముతో మిశ్రమమై వుండునో వారికి సద్గతి లభించదు. సత్త్వగుణము మాత్రమే జ్ఞానమును నిర్మలముగా నుంచగలదని ఉత్తమ(సత్) పురుషులు భావింతురు.

**శమో దమో వివేకశ్చ**
**వైరాగ్యం పూర్ణభావనా ।**
**క్షాంతిః కారుణ్యసంపత్తిః**
**శ్రద్ధా సత్యసముద్భవా ॥ 13-15**

**శివభక్తిః పరో ధర్మః**
**శివజ్ఞానస్య బాంధవాః ।**
**ఏతైర్యుక్తో మహాయోగీ**
**సాత్త్వికః పరికీర్తితః॥ 13-16**

శమము(అంతరింద్రియనిగ్రహము), దమము(బాహ్యేంద్రియ నిగ్రహము), వివేకము (నిత్యానిత్యవస్తువివేకము), వైరాగ్యము (ప్రాపంచిక విషయములపట్ల అనాసక్తత), పూర్ణభావన (అఖండధ్యానము), క్షాంతి (క్షమ), కారుణ్య (దయ), మొదలయిన (ఆధ్యాత్మిక)సంపదలు, సత్యమునందు అచంచలమయిన శ్రద్ధావిశ్వాసములు, శివుని యందు భక్తి అనబడు పరమోత్తమములయిన శివాచారధర్మములే శివజ్ఞానమునకు బంధువులు. ఇటువంటి (సద్)గుణములతో కూడుకున్న మహాయోగి 'సాత్త్వికుడు' అని పిలువబడినాడు.

**కామక్రోధమహామోహ -**
**మదమాత్సర్యవారణాః ।**
**శివజ్ఞానమృగేంద్రస్య**
**కథం తిష్ఠంతి సన్నిధౌ ॥ 13-17**

కామ, క్రోధ,(లోభ,, మోహ, మద, మాత్సర్యములను ఏనుగులు, శివజ్ఞానమను మృగేంద్రుని (సింహము) ముందు ఎలా నిలబడగలవు?

**యత్ర కుత్రాపి వా ద్వేష్టి**
**ప్రపంచే శివరూపిణి ।**
**శివద్వేషీ స విజ్ఞేయో**
**రజసాఽఽవిష్టమానసః ॥ 13-18**

శివస్వరూపమైన ఈ ప్రపంచమునందు ఇతరులను ద్వేషించుస్వభావముగలవారు రజోగుణముచేత ఆవరించబడిన మనసు కలవారై 'శివద్వేషులు'గా తెలియబడినారు.

**యో ద్వేష్టి సకలాన్ లోకాన్**
**యో వాఽహంకురుతే సదా।**
**యోఽసత్యభావనాయుక్తః**
**స తామస ఇతి స్మృతః॥ 13-19**

ఎవదు లోకమునందలి సమస్త జీవరాసులను ద్వేషించుచు, ఎవదు



నిరంతరము అహంకారముతో విర్రవీగుచు అసత్యభావనలను కలిగి వున్నాడో, వాడు 'తామసుడు' అని పిలవబడినాడు.

**తమోమూలా హి సంజాతా**
**రాగద్వేషాదిపాదపాః।**
**శివజ్ఞానకుఠారేణ**
**ఛేద్యంతే హి నిరంతరమ్ ॥ 13-20**

తమోగుణమును మూలములు(వ్రేళ్ళు)గా గలిగిన రాగ ద్వేషాదులను వృక్షములు శివజ్ఞానమను గొడ్డలితో నిరంతరము ఛేదించ(నరక) బడుచున్నవి.

**శివజ్ఞానే సముత్పన్నే**
**సహస్రాదిత్యసన్నిభే ।**
**కుతస్తమోవికారాః స్యుః**
**మహతాం శివయోగినామ్ ॥ 13-21**

వేయిమంది సూర్యులప్రకాశముతో సమానమైన శివజ్ఞానము ఉత్పన్న (ఆవిష్కృత)మైనపుడు తమోగుణప్రభావముతో పుట్టు వికారములు మహాత్ములైన శివయోగులను (శివశరణులను) ఏమిచేయగలవు?

ఇతి తామసనిరసనస్థలం పరిసమాప్తమ్ ।

తామసనిరసనస్థలము ముగిసినది.

**39.** అథ నిర్దేశస్థలమ్

నిర్దేశస్థలము

**నిరాకృత్య తమోభాగమ్**
**సంసారస్య ప్రవర్తకమ్ ।**
**నిర్దిశ్యతే తు యజ్జ్ఞానమ్**
**స నిర్దేశ ఇతి స్మృతః ॥ 13-22**

సంసార(ప్రపంచ)ప్రవృత్తికి కారణమైన తమోగుణమును (పూర్తిగా) తొలగించుకున్న తరువాత సిద్ధించు జ్ఞానమును నిర్దేశించు స్థలమును నిర్దేశస్థలము అంటారు.

**గురురేవ పరం తత్త్వమ్**
**ప్రకాశయతి దేహినామ్ ।**
**కో వా సూర్యం వినా లోకే**
**తమసో వినివర్తకః ॥ 13-23**

లోకములో సూర్యుడు తప్ప చీకటిని పారద్రోలగలసమర్థుడు మరొకడు లేనట్లే సమస్తజీవులకు పరతత్త్వమును ప్రకాశింపజేయగలవాడు (బోధించువాడు) గురువు ఒక్కడే.

**అంతరేణ గురుం సిద్ధమ్**
**కథం సంసారనిష్కృతిః ।**



**నిదానజ్ఞం వినా వైద్యమ్**
**కిం వా రోగో నివర్తతే ॥ 13-24**

శివజ్ఞాన సిద్ధుడయిన గురువు లేకుండా సంసార నిష్కృతి (నివృత్తి) ఎలాసాధ్యమవుతుంది? రోగవిజ్ఞానము చికిత్సావిధానము బాగుగా తెలిసిన వైద్యుడు లేకుండా రోగమెలా తొలుగుతుంది?(సంసారనివృత్తికి జ్ఞానసిద్ధుడైన గురువు, రోగనివారణకు అనుభవజ్ఞుడైన వైద్యుడు తప్పనిసరి అని తాత్పర్యము).

**అజ్ఞానమలినం చిత్త-**
**దర్పణం యో విశోధయేత్ ।**
**ప్రజ్ఞావిభూతియోగేన**
**తమాహుర్గురుసత్తమమ్ ॥ 13-25**

అజ్ఞానముచే మలినమైన చిత్తమను అద్దమును ప్రజ్ఞ యను విభూతితో ఎవరు పరిశుభ్రమొనరించుచున్నారో వారినే గురుశ్రేష్ఠులని అందురు.

**అపరోక్షితతత్త్వస్య**
**జీవన్ముక్తస్వభావినః ।**
**గురోః కటాక్షే సంసిద్ధే**
**కో వా లోకేషు దుర్లభః॥ 13-26**

శివతత్త్వమును సాక్షాత్కరింపచేసుకొని జీవన్ముక్తలక్షణములను గలిగిన గురువుయొక్క (కృపా)కటాక్షము సిద్ధించినపుడు ముల్లోకములలో పొందనిదేమున్నది?

**కైవల్యకల్పతరవో**
**గురవః కరుణాలయాః ।**
**దుర్లభా హి జగత్యస్మిన్**
**శివాద్వైతపరాయణాః ॥ 13-27**

కైవల్యమును అనుగ్రహించగలిగిన కల్పతరువులు, కరుణకు (దయకు) ఆలయములు, శివాద్వైతతత్త్వపరాయణులు అయిన గురువులు ఈ ప్రపంచమునందు నిస్సందేహముగా బహుదుర్లభులు.

**క్షీరాబ్ధిరివ సింధూనామ్**
**సుమేరురివ భూభృతామ్ ।**
**గ్రహాణామివ తిగ్మాంశుః**
**మణీనామివ కౌస్తుభః॥ 13-28**

**ద్రుమాణామివ భద్రశ్రీః**
**దేవానామివ శంకరః ।**
**గురుః శివః పరః శ్లాఘ్యో**
**గురూణాం ప్రాకృతాత్మనామ్ ॥ 13-29**



సాగరములందు క్షీరసాగరమువలె, పర్వతములందు మేరు పర్వతమువలె, గ్రహములందు సూర్యునివలె, మణులయందు కౌస్తుభమణివలె, వృక్షములందు చందనవృక్షమువలె, దేవతలయందు శంకరునివలె, ప్రాకృత(సామాన్యులయిన) గురువులందు శివస్వరూపుడైన గురువు మిక్కిలి శ్లాఘనీయుడై యున్నాడు.

ఇతి నిర్దేశస్థలం పరిసమాప్తమ్ ।
నిర్దేశస్థలము ముగిసినది.

## *40. అథ శీలసంపాదనస్థలమ్*
## శీలసంపాదనస్థలము

**జిజ్ఞాసా శివతత్త్వస్య**
**శీలమిత్యుచ్యతే బుధైః ।**
**నిర్దేశ్యయోగాదార్యాణామ్**
**తద్వాన్ శీలీతి కథ్యతే ॥ 13-30**

ఆచార్యుల ప్రశిక్షణలో శివత్వమును (పరిపూర్ణముగా) తెలుసుకొనవలెనను జిజ్ఞాస (ఉత్కటమైన కోరిక)యే 'శీలము'అని విద్వాంసులచేత చెప్పబడినది. ఆ శీలమును కలిగినవాడే 'శీలి' అని పిలువబడుచున్నాడు.

**ప్రపన్నార్తిహరే దేవే**
**పరమాత్మని శంకరే ।**

**భావస్య స్థిరతాయోగః**
**శీలమిత్యుచ్యతే బుధైః ॥ 13-31**

శరణాగతులై దరిచేరిన వారి దుఃఖములను తొలగించు దేవుడు, పరమాత్ముడు అయిన శంకరుని యందు తన భావనను సుస్థిరముచేసుకొను యోగమే 'శీల'మని విద్వాంసులు చెప్పుచున్నారు.

**శీలం శివైకవిజ్ఞానమ్**
**శివధ్యానైకతానతా ।**
**శివప్రాప్తిసముత్కంఠా**
**తద్యోగీ శీలవాన్ స్మృతః ॥ 13-32**

శివునొక్కడిని గురించి మాత్రమే తెలుసుకొనుట, శివధ్యానము నందు ఏకాగ్రత, శివుని సాక్షాత్కరింపజేసుకొను ఉత్కటమైన కోరికను కలిగివుండుటయే 'శీలం' అనబడినది. అటువంటి శీలసంపాదనకు ప్రయత్నించువాడు 'శీలవంతుడు' అనబడతాడు.

**శివాదన్యత్ర విజ్ఞానే**
**వైముఖ్యం యస్య సుస్థిరమ్ ।**
**తదాసక్తమనోవృత్తిః**
**తమాహుః శీలభాజనమ్ ॥ 13-33**

శివుని తప్ప అన్యదేవతలను గురించి తెలుసుకొనుటయందు ఎవనికి విముఖత (అనాసక్తత) స్థిరమైయున్నదో మరియు ఎవడు



శివునొక్కనియందే ఆసక్తమైన మనస్సును కలిగివున్నాడో, వానినే 'శీలభాజనుడ'ని చెప్పుచున్నారు.

**పతివ్రతాయా యచ్ఛీలమ్**
**పతిరాగాత్ ప్రశస్యతే ।**
**తథా శివానురాగేణ**
**సుశీలోఽభక్త ఉచ్యతే ॥ 13-34**

పతివ్రతాస్త్రీయొక్క శీలము పతియందలి ప్రేమచేత ఎట్లు ప్రశంసింపబడుచున్నదో అటులనే శివునిపైనున్న అనురాగముచేతనే (సాధకుడు) సుశీలుడు, అభక్తుడు (శివుని నుండి వేరుచేయడానికి వీలుకానివాడు) అని చెప్పబడినాడు.

**పతిం వినా యథా స్త్రీణామ్**
**సేవాఽన్యస్య తు గర్హణా ।**
**శివం వినా తథాఽన్యేషాం**
**సేవా నింద్యా కృతాత్మనామ్ ॥ 13-35**

స్త్రీలకు తమ పతిసేవలు తప్ప అన్య(పురుషుల) సేవ ఎట్లు గర్హనీయమో (నిందనీయమో), అటులనే కృతాత్ములకు (కృతకృత్యులైన శరణస్థల సాధకులకు) శివుని తప్ప అన్యదేవతల సేవ నిందనీయము (నింద్యము).

**బహునాత్ర కిముక్తేన**
**శివజ్ఞానైకనిష్ఠతా ।**
**శీలమిత్యుచ్యతే సద్భిః**
**శీలవాంస్తత్పరో మతః ॥ 13-36**

శీలము విషయమున ఎంత చెప్పిన నేమి ప్రయోజనము? శివజ్ఞాన సంపాదనమున ఏకాగ్రతకలిగి వుండుటయే శీలమని సత్పురుషుల మతము. అటువంటి శీలవంతుడు శివజ్ఞానతత్పరుడని చెప్పబడినాడు.

**శివాత్మబోధైకరతః స్థిరాశయః**
**శివం ప్రపన్నో జగతామధీశమ్।**
**శివైకనిష్ఠాహితశీలభూషణః**
**శివైక్యవానేష హి కథ్యతే బుధైః ॥ 13-37**

– (వంశస్థమ్)

శివాత్మబోధనిరతుడు, జగదీశుడైన శివునకు ప్రపన్నుడు, దృఢమైన భావనలుకలవాడు, శివునియందు ఏకాగ్రనిష్ఠయను శీలమును ఆభరణముగా గల శరణస్థల సాధకుడు 'శివైక్యుడు' అని జ్ఞానులు చెప్పుచున్నారు.

ఇతి శీలసంపాదనస్థలం పరిసమాప్తమ్
శీలసంపాదనస్థలం ముగిసినది



**ఓం తత్సత్ ఇతి**

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ శరణస్య చతుర్విధస్థల ప్రసంగోనామ త్రయోదశః పరిచ్ఛేదః।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందు శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో శరణుని చతుర్విధస్థలప్రసంగమను పదమూడవ పరిచ్ఛేదము ముగిసినది.



# చతుర్దశః పరిచ్ఛేదః

## పదునాల్గవ పరిచ్ఛేదము

## ఐక్యస్య చతుర్విధస్థలప్రసంగః

## ఐక్యుని చతుర్విధస్థలప్రసంగము

**(44 శ్లోకములు)**

**VI. అథ ఐక్యస్థలమ్**

**ఐక్యస్థలము**

**అగస్త్య ఉవాచ**

**తామసత్యాగసంబంధాత్**
**నిర్దేశాచ్ఛీలతస్తథా ।**
**శరణాఖ్యస్య భూయోఽస్య**
**కథమైక్యనిరూపణమ్ ॥ 14-1**

**అగస్త్యుల వారి ప్రశ్న**

ఓ రేణుకగణేశ్వరుడా! తమోగుణమును వదిలించుకుని జ్ఞాననిర్దేశముచేతను, శీల సంపాదనముచేతను 'శరణుడు' అనిపించుకున్న సాధకుడు మరలా 'ఐక్యుడు' అని ఎలా నిరూపించుకుంటాడు?

**శ్రీరేణుక ఉవాచ**

**ప్రాణలింగాదియోగేన**
**సుఖాతిశయమేయివాన్ ।**



**శరణాఖ్యః శివేనైక్య -**
**భావనాదైక్యవాన్ భవేత్ ॥ 14-2**

**శ్రీరేణుకుల వారి సమాధానము**

ఓ అగస్త్యుడా! ప్రాణలింగాది (అనుసంధాన) యోగము వలన ఆనందాతిశయమును అనుభవించుచు 'శరణు'డనిపించుకున్న సాధకుడు శివునితో ఐక్యభావమును పొందినపుడు 'ఐక్యుడు' అని పిలువబడుచున్నాడు.

**ఐక్యస్థలమిదం ప్రోక్తమ్**
**చతుర్ధా మునిపుంగవ ।**
**ఐక్యమాచారసంపత్తిః**
**ఏకభాజనమేవ చ ।**
**సహభోజనమిత్యేషామ్**
**క్రమాల్లక్షణముచ్యతే ॥ 14-3**

ఓ మునిపుంగవుడా! ఈ ఐక్యస్థలము నాలుగు విధములుగా చెప్పబడినది. అవి వరుసగా ఐక్యస్థలము, ఆచారసంపత్తిస్థలము, ఏకభాజనస్థలము మరియు సహభోజనస్థలము. వీటి లక్షణములను క్రమముగా తెలిపెదను ఆలకించుము.

***41. అథ ఐక్యస్థలమ్***

**ఐక్యస్థలము**

**విషయానందకణికా -**
**నిఃస్పృహో నిర్మలాశయః ।**

**శివానందమహాసింధు-**
**మజ్జనాదైక్యముచ్యతే ॥ 14-4**

క్షణభంగురములయిన (ప్రాపంచిక) విషయానందముల పట్ల నిస్పృహుడై నిర్మలములైన స్వచ్ఛములైన భావనలు (ఆశయములు)కలిగిన 'శరణుడు' శివానందమను మహాసాగరమున మునుగుట వలన 'ఐక్యుడు' అని పిలువబడుచున్నాడు.

**నిర్ధూతమలసంబంధో**
**నిష్కలంకమనోగతః ।**
**శివోఽహమితి భావేన**
**నిరూఢో హి శివైక్యతామ్ ॥ 14-5**

(ఆణవాది త్రివిధ)మల సంబంధములను (పూర్తిగా) తొలగించుకుని, నిష్కలంకమైన మనసుతో, 'శివోఽహం' (నేనే శివుడను) అనుభావముతో అనుసంధానముచేసుకున్న సాధకుడు శివునితో సంపూర్ణమైన ఐక్యమును పొందుచున్నాడు.

**శివేనైక్యం సమాపన్నః**
**చిదానందస్వరూపిణా ।**
**న పశ్యతి జగజ్జాలమ్**
**మాయాకల్పితవైభవమ్ ॥ 14-6**



చిదానందస్వరూపుడైన శివునితో ఐక్యమును (సామరస్యమును) పొందిన ఐక్యస్థలీయసాధకుడు మాయాప్రభావముతో వైభవమును సంతరించుకున్న ఈ జగజ్జాలమును (ఏ మాత్రము) పరిగణించడు.

**బ్రహ్మాండబుద్బుదోద్భేద-**
**విజృంభీ తత్త్వవీచిమాన్ ।**
**మాయాసింధుర్లయం యాతి**
**శివైక్యవడవానలే ॥ 14-7**

బ్రహ్మాండములను బుడగలనుండి ఎగిసిపడిన(ముప్పదియారు) తత్త్వములనబడు అలల(వీచికల)ను కలిగిన మాయా సముద్రము శివైక్యమను బడబాగ్నిలో లయమగుచున్నది.

**మాయాశక్తితిరోధానాత్**
**శివే భేదవికల్పనా ।**
**ఆత్మనస్తద్వినాశే తు**
**నాద్వైతాత్కించిదిష్యతే ॥ 14-8**

(శివుని యందలి) మాయాశక్తి తిరోధానము (అవతరణము) అయినపుడు జీవాత్మునిలో భేదభావము(బుద్ధి) ఉత్పన్నమగును. ఈ భేదబుద్ధిని నశింపజేసుకొనుటకు (తొలగించుకొనుటకు) అద్వైతభావముకన్నా (శ్రేష్ఠమైన) మరొకమార్గము లేదు.

**పశుత్వం చ పతిత్వం చ**
**మాయామోహవికల్పితమ్ ।**

**తస్మిన్ ప్రలయమాపన్నే**
**కః పశుః కో ను వా పతిః ॥ 14-9**

**ఘోరసంసారసర్పస్య**
**భేదవల్మీకశాయినః ।**
**బాధకం పరమాద్వైత-**
**భావనా పరమౌషధమ్ ॥ 14-10**

పశుత్వము (జీవభావము) పతిత్వము(శివభావము) రెండును మాయా మోహముచేతనే కల్పించబడినవి. ఆ మాయామోహము శివునిలో ప్రలయమైనపుడు (లయించినపుడు) పశువు ఎవరు? పతి ఎవరు? (భేదము తెలియదని భావము). (శివజీవుల) భేదమను పుట్టలో వసించు భయంకరమైన సంసారసర్పమునకు పరమాద్వైత (శివాద్వైత) భావమే సరియైన ఔషధము.

**భేదబుద్ధిసముత్పన్న-**
**మహాసంసారసాగరమ్ ।**
**అద్వైతబుద్ధిపోతేన**
**సముత్తరతి దేశికః॥ 14-11**

(జీవుడు వేరు - శివుడు వేరు అను) భేదబుద్ధిచేత ఉత్పన్నమైన సంసారమను మహాసముద్రమును ఐక్యస్థలసాధకుడైన దేశికుడు (శివాద్వైత) అద్వైతబుద్ధి అను పడవ ద్వారా దరిచేరుచున్నాడు.

**అజ్ఞానతిమిరోద్రిక్తా**
**కామరక్షఃక్రియాకరీ ।**



**సంసారకాలరాత్రిస్తు**
**నశ్యేదద్వైతభానునా ॥ 14-12**

అజ్ఞానమను గాడాంధకారమున పుట్టి, కోరికలను రాక్షస కృత్యములకు పాల్పడిన సంసారమను కాళరాత్రి అద్వైతభావనమను సూర్యునిచేత నాశనము చేయబడుచున్నది.

**తస్మాదద్వైతభావస్య**
**సదృశో నాస్తి యోగినామ్ ।**
**ఉపాయో ఘోరసంసార-**
**మహాతాపనివృత్తయే ॥ 14-13**

అందువలన యోగు(సాధకు)లకు భయంకరమైన సంసార మహాతాపమును (వేడిని) చల్లార్చుకొనుటకు (తొలగించుకొనుటకు) అద్వైతభావముతో సమానమైన మరొక ఉపాయము (మార్గము) లేదు.

**అద్వైతభావనాజాతమ్**
**క్షణమాత్రేఽపి యత్సుఖమ్ ।**
**తత్సుఖం కోటివర్షేణ**
**ప్రాప్యతే నైవ భోగిభిః ॥ 14-14**

ప్రాపంచిక విషయసుఖములను అనుభవించువారికి అద్వైతభావనాబలముతో లభించు ఒక్క క్షణకాలపు సుఖమును పొందుటకు ఒక కోటి సంవత్సరములు ప్రయిత్నించినను సాధ్యముకాదు.

**చిత్తవృత్తిసమాలీన-**
**జగతః శివయోగినః ।**
**శివానందపరిస్ఫూర్తిః**
**ముక్తిరిత్యభిధీయతే ॥ 14-15**

తమ చిత్తవృత్తులలో జగత్తును లీనము చేసుకున్న శివయోగులకు లభించు శివానందపరిస్ఫూర్తి(పరిపూర్ణఆనందస్థితి)యే ముక్తి అని చెప్పబడుచున్నది.

ఇతి ఐక్యస్థలం పరిసమాప్తమ్ ।

ఐక్యస్థలము ముగిసినది.

## *42. అథ ఆచారసంపత్తిస్థలమ్*

## ఆచారసంపత్తిస్థలము

**శివైకభావనాపన్న-**
**శివత్వో దేహవానపి ।**
**దేశికో హి న లిప్యేత**
**స్వాచారైః సూతకాదిభిః॥ 14-16**

శివైక్య (శివాద్వైత) భావనతో (శివుడు, తాను ఒక్కటే అన్న నిశ్చయ జ్ఞానముతో) శివత్వమును పొందిన (ఐక్యస్థలీయ) దేశికుడు దేహముతో వున్నను, తను చేయు నిత్యకర్మల చేతను మరియు (జనన-మరణ- రజః- జాతి-ఉచ్ఛిష్టములనెడి) సూతకముల చేతను అంటబడదు.



**శివాద్వైతపరిజ్ఞానే**
**స్థితే సతి మనస్వినామ్ ।**
**కర్మణా కిం ను భావ్యం స్యాత్**
**అకృతేన కృతేన వా ॥ 14-17**

మనస్వినులకు (లింగమునందు ఐక్యమయిన మనసు గలవారలకు) శివాద్వైతజ్ఞానము సుస్థిరమైనపుడు, అకృతకర్మల (చేయకూడని దుష్కర్మల) వలన గాని లేదా కృతకర్మల (చేయవలసిన సత్కర్మల) వలన గాని ఎటువంటి ప్రయోజనము వుండదు.

**శంభోరేకత్వభావేన**
**సర్వత్ర సమదర్శనః ।**
**కుర్వన్నపి మహాకర్మ**
**న తత్ఫలమవాప్నుయాత్ ॥ 14-18**

అన్నిటా అంతటా సమదృష్టికలిగి (పుణ్యపాపరూపములయిన) శంభువుతో ఐక్యభావనను పొందిన ఐక్యస్థలీయుడు ఎటువంటి మహాకర్మలను ఆచరించినను వాటి ఫలితమతనికి అంటదు.

**సుకృతీ దుష్కృతీ వాఽపి**
**బ్రాహ్మణో వాఽంత్యజోఽపి వా ।**
**శివైకభావయుక్తానామ్**
**సదృశో భవతి ధ్రువమ్ ॥ 14-19**

సుకృతులు (పుణ్యాత్ములు)గాని, దుష్కృతులు (పాపాత్ములు) గాని, బ్రాహ్మణుడు గాని, అంత్యజుడు గాని, శివైక్యభావన(శివాద్వైతభావన)ను పొందిన ఐక్యస్థలీయునకు నిస్సంశయముగా వారందరూ సమానముగానే (ఒకే విధముగానే) కనబడతారు.

**వర్ణాశ్రమసదాచారైః**
**జ్ఞానినాం కిం ప్రయోజనమ్ ।**
**లౌకికస్తు సదాచారః**
**ఫలాభావేఽపి భావ్యతే ॥ 14-20**

(శివైక్య)జ్ఞానసంపన్నులకు బ్రాహ్మణాది వర్ణములవలనగాని, బ్రహ్మచర్యాది ఆశ్రమములవలనగాని, సదాచారములవలన గాని ఎటువంటి ప్రయోజనము వుండదు. అయినా లౌకికములైన (నిత్య-నైమిత్తికాది) కర్మలు ఎటువంటి ఫలములు లేకపోయినా విధించబడినాయి. (అంటే కర్తవ్యముగా చెప్పబడినాయి.)

**నిర్దగ్ధకర్మబీజస్య**
**నిర్మలజ్ఞానవహ్నినా ।**
**దేహివద్భాసమానస్య**
**దేహయాత్రా తు లౌకికీ ॥ 14-21**

నిర్మలమైన జ్ఞానాగ్నిలో కర్మబీజములను దహించివేసుకున్న ఐక్యస్థలీయుడు (అందరివలె) దేహధారిగా వున్ననూ అతడు చేయు నిత్యదైహిక



వ్యవహారములు లోకమునకు (ప్రకృతికి) సంబంధించినవే గాని వాటితో అతనికెటువంటి సంబంధమూ వుండదు.

**శివజ్ఞానసమాపన్న-**
**స్థిరవైరాగ్యలక్షణః ।**
**స్వకర్మణా న లిప్యేత**
**పద్మపత్రమివాంభసా ॥ 14-22**

శివజ్ఞానమును సంపాదించుకుని స్థిరమైన వైరాగ్యలక్షణములను అలవరచుకున్న ఐక్యస్థలీయుడు నీటియందలి తామరపూవువలె తన కర్మ (ఫలము)ల వలన లిప్తుడు కాడు (ప్రభావితుడు కాడు.)

**గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ వాఽపి**
**జాగ్రన్ వాఽపి మహామతిః ।**
**శివజ్ఞానసమాయోగాత్**
**శివపూజాపరః సదా ॥ 14-23**

మహామతి (ఐక్యస్థలమునందున్న) అయినవాడు నడుచుచున్ననూ నిలబడిననూ, పడుకున్ననూ, మేలుకొనివున్ననూ, మరి ఎటువంటి కార్యనిమగ్నుడైననూ అతను శివజ్ఞానసమాయుక్తుడయినందున ఎల్లప్పుడు శివపూజానిరతుడై వుంటాడు.

**యద్యత్పశ్యతి సామోదమ్**
**వస్తు లోకేషు దేశికః ।**
**శివదర్శనసంపత్తిః**
**తత్ర తత్ర మహాత్మనః ॥ 14-24**

(ఐక్యస్థలీయుడైన) దేశికుడు ఈ లోకములో ఏ వస్తువును ప్రేమతో చూసినా ఆ వస్తువులలో మహాత్ముడైన అతనికి శివదర్శన భాగ్యమే కలుగు చుండును.

**యద్యచ్చింతయతే యోగీ**
**మనసా శుద్ధభావనః ।**
**తత్తచ్ఛివమయత్వేన**
**శివధ్యానముదాహృతమ్ ॥ 14-25**

ఐక్యస్థలము నందలి యోగి స్వచ్ఛమైన (నిర్మలమైన) భావనతో తన మనసున ఏ విషయములను గురించి ఆలోచించినా ఆ విషయము లన్నియు శివమయములయినందున ఆ చింతనను శివధ్యానమనియే భావించవలెను.

**యత్కించిద్భాషితం లోకే**
**స్వేచ్ఛయా శివయోగినా ।**
**శివస్తోత్రమిదం సర్వమ్**
**యస్మాత్ సర్వాత్మకః శివః ॥ 14-26**

(ఐక్యస్థలీయ) శివయోగి ఈ లోకమునందు స్వేచ్ఛగా (తన ఇచ్ఛ ప్రకారము) దేనిని గురించి మాట్లాడినా అవి అన్నియు శివస్తోత్రములే అవుతాయి. ఎందువలననగా శివుడు సర్వాత్మకుడు అయినందున.

**యా యా చేష్టా సముత్పన్నా**
**జాయతే శివయోగినామ్ ।**



**సా సా పూజా మహేశస్య**
**సర్వదా తద్గతాత్మనామ్ ॥ 14-27**

ఎప్పుడూ శివతాదాత్మ్యమునందుండు శివయోగుల చేష్టలు (కర్మలు) అన్నియూ మహేశుడైన శివునకు చేయు పూజలుగానే పరిగణించబడతాయి.

ఇతి ఆచారసంపత్తిస్థలం పరిసమాప్తమ్ ।

ఆచారసంపత్తిస్థలము ముగిసినది.

### *43. అథ ఏకభాజనస్థలమ్*
### ఏకభాజనస్థలము

**విశ్వం శివమయం చేతి**
**సదా భావయతో ధియా ।**
**శివైకభాజనాత్మత్వాత్**
**ఏకభాజనముచ్యతే ॥ 14-28**

ఈ విశ్వమంతము శివమయమని తన బుద్ధితో నిరంతరము భావించు ఐక్యస్థలీయునకు శివుడొక్కడే ఏకైక ఆశ్రయుడైనందున అతను ఏకభాజనుడునబడుచున్నాడు.

(భాజనం = పాత్ర, శివుడు జీవుడు ఒకే పాత్ర అయివున్నారు. లింగైక్యుడు, విశ్వము ఈ రెండూ శివునిలోనే వున్నందున లింగైక్యుడు ఏకభాజనస్థలి అనబడినాడు).

**స్వస్య సర్వస్య లోకస్య**
**శివస్యాద్వైతదర్శనాత్ ।**

**ఏకభాజనయోగేన**
**ప్రసాదైక్యమతిర్భవేత్ ॥ 14-29**

ఈ లింగైక్యస్థలీయుడు తనను, సకలవిశ్వమును మరియు శివుణ్ణి ఒక్కటిగానే చూడటం వలన తనకు సిద్ధించిన ఏకభాజనస్థితి నుండి ప్రసాదైక్యమతి కలిగినవాడవుతాడు. (ప్రసాదములో ఐక్యమతి కలిగినవాడవుతాడు).

**శివే విశ్వమిదం సర్వమ్**
**శివః సర్వత్ర భాసతే ।**
**ఆధారాధేయభావేన**
**శివస్య జగతః స్థితిః ॥ 14-30**

ఈ సమస్తవిశ్వము శివునిలో వున్నది. శివుడు విశ్వమంతటా ప్రకాశించు చున్నాడు. శివుడు, జగత్తు ఈ రెంటికీ ఆధార-ఆధేయభావ సంబంధమున్నది. (శివుడు ఆధారము,జగత్తు ఆధేయము అని తెలుసుకొనవలెను).

**చిదేకభాజనం యస్య**
**చిత్తవృత్తేః శివాత్మకమ్ ।**
**నాన్యత్ తస్య కిమేతేన**
**మాయామూలేన వస్తునా ॥ 14-31**

ఎవరి చిత్తవృత్తి (మనోవ్యాపారము) శివాత్మకమూ (శివస్వరూపము) మరియు చిదేకభాజనమూ (చిద్రూపమునే ఆశ్రయముగా కలిగివుండటము)



అయినప్పుడు ఆ ఐక్యస్థలీయునికి మాయామూలమయిన ఈ విశ్వముతో ప్రయోజనమేమి?

**చిత్ప్రకాశయతే విశ్వమ్**
**తద్వినా నాస్తి వస్తు హి ।**
**చిదేకనిష్ఠచిత్తానామ్**
**కిం మాయాపరికల్పితైః ॥ 14-32**

చైతన్యమే ఈ విశ్వమునంతటినీ ప్రకాశింపజేయుచున్నది. ఆ చైతన్యము తప్ప ఏ వస్తువు అస్తిత్వమునందే వుండదు. అందువలన చైతన్యాత్మకమైన చిత్తమును కలిగిన (చిదేకనిష్ఠచిత్తుడైన) ఐక్యస్థలీయునకు మాయాకల్పితమైన ఈ ప్రాపంచిక వస్తువులతో నేమి ప్రయోజనము ?

**వృత్తిశూన్యే స్వహృదయే**
**శివలీనే నిరాకులే ।**
**యః సదా వర్తతే యోగీ**
**స ముక్తో నాత్ర సంశయః ॥ 14-33**

(చిత్త)వృత్తిశూన్యుడు (మరొక వ్యవహారము లేనివాడు), నిరాకులుడు (క్షోభరహితుడు), శివుని యందే లీనమయినఐక్యస్థలీయ యోగి, తన హృదయమునందే సంచరించుచు ముక్తుడగుచున్నాడనుటలో ఎటువంటి సంశయము లేదు.

ఇతి ఏకభాజనస్థలం పరిసమాప్తమ్ ।
ఏకభాజనస్థలము ముగిసినది.

## 44. అథ సహభోజనస్థలమ్

### సహభోజనస్థలము

**గురోః శివస్య శిష్యస్య**
**స్వస్వరూపతయా స్మృతిః ।**
**సహభోజనమాఖ్యాతమ్**
**సర్వగ్రాసాత్మభావతః ॥ 14-34**

గురువును, శివుని మరియు శిష్యుని స్వస్వరూపముగా (తన ఆత్మతో అభిన్నముగా) భావించి సర్వగ్రాసాత్మభావముతో (అంతటినీ కలిపి గ్రహించుస్థితిలో) ఉన్న ఐక్యస్థలీయుడు 'సహభోజనుడు' అని పిలువబడుచున్నాడు.

**శివం విశ్వం గురుం సాక్షాత్**
**యోజయేన్నిత్యమాత్మని ।**
**ఏకత్వేన చిదాకారే**
**తదిదం సహభోజనమ్ ॥ 14-35**

చిదాకారరూపమైన తన ఆత్మలో శివుడు, విశ్వము మరియు గురువు ఒక్కరే అను ఐక్యభావముతో నుండు స్థితియే సహభోజన స్థలము.

**అయం శివో గురుశ్చైష**
**జగదేతచ్చరాచరమ్ ।**



**అహం చేతి మతిర్యస్య**
**నాస్త్యసౌ విశ్వభోజకః ॥ 14-36**

ఇతడు శివుడు, ఇతడు గురువు, ఇది చరాచరజగత్తు మరియు నేను, వేరు వేరు అను భేదబుద్ధి ఎవనియందుండునో వాడు విశ్వభోజకుడు కాజాలడు. (వాడు సహభోజనస్థలి కాడు.)

**అహం భృత్యః శివః స్వామీ**
**శిష్యోఽహం గురురేవ వై ।**
**ఇతి యస్య మతిర్నాస్తి**
**స చాద్వైతపదే స్థితః॥ 14-37**

నేను సేవకుడను, శివుడు స్వామి, నేను శిష్యుడను, అతడు గురువు అను భేదబుద్ధి ఎవనియందుండదో వాడు అద్వైతస్థానీయుడగుచున్నాడు.

**పరాహంతామయే స్వాత్మ-**
**పావకే విశ్వభాస్వతి ।**
**ఇదంతాహవ్యహోమేన**
**విశ్వహోమీతి కథ్యతే ॥ 14-38**

విశ్వప్రకాశకము, పరాహంత (అంతము కనిపించని) రూపము అయిన తన ఆత్మ అను అగ్నిలో 'ఇదం' రూపమైన సర్వస్వమునూ హోమము చేయు (సమర్పించే) వాడు 'విశ్వహోమి' అనబడుచున్నాడు.

**అహం శివో గురుశ్చాహమ్**
**అహం విశ్వం చరాచరమ్ ।**
**యయా విజ్ఞాయతే సమ్యక్**
**పూర్ణాహంతేతి సా స్మృతా ॥ 14-39**

నేనే శివుడను, నేనే గురువును, నేనే చరాచరవిశ్వమును, అని దేనివలన చక్కగా తెలియబడుచున్నదో అదియే 'పూర్ణాహుతి' అని పిలువబడుచున్నది.

**ఆధారవహ్నౌ చిద్రూపే**
**భేదజాతం జగద్ధవిః ।**
**జుహోతి జ్ఞానయజ్వా యః**
**స జ్ఞేయో విశ్వహవ్యభుక్ ॥ 14-40**

చిద్రూపమైన ఆత్మ అను ఆధారాగ్నిలో ప్రాపంచికమయిన భేదభావమను హవిస్సును సమర్పించువాడు 'జ్ఞానయజ్ఞదీక్షితుడు' అని, విశ్వమను హవిస్సును భుజించు(విశ్వహవ్యభుక్)వాడు అని తెలుసుకొనవలెను.

**చిదాకారే పరాకాశే**
**పరమానందభాస్వతి ।**
**విలీనచిత్తవృత్తీనామ్**
**కా వా విశ్వక్రమస్థితిః ॥ 14-41**



పరాకాశములో (సర్వోత్కృష్టమైన ఆజ్ఞ అను పేరుగల హృదయాకాశములో) చిదాకారముతో (జ్ఞానస్వరూపముతో) ప్రకాశించు పరమానందరూపుడైన సూర్యుని (మహావెలుగు)లో, తన చిత్తవృత్తులను అణుచుకున్న ఐక్యస్థలీయునకు ఈ విశ్వపు క్రమస్థితులుగాని, జగత్వ్యవహారములుగాని ఏవీ వుండవు.

**నిరస్తవిశ్వసంబాధే**
**నిష్కలంకే చిదంబరే ।**
**భావయేల్లీనమాత్మానమ్**
**సామరస్యస్వభావతః ॥ 14-42**

సమస్త ప్రాపంచికబాధలనుండి విముక్తుడైన ఐక్యస్థలీయుడు, తనను కళంక రహితమైన చిదాకాశములో (మహాలింగములో) సామరస్య భావముతో లీనమైనవానిగా భావించవలెను.

**సైషా విద్యా పరా జ్ఞేయా**
**సత్తానందప్రకాశినీ ।**
**ముక్తిరిత్యుచ్యతే సద్భిః**
**జగన్మోహనివర్తినీ ॥ 14-43**

సత్-చిత్-ఆనందస్వరూపమును ప్రకాశింపజేయు జ్ఞానమునే శ్రేష్ఠమైన పరావిద్యగా తెలియవలెను. ప్రాపంచిక మోహమును పరిహరించు ఆ విద్య వల్లనే ముక్తి సాధ్యమని సజ్జనులు చెప్పుచున్నారు.

**భక్తాదిధామార్పితధర్మయోగాత్**
**ప్రాప్తైకభావః పరమాద్భుతేన ।**
**శివేన చిద్వ్యోమమయేన సాక్షాత్**
**మోక్షశ్రియో భాజనతాముపైతి ॥ 14-44**

– (ఇంద్రవజ్రా)

భక్తమాహేశ్వరాది స్థలములలో చెప్పబడిన ధర్మములను (సదాచారములను) ఆచరించుట వలన చిదాకాశరూపమున వెలుగొందు సాక్షాత్తు శివునిలో పరమాద్భుతమయిన ఐక్యభావనను పొంది మోక్షసంపదకు యోగ్యుడగుచున్నాడు.

ఇతి సహభోజనస్థలం పరిసమాప్తమ్ ।

సహభోజనస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ 'ఐక్యస్య చతుర్విధస్థలప్రసంగో'నామ చతుర్దశః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో 'ఐక్యుని చతుర్విధస్థలప్రసంగ'మను పదునాల్గవ పరిచ్ఛేదము ముగిసినది.

# ఏకోత్తరశతస్థలాని

***లింగస్థలాని-57***

# నూటొక్క స్థలములు

**లింగస్థలములు-57**

# పంచదశః పరిచ్ఛేదః

## పదునైదవ పరిచ్ఛేదము

### భక్తస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగః

### భక్తస్థలమునందలి నవవిధలింగస్థలప్రసంగము

**(71 శ్లోకములు)**

**I. అథ భక్తస్థలమ్**

**భక్తస్థలము**

***శ్రీరేణుక ఉవాచ :***

**షట్స్థలోక్తసదాచార -**
**సంపన్నస్య యథాక్రమమ్ ।**
**లింగస్థలాని కథ్యంతే**
**జీవన్ముక్తిపరాణి చ ॥** **15-1**

**శ్రీరేణుకుల వచనము**

ఓ అగస్త్యమహర్షీ! అంగస్థలము(జీవు)నకు సంబంధించిన షట్ స్థలములందు చెప్పబడిన సదాచారమును చక్కగా పాటించినవానికి 'జీవన్ముక్తి' పరములయిన లింగస్థలములను వరుసగా వివరించెదను ఆలకించుము.

**అగస్త్య ఉవాచ :**

**భక్తాద్యైక్యావసానాని**
**షడుక్తాని స్థలాని చ ।**
**లింగస్థలాని కానీహ**
**కథ్యంతే కతి వా పునః ॥ 15-2**

**అగస్త్యుల వారి ప్రశ్న**

(అంగస్థలమునకు చెందిన) భక్తస్థలముతో ఆరంభమై ఐక్యస్థలముతో అంతమగు ఆరుస్థలములను మీరు (ఇప్పటిదాకా) వివరించినారు. లింగస్థలములు అనగా ఏవి? అవి ఎన్నివిధములు? తెలియజేయగలరు!

**శ్రీరేణుక ఉవాచ -**

**గుర్వాదిజ్ఞానశూన్యాంతాః**
**భక్తాదిస్థలసంశ్రితాః ।**
**స్థలభేదాః ప్రకీర్త్యంతే**
**పంచాశత్సప్త చాధునా ॥ 15-3**

**శ్రీరేణుకుల వారి సమాధానము**

(లింగస్థలమునందును) భక్తాది (ఆరు) స్థలములను ఆశ్రయించుకొని దీక్షాగురుస్థలముతో ఆరంభించి జ్ఞానశూన్యస్థలము వరకు గల యాబదియేడు అవాంతరస్థలములు వరుసగా చెప్పబడుచున్నవి.



**ఆదౌ నవస్థలానీహ**
**భక్తస్థలసమాశ్రయాత్ ।**
**కథ్యంతే గుణసారేణ**
**నామాన్యేషాం పృథక్ శృణు ॥ 15-4**

**దీక్షాగురుస్థలం పూర్వమ్**
**తతః శిక్షాగురుస్థలమ్ ।**
**ప్రజ్ఞాగురుస్థలం చాథ**
**క్రియాలింగస్థలం తతః ॥ 15-5**

**భావలింగస్థలం చాథ**
**జ్ఞానలింగస్థలం తతః ।**
**స్వయం పరం చరం చేతి**
**తేషాం లక్షణముచ్యతే ॥ 15-6**

వీటిలో (మొదటి) భక్తస్థలమునకు సంబంధించిన తొమ్మిది అవాంతరస్థలములు వాటి గుణములు వేరు వేరుగా వివరించబడు చున్నవి. వాటిలో మొదటిది - దీక్షాగురుస్థలము. రెండవది శిక్షాగురుస్థలము. మూడవది ప్రజ్ఞా(జ్ఞాన)గురుస్థలము, నాలుగవది క్రియాలింగస్థలము. అయిదవది భావలింగస్థలము. ఆరవది జ్ఞానలింగస్థలము. ఏడవది స్వయస్థలము. ఎనిమిదవది పరస్థలము, తొమ్మిదవది చరస్థలము. వీటి లక్షణములు క్రమముగా చెప్పబడుచున్నవి.

## 45. అథ దీక్షాగురుస్థలమ్

### దీక్షాగురుస్థలము

**దీయతే పరమం జ్ఞానమ్**
**క్షీయతే పాశబంధనమ్ ।**
**యయా దీక్షేతి సా తస్యామ్**
**గురుర్దీక్షాగురుః స్మృతః ॥ 15-7**

దేనిచేత పరమశ్రేష్ఠమైన శివజ్ఞానము ఇవ్వబడుచున్నదో, మరియు దేనిచేత (మలాది మాయా)పాశము వలన ఏర్పడిన బంధము తొలగించబడుచున్నదో అదియే దీక్షా (ప్రక్రియ). దీక్షాప్రక్రియలో దీక్షను ప్రసాదించు గురువు 'దీక్షాగురువు' అనబడతాడు.

**గుణాతీతం గుకారం చ**
**రూపాతీతం రుకారకమ్ ।**
**గుణాతీతమరూపం చ**
**యో దద్యాత్ స గురుః స్మృతః ॥ 15-8**

'గు'కారమునకు గుణాతీతుడు అని, 'రు'కారమునకు రూపాతీతుడు అని అర్థము. ఎవడు (ప్రాకృత)గుణముల కతీతము, (మాయా) రూపమునకతీతము, జ్యోతిర్మయము, చిన్మయము అయిన వస్తువును ఇచ్చుచున్నాడో, వాడే 'గురు'వని పిలువబడుచున్నాడు.



**ఆచినోతి చ శాస్త్రార్థాన్**
**ఆచారే స్థాపయత్యలమ్ ।**
**స్వయమాచరతే యస్మాత్**
**ఆచార్యస్తేన చోచ్యతే ॥ 15-9**

(శివాగమ)శాస్త్రరహస్యార్థములను చక్కగా తెలుసుకున్నవాడు, (వీరశైవధర్మమునకు సంబంధించిన) ఆచారములందు (శిష్యులను) నియోగించువాడు, అంతేగాక స్వయముగా ఆ ఆచారములను ఆచరించువాడు 'ఆచార్యుడు' అని పిలువబడుచున్నాడు.

**షడధ్వాతీతయోగేన**
**యతతే యస్తు దేశికః ।**
**మాయాబ్ధితారణోపాయ-**
**హేతుర్విశ్వగురుః శివః॥ 15-10**

(వర్ణాధ్వ, పదాధ్వ, మంత్రాధ్వ, భువనాధ్వ, తత్త్వాధ్వ, కలాధ్వములనెడు) షడధ్వములకు అతీతమయిన ఉపాయములచేత మాయామయమయిన సంసారసాగరతీరములను దాటించుటకు ప్రయత్నించుచున్నాడో, అతడే విశ్వగురువు! అతడే శివుడు.

**అఖండం యేన చైతన్యమ్**
**వ్యజ్యతే సర్వవస్తుషు ।**

**ఆత్మయోగప్రభావేన**
**స గురుర్విశ్వభాసకః ॥ 15-11**

తన ఆత్మయోగప్రభావముచేత (శివతాదాత్మ్యయోగముచేత) ఏ దేశికుడు ప్రపంచమునందలి సమస్త వస్తువులయందును అఖండమైన చైతన్యమును గోచరింపచేయుచున్నాడో, అనుభవింపజేయుచున్నాడో అటువంటి గురువును 'విశ్వభాసకుడు' అని అంటారు.

ఇతి దీక్షాగురుస్థలం పరిసమాప్తమ్
దీక్షాగురుస్థలము ముగిసినది.

## *46. అథ శిక్షాగురుస్థలమ్*

### శిక్షాగురుస్థలము

**దీక్షాగురురసౌ శిక్షా-**
**హేతుః శిష్యస్య బోధకః ।**
**ప్రశ్నోత్తరప్రవక్తా చ**
**శిక్షాగురురితీర్యతే ॥ 15-12**

దీక్షాగురువే శిష్యునకు (శాస్త్ర) బోధకుడై శిష్యుని (సందేహాత్మకమయిన) ప్రశ్నలకు (స్పష్టమైన యుక్తమైన) సమాధానములతో (శిష్యుని) శాస్త్రశిక్షణకు కారణమైనందున 'శిక్షాగురు' వని పిలవబడుచున్నాడు.



**బోధకోఽయం సమాఖ్యాతో**
**బోధ్యమేతదితి స్ఫుటమ్ ।**
**శిష్యే నియుజ్యతే యేన**
**స శిక్షాగురురుచ్యతే ॥ 15-13**

ఈ గురువునే బోధకుడు అన్నారు. బోధించబడే శివయోగ జ్ఞానమును బోధ్యము అన్నారు. ఏ బోధకుడు శిష్యుని యందు (బోధ్యబోధక భావముతో) శివజ్ఞానమును తెలియజేయుచున్నాడో, అతడినే 'శిక్షాగురువు' అన్నారు.

**సంసారతిమిరోన్మాథి-**
**శరచ్చంద్రమరీచయః ।**
**వాచో యస్య ప్రవర్తంతే**
**తమాచార్యం ప్రచక్షతే ॥ 15-14**

ఎవని యొక్క ఉపదేశవాక్యములు సంసారమను అంధకారమును తొలగించు శరత్కాలపు చంద్రకిరణము లగుచున్నవో అటువంటి వానిని 'ఆచార్యుడు' అన్నారు.

**దదాతి యః పతిజ్ఞానమ్**
**జగన్మాయానివర్తకమ్ ।**
**అద్వైతవాసనోపాయమ్**
**తమాచార్యవరం విదుః ॥ 15-15**

జగద్రూపమైన మాయను తొలగించు పతి(శివ) జ్ఞానమును మరియు(శివాద్వైత) అద్వైత భావసాధనకు ఉపాయమును తెలియజేయు గురువును ఆచార్యశ్రేష్ఠుడు అన్నారు.

**పూర్వపక్షం సమాదాయ**
**జగద్భేదవికల్పనమ్ ।**
**అద్వైతకృతసిద్ధాంతో**
**గురురేష గుణాధికః ॥ 15-16**

ప్రపంచపు భేదరూపములయిన వికల్పములను పూర్వపక్షములుగా చక్కగా నిరూపించి (వాటిని ఖండించుట ద్వారా) శివాద్వైతతత్త్వమును సిద్ధాంతముగా నిరూపించు ఈ శిక్షాగురువు గుణములచేత శ్రేష్ఠుడుగా భావించబడుచున్నాడు.

**సందేహవనసందోహ-**
**సముచ్ఛేదకుఠారికా ।**
**యత్సూక్తిధారా విమలా**
**స గురూణాం శిఖామణిః ॥ 15-17**

సంసారమను సందేహసమూహముల కారడవిని నరికివేయు గొడ్డలివంటి (పదునైన) నిర్మలమైన వాక్ప్రవాహమెవరికి గలదో, అటువంటి శిక్షాగురువు గురువులలోనే శిఖామణివంటివాడు.

**యత్సూక్తిదర్పణాభోగే**
**నిర్మలే దృశ్యతే సదా ।**



**మోక్షశ్రీర్బింబరూపేణ**
**స గురుర్భవతారకః ॥ 15-18**

ఎవరి ఉపదేశమను నిర్మలమైన (శుద్ధమైన) అద్దమునందు మోక్షలక్ష్మిని ప్రతిబింబింపచేయుచున్నాడో అటువంటి శిక్షాగురువే భవసాగరము నుండి తరింపచేయగలసమర్థుడు.

**శిష్యాణాం హృదయాలేఖ్యమ్**
**ప్రద్యోతయతి యః స్వయమ్ ।**
**జ్ఞానదీపికయాఽనేన**
**గురుణా కః సమో భవేత్ ॥ 15-19**

శిష్యుల హృదయకమలములలోని(వారి) నిజరూపములను (చిత్రములను) తన జ్ఞానదీపముతో ఎవడు స్వయముగా ప్రకాశింపచేయుచున్నాడో అటువంటి శిక్షాగురువుకు లోకములో సమాను లెవరుంటారు?

**పరమాద్వైతవిజ్ఞాన**
**పరమౌషధిదానతః ।**
**సంసారరోగనిర్మాథీ**
**దేశికః కేన లభ్యతే ॥ 15-20**

పరమా(శివా)ద్వైత విజ్ఞానమను శ్రేష్ఠమైన ఔషధమునిచ్చుట ద్వారా సంసార రోగమును నిర్మూలమునుజేయు ఉపదేశకుడు ఎవరికి లభిస్తాడు?

(శక్తిపాతాత్మకమైన సాత్వికభావసంపన్నులకు మాత్రమే ఇటువంటి గురువులభించునని తాత్పర్యము).

ఇతి శిక్షాగురుస్థలం పరిసమాప్తమ్ ।
శిక్షాగురుస్థలము ముగిసినది.

## 47. అథ (ప్రజ్ఞా) జ్ఞానగురుస్థలమ్
## (ప్రజ్ఞా) జ్ఞానగురుస్థలము

**ఉపదేష్టోపదేశానామ్**
**సంశయచ్ఛేదకారకః ।**
**సమ్యక్జ్ఞానప్రదః సాక్షాత్**
**ఏష జ్ఞానగురుః స్మృతః ॥ 15-21**

(అంతరార్థములతో కూడుకున్న) శాస్త్రములను ఉపదేశించువాడు, (శిష్యుని మనసులోని) సంశయములను సమూలముగా తొలగించువాడు, సమ్యక్ (శివ) జ్ఞానమును కలిగించువాడు జ్ఞానగురువు' అని చెప్పబడినాడు.

**నిరస్తవిశ్వసంభేదమ్**
**నిర్వికారం చిదంబరమ్ ।**
**సాక్షాత్కరోతి యో యుక్త్యా**
**స జ్ఞానగురురుచ్యతే ॥ 15-22**

ఏ గురువు యుక్తి (శివాద్వైతశాస్త్రము నందుపయోగించిన యుక్తి ప్రమాణములతో, స్వానుభవము)తో జగత్తునందలి భేదభావమును



తొలగించి, వికారరహితమైన చిదంబరుని (చిదాకాశతత్త్వస్వరూపుని) (తనకు తాను) సాక్షాత్కరింపచేసుకొన్నాడో అతడే 'జ్ఞానగురువు' అనబడతాడు.

**కలంకవానసౌ చంద్రః**
**క్షయవృద్ధిపరిప్లుతః ।**
**నిష్కలంకస్థితో జ్ఞాన-**
**చంద్రమా నిర్వికారవాన్ ॥ 15-23**

ఆకాశమునందలి చంద్రుడు కలంకమును (మచ్చను), తరుగుదల, పెరుగుదల అను వికారములను కలిగి వున్నాడు. కాని ఈ జ్ఞాన (గురు) చంద్రుడు నిష్కలంకుడు మరియు నిర్వికారుడు అయియున్నాడు.

**పార్శ్వస్థతిమిరం హంతి**
**ప్రదీపో మణినిర్మితః ।**
**సర్వగామి తమో హంతి**
**బోధదీపో నిరంకుశః ॥ 15-24**

మణులతో తయారుచేసిన దీపము సమీపమునందున్న చీకటిని (మాత్రమే) నాశనము చేయుచున్నది. అయితే నిరంకుశ(అపరిచ్ఛిన్న)మైన బోధ(నా)దీపము (శివజ్ఞానదీపము) అంతటా వ్యాపించివున్న తమస్సును (అజ్ఞానమును) నాశనము చేయుచున్నది.

**సర్వార్థసాధకజ్ఞాన -**
**విశేషాదేశతత్పరః ।**

**జ్ఞానాచార్యః సమస్తానామ్**
**అనుగ్రహకరః శివః ॥ 15-25**

సర్వార్థసాధకమైన (భుక్తిముక్తిప్రదాయకమైన) జ్ఞాన విశేషమును(శివాద్వైతజ్ఞానమును) ఉపదేశించుటలో నిమగ్నుడై ముముక్షువులందరినీ అనుగ్రహించు జ్ఞానాచార్యుడు సాక్షాత్తు శివుడే (అయివున్నాడు).

**కటాక్షచంద్రమా యస్య**
**జ్ఞానసాగరవర్ధనః ।**
**సంసారతిమిరచ్ఛేదీ**
**స గురుర్జ్ఞానపారగః ॥ 15-26**

ఏ గురువుయొక్క కృపాకటాక్షమను చంద్రుడు శిష్యుని జ్ఞానసాగరమును ఉప్పొంగింపచేయుచున్నాడో, అలాగే సంసారపు చీకట్లను పారద్రోలుచున్నాడో అటువంటి గురువు జ్ఞానపారంగతుడవుతాడు.

**బహిస్తిమిరవిచ్ఛేత్తా**
**భానురేష ప్రకీర్తితః ।**
**బహిరంతస్తమశ్ఛేదీ**
**విభుర్దేశికభాస్కరః ॥ 15-27**

బహిరంగమునందు కంటికి కనిపించు చీకటిని తొలగించినవాడు



సూర్యుడని కొనియాడబడినాడు. బహిరంగమునందు, అంతరంగము నందున్న అజ్ఞానమును తొలగించువానిని సర్వవ్యాపకుడైన 'ఉపదేశభాస్కరు'డని పేర్కొన్నాడు.

**కటాక్షలేశమాత్రేణ**
**వినా ధ్యానాదికల్పనమ్ ।**
**శివత్వం భావయేద్యత్ర**
**స వేదః శాంభవో మతః ॥ 15-28**

ధ్యానధారణాదు(అష్టాంగయోగము)ల అభ్యాసములేకనే (కేవలము గురువుల) కృపాకటాక్ష మాత్రముననే శిష్యునియందు శివత్వమునను గ్రహించు ప్రక్రియ 'శాంభవ(జ్ఞాన)ము' అని పిలువబడుచున్నది.

**శివవేధకరే జ్ఞానే**
**దత్తే యేన సునిర్మలే ।**
**జీవన్ముక్తో భవేచ్ఛిష్యః**
**స గురుర్జ్ఞానసాగరః ॥ 15-29**

శిష్యునియందు 'శివవేధనను' సమావేశమునొనర్చు నిర్మలజ్ఞానము ఏ గురువు నుండి పొందినవెంటనే శిష్యుడు 'జీవన్ముక్తు'డగుచున్నాడో అటువంటి(జ్ఞాన)గురువు నిజముగా జ్ఞానసాగరుడే(అయివున్నాడు).

ఇతి (ప్రజ్ఞా) జ్ఞానగురుస్థలం పరిసమాప్తమ్ ।

జ్ఞానగురుస్థలము ముగిసినది.

*48.* అథ క్రియాలింగస్థలమ్

క్రియాలింగస్థలము

**గురోర్విజ్ఞానయోగేన**
**క్రియా యత్ర విలీయతే ।**
**తత్క్రియాలింగమాఖ్యాతమ్**
**సర్వైరాగమపారగైః ॥ 15-30**

జ్ఞానగురువు ద్వారా లభించిన (అనుభవాత్మకమైన) జ్ఞానసంబంధము చేత ఏ లింగమునందు సమస్తక్రియలు విలయమొందుచున్నవో అటువంటి లింగమును శివాగమపారంగతులైన శివాచార్యులందురూ 'క్రియాలింగ'మని చెప్పుచున్నారు.

**పరానందచిదాకారమ్**
**పరబ్రహ్మైవ కేవలమ్ ।**
**లింగం సద్రూపతాపన్నమ్**
**లక్ష్యతే విశ్వసిద్ధయే ॥ 15-31**

పరమానందస్వరూపము, చిద్రూపము అయిన కేవల పరబ్రహ్మమే విశ్వమునందలి సమస్త సత్క్రియలసంసిద్ధికై సద్రూపమును ధరించి ఇష్టలింగరూపములో ఒక చిహ్నముగా అభివ్యక్తమైయున్నది.

**లింగమేవ పరం జ్యోతిః**
**భవతి బ్రహ్మ కేవలమ్ ।**



**తస్మాత్ తత్పూజనాదేవ**
**సర్వకర్మఫలోదయః ॥ 15-32**

పరంజ్యోతిస్వరూపమును పొందిన కేవల పరబ్రహ్మమే (ఇష్ట)లింగమైయున్నది. అందువలన అటువంటి లింగమునారాధించుట వలననే సర్వకర్మలు సిద్ధిని పొందుచున్నవి.

**పరిత్యజ్య క్రియాః సర్వా**
**లింగపూజైకతత్పరాః ।**
**వర్తంతే యోగినః సర్వే**
**తస్మాల్లింగం విశిష్యతే ॥ 15-33**

అందువలననే (శివ)యోగులందరూ ఇతరములైన (యాగాది) సమస్తక్రియలను వదలిపెట్టి, (శివ)లింగపూజను మాత్రమే ఆచరించుచున్నారు. అందువలన (వారి పూజలనందుకొను) లింగము సర్వోత్కృష్టమైనది.

**యజ్ఞాదయః క్రియాః సర్వా**
**లింగపూజాంశసమ్మితాః ।**
**ఇతి యత్పూజ్యతే సిద్ధైః**
**తత్క్రియాలింగముచ్యతే ॥ 15-34**

ఇష్టలింగపూజ ద్వారా ప్రాప్తించు ఫలములో యజ్ఞయాగాది ఇతర సమస్తక్రియలవలన సిద్ధించు ఫలము కేవలం ఒక అంశ మాత్రమే. దీనిని

తెలుసుకున్న శివయోగసిద్ధులచేత ఏ లింగము పూజింపబడుచున్నదో అదియే 'క్రియాలింగ' మనబడుచున్నది.

**కిం యజ్ఞైరగ్నిహోత్రాద్యైః**
**కిం తపోభిశ్చ దుశ్చరైః ।**
**లింగార్చనరతిర్యస్య**
**స సిద్ధః సర్వకర్మసు ॥ 15-35**

క్రియాలింగపూజలో ఆసక్తి గలవాడు చేయు సర్వకర్మలకు ఫలము వెంటనే సిద్ధించుచున్నది. అటువంటివానికి అగ్నిహోత్రాది యజ్ఞకర్మల వలన గాని, కష్టసాధ్యములైన తపస్సు వలన గాని ఏమి ప్రయోజనము?

**బ్రహ్మవిష్ణ్వాదయః సర్వే**
**విబుధా లింగమాశ్రితాః ।**
**సిద్ధాః స్వస్వపదే భాంతి**
**జగత్తంత్రాధికారిణః ॥ 15-36**

విశ్వసృష్టిప్రక్రియలో వివిధ కార్యకలాపములకు అధికారులైన బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలు లింగపూజాసక్తులయినందుననే తమ తమ పదవుల కార్యనిర్వహణసమర్థతను కలిగి వుంటున్నారు.

*ఇతి క్రియాలింగస్థలం పరిసమాప్తమ్ ।*

క్రియాలింగస్థలము ముగిసినది.



## *49. అథ భావలింగస్థలమ్*

### భావలింగస్థలము

**క్రియా యథా లయం ప్రాప్తా**
**తథా భావోఽపి లీయతే ।**
**యత్ర తద్దేశికైరుక్తమ్**
**భావలింగమితి స్ఫుటమ్ ॥ 15-37**

(ఇంతకుముందు చెప్పినట్టు) సమస్తక్రియలు లయమును పొందినట్టే, ఏ లింగమునందు భావము కూడా లయమగుచున్నదో అదియే 'భావలింగ'(ప్రాణలింగ)మని దేశికులు (వీరశైవ ఆచార్యులు) స్పష్టముగా పేర్కొనుచున్నారు.

**భావేన గృహ్యతే దేవో**
**భగవాన్ పరమః శివః ।**
**కిం తేన క్రియతే తస్య**
**నిత్యపూర్ణో హి స స్మృతః ॥ 15-38**

(షడ్గుణైశ్వర్య సంపన్నుడైన) భగవంతుడయిన పరమశివుడు, భావము చేతనే (పరిపూర్ణమైన శివాత్మకవృత్తి వలననే ) గ్రహించబడుచున్నాడు. అటువంటి నిత్యపరిపూర్ణుడయినవానికి క్రియలతో ఏమి ప్రయోజనము?

**అఖండపరమానంద**
**బోధరూపః పరః శివః ।**
**భక్తానాముపచారేణ**
**భావయోగాత్ ప్రసీదతి ॥ 15-39**

అఖండుడు (అపరిచ్ఛిన్నుడు), పరమానందస్వరూపుడు, బోధ రూపుడు (చిద్రూపుడు) అయిన ఆ పరమశివుడు భక్తులు భావనాత్మకముగా చేయు ఉపచారములకు ప్రసన్నుడగుచున్నాడు.

**మృచ్ఛిలావిహితాల్లింగాత్**
**భావలింగం విశిష్యతే ।**
**నిరస్తసర్వదోషత్వాత్**
**జ్ఞానమార్గప్రవేశనాత్ ॥ 15-40**

మట్టి, శిలల వంటి బాహ్యపదార్థములతో తయారుచేయబడిన లింగములకన్నను భావలింగము (ప్రాణలింగము) విలక్షణమైనది. ఎందువలననగా అది సర్వదోషరహితమై జ్ఞానమార్గప్రవేశమునకు సహకరించుచున్నది.

**విహాయ బాహ్యలింగాని**
**చిల్లింగం మనసి స్మరన్ ।**



**పూజయేద్ భావపుష్పైః**
**యో భావలింగీతి కథ్యతే ॥ 15-41**

ఇతరములైన బాహ్యలింగములను (ఇష్టలింగముతప్ప) వదలి, చిల్లింగమును మనసులో స్మరించుచు భావపుష్పములతో పూజించువాడు 'భావలింగి' అని పిలువబడుచున్నాడు.

**మూలాధారేఽథవా చిత్తే**
**భ్రూమధ్యే వా సునిర్మలమ్ ।**
**దీపాకారం యజన్ లింగమ్**
**భావద్రవ్యైః స యోగవాన్ ॥ 15-42**

తన మూలాధార(చక్రము)నగాని, చిత్తమున (హృదయ భాగమునందలి అనాహతచక్రమున) గాని, లేదా భ్రూమధ్యమున (ఆజ్ఞాచక్రము నందు) గాని,అత్యంత నిర్మలమైన దీపాకారపు లింగమును భావద్రవ్యములతో పూజించువాడు (శివ)యోగి అనబడుచున్నాడు.

**స్వానుభూతిప్రమాణేన**
**జ్యోతిర్లింగేన సంయుతః ।**
**శిలామృద్దారుసంభూతమ్**
**న లింగం పూజయత్యసౌ ॥ 15-43**

స్వానుభూతి (శివుడే నేనన్న అనుభవాత్మకమైన) ప్రమాణముతో జ్యోతిర్లింగమున లీనమైన వాడు, మట్టి, రాయి, కొయ్యలతో తయారయిన

(బాహ్య) లింగములను (ఇష్టలింగమును తప్ప) పూజించదు.

**క్రియారూపా తు యా పూజా**
**సా జ్ఞేయా స్వల్పసంవిదామ్ ।।**
**ఆంతరా భావపూజా తు**
**శివస్య జ్ఞానినాం మతా ।। 15-44**

(బాహ్యోపచారాది) క్రియలతో చేయు పూజ అల్పజ్ఞానులకు విధించినదని తెలుసుకొనవలెను. అయితే అంతరంగములో శివునికి చేయు భావపూజ జ్ఞాను(శివాద్వైతజ్ఞాను)లకు విధించబడినద'ని తెలియవలెను. (ఇష్టలింగపూజను చేస్తూ భావలింగమువైపు పయనించినప్పుడే సాధకుడు పూర్ణజ్ఞాని అవుతాడు).

*ఇతి భావలింగస్థలం పరిసమాప్తమ్ ।*

భావలింగస్థలము ముగిసినది.

## 50. అథ జ్ఞానలింగస్థలమ్
## జ్ఞానలింగస్థలము

**తద్భావజ్ఞాపకజ్ఞానమ్**
**లయం యత్ర సమశ్నుతే ।**
**తజ్జ్ఞానలింగమాఖ్యాతమ్**
**శివతత్త్వార్థకోవిదైః ।। 15-45**



ఆ భావలింగమును జ్ఞాపకమునకు తెచ్చు జ్ఞానము ఎక్కడ సంపూర్ణముగా లయమగుచున్నదో, దానినే శివతత్త్వకోవిదులు 'జ్ఞానలింగ'మని పిలుచుచున్నారు.

**త్రిమూర్తిభేదనిర్ముక్తమ్**
**త్రిగుణాతీతవైభవమ్ ।**
**బ్రహ్మ యద్బోధ్యతే తత్తు**
**జ్ఞానలింగముదాహృతమ్ ।। 15-46**

బ్రహ్మ, విష్ణువు, రుద్రులను మూర్తిభేదములు లేనట్టిది (అఖండమైనది), సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములకు అతీతమైన వైభవము గలిగినది అయిన ఏ పరబ్రహ్మతత్త్వము బోధించబడుచున్నదో, అదియే 'జ్ఞానలింగ'మని చెప్పబడినది.

**స్థూలే క్రియాసమాపత్తిః**
**సూక్ష్మే భావస్య సంభవః ।**
**స్థూలసూక్ష్మపదాతీతే**
**జ్ఞానమేవ పరాత్మని ।। 15-47**

పరాత్పరతరమైన ఆ జ్ఞానలింగమే స్థూలరూపములో ఇష్టలింగమైనందున అక్కడ క్రియారూపమైన పూజలచేత అర్చించబడుచున్నది. అదేలింగము సూక్ష్మరూపములో భావలింగ (ప్రాణలింగ)మైనందున అక్కడ భావనాత్మకమైన ద్రవ్యములతో అర్చించబడుచున్నది. స్థూల, సూక్ష్మ

(లింగ)ములకన్నను అతీతము, పరాత్పరము అయిన జ్ఞానలింగ(తృప్తిలింగ)మును జ్ఞానము చేతనే అర్చించవలెను.

**కల్పితాని హి రూపాణి**
**స్థూలాని పరమాత్మనః।**
**సూక్ష్మాణ్యపి చ తైః కిం వా**
**పరబోధం సమాచరేత్ ॥ 15-48**

పరమాత్ముని స్థూల మరియు సూక్ష్మరూపములు కల్పితములు. ముముక్షువులైనవారికి కల్పితములయినవాటిలో ప్రయోజనము లేనందున పరబోధరూపమైన తృప్తి(జ్ఞాన)లింగమే పరమశ్రేష్ఠమైనదిగా తెలియవలెను.

**పరాత్పరం తు యద్ బ్రహ్మ**
**పరమానందలక్షణమ్ ।**
**శివాఖ్యం జ్ఞాయతే యేన**
**జ్ఞానలింగీతి కథ్యతే ॥ 15-49**

పరమానందమునే స్వరూపలక్షణముగా గలిగిన పరాత్పర బ్రహ్మరూపమైన శివతత్త్వము ఎవనిచేత తెలియబడుచున్నదో అతడే 'జ్ఞానలింగి' అని పిలవబడుచున్నాడు.

**బాహ్యక్రియాం పరిత్యజ్య**
**చింతామపి చ మానసీమ్ ।**



**అఖండజ్ఞానరూపత్వమ్**
**యో భజేన్ముక్త ఏవ సః ॥ 15-50**

ముందు చెప్పినటుల ఇష్టలింగమునకు చేయు బాహ్యక్రియారూపమైన పూజను, ప్రాణలింగమునకు చేయు ధ్యానరూపమైన మానసికపూజను కూడా పరిత్యజించి, ఎవడు అఖండజ్ఞాన రూపమైన తృప్తిలింగమును పూజించుచున్నాడో వాడే ముక్తుడు.

*ఇతి జ్ఞానలింగస్థలం పరిసమాప్తమ్ ।*

జ్ఞానలింగస్థలము ముగిసినది.

## *51. అథ స్వయస్థలమ్*

### స్వయస్థలము

**తద్భావజ్ఞాపకజ్ఞానమ్**
**యత్ర జ్ఞానే లయం వ్రజేత్ ।**
**తద్వానేష సమాఖ్యాతః**
**స్వాభిధానో మనీషిభిః ॥ 15-51**

ఆ భావ(భావలింగ)ప్రకాశకమైన జ్ఞానము ఏ జ్ఞాన(లింగ)మునందు లయమొందుచున్నదో అటువంటి స్థితియందున్న సాధకుని 'స్వయ' మను పేరు గలిగినవానిగా (స్వయస్థలి యని, స్వయలింగ మని) శివజ్ఞానులు పేర్కొనుచున్నారు.

**స్వచ్ఛందాచారసంతుష్టో**
**జ్యోతిర్లింగపరాయణః ।**
**ఆత్మస్థసకలాకారః**
**స్వాభిధో మునిసత్తమః ॥ 15-52**

తన (స్వతంత్రమయిన )స్వేచ్ఛాచారములతో సంతుష్టుడై (నిరంతరము) జ్యోతిర్లింగ(జ్ఞానలింగ)మునందు భావనా నిష్ఠుడై, శివస్వరూపుడై, తన లోనే ప్రపంచమునందలి సమస్త ఆకారవికారములను అణుచుకున్న మునిశ్రేష్ఠుడే 'స్వయస్థలి' అనబడినాడు.

**నిర్మమో నిరహంకారో**
**నిరస్తక్లేశపంచకః ।**
**భిక్షాశీ సమబుద్ధిశ్చ**
**ముక్తప్రాయో మునిర్భవేత్ ॥ 15-53**

మమకారములేనివాడు, అహంకారశూన్యుడు, (అవిద్యాది) పంచక్లేశముల నుండి ముక్తుడు, భిక్షాహారముతో జీవించువాడు, సర్వజీవులయందు సమానబుద్ధికలిగినవాడు, మౌనమును దాల్చినవాడు ముక్తప్రాయుడుగా (పరముక్తిని పొందినవారితో సమానమైనవానిగా) పరిగణించబడతాడు.

**యదృచ్ఛాలాభసంతుష్టో**
**భస్మనిష్ఠో జితేంద్రియః ।**



**సమవృత్తిర్భవేద్ యోగీ**
**భిక్షుకే వా నృపేఽథవా ॥ 15-54**

(అపేక్షించకుండా) లభించినదానితోనే సంతుష్టుడై భస్మోద్ధూళనాదుల(భస్మధారణ)యందు నిష్ఠగలిగి, ఇంద్రియములను వశమునందుంచుకొనుటచే జితేంద్రియుడైన 'స్వయస్థలి'యోగి యాచకుని యందును, నరపాలకుని యందును సమానబుద్ధిని కలిగివుంటాడు.

**పశ్యన్ సర్వాణి భూతాని**
**సంసారస్థాని సర్వశః ।**
**స్మయమానః పరానందే**
**లీనాత్మా వర్తతే సుధీః ॥ 15-55**

సమబుద్ధి(ధీ)కలిగిన స్వయలింగి(శివయోగి), సంసారమునందలి సర్వప్రాణులను విస్మయముతో చూచుచు పరమానందమయమైన మహాలింగమునందు లీనుడై లోకమున చరిస్తాడు.

**ధ్యానం శైవం తథా జ్ఞానమ్**
**భిక్షా చైకాంతశీలతా ।**
**యతేశ్చత్వారి కర్మాణి**
**న పంచమమిహేష్యతే ॥ 15-56**

'స్వయస్థలి అయిన యతికి శివధ్యానము, శివజ్ఞానము, భిక్షాహారము

మరియు ఏకాంతవాసము అను (నాలుగు) కర్మలు మాత్రమే విధించబడినవి. అయిదవకర్మ లేదని గ్రహించవలెను.

ఇతి స్వయస్థలం పరిసమాప్తమ్ ।

స్వయస్థలము ముగిసినది.

## *52.* అథ చరస్థలమ్

### చరస్థలము

**స్వరూపజ్ఞానసంపన్నో**
**ధ్వస్తాహంమమతాకృతిః ।**
**స్వయమేవ స్వయం భూత్వా**
**చరతీతి చరాభిధః ॥ 15-57**

'నేను', 'నాది అన్న అహంకార మమకారములను తొలగించుకుని, స్వస్వరూపజ్ఞానమును సంపాదించుకున్న 'స్వయలింగి' తనకు తానుగా లోకములో సంచరించునపుడు 'చరస్థలి' లేదా 'చరలింగి' యని పిలువబడుచున్నాడు.

**కామక్రోధాదినిర్ముక్తః**
**శాంతిదాంతిసమన్వితః ।**
**సమబుద్ధ్యా చరేద్ యోగీ**
**సర్వత్ర శివబుద్ధిమాన్ ॥ 15-58**



కామక్రోధాదులను పరిపూర్ణముగా పోగొట్టుకొని, శాంతి (శమ) దాంతి (దమ) గుణములను కలిగి (అంతటినీ) సమబుద్ధితో, శివబుద్ధితో చూచుచు లోకమున సంచరించువాడు 'చరస్థలి' శివయోగి అనబడతాడు.

**ఇదం ముఖ్యమిదం హీనమ్**
**ఇతి చింతామకల్పయన్ ।**
**సర్వత్ర సంచరేద్ యోగీ**
**సర్వం బ్రహ్మేతి భావయన్ ॥ 15-59**

ఇది ప్రధానము, ఇది అప్రధానము అన్న ఆలోచనను చేయక సర్వము బ్రహ్మమని స్వానుభవమున భావించుచు లోకమునందంతట తిరుగువాడే 'చరలింగ' శివయోగి.

**న సన్మానేషు సంప్రీతిమ్**
**నావమానేషు చ వ్యథామ్ ।**
**కుర్వాణః సంచరేద్ యోగీ**
**కూటస్థే స్వాత్మని స్థితః ॥ 15-60**

కూటస్థుడై (నిర్వికారస్థితిలో), తనయందే తాను వసించుచు (లోకమునందలి) సన్మానములపట్ల ఆదరణను, అవమానములపట్ల వ్యథను పరిగణించక లోకమున తిరుగు శివయోగియే చరలింగడు.

**అప్రాకృతైర్గుణైః స్వీయైః**
**సర్వం విస్మాపయన్ జనమ్ ।**

**అద్వైతపరమానంద-**
**ముదితో దేహివచ్చరేత్ ॥ 15-61**

శివాద్వైతజ్ఞానముతో సిద్ధించిన పరమానందముతో సంతృప్తుడై అప్రాకృతము(లోకోత్తరము)లైన తన గుణగణములతో లోకులకు ఆశ్చర్యమును కలుగ(విస్మయులను)చేయుచు సామాన్యమానవుని వలె సంచరించువాడే చరలింగడు.

**న ప్రపంచే నిజే దేహే**
**న ధర్మే న చ దుష్కృతే ।**
**గతవైషమ్యధీర్ధీరో**
**యతిశ్చరతి దేహివత్ ॥ 15-62**

విధి నిషేధముల విషమ(వైర) బుద్ధిని పోగొట్టుకొని, ధీరుడైన (నిర్వికారమైన మనసుగల) యతి (చరస్థలి), ఈ ప్రపంచము నందు గాని, దేహవ్యాపారమునందుగాని, ధర్మాచరణమునందుగాని, దుష్కృత్య (పాప) ములయందుగాని, సామాన్యమానవునివలె ప్రవర్తించడు.

**ప్రాకృతైశ్వర్యసంపత్తి-**
**పరాఙ్ముఖమనఃస్థితిః ।**
**చిదానందనిజాత్మస్థో**
**మోదతే మునిపుంగవః ॥ 15-63**



ప్రకృతితత్త్వము వలన ప్రాప్తించు ఐశ్వర్యసంపదలపట్ల విముఖత కలిగిన మనసుతో చిదానందము ననుభవించుచు తన ఆత్మయందే స్థితుడైన మునిపుంగవుడే 'చరస్థలి'.

ఇతి చరస్థలం పరిసమాప్తమ్ ।
చరస్థలము ముగిసినది.

## 53. అథ పరస్థలమ్
## పరస్థలము

**స్వయమేవ స్వయం భూత్వా**
**చరతః స్వస్వరూపతః ।**
**పరం నాస్తీతి బోధస్య**
**పరత్వమభిధీయతే ॥ 15-64**

తనకు తానుగా తనస్వరూపముతో సంచరించుచూ, తన స్వరూపముకంటే వేరైన మరొక స్వరూపము (లోకమున) లేదను జ్ఞానముతో నుండుటయే 'పరత్వ'స్థితి యని చెప్పబడినది. (అతనినే (పరస్థలి)గా చెప్పుచున్నారు.)

**స్వతంత్రః సర్వకృత్యేషు**
**స్వం పరత్వేన భావితః ।**
**తృణీకుర్వన్ జగజ్జాలమ్**
**వర్తతే శివయోగిరాట్ ॥ 15-65**

తననే పరవస్తువుగా భావించుకున్న 'పరస్థలి' అని పిలువబడిన శివయోగీశ్వరుడు, తాను చేయు కర్మలలో సర్వస్వతంత్రుడై జగజ్జాలమునంతటినీ గడ్డిపోచవలె తృణీకరిస్తాడు.

**వర్ణాశ్రమసమాచార -**
**మార్గనిష్ఠాపరాఙ్ముఖః ।**
**సర్వోత్కృష్టం స్వమాత్మానమ్**
**పశ్యన్ యోగీ తు మోదతే ॥ 15-66**

లౌకికములయిన వర్ణాశ్రమములకు సంబంధించిన ఆచార వ్యవహారములపట్ల విముఖుడైన 'పరస్థలి' శివయోగి, తనను తాను సర్వోత్కృష్టమైన పరబ్రహ్మగా పరిగణించుచూ పరమానందానుభవమును అనుభవిస్తాడు.

**విశ్వాతీతం పరం బ్రహ్మ**
**శివాఖ్యం చిత్స్వరూపకమ్ ।**
**తదేవాహమితి జ్ఞానీ**
**సర్వోత్కృష్టః స ఉచ్యతే ॥ 15-67**

'శివుడు' అను పేరుతో వ్యవహరించబడుచూ చైతన్యరూపుడైన తానే విశ్వాతీతమయిన పరబ్రహ్మమని తెలుసుకున్న జ్ఞానియే సర్వోత్కృష్టుడని చెప్పబడినాడు.



**అచలం ధ్రువమాత్మానమ్**
**అనుపశ్యన్నిరంతరమ్ ।**
**నిరస్తవిశ్వవిభ్రాంతిః**
**జీవన్ముక్తో భవేన్మునిః ॥ 15-68**

తనను నిరంతరము అచలుని (నిశ్చలుని) గాను, దృఢమైన వాని(నిత్యుని)గాను భావించుచూ ప్రాపంచికమైన భేదభ్రాంతిని తొలగించుకున్న ఆ మునియే (పరస్థలయోగియే) జీవన్ముక్తుడని పిలువబడినాడు.

**బ్రహ్మాద్యాః కిం ను కుర్వంతి**
**దేవతాః కర్మమార్గగాః ।**
**కర్మాతీతపదస్థస్య**
**స్వయం బ్రహ్మస్వరూపిణః ॥ 15-69**

కర్మ(కాండ)కతీతమైన స్థానము (స్థితిని) పొంది స్వయముగా తానే పరబ్రహ్మస్వరూపుడైన ఈ పరస్థలయోగిని కర్మమార్గానుయాయులయిన బ్రహ్మాదిదేవతలు ఏమిచేయగలరు?

**స్వేచ్ఛయా సంచరేద్ యోగీ**
**విముంచన్ దేహమానితామ్ ।**

**దర్శనైః స్పర్శనైః సర్వాన్**
**అజ్ఞానపి విమోచయేత్ ॥ 15-70**

దేహాభిమానమును వదలి, (తన) ఇచ్ఛానుసారము సంచరించు ఈ పరస్థలశివయోగి కేవలం తన దర్శన స్పర్శనాదులచేతనే అజ్ఞానులైన జీవులను ముక్తులనొనరించుచున్నాడు.

**నిత్యే నిర్మలభావనే నిరుపమే నిర్ధూతవిశ్వభ్రమే**
**సత్తానందచిదాత్మకే పరశివే సామ్యం గతః సంయమీ ।**
**ప్రధ్వస్తాశ్రమవర్ణధర్మనిగలః స్వచ్ఛందసంచారవాన్**
**దేహీవాద్భుతవైభవో విజయతే జీవన్విముక్తః సుధీః ॥15-71**

– (శార్దూలవిక్రీడితమ్)

నిత్యుడు (శాశ్వతుడు), నిర్మలస్వభావుడు, ఉపమాతీతుడు, (పోల్చలేనివాడు), విశ్వభ్రాంతిరహితుడు, సత్-చిత్-ఆనందమయుడు అయిన పరశివునితో సామ్యతను (సమానబుద్ధిని) సాధించుకుని సంయమి, జీవన్ముక్తుడు అయిన శివయోగి, వర్ణాశ్రమధర్మపు సంకెళ్ళను త్రెంచుకొని యథేచ్ఛగా లోకమున సంచరించుచూ (పాంచభౌతికమైన) శరీరముతో వున్నను అద్భుతమైన వైభవమును కలిగి వుండి, సర్వోత్కృష్టుడుగా, సర్వశ్రేష్ఠుడుగా కొనియాడబడుచున్నాడు.

ఇతి పరస్థలం సమాప్తమ్।
పరస్థలము ముగిసినది.



***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ భక్తస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగోనామ పంచదశమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో భక్తస్థలాంతర్గతనవవిధ లింగస్థలప్రసంగమను పదునైదవ పరిచ్ఛేదము ముగిసినది.



# షోడశః పరిచ్ఛేదః

## పదునారవ పరిచ్ఛేదము

### మాహేశ్వరస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగః

### మాహేశ్వరస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగము

**(84 శ్లోకములు)**

**II. అథ మాహేశ్వరస్థలమ్**
**మాహేశ్వరస్థలము**

**అగస్త్య ఉవాచ :**

**స్థలానాం నవకం ప్రోక్తమ్**
**భక్తస్థలసమాశ్రయమ్ ।**
**మాహేశ్వరస్థలే సిద్ధమ్**
**స్థలభేదం వదస్వ మే ॥ 16-1**

**అగస్త్యుల వారిప్రశ్న**

(లింగస్థలమునకు చెందిన) భక్తస్థలము నందలి తొమ్మిది (అవాంతర) స్థలములు (మీ చేత) వివరించబడినవి. ఇక మాహేశ్వరస్థలమునకు చెందిన స్థలభేదములను నాకు తెలియజేయగలరు.

**శ్రీరేణుక ఉవాచ :**

**మాహేశ్వరస్థలే సంతి**
**స్థలాని నవ తాపస ।**
**క్రియాగమస్థలం పూర్వమ్**
**తతో భావాగమస్థలమ్ ॥ 16-2**

**జ్ఞానాగమస్థలం చాథ**
**సకాయస్థలమీరితమ్ ।**
**తతోఽకాయస్థలం ప్రోక్తమ్**
**పరకాయస్థలం తతః ॥ 16-3**

**ధర్మాచారస్థలం చాథ**
**భావాచారస్థలం తతః ।**
**జ్ఞానాచారస్థలం చేతి**
**క్రమాదేషాం భిదోచ్యతే ॥ 16-4**

**శ్రీ రేణుకుల సమాధానము :**

ఓ తాపసీ ! లింగస్థలమునకు చెందిన మాహేశ్వరస్థలమునందు తొమ్మిది(అవాంతర)స్థలములున్నవి. అవి వరుసగా క్రియాగమస్థలము, భావాగమస్థలము, జ్ఞానాగమస్థలము, సకాయస్థలము, అకాయస్థలము, పరకాయస్థలము, ధర్మాచారస్థలము, భావాచారస్థలము, జ్ఞానాచారస్థలము. వీటి లక్షణములను తెలిపెదను. ఆలకించుము.

## 54. అథ క్రియాగమస్థలమ్

### క్రియాగమస్థలము

**శివో హి పరమః సాక్షాత్**
**పూజా తస్య క్రియోచ్యతే ।**
**తత్పరా ఆగమా యస్మాత్**
**తదుక్తోఽయం క్రియాగమః ॥ 16-5**

'పరమ' శబ్దవాచ్యుడైనవాడు సాక్షాత్తు శివుడే. (అతడే పరస్థలి అయిన శివయోగి). అటువంటి శివుని పూజయే 'క్రియ' అని పిలువబడుచున్నది. అటువంటి క్రియలను గురించి తెలియజేయు ఆగమములను క్రియాగమములు అంటారు.

**ప్రకాశతే యథా నాగ్నిః**
**అరణ్యాం మథనం వినా ।**
**క్రియాం వినా తథాంతస్థో**
**న ప్రకాశో భవేచ్ఛివః ॥ 16-6**

(రెండు) అరణులను (కొయ్యలను) పరస్పరము మథనము (రాపిడి) చేయనిదే అగ్ని ఎలా ప్రకాశించదో (రగల్చబడదో), అలాగుననే (బాహ్యమైన పూజాది) క్రియలు నిర్వహించనిదే అంతరంగమునందలి శివుడు ప్రకాశించడు (అభివ్యక్తము కాదు).

**న యథా విధిలోపః స్యాత్**
**యథా దేవః ప్రసీదతి ।**



**యథాగమః ప్రమాణం స్యాత్**
**తథా కర్మ సమాచరేత్ ॥ 16-7**

విధివిధానములకు లోపము కలుగకుండా, శివుడు ప్రసన్ను డగుటకు ఆగమశాస్త్రములందు విధించిన శివపూజాది కర్మ(ల)ను ఆచరించవలెను.

**విధిః శివనియోగోఽయమ్**
**తస్మాద్ విహితకర్మణి ।**
**శివారాధనబుద్ధ్యైవ**
**నిరతః స్యాద్ విచక్షణః ॥ 16-8**

విధి అంటే శివుని శాసనము అని అర్థము. అందువలన విచక్షణుడైన సాధకుడు శివారాధనబుద్ధితో (ఆగమములందు) విధించిన కర్మలను (అవశ్యము) ఆచరించవలెను.

**గురోరాదేశమాసాద్య**
**పూజయేత్ పరమేశ్వరమ్ ।**
**పూజితే పరమేశానే**
**పూజితాః సర్వదేవతాః ॥ 16-9**

శ్రీగురువుయొక్క ఆదేశమునను సరించి పరమేశ్వరుని పూజించవలెను. ఆ పరమేశ్వరుని పూజించిన, సమస్త దేవతలను పూజించినట్లగును.

**సదా శివార్చనోపాయ-**
**సామాగ్రీవ్యగ్రమానసః ।**
**శివయోగరతో యోగీ**
**ముచ్యతే నాత్ర సంశయః ॥ 16-10**

ఎల్లప్పుడు శివార్చనకవసరమైన సామగ్రిని సంపాదించుటలో నిమగ్నమానసుడై, శివయోగమునందు నిరతుడైన యోగి ముక్తుడౌతాడు. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

**అంధపంగువదన్యోఽన్య-**
**సాపేక్షే జ్ఞానకర్మణీ ।**
**ఫలోత్పత్తౌ విరక్తస్య**
**తస్మాత్ తద్ద్వయమాచరేత్ ॥ 16-11**

జ్ఞానము (శివాద్వైతజ్ఞానము) కర్మ (శివపూజారూపమైన కర్మ) ఇవి రెండూ గుడ్డివాడు కుంటివాని వలె పరస్పరసాపేక్షకాలు. అందుచేత వాటి వలన కలుగు ఫలముల పట్ల విరక్తభావమును పెంపొందించుకున్న సాధకుడు జ్ఞానకర్మలు రెండింటినీ ఆచరించవలెను.

**జ్ఞానే సిద్ధేఽపి విదుషామ్**
**కర్మాపి వినియుజ్యతే ।**
**ఫలాభిసంధిరహితమ్**
**తస్మాత్ కర్మ న సంత్యజేత్ ॥ 16-12**



శివాద్వైతజ్ఞానమును సిద్ధింపచేసుకున్న (శివ)జ్ఞానులకు ఫలాపేక్షరహితమైన కర్మకూడా విధించబడియున్నది. అందువలన శివపూజాత్మకమైన కర్మను వదలిపెట్టరాదు.

**ఆచార ఏవ సర్వేషామ్**
**అలంకారాయ కల్ప్యతే ।**
**ఆచారహీనః పురుషో**
**లోకే భవతి నిందితః ॥ 16-13**

అందరికీ ఆచారమే అలంకారమని చెప్పబడినది. అందువలన లోకమున ఆచారహీనుడైన మానవుడు నిందించబడుచున్నాడు.

**జ్ఞానేనాచారయుక్తేన**
**ప్రసీదతి మహేశ్వరః ।**
**తస్మాదాచారవాన్ జ్ఞానీ**
**భవేదాదేహపాతనమ్ ॥ 16-14**

సదాచారముతో కూడుకున్న జ్ఞానముచేతనే మహేశ్వరుడైన శివుడు ప్రసన్నుడగుచున్నాడు. అందువలన జ్ఞాని అయినవాడు దేహమున్నంతకాలము ఆచారవంతుడై ఉండవలెను.

ఇతి క్రియాగమస్థలం పరిసమాప్తమ్ ।

క్రియాగమస్థలము ముగిసినది.

## 55. అథ భావాగమస్థలమ్
### భావాగమస్థలము

**భావచిహ్నాని విదుషో**
**యాని సంతి విరాగిణః ।**
**తాని భావాగమత్వేన**
**వర్తంతే సర్వదేహినామ్ ॥ 16-15**

వైరాగ్యసంపన్నుడైన శివయోగికి ఏ భావచిహ్నములు (పరిపూర్ణ శివస్వరూపమయిన అతని మనో లక్షణములు) వున్నవో, ఆ చిహ్నములు సమస్తజీవుల యందును వుండుటనే 'భావాగమ'మని చెప్పబడినది.

**శివోఽహమితి భావోఽపి**
**శివతాపత్తికారణమ్ ।**
**న జ్ఞానమాత్రం నాచారో**
**భావయుక్తః శివో భవేత్ ॥ 16-16**

శివోఽహం (శివుడే నేను) అను భావమే శివత్వప్రాప్తికి కారణమైయున్నది. అయితే కేవలం శివజ్ఞానము గాని, లేదా కేవలం శివపూజాపరమైన ఆచారముగాని శివత్వమును సంపాదించిపెట్టజాలవు. అందువలన భావయుక్తు(ధ్యానయుక్తు)డు మాత్రమే శివుడుకాగలడు. (జ్ఞానమును ఆచారమును భావపరముగానే చేయవలెనని తాత్పర్యము.)

**జ్ఞానం వస్తుపరిచ్ఛేదో**
**ధ్యానం తద్భావకారణమ్ ।**



**తస్మాత్ జ్ఞాతే మహాదేవే**
**ధ్యానయుక్తో భవేత్ సుధీః ॥ 16-17**

ఒక వస్తువుయొక్క స్వరూపమును నిర్ణయించునది జ్ఞానము. తద్భావమునకు (ఆ వస్తువే తానగుటకు) ధ్యానము కారణము. అందుచేత జ్ఞాని అయినవాడు మహాదేవుని (స్వరూపమును గురించి) తెలుసుకుని (తత్సాధనకు), ధ్యానయుక్తుడు కావలెను.

**అంతర్బహిశ్చ సర్వత్ర**
**పరిపూర్ణం మహేశ్వరమ్ ।**
**భావయేత్ పరమానంద-**
**లబ్ధయే పండితోత్తమః ॥ 16-18**

పండితోత్తము(శైవాగమశాస్త్రములందు కుశలుడైనవా)డు పరమానందప్రాప్తికి మహేశ్వరుణ్ణి లోపలా బయటా అంతటా పరిపూర్ణముగా వున్నాడని భావించ(ధ్యానించ)వలెను.

**అర్థహీనా యథా వాణీ**
**పతిహీనా యథా సతీ ।**
**శ్రుతిహీనా యథా బుద్ధిః**
**భావహీనా తథా క్రియా ॥ 16-19**

అర్థములేని శబ్దము, పతిలేని సతి, శాస్త్రసమ్మతముగాని జ్ఞానము ఎలా వ్యర్థములో అటులనే భావహీనమైన క్రియ కూడా వ్యర్థమే.

**చక్షుర్హీనో యథా రూపమ్**
**న కించిద్వీక్షితుం క్షమః ।**
**భావహీనస్తథా యోగీ**
**న శివం ద్రష్టుమీశ్వరః ॥ 16-20**

కనులు లేనివాడు రూపమునుచూచుటకెట్లు సమర్థుడుకాడో అటులనే, భావహీనుడైన శివయోగి కూడా శివుని దర్శించుటకు సమర్థుడు కాజాలడు.

**భావశుద్ధేన మనసా**
**పూజయేత్ పరమేష్ఠినమ్ ।**
**భావహీనాం న గృహ్ణాతి**
**పూజాం సుమహతీమపి ॥ 16-21**

అందువలన భావశుద్ధమైన మనస్సుతో పరమేష్ఠిని(పరమశివుని) పూజించవలెను. భావహీనమైనపూజ ఎంత వైభవముగానున్నను, దానిని శివుడు స్వీకరించడు.

**నైరంతర్యేణ సంపన్నే**
**భావే ధ్యాతుం శివం ప్రతి ।**
**తద్భావో జాయతే యద్వత్**
**క్రిమేః కీటస్య చింతనాత్ ॥ 16-22**

కీటకము భ్రమరమును గురించి నిరంతరము చింతించుట వలననే



కీటకము భ్రమరమయినట్లు, శివుని గురించి నిరంతరము చేయు భావము ధ్యానములో సుస్థిరమైనపుడు శివత్వము (తనకుతానే) సిద్ధించును.

**నిష్కలంకం నిరాకారమ్**
**పరబ్రహ్మ శివాభిధమ్ ।**
**నిర్ధ్యాతుమసమర్థోఽపి**
**తద్విభూతిం విభావయేత్ ॥ 16-23**

నిష్కలంకుడు, నిరాకారుడు, 'శివశబ్దవాచ్యుడు' అయిన పరబ్రహ్మను ధ్యానించుటకు వీలుకాకున్నను, శివుని విభూతిని (సర్వజ్ఞత్వము, నిత్యత్వము, అనాదిబోధత్వము, స్వతంత్రత్వము, అలుప్తశక్తిత్వము, అనంతశక్తిత్వము అను షడ్గుణములను) భావించి ధ్యానించవలెను. (ఈ ఆరు పరమాత్ముని షడ్గుణములు).

ఇతి భావాగమస్థలం పరిసమాప్తమ్.

భావాగమస్థలము ముగిసినది.

## *56. అథ జ్ఞానాగమస్థలమ్*

### జ్ఞానాగమస్థలము

**పరస్య జ్ఞానచిహ్నాని**
**యాని సంతి శరీరిణామ్ ।**
**తాని జ్ఞానాగమత్వేన**
**ప్రవర్తంతే విముక్తయే ॥ 16-24**

భావాగమస్థలమునకు చెందిన పరమయోగీశ్వరునికి ఏ జ్ఞానచిహ్నములున్నవో, ఆ చిహ్నములే (లోకమునందలి)జీవులందరి ముక్తికి జ్ఞానాగమములుగా ఉపయోగపడుచున్నవి.

**భావేన కిం ఫలం పుంసామ్**
**కర్మణా వా కిమిష్యతే ।**
**భావకర్మసమాయుక్తమ్**
**జ్ఞానమేవ విముక్తిదమ్ ॥ 16-25**

మానవులకు కేవలము కర్మలవలన గాని, లేదా కేవలము భావముల వలన గాని ప్రయోజనము లేదు. ఎందువలననగా భావ, కర్మలసముచ్చయమైన జ్ఞానము మాత్రమే ముక్తిని ప్రసాదించగలదు.

**కేవలం కర్మమాత్రేణ**
**జన్మకోటిశతైరపి ।**
**నాత్మనాం జాయతే ముక్తిః**
**జ్ఞానం ముక్తేర్హి కారణమ్ ॥ 16-26**

కేవలం కర్మాచరణమువలన,నూరుకోట్ల జన్మములనెత్తినా జీవులకు ముక్తి లభించదు. (ఎందుకనగా) ముక్తికి కారణము జ్ఞానము గనుక.

**జ్ఞానహీనం సదా కర్మ**
**పుంసాం సంసారకారణమ్ ।**
**తదేవ జ్ఞానయోగేన**
**సంసారవినివర్తకమ్ ॥ 16-27**



జ్ఞానరహితమైన కర్మాచరణము జీవులకు సంసారబంధమునకు కారణమగుచున్నది. అదే కర్మము జ్ఞానముతో కలిపి ఆచరించినపుడు జీవుల సంసారబంధము తొలగించుచున్నది.

**ఫలం క్రియావతాం పుంసామ్**
**స్వర్గాద్యం నశ్వరం యతః ।**
**తస్మాత్ స్థాయిఫలప్రాప్త్యై**
**జ్ఞానమేవ సమభ్యసేత్॥ 16-28**

కేవలం కర్మాచరణము చేయు జీవులకు నశ్వరము(అశాశ్వతము)లైన స్వర్గాది ఫలములు లభించును. అందువల్ల శాశ్వతమైన (ముక్తి) ఫలమును పొందగోరువారు జ్ఞానమును చక్కగా అభ్యాసము చేయవలెను.

**శాస్త్రాభ్యాసాదియత్నేన**
**సద్గురోరుపదేశతః ।**
**జ్ఞానమేవ సమభ్యస్యేత్**
**కిమన్యేన ప్రయోజనమ్ ॥ 16-29**

(వేదాగమాదిప్రసిద్ధవీరశైవ) శాస్త్రాధ్యయ ప్రయత్నముల వలనను, సద్గురువుల ఉపదేశము వలనను, జ్ఞానమునే అభ్యసించవలెను. ఇతర ప్రయత్నముల వలన ఏమి ప్రయోజనము?

**జ్ఞానం పరశివాద్వైత-**
**పరిపాకవినిశ్చయః ।**

**యేన సంసారసంబంధ-**

**వినివృత్తిర్భవేత్ సతామ్॥ 16-30**

పరశివాద్వైతమునందు పరిపక్వమైన నిశ్చయజ్ఞానమే జ్ఞానము. ఇటువంటి జ్ఞానము చేతనే సత్పురుషులకు సంసారబంధము నుండి విముక్తి కలుగుచున్నది.

**శివాత్మకమిదం సర్వమ్**

**శివాదన్యన్న విద్యతే ।**

**శివోఽహమితి యా బుద్ధిః**

**తదేవ జ్ఞానముత్తమమ్ ॥ 16-31**

కనిపించే జగత్తు అంతయు శివాత్మకమే. శివుని కంటే భిన్నమైన మరొక వస్తువు లేదు. నేను కూడా శివుడనే (శివోఽహం) అయి వున్నాను. అను బుద్ధి(ఎఱుక)యే ఉత్తమమయిన జ్ఞానము.

**అంధో యథా పురస్థాని**

**వస్తూని చ న పశ్యతి ।**

**జ్ఞానహీనస్తథా దేహీ**

**నాత్మస్థం వీక్షతే శివమ్ ॥ 16-32**

గ్రుడ్డివాడు తన ముందున్న వస్తువులనెలా చూడజాలడో, అటులనే జ్ఞానహీనుడైన జీవుడు తనలోని శివుని చూడలేడు.



**శివస్య దర్శనాత్ పుంసామ్**

**జన్మరోగనివర్తనమ్ ।**

**శివదర్శనమప్యాహుః**

**సులభం జ్ఞానచక్షుషామ్ ॥ 16-33**

శివునిదర్శనముతో మానవులకు జన్మరోగము (జనన మరణరూపమైన సంసారబంధము) తొలగిపోవును. అటువంటి శివదర్శనము జ్ఞాననేత్రములు గలిగినవారికి అత్యంత సులభమని జ్ఞానుల అభిప్రాయము.

**దీపం వినా యథా గేహే**

**నాంధకారో నివర్తతే ।**

**జ్ఞానం వినా తథా చిత్తే**

**మోహోఽపి న నివర్తతే ॥ 16-34**

ఇంటిలోని చీకటి దీపము లేకుండా ఎలా తొలగిపోజాలదో అటులనే శివజ్ఞానము లేకుండా చిత్తమునందలి మోహము కూడా తొలగిపోదు.

ఇతి జ్ఞానాగమస్థలం పరిసమాప్తమ్ ।

జ్ఞానాగమస్థలము ముగిసినది

## 57. అథ సకాయస్థలమ్

## సకాయస్థలము

**పరస్య యా తనుర్జ్ఞేయాఽ -**

**దేహకర్మాభిమానినః ।**

**తయా సకాయో లోకోఽయమ్**
**తదాత్మత్వనిరూపణాత్ ॥ 16-35**

'నేను స్థూలడ'నను దేహాభిమానము, 'నేను చేయుచున్నా' నను కర్మాభిమానము లేనటువంటి పరుని (శివయోగి యొక్క) శరీరమేది కలదో, ఆ శరీరమే ఈ జగత్తున 'సకాయ'మని పిలువబచుతున్నది. ఎందువలననగా పరుని శరీరమే 'ఆత్మ'అని మానవులకు ఇంతకు ముందే తెలుపబడినది.

(దేహకర్మాభిమానములేని దేహధారి అయిన పరుడే (పరశివయోగియే) సకాయుడు. అతడు సర్వాత్ముడైనందున అతని దేహమే లోకమున 'సకాయ'మనబడుచున్నది.)

**కాయం వినా సమస్తానామ్**
**న క్రియా న చ భావనా ।**
**న జ్ఞానం యత్తతో యోగీ**
**కాయవానేవ సంచరేత్ ॥ 16-36**

లోకమునందలి సమస్త జీవులకు శరీరము లేకుండా క్రియగాని, భావముగాని, జ్ఞానముగాని కలుగవు. అందువలన (శివ)యోగి అయినవాడు ఈ లోకమునందున్నంతకాలము దేహధారి (సకాయుడు) గానే సంచరించవలెను.

**శివైకజ్ఞానయుక్తస్య**
**యోగినోఽపి మహాత్మనః ।**
**కాయయోగేన సిధ్యంతి**
**భోగమోక్షాదయః సదా ॥ 16-37**



శివునితో ఐక్యజ్ఞానమును పొందిన యోగులైన మహాత్ములకు కూడా కాయ(శరీర)సంబంధము వలననే భోగమోక్షాదులు సిద్ధించుచున్నవి.

**కాష్ఠం వినా యథా వహ్నిః**
**జాయతే న ప్రకాశవాన్ ।**
**మూర్తిం వినా తథా యోగీ**
**నాత్మతత్త్వప్రకాశవాన్ ॥ 16-38**

కట్టెలు లేకుండా అగ్ని ప్రకాశమానము కానట్లే దేహము లేని యోగి తన ఆత్మతత్త్వమును ప్రకాశింపచేసుకొనజాలడు.

**మూర్త్యాత్మనైవ దేవస్య**
**యథా పూజ్యత్వకల్పనా ।**
**తథా దేహాత్మనైవాస్య**
**పూజ్యత్వం పరయోగినః ॥ 16-39**

దేవతా విగ్రహము వున్నప్పుడే దైవపూజ చేయుటకు సాధ్యమగును. అటులనే పర(శివ)యోగికి సైతము శరీర సంబంధమున్నప్పుడే పూజ్యత్వము సాధ్యమగుచున్నది.

**నిష్కలో హి మహాదేవః**
**పరిపూర్ణః సదాశివః ।**
**జగత్సృష్ట్యాదిసంసిద్ధ్యై**
**మూర్తిమానేవ భాసతే ॥ 16-40**

పరిపూర్ణుడు, సదామంగళమయుడు అయిన ఆ మహాదేవుడు నిష్కలుడు (నిరాకారుడు) అయివున్నాడు. అయితే అతడు విశ్వసృష్టి వంటి కార్యములను నెరవేర్చుటకు మూర్తిమంతుడు (సాకారుడు) అగుచున్నాడు.

**బ్రహ్మాద్యా దేవతాః సర్వాః**
**మునయోఽపి ముముక్షవః ।**
**కాయవంతో హి కుర్వంతి**
**తపః సర్వార్థసాధకమ్ ॥ 16-41**

బ్రహ్మాది దేవతలు, మోక్షార్థులయిన మహామునులు, తమ సమస్త కోరికలను సిద్ధింపచేసుకొనుటకు సాధనమయిన తపస్సును శరీరధారులుగా వున్నపుడే చేయగలుగుచున్నారు.

**తపో హి మూలం సర్వాసామ్**
**సిద్ధీనాం యజ్జగత్త్రయే ।**
**తపస్తత్కాయమూలం హి**
**తస్మాత్ కాయం న సంత్యజేత్ ॥ 16-42**

ముల్లోకములలోను సమస్తసిద్ధులకు తపస్సే మూలసాధనము. ఆ తపస్సుకు శరీరమే మూలము. అందువలన జ్ఞాని అయినవాడు శరీరమును వదలిపెట్టరాదు.

ఇతి సకాయస్థలం పరిసమాప్తమ్ ।
సకాయస్థలము ముగిసినది.



## *58.* అథ అకాయస్థలమ్

### అకాయస్థలము

**ఔపచారికదేహిత్వాత్**
**జగదాత్మత్వభావనాత్ ।**
**మాయాసంబంధరాహిత్యాత్**
**అకాయో హి పరః స్మృతః ॥ 16-43**

ఔపచారికమైన దేహమును కల 'సకాయస్థలు'డనిపించుకున్న పరయోగి (దేహాభిమానము లేనివాడై) జగమునంతటినీ తన ఆత్మగా భావించి, మాయాసంబంధమును తొలగించుకున్నప్పుడు, (అతడు) అకాయుడని చెప్పబడినాడు.

**పరస్య దేహయోగేఽపి**
**న దేహాశ్రయవిక్రియా ।**
**శివస్యేవ యతస్తస్మాత్**
**అకాయోఽయం ప్రకీర్తితః ॥ 16-44**

పరయోగికి దేహసంబంధమున్ననూ అతనికి శివునికి వలె దేహమునందలి కామాది వికారములుండవు. అందువలన ఆ యోగి 'అకాయుడు' అని పిలువబడినాడు.

**పరలింగే విలీనస్య**
**పరమానందచిన్మయే ।**

**కుతో దేహేన సంబంధో**
**దేహివద్భాసనం భ్రమః ॥ 16-45**

పరమానందరూపము, చిన్మయము అయిన పరలింగమునందు విలీనమైన ఆ యోగికి దేహసంబంధమెక్కడిది? అతడు దేహధారి వలె కనిపించుట భ్రమమాత్రమే.

**దేహాభిమానహీనస్య**
**శివభావే స్థితాత్మనః ।**
**జగదేతచ్ఛరీరం స్యాత్**
**దేహేనైకేన కా వ్యథా ॥ 16-46**

దేహాభిమానరహితుడై, 'నేనే శివుడను' అను భావనలో స్థితుడైన ఆ పరమయోగికి ఈ సమస్త జగమే శరీరమైనప్పుడు, అతనికున్న ఈ ఒక్క శరీరముతో నేమి పని?

**శివజ్ఞానైకనిష్ఠస్య**
**నాహంకారభవభ్రమః ।**
**న చేంద్రియభవం దుఃఖమ్**
**త్యక్తదేహాభిమానినః ॥ 16-47**

దేహాభిమానమును త్యాగము చేసి, శివజ్ఞానమునందు నిష్ఠుడైన ఆ పరమయోగికి అహంకారము వలన ఏర్పడిన భ్రమగాని, ఇంద్రియముల వలన కలుగు దుఃఖముగాని వుండనే వుండవు.



**న మనుష్యో న దేవోఽహమ్**
**న యక్షో నైవ రాక్షసః ।**
**శివోఽహమితి యో బుద్ధ్వాత్**
**తస్య కిం దేహకర్మణా॥ 16-48**

నేను మానవుడనుకాను, దేవుడను కాను, యక్షుడను కాను, రాక్షసుడను కాను, అయితే 'నేను శివుడను' అని తెలుసుకున్న వానికి దైహికకర్మల వలన ఎటువంటి ప్రయోజనము వుండదు.

ఇతి అకాయస్థలం పరిసమాప్తమ్
అకాయస్థలము ముగిసినది

## *59.* అథ పరకాయస్థలమ్
### పరకాయస్థలము

**వశీకృతత్వాత్ ప్రకృతేః**
**మాయామార్గాతివర్తనాత్ ।**
**పరకాయోఽయమాఖ్యాతః**
**సత్యజ్ఞానసుఖాత్మకః ॥ 16-49**

ప్రకృతిని తన వశమునందుంచుకున్నందువలనను, మాయా మార్గము(ప్రభావము)నతి క్రమించి నందు వలనను, సత్-చిత్-ఆనంద స్వరూపాత్మకమయిన అకాయమే పరకాయమని చెప్పబడినది.

**పరబ్రహ్మవపుర్యస్య**
**ప్రబోధానందభాసురమ్ ।**
**ప్రాకృతేన శరీరేణ**
**కిమేతేనాస్య జాయతే ॥ 16-50**

సచ్చిదానందస్వరూపమైన పరశివబ్రహ్మమే ఎవనికి శరీరముగా వున్నదో అటువంటి పరకాయుడయిన (శివ)యోగికి ఈ ప్రాకృతమైన శరీరమువలన ఎటువంటి అపకారము జరుగదు.

**సమ్యగ్జ్ఞానాగ్నిసందగ్ధ-**
**జన్మబీజకలేవరః ।**
**శివతత్త్వావలంబీ యః**
**పరకాయః స ఉచ్యతే ॥ 16-51**

సమ్యగ్జ్ఞాన(శివాద్వైతజ్ఞాన)మను అగ్నిలో జన్మబీజమును దగ్ధము చేసుకుని, శివతత్త్వమును అవలంబించిన యోగియే 'పరకాయుడ'ని పిలువబడినాడు.

**ఇంద్రియాణి మనోవృత్తి -**
**వాసనాః కర్మసంభవాః ।**
**యత్ర యాంతి లయం తేన**
**సకాయోఽయం పరాత్మనా ॥ 16-52**



కర్మబంధముల వలన ఏర్పడిన మనోవృత్తుల వాసనలు మరియు దశేంద్రియ వ్యాపారములు, ఏ పరబ్రహ్మములో లయమగుచున్నవో, అటువంటి పరబ్రహ్మ ఎవనికి శరీరమైవున్నాడో అతడే 'పరకాయుదు' అని పిలువబడినాదు.

**పరాహంతామనుప్రాప్య**
**పశ్యేత్ విశ్వం చిదాత్మకమ్ ।**
**సదేహోఽతిభ్రమస్తస్య**
**నిశ్చితా హి శివాత్మతా ॥ 16-53**

'పరబ్రహ్మ పరమాత్మయే తాను' అన్న పరాహంతా (చివరి ఎల్లలు) స్వరూపమును పొంది, విశ్వమునంతటినీ చిదాత్మకముగా దర్శించు ఈ పరయోగిని 'సదేహుడు' అని వ్యవహరించుట అత్యంత భ్రాంతియే. ఎందువలననగా అతని దేహము కూడా నిశ్చయముగా శివస్వరూపమే గదా అయియున్నది

**స్వస్వరూపం చిదాకారమ్**
**జ్యోతిః సాక్షాద్విచింతయన్ ।**
**దేహవానపి నిర్దేహో**
**జీవన్ముక్తో హి సాధకః ॥ 16-54**

తన స్వరూపమును సాక్షాత్తు చిదాకారజ్యోతిగా భావించు ఈ పరకాయస్థల సాధకుడు దేహధారిగా వున్ననూ, దేహాంతరమును పొందవలెనను కోరికలేని, జీవన్ముక్తుడు అగుచున్నాడు.

**దేహస్తిష్ఠతు వా యాతు**
**యోగినః స్వాత్మబోధినః ।**
**జీవన్ముక్తిర్భవేత్ సద్యః**
**చిదానందప్రకాశినీ ॥ 16-55**

స్వస్వరూపజ్ఞానసంపన్నుడైన పరకాయ యోగికి (స్థూల) దేహమున్ననూ లేకున్ననూ చిదానందప్రకాశమైన జీవన్ముక్తి తక్షణమే సిద్ధించుచున్నది.

**ఆత్మజ్ఞానావసానం హి**
**సంసారపరిపీడనమ్ ।**
**సూర్యోదయేఽపి కిం లోకః**
**తిమిరేణోపరుధ్యతే ॥ 16-56**

సంసారసంబంధమయిన (జననమరణ రూపమైన) బాధ (పీడ) ఆత్మజ్ఞానము కలుగునంతవరకు మాత్రమే వుండును. సూర్యోదయము అయినను లోకము చీకటితో ఆవరించబడి వుండునా? (సూర్యోదయముతో చీకటి తొలగినట్లే ఆత్మజ్ఞానోదయముతో సంసారబాధ తొలగునని భావము).

**దేహాభిమాననిర్ముక్తః**
**కలాతీతపదాశ్రయః ।**
**కథం యాతి పరిచ్ఛేదమ్**
**శరీరేషు మహాబుధః ॥ 16-57**



దేహాభిమానము లేనివాడు, నివృత్త్యాది కళలకు అతీతమైన పరబ్రహ్మస్థానమును సంపాదించుకున్న మహాబుధుడు (పరకాయయోగి) శరీరమునందు ఎట్లు బంధించబడతాడు?

ఇతి పరకాయస్థలం పరిసమాప్తమ్ ।
పరకాయస్థలము ముగిసినది

## *60.* అథ ధర్మాచారస్థలమ్
## ధర్మాచారస్థలము

**తస్యైవ పరకాయస్య**
**సమాచారో య ఇష్యతే ।**
**స ధర్మః సర్వలోకానామ్**
**ఉపకారాయ కల్ప్యతే ॥ 16-58**

(పూర్వోక్త) పరకాయుడైన యోగికి ఏ ఆచారము అభీష్టమగునో, ఆ ఆచారమే ధర్మమగును. ఆ ధర్మమే లోకమునందలి జీవులందరికి ఉపకారకమగును.

**అహింసా సత్యమస్తేయమ్**
**బ్రహ్మచర్యం దయా క్షమా ।**
**దానం పూజా జపో ధ్యానమ్**
**ఇతి ధర్మస్య సంగ్రహః ॥ 16-59**

అహింస – సత్యము – అస్తేయము – బ్రహ్మచర్యము – దయ – క్షమ – దానము – పూజ – జపము – ధ్యానము అను పది ఆచారములు ధర్మముయొక్క సంక్షిప్తస్వరూపము (ప్రాణులను హింసించకుండుట, సత్యమును పలుకుట, ఇతరుల వస్తువులను దొంగలించకుండుట, బ్రహ్మచర్యమును పాటించుట, ప్రాణులపట్ల కరుణకలిగి వుండుట, ఓర్పు కలిగివుండుట, దానము చేయుట, శివపూజచేయుట, శివమంత్రము జపించుట, శివధ్యానము చేయుట – ఈ పదివిధులు ధర్మసాధన సూత్రములు).

**శివేన విహితో యస్మాత్**
**ఆగమైర్ధర్మసంగ్రహః ।**
**తస్మాత్తమాచరన్ విద్వాన్**
**తత్ప్రసాదాయ కల్ప్యతే ॥ 16–60**

పైన పేర్కొన్న అహింసాది ధర్మములు ఆగమములలో శివునిచేత విధించబడివున్నవి. అందువలన వీటినాచరించు విద్వాంసుడు శివుని ప్రసాదమునకు అర్హుడగును.

**అధర్మం న స్పృశేత్ కించిద్**
**విహితం ధర్మమాచరేత్ ।**
**తం చ కామవినిర్ముక్తమ్**
**తమపి జ్ఞానపూర్వకమ్ ॥ 16–61**



అధర్మమునెప్పుడూ ఆచరించ రాదు. విధించబడిన (అహింసాది) ధర్మమును మాత్రమే పాటించవలెను. ఆ ధర్మాచరణము కూడా ఫలాపేక్షరహితముగాను జ్ఞానపూర్వకముగాను వుండవలెను.

**ఆత్మవత్ సర్వభూతాని**
**సంపశ్యేద్ యోగవిత్తమః ।**
**జగదేకాత్మతాభావాత్**
**నిగ్రహాదివిరోధతః ॥ 16–62**

యోగవిజ్ఞానమును చక్కగా తెలుసుకున్న యోగీశ్వరుడు విశ్వమునంతటిని (పరబ్రహ్మస్వరూపమను) ఏకాత్మభావముతో రాగద్వేషరహితుడై, సమస్త ప్రాణులను తన స్వరూపముగా దర్శించవలెను.

**ఏక ఏవ శివః సాక్షాత్**
**జగదేతదితి స్ఫుటమ్ ।**
**పశ్యతః కిం న జాయేత**
**మమకారో హి విభ్రమః ॥ 16–63**

ఒక్కడే అయిన శివుడే ఈ జగదాకారములో వున్నాడన్నది సుస్పష్టము. ఇలా దర్శించు యోగికి లోకమునందు పొందనిదేమున్నది? 'ఇది నాది' అను మమకారము కూడా ఒక విశేషభ్రాంతియే. అటువంటి భ్రాంతి కూడా అతనికి వుండదు.

**ధర్మ ఏవ సమస్తానామ్**
**యతః సంసిద్ధికారణమ్ ।**

**నిస్పృహోఽపి మహాయోగీ**
**ధర్మమార్గం చ న త్యజేత్ ॥ 16-64**

లోకములోని వారందరికీ (భోగమోక్షములను) సిద్ధులను సాధించుకొనుటకు ధర్మమే కారణమైయున్నది. అందువలన మహాయోగి కూడా (ఫలముపట్ల) నిస్పృహుడైనను ధర్మాచరణమును వదలరాదు.

**జ్ఞానామృతేన తృప్తోఽపి**
**యోగీ ధర్మం న సంత్యజేత్ ।**
**ఆచారం మహతాం దృష్ట్వా**
**ప్రవర్తంతే హి లౌకికాః ॥ 16-65**

యోగి అయినవాడు (శివ) జ్ఞానామృతాస్వాదనముతో సంతుష్టుడైనను (అహింసాది) ధర్మాచరణను వదలిపెట్టరాదు. ఎందువలననగా మహాత్ముల ఆచరణాది విధానములను చూసియే లోకమునందలి సామాన్యులు అనుసరింతురు. (అందువలన లోకసంగ్రహమునకై జ్ఞానులు ధర్మము నాచరించవలెను).

**సదాచారప్రియః శంభుః**
**సదాచారేణ పూజ్యతే।**
**సదాచారం వినా తస్య**
**ప్రసాదో నైవ జాయతే ॥ 16-66**



శివుడు సదాచారప్రియుడు. అతడు సదాచారముతోనే పూజింపబడతాడు. సదాచారము లేకుండా అతని ప్రసాదము (అనుగ్రహము) లభించదు.

ఇతి ధర్మాచారస్థలం పరిసమాప్తమ్ ।
ధర్మాచారస్థలము ముగిసినది.

## *61.* అథ భావాచారస్థలమ్
## భావాచారస్థలము

**భావ ఏవాస్య సర్వేషామ్**
**భావాచారః ప్రకీర్తితః ।**
**భావో మానసచేష్టాత్మా**
**పరిపూర్ణః శివాశ్రయః ॥ 16-67**

(ఇంతకు ముందు చెప్పిన) ధర్మాచారసంపన్నుడైన యోగియొక్క భావమే లోకమునందలి జనులందరికీ భావాచారమని చెప్పబడినది. భావమనగా పరిపూర్ణముగా శివుని ఆశ్రయించి అల్లుకున్న మానసికవ్యాపారమని అర్థము.

**భావనావిహితం కర్మ**
**పావనాదపి పావనమ్ ।**
**తస్మాద్ భావనయా యుక్తమ్**
**పరధర్మం సమాచరేత్ ॥ 16-68**

భావనతో చేయు కర్మలే అత్యంత పవిత్రమైనవి. అందువలన పరమ శ్రేష్ఠమయిన శివధర్మాచరణమును భావయుక్తముగానే ఆచరించవలెను.

**భావేన హి మనఃశుద్ధిః**
**భావశుద్ధిశ్చ కర్మణా ।**
**ఇతి సంచింత్య మనసా**
**యోగీ భావం న సంత్యజేత్ ॥ 16-69**

భావముచేత (శివభావము) మనసు శుద్ధమగును. కర్మలచేత భావము శుద్ధమగును. (శుద్ధమైన భావముతో చేయు కర్మలు ఫలప్రదములగును.) ఇట్లు చక్కగా మనసున విచారించి తెలుసుకున్న యోగి భావము నెన్నడూ వదలిపెట్టరాదు.

**శివభావనయా సర్వమ్**
**నిత్యనైమిత్తికాదికమ్ ।**
**కుర్వన్నపి మహాయోగీ**
**గుణదోషైర్న బాధ్యతే ॥ 16-70**

మహాయోగి అయినవాడు శివభావనతో నిత్యనైమిత్తికాది సమస్త కర్మలను అనుష్ఠించినను, ఆ కర్మ సంబంధములైన గుణదోషములతో అతనికెటువంటి సంబంధమూ వుండదు.

**అంతః ప్రకాశమానస్య**
**సంవిత్సూర్యస్య సంతతమ్ ।**



**భావేన యదుపస్థానమ్**
**తత్సంధ్యావందనం విదుః ॥ 16-71**

తన అంతరంగమున (హృత్కమలములో) నిరంతరము ప్రకాశించు సంవిత్ సూర్యుని గురించి, భావనతో చేయు ఏ ఉపాసనమున్నదో దానినే సంధ్యావందనమని (వీరశైవ ఆచార్యులు) భావింతురు.

**ఆత్మజ్యోతిషి సర్వేషామ్**
**విషయాణాం సమర్పణమ్ ।**
**అంతర్ముఖేన భావేన**
**హోమకర్మేతి గీయతే ॥ 16-72**

తన ఆత్మజ్యోతిలో (చిదగ్నిలో) అంతర్ముఖమైన భావనతో సమస్తవిషయములను సమర్పణ చేయుటయే హోమకర్మమని చెప్పబడినది.

**భావయేత్ సర్వకర్మాణి**
**నిత్యనైమిత్తికాని చ ।**
**శివప్రీతికరాణ్యేవ**
**సంగరాహిత్యసిద్ధయే ॥ 16-73**

సంసారబంధనివృత్తికోసము తాను చేయు నిత్యనైమిత్తికాది సమస్త కర్మలు శివునికత్యంత ప్రీతిని కలిగించుటకే నిర్వహించబడుచున్నవని భావించవలెను.

**శివే నివేశ్య సకలమ్**
**కార్యాకార్యం వివేకతః ।**

**వర్తతే యో మహాభాగః**
**స సంగరహితో భవేత్ ॥ 16-74**

(చేసేవాడవు నీవే, చేయించేవాడవు నీవే, చేసిన కర్మఫలము నీవే అను) వివేకజ్ఞానముతో ఏ మహాత్ముడు తన కార్యాకార్యములనన్నింటినీ శివునికే సమర్పించుచున్నాడో అతడే 'సంగ రహితుడ'గుచున్నాడు.

**ఆత్మానమఖిలం వస్తు**
**శివమానందచిన్మయమ్ ।**
**ఏకభావేన సతతమ్**
**సంపశ్యన్నేవ పశ్యతి ॥ 16-75**

తనను, సకల జగత్తును మరియు సచ్చిదానంద స్వరూపుడయిన శివుని ఎల్లపుడు ఒకే భావనతో దర్శించుచున్నాడో అతడే శివసాక్షాత్కారమును పొందుచున్నాడు.

*ఇతి భావాచారస్థలం పరిసమాప్తమ్ ।*
భావాచారస్థలము ముగిసినది.

## *62.* అథ జ్ఞానాచారస్థలమ్
## జ్ఞానాచారస్థలము

**అస్య జ్ఞానసమాచారో**
**యోగినః సర్వదేహినామ్ ।**



**జ్ఞానాచారో యదుక్తోఽయమ్**
**జ్ఞానాచారః స కథ్యతే ॥ 16-76**

భావాచారసంపన్నుడైన యోగీశ్వరుని జ్ఞానాచారము (జ్ఞానమునకు తగినజీవనవిధానము) ఏదైతే వున్నదో అదియే సమస్తజీవులు అనుసరించవలసిన జ్ఞానాచారమని చెప్పబడినది.

**శివాద్వైతపరం జ్ఞానమ్**
**జ్ఞానమిత్యుచ్యతే బుధైః ।**
**సిద్ధేన వాప్యసిద్ధేన**
**ఫలం జ్ఞానాంతరేణ కిమ్ ॥ 16-77**

శివాద్వైతపరమైన జ్ఞానమే సర్వశ్రేష్ఠమైన జ్ఞానమని పండితుల నిర్ణయము. ఇతర జ్ఞానముల వలన ఫలము సిద్ధించినా సిద్ధించకపోయినా ఏమి ప్రయోజనము? (ఇతర జ్ఞానములు నిష్ప్రయోజనములని తాత్పర్యము).

**నిర్మలం హి శివజ్ఞానమ్**
**నిఃశ్రేయసకరం పరమ్ ।**
**రాగద్వేషాదికలుషమ్**
**భూయః సంసృతికారణమ్ ॥ 16-78**

నిర్మలమైన శివజ్ఞానము (శివాద్వైతజ్ఞానము) పరమ నిఃశ్రేయసమైనది (ముక్తిదాయకమైనది). ఇక రాగద్వేషములతో కలుషితమైన (శివ)జ్ఞానము సంసారమునకు కారణమగుచున్నది (అందువలన శివాద్వైతజ్ఞానమే సమస్త మానవాళికి శిరోధార్యమైనది).

**పరిపూర్ణం మహాజ్ఞానమ్**
**పరతత్త్వప్రకాశకమ్ ।**
**అవలంబ్య ప్రవృత్తో యో**
**జ్ఞానాచారః స ఉచ్యతే ॥ 16-79**

పరశివతత్త్వమును ప్రకాశింపచేయు అఖండమైన మహాజ్ఞానమును (శివాద్వైతజ్ఞానమును) అవలంబించి లోకములో ఏ ఆచారము అనుసరించబడుచున్నదో అదియే జ్ఞానాచారమని చెప్పబడినది.

**నిర్వికల్పే పరే ధామ్ని**
**నిష్కలే శివనామని ।**
**జ్ఞానేన యోజయేత్ సర్వమ్**
**జ్ఞానాచారీ ప్రకీర్తితః ॥ 16-80**

నిర్వికల్పము (భేదరహితము), నిష్కలము (నిరవయవము), మంగళకరము అయిన పరబ్రహ్మము నందు తన ఐక్య(అభేద) జ్ఞానము చేత సమస్త విశ్వమును సంయోజనము చేయు మహాయోగి 'జ్ఞానాచార్యుడు' అని కీర్తించబడుచున్నాడు.

**జ్ఞానం ముక్తిప్రదం ప్రాప్య**
**గురుదృష్టిప్రసాదతః ।**
**కః కుర్యాత్ కర్మకార్పణ్యే**
**వాంఛాం సంసారవర్ధనే ॥ 16-81**



గురువుయొక్క కరుణాకటాక్షము చేత ముక్తిదాయకమైన శివాద్వైతజ్ఞానమును పొందిన తరువాత, సంసారబంధములను పెంచు కర్మకలాపములను ఎవడు కోరుకుంటాడు?

**కర్మ జ్ఞానాగ్నినా దగ్ధమ్**
**న ప్రరోహేత్ కథంచన ।**
**యదాహుః సంసృతేర్మూలమ్**
**ప్రవాహానుగతం బుధాః॥ 16-82**

ఏ కర్మలు సంసారమునకు మూలకారణమని, నదీజలప్రవాహము వలె అనాది నుండి శరీరమునంటుకుని మనకు సంక్రమించినవి అని విద్వాంసులు చెప్పుచున్నారో, ఆ కర్మలు శివాద్వైతమను అగ్నిలో కాల్చబడి మరలా మొలకెత్తుటకు పనికిరానివిగా చేయబడినాయి.

**జ్ఞానేన హీనః పురుషః**
**కర్మణా బధ్యతే సదా ।**
**జ్ఞానినః కర్మసంకల్పా**
**భవంతి కిల నిష్ఫలాః ॥ 16-83**

శివాద్వైతజ్ఞానమును పొందని మానవుడు నిరంతరము కర్మజాలముచేత బంధించబడుచున్నాడు. శివాద్వైతజ్ఞానులచేత ఆచరించబడు కర్మలు నిష్ఫలములు గనుక అవి వారిని బంధించజాలవు.

**శుద్ధాచారే శుద్ధభావో వివేకీ**
**జ్యోతిః పశ్యన్ సర్వతశ్చైవమేకమ్।**

జ్ఞానధ్వస్తప్రాకృతాత్మప్రపంచః
జీవన్ముక్తశ్చేష్టతే దివ్యయోగీ ॥ 16-84

-(శాలినీ)

ధర్మాచారనిరతుడు, శుద్ధభావసంపన్నుడు, వివేకవంతుడు అయిన దివ్య(శివ)యోగి అన్ని చోట్లా జ్యోతిస్స్వరూపుడైన శివుని దర్శించుచూ, తనకు కలిగిన శివాద్వైతజ్ఞానము చేత ప్రకృతిజన్యమైన దేహప్రపంచమును నశింప చేసుకుని జీవన్ముక్తుడగుచున్నాడు.

ఇతి జ్ఞానాచారస్థలం పరిపూర్ణమ్ ।
జ్ఞానాచారస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ మాహేశ్వరస్థలాంతర్గత నవవిధలింగస్థలప్రసంగోనామ షోడశః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో మాహేశ్వరస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగమను పదునారవ పరిచ్ఛేదము ముగిసినది.

# సప్తదశః పరిచ్ఛేదః

## పదునేడవ పరిచ్ఛేదము

## ప్రసాదిస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగః

## ప్రసాదిస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగము

**(86 శ్లోకములు)**

### *III.* అథ ప్రసాదిస్థలమ్
### ప్రసాదిస్థలము

***అగస్త్య ఉవాచ :***

స్థలాని తాని చోక్తాని
యాని మాహేశ్వరస్థలే ।
వదస్వ స్థలభేదం మే
ప్రసాదిస్థలసంశ్రితమ్ ॥ 17-1

***అగస్త్యుల ప్రశ్న :***

(ఓ రేణుకగణేశ్వరా!) మాహేశ్వరస్థలము నందలి స్థలభేదములన్నియూ చక్కగా చెప్పబడినవి. ప్రసాదిస్థలము నందలి అవాంతర స్థలములను తెలుపవలసినదిగా కోరుచున్నాను.

***శ్రీరేణుక ఉవాచ :***

స్థలభేదా నవ ప్రోక్తాః
ప్రసాదిస్థలసంశ్రితాః ।

కాయానుగ్రహణం పూర్వమ్
ఇంద్రియానుగ్రహం తతః ॥ 17-2

ప్రాణానుగ్రహణం పశ్చాత్
తతః కాయార్పితం మతమ్ ।
కరణార్పితమాఖ్యాతమ్
తతో భావార్పితం మతమ్ ॥ 17-3

శిష్యస్థలం తతః ప్రోక్తమ్
శుశ్రూషాస్థలమేవ చ ।
తతః సేవ్యస్థలం చైషామ్
క్రమశః శృణు లక్షణమ్ ॥ 17-4

**శ్రీ రేణుకుల సమాధానము**

ఓ మునీశ్వరుడా! లింగస్థలమునకు సంబంధించిన ప్రసాదిస్థలము నందు తొమ్మిది (అవాంతర)స్థలములున్నవి. అందు మొదటిది కాయానుగ్రహస్థలము, రెండవది ఇంద్రియానుగ్రహస్థలము. మూడవది ప్రాణానుగ్రహస్థలము, నాలుగవది కాయార్పితస్థలము. అయిదవది కరణార్పితస్థలము. ఆరవది భావార్పితస్థలము. ఏడవది శిష్యస్థలము. ఎనిమిదవది శుశ్రూషస్థలము. తొమ్మిదవది సేవ్యస్థలము. వీటి లక్షణములను వరుసగా చెప్పెదను ఆలకించుము.



**63. అథ కాయానుగ్రహస్థలమ్**
**కాయానుగ్రహస్థలము**

అనుగృహ్ణాతి యల్లోకాన్
స్వకాయం దర్శయన్నసౌ ।
తస్మాదేష సమాఖ్యాతః
కాయానుగ్రహనామకః ॥ 17-5

(జ్ఞానాచారసంపన్నుడైన) శివయోగి ఈ లోకమునందు తనదేహముతో(స్వకాయముతో) మానవులను అనుగ్రహిస్తాడు. అందు వలన అతనిని 'కాయానుగ్రాహకుడు' అని అంటారు. (తన దేహదర్శనముతోనే జీవులను అనుగ్రహించువాడు కాయానుగ్రాహకుడని తాత్పర్యము).

యథా శివోఽనుగృహ్ణాతి
మూర్తిమావిశ్య దేహినః ।
తథా యోగీ శరీరస్థః
సర్వానుగ్రాహకో భవేత్ ॥ 17-6

నిష్కలుడైన శివుడు ఏవిధముగా లీలావిగ్రహములను దాల్చి జీవులను అనుగ్రహించుచున్నాడో అదేవిధముగా ఈ శివయోగి కూడా తన (దివ్య) శరీరము నందు ఉన్నవాడై లోకులందరినీ అనుగ్రహించుచున్నాడు.

శివః శరీరయోగేఽపి
యథా సంగవివర్జితః ।

**తథా యోగీ శరీరస్థో**
**నిఃసంగో వర్తతే సదా ॥ 17-7**

శివుడెలా తన లీలామూర్తుల శరీరములందున్ననూ ఆ శరీరములతో సంగరహితుడు(సంబంధములేనివాడు)గా వుంటున్నాడో, అలాగుననే శరీరముతోనున్న యోగి కూడా (శరీరముతో) సంగరహితుడుగానే వుంటాడు.

**శివభావనయా యుక్తః**
**స్థిరయా నిర్వికల్పయా ।**
**శివో భవతి నిర్ధూత-**
**మాయావేశపరిప్లవః॥ 17-8**

నిర్వికల్పము (భేదబుద్ధిరహితము), స్థిరము అయిన శివభావనతో కూడుకున్న యోగీశ్వరుడు మాయావేశ ప్రభావముతో కలుగు భావనలను విదిలించుకుని తాను (సాక్షాత్తు) శివుడే అగుచున్నాడు.

**చిత్తవృత్తిషు లీనాసు**
**శివే చిత్సుఖసాగరే ।**
**అవిద్యాకల్పితం వస్తు**
**నాన్యత్ పశ్యతి సంయమీ ॥ 17-9**

ఈ యోగీశ్వరుని చిత్తవృత్తులు (మనోవ్యాపారములు) చిదానందసాగరుడైన శివునియందే లీనమవుతున్నందున, సంయమి అయిన శివయోగి అవిద్యాకల్పితమైన ఏ వస్తువును చూడలేదు.



**నేదం రజతమిత్యుక్తే**
**యథా శుక్తిః ప్రకాశతే ।**
**నేదం జగదితి జ్ఞాతే**
**శివతత్త్వం ప్రకాశతే ॥ 17-10**

ముత్తెపు చిప్పలోని వెండిని చూసి 'ఇది వెండికాదు' అను యథార్థజ్ఞానము ఆ ముత్తెపు చిప్పయందే ప్రకాశమానమైనట్లే, కనబడుతున్న జగత్తును చూసి 'ఇది జగత్తు కాదు' అను ఎరుక కలిగినప్పుడు శివతత్త్వము ప్రకాశమానమగును.

**యథా స్వప్నకృతం వస్తు**
**ప్రబోధేనైవ శామ్యతి ।**
**తథా శివస్య విజ్ఞానే**
**సంసారం నైవ పశ్యతి ॥ 17-11**

కలలో కనిపించిన వస్తువులు మేలుకున్న వెంటనే ఎలా తొలగిపోతున్నాయో అదేవిధముగా శివజ్ఞానమును పొందిన శివయోగి (మాయాప్రభావముతో ఏర్పడిన) సంసారమును చూడజాలడు.

**అజ్ఞానమేవ సర్వేషామ్**
**సంసారభ్రమకారణమ్ ।**
**తన్నివృత్తౌ కథం భూయః**
**సంసారభ్రమదర్శనమ్ ॥ 17-12**

లోకమునందలి అందరి భ్రాంతికి కారణమైనది అజ్ఞానమే. అటువంటి అజ్ఞానము తొలగిపోతే సంసారపు భ్రాంతి మరలా ఎలా కలుగుతుంది?

**గలితాహంకృతిగ్రంథిః**
**క్రీడాకల్పితవిగ్రహః ।**
**జీవన్ముక్తశ్చరేద్ యోగీ**
**దేహీవన్నిరుపాధికః ॥ 17-13**

అహంకారపుముడిని విప్పుకొని, వినోదమునకై కల్పించుకున్న శరీరముతో, ఉపాధిరహితుడైన శివయోగి జీవన్ముక్తుడై (తన దేహముతో) సామాన్యమానవునిలా లోకములో తిరుగుతూ వుంటాడు.

ఇతి కాయానుగ్రహస్థలం పరిసమాప్తమ్
కాయానుగ్రహస్థలము ముగిసినది.

## 64. అథ ఇంద్రియానుగ్రహస్థలమ్
## ఇంద్రియానుగ్రహస్థలము

**దర్శనాత్ పరకాయస్య**
**కరణానాం వివేకతః ।**
**ఇంద్రియానుగ్రహః ప్రోక్తః**
**సర్వేషాం తత్త్వవేదిభిః ॥ 17-14**



కాయానుగ్రహి అయిన పరయోగియొక్క దర్శనము చేతను అతని ఇంద్రియముల వివేకము చేతను లోకులందరిలో కలుగు కరణముల వివేకమే 'ఇంద్రియానుగ్రహ'మని శివతత్త్వవేత్తలు చెప్పుచున్నారు.

**ఇంద్రియాణాం సమస్తానామ్**
**స్వార్థేషు సతి సంగమే ।**
**రాగో వా జాయతే ద్వేషః**
**తౌ యోగీ పరివర్జయేత్ ॥ 17-15**

ఇంద్రియములు (జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు) తమ తమ విషయముల (పంచభూతముల)తో కలిసినపుడు మనస్సులో రాగముగాని ద్వేషముగాని పుడతాయి. అయితే యోగి అయినవాడు(ఆ)రెండింటినీ పరిత్యజించాలి.

**ఇంద్రియాణాం బహిర్వృత్తిః**
**ప్రపంచస్య ప్రకాశినీ ।**
**అంతః శివే సమావే**
**నిష్ప్రపంచస్య కారణమ్ ॥ 17-16**

ఇంద్రియములు బహిర్ముఖముగా (వెలుపలకు) ప్రవృత్తమయినపుడు (బాహ్య) ప్రపంచము కనబడుతుంది. అవి అంతర్ముఖముగా ప్రవృత్తమైనపుడు శివునిలో ఐక్యమై నిష్ప్రపంచజ్ఞానానికి కారణములౌతాయి.

**క్షణమంతః శివం పశ్యన్**
**కేవలేనైవ చేతసా ।**

**బాహ్యార్థానామనుభవమ్**
**క్షణం కుర్వన్ దృగాదిభిః॥ 17-17**

**సర్వేంద్రియనిరూఢోఽపి**
**సర్వేంద్రియవిహీనవాన్ ।**
**శివాహితమనా యోగీ**
**శివం పశ్యతి నాపరమ్ ॥ 17-18**

అంతర్ముఖమైన మనసుతో అంతరింద్రియముల ద్వారా ఒక క్షణకాలను తనలోపలి శివుని దర్శించి, మరొక క్షణం చక్షురాది బాహ్యేంద్రియములతో బాహ్యవిషయములను అనుభవించుచు, ఇలా సర్వేంద్రియములు ఆ యా వ్యాపారములతో కూడుకొని వున్ననూ, శివునియందాసక్తమైన మనసుతోనున్న శివయోగి ఇంద్రియములు లేనివానివలె శివుని తప్ప మరేదానిని చూడజాలడు.

**న జరా మరణం నాస్తి**
**న పిపాసా న చ క్షుధా ।**
**శివాహితేంద్రియస్యాస్య**
**నిర్మానస్య మహాత్మనః॥ 17-19**

శివునియందే సర్వేంద్రియవ్యాపారములను కేంద్రీకరించి నిర్మాని (దేహాభిమానరహితుడు), మహాత్ముడు అయిన యోగికి ముసలితనము, మరణము వంటి దేహధర్మములు గాని, ఆకలిదప్పులవంటి ప్రాణిధర్మములు కాని వుండవు.



**మనో యత్ర ప్రవర్తేత**
**తత్ర సర్వేంద్రియస్థితిః ।**
**శివే మనసి సల్లీనే**
**క్వ చేంద్రియవిచారణా ॥ 17-20**

అటువంటి యోగి యొక్క మనసు ఎక్కడ సంచరించునో, అక్కడే సర్వేంద్రియములు కూడా స్థిరమౌతాయి. ఆ మనస్సు శివునిలోనే చక్కగా లీనమైనపుడు ఇంద్రియములు మరోచోటికి ఎలా వెళతాయి?

**యద్యత్ పశ్యన్ దృశా యోగీ**
**మనసా చింతయత్యపి ।**
**తత్తత్ సర్వం శివాకారమ్**
**సంవిద్రూపం ప్రకాశతే ॥ 17-21**

అటువంటి యోగి తన కన్నులతో దేనిని చూచుచున్నను, మనసుతో దేనిని (గురించి) ఆలోచించుచున్నను, అది అంతయు అతనికి ఎఱుకతో కూడిన శివస్వరూపముగానే ప్రకాశించును.

**కరణైః సహితం ప్రాణమ్**
**మనస్యాధాయ సంయమీ ।**
**యోజయేత్ స శివః సాక్షాత్**
**యత్ర నాస్తి జగద్భ్రమః॥ 17-22**

(నేత్రాది) కరణము(ఇంద్రియము)లతో కూడుకున్న ప్రాణ వాయువును మనస్సునందునిలిపి, సంయమి అయిన యోగి ఆ మనస్సును శివుని యందు సంయోజనము చేయుట వలన, అతడు సాక్షాత్తు శివుడే అగుచున్నాడు. అందువలన అతనికి జగత్తుకు సంబంధించిన భ్రమయే వుండదు.

**సర్వేంద్రియప్రవృత్త్యా చ**
**బహిరంతః శివం యజన్ ।**
**స్వచ్ఛందచారీ సర్వత్ర**
**సుఖీ భవతి సంయమీ ॥ 17-23**

సంయమి (ఇంద్రియానుగ్రహస్థలమునందలి యోగి) తన సర్వేంద్రియ ప్రవృత్తుల (అంతరింద్రియ బాహ్యేంద్రియ వ్యాపారముల) ద్వారా లోపలా బయటా కూడా శివుణ్ణే (ప్రాణలింగమును) పూజించుచూ సర్వస్వతంత్రుడై అన్ని చోట్లా ఆనందమును అనుభవిస్తాడు.

*ఇతి ఇంద్రియానుగ్రహస్థలం పరిసమాప్తమ్ ।*
ఇంద్రియానుగ్రహస్థలము ముగిసినది.

## 65. అథ ప్రాణానుగ్రహస్థలమ్
## ప్రాణానుగ్రహస్థలము

**శివస్య పరకాయస్య**
**యత్ తాత్పర్యావలోకనమ్ ।**
**తత్ప్రాణానుగ్రహః ప్రోక్తః**
**సర్వేషాం తత్త్వదర్శిభిః ॥ 17-24**



పరకాయుడు (పరబ్రహ్మమునే దేహముగా గలిగినవాడు), శివస్వరూపుడు అయిన (శివ)యోగియొక్క తాత్పర్యావలోకనమే (విశ్వమునంతటినీ శివునిగా చూడగలిగిన నిశ్చయజ్ఞానమే) విశ్వమునందలి జీవులన్నింటికీ ప్రాణానుగ్రహస్థలమని తత్త్వజ్ఞానులచేత చెప్పబడినది. (తన ప్రాణమును పరమాత్మునిలో లయముచేసి ఆ పరశివతత్త్వమును దర్శించు స్థితి, బయటి జనసమూహమునకు ప్రాణానుగ్రాహకముగా పరిణమించును.

**ప్రాణో యస్య లయం యాతి**
**శివే పరమకారణే ।**
**కుతస్తస్యేంద్రియస్ఫూర్తిః**
**కుతః సంసారదర్శనమ్ ॥ 17-25॥**

పరమకారణుడైన పరమశివునిలో ఏ యోగి యొక్క ప్రాణవాయువు లయమగుచున్నదో అటువంటి ప్రాణానుగ్రాహకుడైన యోగికి ఇంద్రియముల స్ఫూర్తిగాని లేదా సంసారదర్శనముగాని ఎలా కలుగుతుంది?

**కరణేషు నివృత్తేషు**
**స్వార్థసంగాత్ ప్రయత్నతః ।**
**తైః సమం ప్రాణమారోప్య**
**స్వాంతే శాంతమతిః స్వయమ్ ॥ 17-26**

జ్ఞానేంద్రియములను మరియు కర్మేంద్రియములను వాటి వాటి విషయవస్తువుల సమావేశము నుండి ప్రయత్నపూర్వకముగా నివర్తింపజేసి

(వెనుకకు తీసుకొని), వాటికి ప్రాణమును (ప్రాణవాయువుతో) సంయోజనము చేసిన యోగి, తన అంతరంగములో తనకు తానే శాంతమనస్కు(చిత్తు)డు అవుతాడు (రాగద్వేషాదులు లేనివాడౌతాడు).

**శాంతత్వాత్ ప్రాణవృత్తీనామ్**
**మనః శామ్యతి వృత్తిభిః ।**
**తచ్ఛాంతౌ యోగినాం కించిత్**
**శివాదన్యన్న దృశ్యతే ॥ 17-27**

ప్రాణవృత్తులు (రేచకపూరక ప్రాణవృత్తులు) శమించినపుడు మనసు తన సంకల్పవికల్పాత్మకములయిన వ్యవహారములను వదలిపెట్టి ఉపశమిస్తుంది. ఇలా మనసును ఉపశమింపచేసుకున్న యోగి శివుని తప్ప మరే వస్తువును చూడజాలడు.

**ప్రాణ ఏవ మనుష్యాణామ్**
**దేహధారణకారణమ్ ।**
**తదాధారః శివః ప్రోక్తః**
**సర్వకారణకారణమ్ ॥ 17-28**

మానవులు దేహధారులగుటకు ప్రాణమే కారణము. అటువంటి ప్రాణమునకు ఆధారమైనవాడు సర్వ కారణములకు కారణమైన శివుడని చెప్పబడినది.

**నిరాధారః శివః సాక్షాత్**
**ప్రాణస్తేన ప్రతిష్ఠితః ।**



**తదాధారా తనుర్జ్ఞేయా**
**జీవో యేనైవ చేష్టతే ॥ 17-29**

శివుడు నిరాధారుడు (సర్వస్వతంత్రుడు). అతని చేతనే ప్రాణము ప్రతిష్ఠించబడినది. ఆ ప్రాణమునాధారము చేసుకునే ఈ శరీరము నిలచి యున్నది. ఆ ప్రాణశక్తివల్లనే జీవుడు లోకమునందు వ్యవహరించుచున్నాడు.

**శివే ప్రాణో విలీనోఽపి**
**యోగినో యోగమార్గతః ।**
**స్వశక్తివాసనాయోగాత్**
**ధారయత్యేవ విగ్రహమ్ ॥ 17-30**

యోగపురుషులు యోగమార్గముననుసరించి శివునిలో తమ ప్రాణములను విలీనము చేసుకున్ననూ, 'స్వశక్తివాసనా' యోగము చేత తమ శరీరములను ధరించి యున్నారు.

**స చాభ్యాసవశాద్భూయః**
**సర్వతత్త్వాతివర్తిని ।**
**నిష్కలంకే నిరాకారే**
**నిరస్తాశేషవిక్లవే ॥ 17-31**

**చిద్విలాసపరిస్ఫూర్తి -**
**పరిపూర్ణసుఖాహ్వయే ।**
**శివే విలీనః సర్వాత్మా**
**యోగీ చలతి న క్వచిత్ ॥ 17-32**

సమస్త (ముప్పదియారు) తత్త్వములకు అతీతమైనవాడు, నిష్కలంకుడు (దోషరహితుడు), నిరాకారుడు (ప్రాకృతిక ఆకారములేనివాడు) సర్వక్లేశవిదూరుడు (సంసార దుఃఖవిముక్తుడు), చిద్విలాసపరిస్ఫూర్తితో (జ్ఞానాధిక్యతతో) పరిపూర్ణసుఖ స్వరూపుడు, అద్వితీయుడు అయిన శివుని యందు నిరంతరాభ్యాసముతో ప్రాణవాయువును విలీనము చేసుకొని సర్వాత్ముడైన శివయోగి నిశ్చలుడగుచున్నాడు.

**ప్రధ్వస్తవాసనాసంగాత్**
**ప్రాణవృత్తిపరిక్షయాత్ ।**
**శివైకీభూతసర్వాత్మా**
**స్థాణువద్భాతి సంయమీ ॥ 17-33**

ప్రాణవృత్తులను నిరోధించుకుని ప్రాపంచిక విషయవాసనలను నశింపచేసుకొని శివునిలో ఐక్యతను సాధించిన సర్వాత్ముడైన సంయమి స్థాణువు (మొద్దు) వలె ప్రకాశించుచున్నాడు.

ఇతి ప్రాణానుగ్రహస్థలం పరిసమాప్తమ్ ।
ప్రాణానుగ్రహస్థలము ముగిసినది

## *66.* అథ కాయార్పితస్థలమ్

### కాయార్పితస్థలము

**శివస్య పరరూపస్య**
**సర్వానుగ్రాహిణోఽర్చనే ।**
**త్యాగో దేహాభిమానస్య**
**కాయార్పితముదాహృతమ్ ॥ 17-34**



అందరినీ అనుగ్రహించు పరబ్రహ్మస్వరూపుడు, ప్రాణానుగ్రహ సంపన్నుడు అయిన యోగి శివలింగార్చనలో తన దేహాభిమానమును త్యాగము చేయుటయే కాయార్పితస్థలమని చెప్పబడినది.

**యదా యోగీ నిజం దేహమ్**
**శివాయ వినివేదయేత్।**
**తదా భవతి తద్రూపమ్**
**శివరూపం న సంశయః ॥ 17-35**

ఎప్పుడు (ప్రాణానుగ్రహస్థలసంపన్నుడైన) యోగి తన దేహమును శివునికి సమర్పించుచున్నాడో అప్పుడు అతని దేహము శివరూపమే అగుచున్నది. అందులో సందేహము లేదు.

**ఇంద్రియప్రీతిహేతూని**
**విషయాసంగజాని చ ।**
**సుఖాని సుఖచిద్రూపే**
**శివయోగీ నివేదయేత్ ॥ 17-36**

శివయోగి తన ఇంద్రియప్రీతికి కారణమైన విషయ సంబంధము వలన కలుగు సుఖములను కూడా సుఖస్వరూపుడు చిద్రూపుడు అయిన శివునికే నివేదించవలెను.

**దర్శనాత్ స్పర్శనాభుక్తేః**
**శ్రవణాద్ ఘ్రాణనాదపి ।**

**విషయేభ్యో యదుత్పన్నమ్**
**శివే తత్సుఖమర్పయేత్ ॥ 17-37**

కళ్లతో చూచుట వలననూ, చర్మముతో స్పృశించుట వలననూ, నాలుకతో ఆస్వాదించుట వలననూ, చెవులతో వినుట వలననూ, ముక్కుతో వాసనచూచుట వలననూ, ఆ యా విషయసంబంధముల చేత కలుగు సుఖములనన్నింటినీ శివునికే సమర్పించవలెను.

**దేహద్వారేణ యద్యత్ స్యాత్**
**సుఖం ప్రాసంగమాత్మనః ।**
**తత్తన్నివేదయన్ శంభోః**
**యోగీ భవతి నిర్మలః ॥ 17-38**

దేహము వలన ఏ యే సుఖములు తనకు కలుగుచున్నవో, వాటినన్నింటినీ యోగి అయినవాడు శివునికి సమర్పించుట ద్వారా నిర్మలుడు అగుచున్నాడు.

ఇతి కాయార్పితస్థలం పరిసమాప్తమ్
కాయార్పితస్థలము ముగిసినది.

## 67. అథ కరణార్పితస్థలమ్
## కరణార్పితస్థలము

**ఆసంజనం సమస్తానామ్**
**కరణానాం పరాత్పరే ।**



**శివే యత్తదిదం ప్రోక్తమ్**
**కరణార్పితమాగమే ॥ 17-39**

పరాత్పరుడైన పరమశివునకు తనయొక్క సమస్త కరణములను (అంతఃకరణ, బహిఃకరణములను) సమర్పించుటనే శివాగమశాస్త్రములందు 'కరణార్పిత'మని చెప్పబడినది.

**యద్యత్కరణమాలంబ్య**
**భుంక్తే విషయజం సుఖమ్ ।**
**తత్తచ్ఛివే సమర్ప్యైష**
**కరణార్పక ఉచ్యతే ॥ 17-40**

ఏయే కరణముల(ఇంద్రియముల)ద్వారా విషయజన్యములైన ఏయే సుఖములను అనుభవించుచున్నాడో ఆ సుఖములన్నింటినీ శివునికి సమర్పించు శివయోగి 'కరణార్పకు'డని పిలువబడుచున్నాడు.

**అహంకారమదోద్రిక్తమ్**
**అంతఃకరణవారణమ్ ।**
**బధ్నీయాద్ యః శివాలానే**
**స ధీరః సర్వసిద్ధిమాన్ ॥ 17-41**

అహంకారమను మదముచేత క్రొవ్వెక్కిన అంతఃకరణమను మదగజమును ఎవడు శివలింగమను స్థంభమునకు బంధించుచున్నాడో వాడే సకలసిద్ధులను పొందిన ధీరుడు అనబడుచున్నాడు.

**ఇంద్రియాణాం సమస్తానామ్**
**మనః ప్రథమముచ్యతే ।**
**వశీకృతే శివే తస్మిన్**
**కిమన్యైస్తద్వశానుగైః ॥ 17-42**

సమస్త ఇంద్రియములలో మనసే ముఖ్యమైన (ప్రధానమైన)దని చెప్పబడినది. అందువలన అటువంటి మనసే శివుని వశమైనపుడు దాని అధీనమునందున్న (మిగిలిన) ఇంద్రియములు చేయగలిగినదేమున్నది?

**ఇంద్రియాణాం వశీకారో**
**నివృత్తిరితి గీయతే ।**
**లక్షీకృతే శివే తేషామ్**
**కుతః సంసారగాహనమ్ ॥ 17-43**

ఇంద్రియములను (తన) వశమునందుంచుకొనుటయే (ప్రాపంచికబంధ) నివృత్తియని చెప్పబడినది. అందువల్ల ఇంద్రియములు శివలింగములో లీనమైనపుడు సంసారసాగరములో మునగడమెట్లు సాధ్యము?

**సంసారవిషకాంతార-**
**సముచ్ఛేదకుఠారికా ।**
**ఉపశాంతిర్భవేత్ పుంసామ్**
**ఇంద్రియాణాం వశీకృతౌ ॥ 17-44**



సంసారమను విషవృక్షములతో నిండిన అడవిని నరికివేయుటకు ఇంద్రియవశీకరణమను గొడ్డలి ఉపకరించును. ఆ ఇంద్రియవశీకరణ మనుగొడ్డలి సమస్త ప్రాణులకు ఉపశాంతిని (నిరపేక్షత్వభావమును) కలుగజేయుచున్నది.

**ఇంద్రియైరేవ జాయంతే**
**పాపాని సుకృతాని చ ।**
**తేషాం సమర్పణాదీశే**
**కుతః కర్మనిబంధనమ్ ॥ 17-45**

ఇంద్రియముల వలననే పాపములు, పుణ్యములు (రెండు) కలుగుచున్నవి. అటువంటి ఇంద్రియములనే ఈశ్వరునికి సమర్పించిన ఇక కర్మబంధమెట్లు కలుగును?

**ప్రకాశమానే చిద్వహ్నౌ**
**బహిరంతర్జగన్మయే ।**
**సమర్ప్య విషయాన్ సర్వాన్**
**ముక్తవజ్జాయతే జనః ॥ 17-46**

విశ్వవ్యాపకమైన చైతన్యాగ్ని లోపలా వెలుపలా ప్రకాశించుచుండగా అందులో (ఆ అగ్నిలో) విషయసుఖములను హవిస్సుగా సమర్పించు మానవులు ముక్తులే అగుచున్నారు.

**చిత్తద్రవ్యం సమాదాయ**
**జగజ్జాతం మహాహవిః ।**

**చిద్వహ్నౌ జుహ్వతామంతః**
**కుతః సంసారవిప్లవః ॥ 17-47**

జగత్సమూహమను మహాహవిస్సును మరియు చిత్త (మానసిక) ద్రవ్యమును తన హృదయకమలమునందలి చిదగ్నిలో సమర్పించి హెూమము చేయు కరణార్పకయోగికి సంసారక్లేశము ఎట్లు ఏర్పడును ?

**ఆత్మజ్యోతిషి చిద్రూపే**
**ప్రాణవాయునిబోధితే ।**
**జుహ్వన్ సమస్తవిషయాన్**
**తన్మయో భవతి ధ్రువమ్ ॥ 17-48**

ప్రాణవాయువుతో ప్రజ్వలింపచేసిన చిద్రూపమైన (తన) ఆత్మజ్యోతిలో విషయములు అను హవిస్సును హెూమము చేసిన ఆ యోగి నిస్సందేహముగా శివస్వరూపుడే అగుచున్నాడు.

**ఇంద్రియాణి సమస్తాని**
**శరీరం భోగసాధనమ్ ।**
**శివపూజాంగభావేన**
**భావయన్ ముక్తిమాప్నుయాత్ ॥ 17-49**

సమస్త ఇంద్రియములను, భోగసాధనమైన శరీరమును శివపూజకు అంగములుగా భావించు ఈ కరణార్పకయోగి ముక్తిని పొందుచున్నాడు.

ఇతి కరణార్పితస్థలం పరిసమాప్తమ్ ।
కరణార్పితస్థలము ముగిసినది.



## *68.* అథ భావార్పితస్థలమ్

### భావార్పితస్థలము

**శివే నిశ్చలభావేన**
**భావానాం యత్సమర్పణమ్ ।**
**భావార్పితమిదం ప్రోక్తమ్**
**శివసద్భావవేదిభిః ॥ 17-50**

శివలింగము నందు నిశ్చలమైన భావముతో తన మనోభావములను సమర్పించుటయే భావార్పితమని శివసద్భావమును తెలిసినవారు చెప్పుచున్నారు (భావమనగా మనోవృత్తియని అర్థము).

**చిత్తస్థసకలార్థానామ్**
**మననం యత్తు మానసే ।**
**తదర్పణం శివే సాక్షాత్**
**మానసో భావ ఉచ్యతే ॥ 17-51**

తన చిత్తమునందలి సమస్త పదార్థములకు సంబంధించిన ఆలోచనలను శివునికి మనస్సులో అర్పించుటయే 'మానసికభావార్పిత' మనదుచున్నది.

**భావ ఏవ హి జంతూనామ్**
**కారణం బంధమోక్షయోః ।**

**భావశుద్ధౌ భవేన్ముక్తిః**
**విపరీతే తు సంసృతిః ॥ 17-52**

జీవులయొక్క బంధమోక్షములకు భావమే కారణము. భావము శుద్ధమైతే ముక్తి, అందుకు విరుద్ధముగా అశుద్ధమైతే (అహంకార, మమకారములతో కూడుకున్న) సంసారము ప్రాప్తమవుతాయి.

**భావస్య శుద్ధిరాఖ్యాతా**
**శివోఽహమితి యోజనా ।**
**విపరీతసమాయోగే**
**కుతో దుఃఖనివర్తనమ్ ॥ 17-53**

భావములో 'శివోఽహం' (శివుడే నేను) అను భావము యోజనము చేయబడినపుడు అది శుద్ధభావమగును. తద్విరుద్ధముగ (నేను శివుడను కాదను) భావము చేసినచో దుఃఖమెలా నివారించబడును? ('శివోఽహం' భావనతోనే భావము శుద్ధమగును.)

**భోక్తా భోగ్యం భోజయితా**
**సర్వమేతచ్చరాచరమ్ ।**
**భావయన్ శివరూపేణ**
**శివో భవతి వస్తుతః ॥ 17-54**



భోక్త అయినవాడు జీవుడు; భోగ్యమయినది జగత్తు. భోగాన్ని ప్రసాదించేవాడు శివుడు. చరాచరాత్మకమైనది విశ్వము. వీటన్నింటినీ శివరూపముగా భావించువాడు నిశ్చయముగా శివుడే అగుచున్నాడు. (అన్నిటా శక్తివిశిష్టమైన అఖండచైతన్యమునే భావించవలెను).

**మిథ్యేతి భావయన్ విశ్వమ్**
**విశ్వాతీతం శివం స్మరన్ ।**
**సత్తానందచిదాకారమ్**
**కథం బద్ధమిహార్హతి ॥ 17-55**

విశ్వమును మిథ్యగా భావించుచు, విశ్వాతీతుడైన శివుని సచ్చిదానంద స్వరూపునిగా స్మరించు భావార్పితస్థలయోగి మలమాయాదిపాశములతో ఎట్లు బంధించబడుచున్నాడు?

**సర్వం కర్మార్చనం శంభోః**
**వచనం తస్య కీర్తనమ్ ।**
**ఇతి భావయతో నిత్యమ్**
**కథం స్యాత్ కర్మబంధనమ్ ॥ 17-56**

తాను చేయు కర్మలు శివార్చనలని, పలికే ప్రతి పలుకు శివకీర్తనమని నిరంతరము భావించు ఈ యోగికి కర్మబంధమెట్లు ఏర్పడును?

**సర్వేంద్రియగతం సౌఖ్యమ్**
**దుఃఖం వా కర్మసంభవమ్ ।**

**శివార్థం భావయన్ యోగీ**
**జీవన్ముక్తో భవిష్యతి ॥ 17-57**

సకలేంద్రియసమూహము ద్వారా లభించు కర్మజన్యసుఖదుఃఖము లన్నియు శివునికి సంబంధించినవే అని భావించు యోగి జీవన్ముక్తుడౌతాడు.

*ఇతి భావార్పితస్థలం పరిసమాప్తమ్ ।*
భావార్పితస్థలము ముగిసినది.

**69. అథ శిష్యస్థలమ్**
**శిష్యస్థలము**

**శాసనీయో భవేద్యస్తు**
**పరకాయేన సర్వదా ।**
**తత్ప్రసాదాత్తు మోక్షార్థీ**
**స శిష్య ఇతి కీర్తితః ॥ 17-58**

వరకాయుడు (వరబ్రహ్మమునే దేహముగా కలిగి భావార్పితస్థలమునకు చెందిన)అయిన యోగిచేత శిక్షణను పొందుచు మరియు ఆతని ప్రసాదము చేత మోక్షమును పొందుట కభిలషించువాడు 'శిష్యుడు' అని పిలువబడుచున్నాడు.

**భావో యస్య స్థిరో నిత్యమ్**
**మనోవాక్కాయకర్మభిః ।**



**గురౌ నిజే గుణోదారే**
**స శిష్య ఇతి గీయతే ॥ 17-59**

జ్ఞానవైరాగ్యాది గుణములచేత మహోన్నతుడైన తన గురువు పట్ల ఎవని భావములు మనస్సు – వాక్కు – కర్మలచేత నిత్యము సుస్థిరములైయున్నవో అతడు 'శిష్యుడు' అనబడతాడు.

**శాంతో దాంతస్తపశ్శీలః**
**సత్యవాక్ సమదర్శనః ।**
**గురౌ శివే సమానస్థః**
**స శిష్యాణామిహోత్తమః ॥ 17-60**

శాంతుడు (అంతరింద్రియనిగ్రహము కలవాడు), దాంతుడు (బహిరింద్రియనిగ్రహము కలవాడు), తపశ్శీలుడు(యమనియమాద్యష్టాంగము నను్ష్టించువాడు), సత్యమును పలుకువాడు, అన్నిటాసమాన బుద్ధికలగినవాడు, గురువు, శివుడు ఈ ఇరువురి పట్ల సమానమైన భక్తి గౌరవాదులను కలిగినవాడు శిష్యులలో సర్వశ్రేష్ఠుడుగా (ఉత్తముడుగా) పరిగణించబడతాడు.

**గురుమేవ శివం పశ్యేత్**
**శివమేవ గురుం తథా ।**
**నైతయోరంతరం కించిత్**
**విజానీయాద్విచక్షణః ॥ 17-61**

విచక్షణ కలిగిన శిష్యుడు గురువునందు శివుని, అలాగే శివుని గురువుయందును చూడవలెను. వారిరువురి నడుమ ఎటువంటి భేదబుద్ధిని కలిగివుండరాదు.

**శివాచారే శివధ్యానే**
**శివజ్ఞానే చ నిర్మలే ।**
**గురోరాదేశమాత్రేణ**
**పరాం నిష్ఠామవాప్నుయాత్ ॥ 17-62**

గురువుల ఆదేశముననుసరించి శిష్యుడయినవాడు శివాచారమునందు, శివధ్యానమునందు, నిర్మలమైన శివజ్ఞానమునందు – పరమనిష్ఠుడై (అచంచలమయిన విశ్వాసమును కలిగి) వుండవలెను.

**బ్రహ్మాండబుద్బుదోద్భూతమ్**
**మాయాసింధుం మహత్తరమ్ ।**
**గురోః కవలయత్యాశు**
**కటాక్షవడవానలః ॥ 17-63**

బ్రహ్మాండములను బుడగలనుత్పత్తి చేయు మహత్తరమైన మాయాసముద్రమును గురుకటాక్షమను బడబాగ్ని మరుక్షణమే కబళించివేయుచున్నది.

**గురోః కటాక్షవేధేన**
**శివో భవతి మానవః ।**



**రసవేధాద్ యథా లోహో**
**హేమతాం ప్రతిపద్యతే ॥ 17-64**

రసవేధ(నిద్య) చేత లోహము బంగారమయినట్లు, గురుకటాక్షమను వేధ చేత మానవుడు శివుడగుచున్నాడు. (తీవ్రమైన అనురక్తిభావము వేధ అనబడినది)

**న లంఘయేద్ గురోరాజ్ఞామ్**
**జ్ఞానమేవ ప్రకాశయన్ ।**
**శివాసక్తేన మనసా**
**సర్వసిద్ధిమవాప్నుయాత్ ॥ 17-65**

అటువంటి సర్వశ్రేష్ఠుడైన గురువుయొక్క ఆజ్ఞను (శిష్యుడు) జవదాటరాదు. అతడు శివాసక్తమైన మనసుతో జ్ఞానమును(సదా) ప్రకాశింపచేయుచు సకల సిద్ధులను పొందుచున్నాడు.

**శివాదన్యజ్జగన్మిథ్యా**
**శివః సంవిత్స్వరూపకః ।**
**శివస్త్వమితి నిర్దిష్టో**
**గురుణా ముక్త ఏవ సః ॥ 17-66**

'శివునికన్నా వేరైన జగత్తు మిథ్య' 'శివుడు సంవిత్స్వరూపుడు' (జ్ఞానస్వరూపుడు), 'ఆ శివుడవే నీవు' అని గురువు చేత ఉపదేశించబడిన శిష్యుడు ముక్తుడౌతాడు.

**గురోర్లబ్ధ్వా మహాజ్ఞానమ్**
**సంసారామయభేషజమ్ ।**
**మోదతే యః సుఖీ శాంతః**
**స జీవన్ముక్త ఏవ హి ॥ 17-67**

సంసార రోగమునకు ఔషధమయిన మహాజ్ఞానమును (శివాద్వైతజ్ఞానమును) గురువు నుండి పొంది ఎవడు సుఖశాంతులతో ఆనందించుచున్నాడో అతడు జీవన్ముక్తుడు అగుచున్నాడు.

ఇతి శిష్యస్థలం పరిసమాప్తమ్ ।
శిష్యస్థలము ముగిసినది.

## 70. అథ శుశ్రూషుస్థలమ్

### శుశ్రూషుస్థలము

**బోధ్యమానః స గురుణా**
**పరకాయేన సర్వదా ।**
**తచ్ఛుశ్రూషారతః శిష్యః**
**శుశ్రూషురితి కీర్త్యతే ॥ 17-68**

పరకాయుడైన శ్రీగురువుచేత నిరంతరము ఉపదేశించబడుతున్న శిష్యుడు, గురువుచే బోధించబడు తత్త్వార్థములను వినవలెనన్న తీవ్రమైన వాంఛను గలిగివున్నప్పుడు 'శుశ్రూషు'వు అని పిలువబడుచున్నాడు.



**కిం సత్యం కిం ను వాఽసత్యమ్**
**క ఆత్మా కః పరః శివః ।**
**ఇతి శ్రవణసంసక్తో**
**గురోః శిష్యో విశిష్యతే ॥ 17-69**

ఏది సత్యము? ఏది అసత్యము? ఆత్మ అంటే ఎవరు? పరశివుడు ఎవరు? వంటి ప్రశ్నలకు గురువు నుండి సమాధానములను తెలుసుకొనుటకు ఆసక్తికలిగిన శిష్యుడు ఉత్తముడని పరిగణించబడుచున్నాడు.

**శ్రుత్వా శ్రుత్వా గురోర్వాక్యమ్**
**శివసాక్షాత్క్రియావహమ్ ।**
**ఉపశామ్యతి యః స్వాంతే**
**స ముక్తిపదమాప్నుయాత్ ॥ 17-70**

శివసాక్షాత్కారమును కలుగజేయు గురువుల వాక్యములను మరలా మరలా విని ఎవడు తన అంతరంగమున శాంతచిత్తు (సమాధానమనస్కు) డగుచున్నాడో అతడే ముక్తిని పొందుచున్నాడు.

**న బుధ్యతి గురోర్వాక్యమ్**
**వినా శిష్యస్య మానసమ్ ।**
**తేజో వినా సహస్రాంశోః**
**కథం స్ఫురతి పంకజమ్ ॥ 17-71**

గురువుల ఉపదేశవాక్యములను ఆలకించినగాని శిష్యుని మనసుకు జ్ఞానోదయము కలుగదు (హృదయకమలము వికసించదు). సూర్యకాంతి సోకనిదే కమలమెట్లు వికసించును?

**సూర్యస్యోదయమాత్రేణ**
**సూర్యకాంతః ప్రకాశతే ।**
**గురోరాలోకమాత్రేణ**
**శిష్యో బోధేన భాసతే ॥ 17-72**

సూర్యోదయము తరువాతనే సూర్యకాంతమణి ప్రకాశించినట్లుగా గురువుల చూపులమాత్రముననే శిష్యుడు జ్ఞానవంతుడగుచున్నాడు.

**అద్వైతపరమానంద-**
**ప్రబోధైకప్రకాశకమ్ ।**
**ఉపాయం శృణుయాచ్ఛిష్యః**
**సద్గురుం ప్రాప్య సాంజలిః ॥ 17-73**

శిష్యుడైనవాడు సద్గురువుల సన్నిధి చేరి, చేతులను జోడించి అద్వైతరూపమయిన పరమానందజ్ఞానమును ప్రకాశింపజేయు ఉపాయమును గురువునుండి ఆలకించవలెను.

**కిం తత్త్వం పరమం జ్ఞేయమ్**
**కేన సర్వే ప్రతిష్ఠితాః ।**



**కస్య సాక్షాత్క్రియా ముక్తిః**
**కథయేతి సమాసతః ॥ 17-74**

(ఓ గురుశ్రేష్ఠుడా!) తెలియవలసిన పరతత్త్వమేది? ఎవనిచేత ఈ తత్త్వము నిరూపించుబడినది? ఎవని సాక్షాత్కారము ముక్తిని కలుగజేయును? సంక్షేపముగా తెలియచేయుడి.

**ఇతి ప్రశ్నే కృతే పూర్వమ్**
**శిష్యేణ నియతాత్మనా ।**
**బ్రూయాత్ తత్త్వం గురుస్తస్మై**
**యేన స్యాత్ సంసృతేర్లయః ॥ 17-75**

ఇటువంటి ప్రశ్నలతో వచ్చిన ఏకాగ్రచిత్తుడైన శిష్యునకు గురువు, సంసారమును తొలగింపచేయు తత్త్వమును ఉపదేశించవలెను.

**శివ ఏవ పరం తత్త్వమ్**
**చిదానందసదాకృతిః ।**
**స యథార్థస్తదన్యస్య**
**జగతో నాస్తి నిత్యతా ॥ 17-76**

సచ్చిదానందస్వరూపుడైన శివుడొక్కడే పరతత్త్వము. అతడొక్కడే యథార్థము. అతనికన్నా వేరైన జగత్తుకు నిత్యత్వము ఉండదు.

**అయథార్థప్రపంచోఽయమ్**
**ప్రతితిష్ఠతి శంకరే ।**

**సదాత్మని యథా శుక్తౌ**
**రజతత్వం వ్యవస్థితమ్ ॥ 17-77**

ముత్తెపుచిప్పలో వెండివున్నట్లు కనిపించినట్టుగానే, అయథార్థ (అనిత్య)మయిన ఈ ప్రపంచము సత్యస్వరూపుడైన శంకరునిలో (ప్రతిష్ఠితమై) కనిపించుచున్నది.

**శివోఽహమితి భావేన**
**శివే సాక్షాత్కృతే స్థిరమ్ ।**
**ముక్తో భవతి సంసారాత్**
**మోహగ్రంథేర్విభేదతః ॥ 17-78**

'శివోఽహం' (నేనే శివుడను) అను భావన సుస్థిరమైనపుడు శివసాక్షాత్కారము ఫలించి, మోహగ్రంధి తొలగిపోవుటచేత సాధకుడు సంసారము నుండి ముక్తుడగుచున్నాడు.

**శివం భావయ చాత్మానమ్**
**శివాదన్యం న చింతయ ।**
**ఏవం స్థిరే శివాద్వైతే**
**జీవన్ముక్తో భవిష్యసి ॥ 17-79**

'నీవు నిన్ను శివునిగానే భావించు! శివునికన్నా వేరైన దానిని గురించి ఆలోచించవద్దు! ఇలా చేయుట వలన నీలో శివాద్వైతజ్ఞానము స్థిరపడి నీవు జీవన్ముక్తుడవగుదువు!'



**ఏవం ప్రచోదితః శిష్యో**
**గురుణా గుణశాలినా ।**
**శివమేవ జగత్ పశ్యన్**
**జీవన్ముక్తోఽభిజాయతే ॥ 17-80**

ఈ విధముగా గుణసంపన్నుడైన గురువుచేత చక్కగా బోధించబడిన శిష్యుడు, ఈ జగత్తునంతటినీ శివమయముగా చూచుచు జీవన్ముక్తుడగుచున్నాడు.

ఇతి శుశ్రూషస్థలం పరిసమాప్తమ్ ।
శుశ్రూషస్థలము ముగిసినది.

### *71.* అథ సేవ్యస్థలమ్
### సేవ్యస్థలము

**గురువాక్యామృతాస్వాదాత్**
**ప్రాప్తబోధమహాఫలః ।**
**శుశ్రూషురేవ సర్వేషామ్**
**సేవ్యత్వాత్ సేవ్య ఉచ్యతే ॥ 17-81**

శ్రీగురువుయొక్క ఉపదేశామృతమును ఆస్వాదించుట చేత శివాద్వైతబోధ(జ్ఞాన)రూపమైనమహాఫలమును సంపాదించుకున్న శుశ్రూషస్థలసాధకుడు, అందరిచే సేవించబడుటకు యోగ్యతను సంపాదించుకున్నందున 'సేవ్యుడు' అని పిలువబడుచున్నాడు.

**గురూపదిష్టే విజ్ఞానే**
**చేతసి స్థిరతాం గతే ।**
**సాక్షాత్కృతశివః శిష్యో**
**గురువత్ పూజ్యతే సదా ॥ 17-82**

గురువు ఉపదేశించిన అనుభవాత్మకమైన శివాద్వైత విజ్ఞానము తన మనస్సులో సుస్థిరము కాగా, శివసాక్షాత్కారమును పొందిన శిష్యుడు గురువువలె (తానును) ఎల్లప్పుడూ పూజింపబడుచున్నాడు.

**జ్ఞానాదాధిక్యసంపత్తిః**
**గురోర్యస్మాదుపస్థితా ।**
**తస్మాజ్జ్ఞానాగమాచ్ఛిష్యో**
**గురువత్ పూజ్యతాం వ్రజేత్॥ 17-83**

ఏ గురువునుండి శివాద్వైతజ్ఞానమను (ఉత్కృష్ట) సంపద సంప్రాప్తమైనదో, అటువంటి జ్ఞానప్రాప్తివలన శిష్యుడు కూడా గురువు వలె పూజ్యతను పొందుచున్నాడు.

**శివోఽహమితి భావస్య**
**నైరంతర్యాద్ విశేషతః ।**
**శివభావే సముత్పన్నే**
**శివవత్ పూజ్య ఏవ సః ॥ 17-84**



'శివోఽహం' (శివుడే నేను)అను భావనను నిరంతరాభ్యాసము వలన శివభావము ఉత్పన్నమై, ఆ సేవ్యుడు శివుని వలెనే పూజ్యుడగుచున్నాడు.

**విషయాసక్తచిత్తోఽపి**
**విషయాసంగవర్జితః ।**
**శివభావయుతో యోగీ**
**సేవ్యః శివ ఇవాపరః ॥ 17-85**

ఇటువంటి సేవ్యుడు ప్రాపంచికవిషయాసక్తచిత్తునివలె (పైకి) కనిపించినను, శివభావయుతుడైన అతడు (ప్రాపంచిక) విషయాసంగవర్జితుడై, అపరశివుని వలె సేవించబడుచున్నాడు.

**ముక్తః సంశయపాశతః స్థిరమనా బోధే చ ముక్తిప్రదే**
**మోహం దేహభృతాం దృశా విఘటయన్ మూలం మహాసంసృతేః।**
**సత్తానందచిదాత్మకే నిరుపమే శైవే పరస్మిన్ పదే**
**లీనాత్మా క్షయితప్రపంచవిభవో యోగీ జనైః సేవ్యతే ॥ 17-86**

(శార్దూల విక్రీడితమ్)

సంశయములను బంధనముల నుండి ముక్తుడు, మోక్షప్రదమైన శివాద్వైతబోధన (జ్ఞానము) యందు స్థిరమనస్కుడు, సంసారమునకు మూలకారణమైన మోహమును కేవలము తన కృపాదృష్టితో తొలగించగలిగిన సచ్చిదానందస్వరూపుడు, ఉపమాతీతుడు, పరశివునిలో లీనాత్ముడు, ప్రపంచవైభవమును నశింపచేసుకున్న సేవ్యస్థలీయయోగి లోకమునందలి ప్రాణులందరిచేత పూజింపబడు చున్నాడు.

*ఓం తత్సత్ ఇతి*

*శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ ప్రసాదిస్థలాంతర్గత నవవిధలింగస్థలప్రసంగో నామ సప్తదశః పరిచ్ఛేదః ।*

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో ప్రసాదిస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగమను పదునేడవ పరిచ్ఛేదము ముగిసినది.



# అష్టాదశః పరిచ్ఛేదః

## పదునెనిమిదవ పరిచ్ఛేదము

### *ప్రాణలింగిస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగః*

### ప్రాణలింగిస్థలాంతర్గత నవవిధలింగస్థలప్రసంగము

**(78 శ్లోకములు)**

**IV అథ ప్రాణలింగిస్థలమ్**

**ప్రాణలింగిస్థలము**

***అగస్త్య ఉవాచ :***

**ప్రసాదిస్థలసంబద్ధాః**
**స్థలభేదాః ప్రకీర్తితాః ।**
**ప్రాణలింగిస్థలారూఢాన్**
**స్థలభేదాన్ వదస్వ మే ॥ 18-1**

**అగస్త్యుల ప్రశ్న**

(ఓ గణేశ్వరుడా!) ప్రసాదిస్థలమునకు సంబంధించిన స్థలభేదములు స్పష్టముగా చెప్పబడినవి. ఇపుడు ప్రాణలింగిస్థలమును ఆశ్రయించివున్న (అవాంతర) స్థలభేదములను నాకు బోధించ ప్రార్థన.

***శ్రీరేణుక ఉవాచ :***

**స్థలానాం నవకం ప్రోక్తమ్**
**ప్రాణలింగిస్థలాశ్రితమ్ ।**

ఆదావాత్మస్థలం ప్రోక్తమ్
అంతరాత్మస్థలం తతః ॥ 18-2

పరమాత్మస్థలం పశ్చాత్
నిర్దేహాగమసంజ్ఞకమ్ ।
నిర్భావాగమసంజ్ఞం చ
తతో నష్టాగమస్థలమ్ ॥ 18-3

ఆదిప్రసాదనామాథ
తతోఽప్యంత్యప్రసాదకమ్ ।
సేవ్యప్రసాదకం చాథ
శృణు తేషాం చ లక్షణమ్ ॥ 18-4

## శ్రీరేణుకుల వారి సమాధానము

(ఓ మునీశ్వరుడా!) ఈ ప్రాణలింగిస్థలమునాశ్రయించుకొని తొమ్మిది అవాంతరస్థలములున్నవి. వాటిలో మొదటిది ఆత్మస్థలము, రెండవది అంతరాత్మస్థలము. మూడవది పరమాత్మస్థలము, నాలుగవది నిర్దేహాగమస్థలము, అయిదవది నిర్భావాగమస్థలము, ఆరవది నష్టాగమస్థలము. ఏడవది ఆదిప్రసాదిస్థలము. ఎనిమిదవది అంత్యప్రసాది స్థలము, తొమ్మిదవది సేవ్యప్రసాదిస్థలము. వీటి లక్షణములను వరుసగా చెప్పెదను ఆలకించుము.



## 72. అథ ఆత్మస్థలమ్

### ఆత్మస్థలము

జీవభావం పరిత్యజ్య
యదా తత్త్వం విభావ్యతే ।
గురోశ్చ బోధయోగేన
తదాఽత్మాయం ప్రకీర్తితః ॥ 18-5

శ్రీ గురువు యొక్క శివాద్వైతబోధచేత శిష్యుడు తన జీవభావమును వదలిపెట్టి ఎప్పుడు పరతత్త్వమును (సత్యమును) తెలుసుకొనుచున్నాడో, అప్పుడు అతను 'ఆత్మస్థలి'యని పిలువబడును.

వాలాగ్రశతభాగేన
సదృశో హృదయస్థితః ।
అశ్నన్ కర్మఫలం సర్వమ్
ఆత్మా స్ఫురతి దీపవత్ ॥ 18-6

ఈ ఆత్మ, వెంట్రుకకొసయొక్క శతాంశమునకు సమానమైన ప్రమాణము (అత్యంతసూక్ష్మరూపము)తో హృదయభాగము నందు స్థితమై తన సమస్త కర్మఫలములను అనుభవించుచు దీపమువలె ప్రకాశించుచుండును.

ఆత్మాఽపి సర్వభూతానామ్
అంతఃకరణమాశ్రితః ।

**అణుభూతో మలాసంగాత్**
**ఆదికర్మనియంత్రితః ॥ 18-7**

ఈ ఆత్మ, అన్ని భూతము(ప్రాణు)లయొక్క ఆత్మగా (వ్యాపించి) ఉన్ననూ (ఆణవాది) మలసంబంధముచేత తాను అణురూపమున అంతఃకరణమునాశ్రయించుకొని పూర్వజన్మములందుచేసిన కర్మ లచేత నియంత్రిచబడుచున్నది.

**జపాయోగాద్యథా రాగః**
**స్ఫటికస్య మణేర్భవేత్ ।**
**తథాఽహంకారసంబంధాత్**
**ఆత్మనో దేహమానితా ॥ 18-8**

జపాకుసుమము (ఎర్రని పగడముల) యొక్క సంబంధముచేత స్ఫటికమణి ఎలా ఎర్రగా కనబడుచున్నదో అలాగుననే అహంకారపు సంబంధము చేత ఈ ఆత్మకు దేహాభిమానము ఏర్పడుచున్నది.

**అశరీరోఽపి సర్వత్ర**
**వ్యాపకోఽపి నిరంజనః।**
**ఆత్మా మాయాశరీరస్థః**
**పరిభ్రమతి సంసృతౌ॥ 18-9**

(ఈ) ఆత్మ, శరీరములేనిదైనను, సర్వవ్యాపకమైనను నిరంజనమై (దోషరహితమై)నను, మాయాకల్పిత శరీరము నందు (అధోమాయచేత



సృష్టించబడిన శరీరమునందు) వసించుచు సంసారచక్రమున తిరుగులాడు చున్నది.

**ఆత్మస్వరూపవిజ్ఞానమ్**
**దేహేంద్రియవిభాగతః ।**
**అఖండబ్రహ్మరూపేణ**
**తదాత్మప్రాప్తిరుచ్యతే ॥ 18-10**

'నేను దేహేంద్రియముల కన్నా భిన్నమైన (వేరైన)వాడ'ను, మరియు 'నేను అఖండబ్రహ్మస్వరూపుడను' అని తన ఆత్మస్వరూపము యొక్క అనుభవాత్మకమైన జ్ఞానమును సంపాదించుకొనుటయే 'ఆత్మప్రాప్తి' అనబడినది.

**న చాస్తి దేహసంబంధో**
**నిర్దేహస్య స్వభావతః ।**
**అజ్ఞానకర్మయోగేన**
**దేహీ భవతి భుక్తయే ॥ 18-11**

దేహములేని ఆత్మకు స్వాభావికముగా (సహజంగా) దేహసంబంధ ముండదు. అయితే అనాది అయిన కర్మఫలము ననుభవించుటకు దేహమును కలిగినవాడగుచున్నాడు.

**నాసౌ దేవో న గంధర్వో**
**న యక్షో నైవ రాక్షసః ।**

న మనుష్యో న తిర్యక్ చ
న చ స్థావరవిగ్రహః ।
తత్తచ్ఛరీయోగేన
తత్తన్నామ్నా విరాజతే ॥ 18-12

ఈ ఆత్మ దేవుడు కాదు, గంధర్వుడు కాదు, యక్షుడు కాదు, రాక్షసుడు కాదు, మనుష్యుడు కాదు, ఎగిరే పక్షికాదు, స్థావర శరీరి (వృక్షజాతి)కాదు. అయితే ఆయా శరీరముల సంబంధము చేత ఆయా పేర్లతో (లోకములో) వ్యవహరించబడుతూ ప్రకాంచుచున్నాడు.

నానాకర్మవిపాకాశ్చ
నానాయోనిసమాశ్రితాః ।
నానాయోగసమాపన్నా
నానాబుద్ధివిచేష్టితాః ॥ 18-13

నానామార్గసమారూఢా
నానాసంకల్పకారిణః ।
అస్వతంత్రాశ్చ కించిజ్ఞాః
కించిత్కర్తృత్వహేతవః ।
లీలాభాజనతాం ప్రాప్తాః
శివస్య పరమాత్మనః ॥ 18-14



ఈ జీవులు నానావిధములైన పూర్వజన్మలందు చేసిన కర్మపరిపాకము వలన, (దేవ మనుష్యాది) వివిధ యోనులందు జన్మించి, అనేక విధములైన యోగములను పొంది, (అప్రాప్త వస్తువులను ప్రాప్తము చేసుకొని), అనేక విధములైన బుద్ధులతో వ్యవహరించుచు, నానా విధములైన భోగమార్గములను అవలంబించి అనేక సంకల్పములను చేసుకొనుచు, అస్వతంత్రులై, అల్పజ్ఞులై, అల్పకర్తృత్వశక్తితో (ఈ జీవులు) పరమాత్ముడైన శివునికి లీలామూర్తులగు చున్నారు.

చోదితాః పరమేశేన
స్వస్వకర్మానురూపతః ।
స్వర్గం వా నరకం వాపి
ప్రాణినో యాంతి కర్మిణః ॥ 18-15

కర్మబద్ధులై తమ తమ కర్మానుసారము పరమాత్ముని చేత ప్రేరేపించబడిన ఈ జీవులు స్వర్గమును గాని లేదా నరకమును గాని పొందుచున్నారు.

పునః కర్మావశేషేణ
జాయంతే గర్భకోటరాత్ ।
జాతా మృతాః పునర్జాతాః
పునర్మరణభాజినః ।
భ్రమంతి ఘోరసంసారే
విశ్రాంతికథయా వినా ॥ 18-16

(ఇలా స్వర్గనరకములలో పుణ్యపాపఫలములను అనుభవించి) ఇంకా మిగిలివున్న కర్మశేషమును అనుభవించుటకు మరలా ఈ జీవులు (మాతృ) గర్భముల నుండి పుడతారు. పుట్టినవారు మరణిస్తారు. మళ్లీ పుడతారు. మళ్లీ మరణిస్తూ వుంటారు. ఇలా ఈ ఘోరమైన సంసారమునందు విశ్రాంతి అన్న మాట ఎరుగక నిరంతరం పరిభ్రమిస్తూనే వుంటారు.

**జీవత్వం దుఃఖసర్వస్వమ్**
**తదిదం మలకల్పితమ్ ।**
**నిరస్యతే గురోర్బోధాత్**
**జ్ఞానశక్తిః ప్రకాశతే ॥ 18-17**

ఆణవాదిమలముల ప్రభావముతో కల్పించబడిన దుఃఖమునే సర్వస్వముగా గలిగిన ఈ జీవభావము గురువుయొక్క ప్రబోధముతో నివారించబడి సాధకునిలో జ్ఞానశక్తిని ప్రకాశింపచేయును.

ఇతి ఆత్మస్థలం పరిసమాప్తమ్ ।
ఆత్మస్థలము ముగిసినది.

## *73. అథ అంతరాత్మస్థలమ్*
### అంతరాత్మస్థలము

**యదా నిరస్తం జీవత్వమ్**
**భవేద్ గుర్వనుబోధతః ।**
**తదాంతరాత్మభావోఽపి**
**నిరస్తస్య భవేద్ ధ్రువమ్ ॥ 18-18**



గురుబోధతో ఎప్పుడు ఆత్మస్థలీయసాధకునికి జీవత్వభావము తొలుగునో అప్పుడు నిరాకరించబడిన జీవత్వభావమున్న అతనికి నిశ్చయముగా అంతరాత్మభావము ఆవిర్భవించును.

**దేహస్థితోఽప్యయం జీవో**
**దేహసంగవివర్జితః ।**
**బోధాత్పరాత్మభావిత్వాత్**
**అంతరాత్మేతి కీర్తితః ॥ 18-19**

ఈ జీవుడు దేహములో వున్నప్పటికీ గురుబోధతో సిద్ధించిన స్వస్వరూపజ్ఞానప్రభావముతో, దేహసంబంధము లేనివాడై పరాత్మభావమును కలిగి 'అంతరాత్మ' అని అని పిలువబడుచున్నాడు.

**ఆత్మాంతరాలవర్తిత్వాత్**
**జీవాత్మపరమాత్మనోః ।**
**యోగాదుభయధర్మాణామ్**
**అంతరాత్మేతి కీర్తితః ॥ 18-20**

(ఈ ఆత్మస్వరూపుడైన జీవుడు), జీవాత్మపరమాత్మల ఇద్దరి మధ్యన వున్నందున ఆ ఇరువురి ధర్మములతో కూడుకొని వున్నందున, (కర్తృత్వ భోక్తృత్వభావములు జీవాత్మ ధర్మములు. సాక్షిరూపముగా వుండుట పరమాత్మ ధర్మము) అతను 'అంతరాత్ముడ'ని పిలువబడుచున్నాడు.

**అహంకారస్య సంబంధాత్**
**మనుష్యత్వాదివిభ్రమః ।**

**న స్వభావ ఇతి జ్ఞానాత్**
**అంతరాత్మేతి కథ్యతే ॥ 18-21**

(జీవాత్మునిలో) మనుష్యత్వాది భ్రాంతి వున్నందువలననూ, అహంకార సంబంధము వుండుటవలనను, అంతేకాదు అది స్వాభావికమైనది కాదన్న జ్ఞానము వుండుట చేతను, ఇతను 'అంతరాత్మ' అని చెప్పబడుచున్నాడు.

**యథా పద్మపలాశస్య**
**న సంగో వారిణా భవేత్ ।**
**తథా దేహజుషోఽప్యస్య**
**న శరీరేణ సంగతిః ॥ 18-22**

తామరాకు ఎట్లు నీటియందున్ననూ నీటి సంబంధము కలిగి వుండదో, అటులనే ఈ 'అంతరాత్మ' దేహమునందున్ననూ, శరీరసంబంధము అతనికి వుండదు. (అతడు దేహధర్మములను తనపై ఆరోపించుకొనడు).

**నీడస్థితో యథా పక్షీ**
**నీడాద్భిన్నః ప్రదృశ్యతే ।**
**దేహస్థితస్తథాత్మాయమ్**
**దేహాదన్యః ప్రకాశ్యతే ॥ 18-23**

గూటిలోని పక్షి ఎలా గూడు కన్నా వేరుగా కనబడునో అదేవిధముగా దేహమునందున్న 'అంతరాత్మ' దేహము కన్నా వేరుగా ప్రకాశించును.



**ఆచ్ఛాద్యతే యథా చంద్రో**
**మేఘైరాసంగవర్జితైః ।**
**తథాత్మా దేహసంఘాతైః**
**అసంగపరివేష్టితః ॥ 18-24**

చంద్రుడు ఎలా తనను తాకని (స్పర్శించని) మేఘముల చేత ఆవరించబడుచున్నాడో అదేవిధముగా జీవభావమును తొలగించుకున్న 'అంతరాత్మ' స్థూలాది గుణసంబంధములు లేకున్ననూ వాటిచేత ఆవరించబడుచున్నాడు.

**నిర్మమో నిరహంకారో**
**నిరస్తోపాధివిప్లవః ।**
**దేహస్థోఽపి సదా హ్యాత్మా**
**శివం పశ్యతి యోగతః ॥ 18-25**

'ఈ అంతరాత్మ', దేహమునందే వున్ననూ, అహంకార మమకారములు లేనివాడై, దేహాది వుపాధుల ప్రభావములకు లొంగక ఎల్లప్పుడూ యోగమార్గమున శివుడినే దర్శించుచుండును.

**భోక్తృభోజ్యపరిత్యాగాత్**
**ప్రేరకస్య ప్రసాదతః ।**
**భోక్తృతాభావగలితః**
**స్ఫురత్యాత్మా స్వభావతః ॥ 18-26**

ఈ 'అంతరాత్మ', (పూర్వ దశయందలి) భోక్తృత్వాది ధర్మములను భోజ్యములైన విషయములను పరిత్యాగము చేసినందువలనను మరియు ప్రేరకుడైన ఈశ్వరుని అనుగ్రహముచేతను తన భోక్తృభావము వదిలించుకుని (సహజమైన) స్వస్వరూపముతో ప్రకాశించుచుండును.

**సర్వేషాం ప్రేరకత్వేన**
**శంభురంతఃస్థితః సదా ।**
**తత్పరిజ్ఞానయోగేన**
**యోగీ నందతి ముక్తవత్ ॥ 18-27**

లోకమునందలి అందరిలోనూ శంభువు ప్రేరకుడై హృదయస్థానములో సదా నివసించుచుండును. ఆ శంభువును అనుసంధానము చేయు జ్ఞానమును సంపాదించుకున్న అంతరాత్మయోగి ముక్తునివలె ఎల్లప్పుడూ ఆనందముగా వుండును.

ఇతి అంతరాత్మస్థలం పరిసమాప్తమ్ ।
అంతరాత్మస్థలము ముగిసినది.

## 74. అథ పరమాత్మస్థలమ్
### పరమాత్మస్థలము

**నిర్ధూతే తత్ప్రబోధేన**
**మలే సంసారకారణే ।**
**సామరస్యాత్ పరాత్మస్థాత్**
**పరమాత్మాయముచ్యతే ॥ 18-28**



(అంతరాత్మస్థలీయుడైన యోగికి) శివాద్వైత(జ్ఞాన)ప్రబోధముతో సంసారకారణమైన మల(త్రయ)ము (పూర్తిగా) తొలగిపోయి పరమాత్మునితో సామరస్యస్థితిని పొందినప్పుడు అతడు 'పరమాత్మ'అని పిలువబడుచున్నాడు.

**సర్వేషామాత్మభేదానామ్**
**ఉత్కృష్టత్వాత్ స్వతేజసా ।**
**పరమాత్మా శివః ప్రోక్తః**
**సర్వగోఽపి ప్రకాశవాన్ ॥ 18-29**

అనేక భేదములతో కూడుకున్న ఇతర ఆత్మలకన్నా, తన స్వప్రకాశముచేత ఉత్కృష్టతను సాధించుకుని సర్వవ్యాపకుడు సర్వప్రకాశకుడు అయిన శివుడు (శివయోగి) పరమాత్ముడని చెప్పబడినాడు.

**బ్రహ్మాండబుద్బుదస్తోమా**
**యస్య మాయామహోదధౌ ।**
**ఉన్మజ్జంతి నిమజ్జంతి**
**పరమాత్మా స ఉచ్యతే ॥ 18-30**

ఎవని మాయ అను మహాసముద్రములో బ్రహ్మాండములు బుడగల సమూహమువలె మునుగుతూ తేలుతూ వున్నవో, అతడే 'పరమాత్మ' అని పిలువబడినాడు.

**యస్మిన్ జ్యోతిర్గణాః సర్వే**
**స్ఫులింగా ఇవ పావకాత్ ।**
**ఉత్పత్య విలయం యాంతి**
**తద్రూపం పరమాత్మనః॥ 18-31**

ఏ పరవస్తువునుండి సమస్త జీవుల తేజస్సమూహములు అగ్ని నుండి వెలువడు వెలుగు రవ్వల వలె పుట్టి నశించుచున్నవో అదియే పరమాత్ముని స్వరూపము.

**యస్మిన్ సమస్తవస్తూని**
**కల్లోలా ఇవ వారిధౌ ।**
**సంభూయ లయమాయాంతి**
**తద్రూపం పరమాత్మనః ॥ 18-32**

ఏ పరతత్త్వమునందు (పృథ్వ్యాది) సమస్త వస్తువులు సముద్రము నందలి తరంగముల (అలల) వలె పైకెగసి మరలా అందులోనే విలయమును పొందుచున్నవో అదియే పరమాత్ముని స్వరూపము.

**నిరస్తమలసంబంధమ్**
**నిఃశేషజగదాత్మకమ్ ।**
**సర్వతత్త్వోపరి ప్రోక్తమ్**
**స్వరూపం పరమాత్మనః ॥ 18-33**

ఆణవాది మలసంబంధములు లేనటువంటి, సకల జగత్తుకు ఆత్మస్వరూపమైనటువంటి, సర్వతత్త్వములకు అతీతమైనటువంటి ఏ స్వరూపము వున్నదో అదియే పరమాత్మస్వరూపము.

**యథా వ్యాప్య జగత్సర్వమ్**
**స్వభాసా భాతి భాస్కరః ।**



**తథా స్వశక్తిభిర్వ్యాప్య**
**పరమాత్మా ప్రకాశతే ॥ 18-34**

ఎట్లు సూర్యుడు తన ప్రకాశముతో జగత్తునంతటినీ వ్యాపించి ప్రకాశించుచున్నాడో అటులనే పరమాత్ముడు తన శక్తులతో జగత్తునంతా వ్యాపించి ప్రకాశించుచున్నాడు.

**విశ్వతో భాసమానోఽపి**
**విశ్వమాయావిలక్షణః ।**
**పరమాత్మా స్వయంజ్యోతీ-**
**రూపో జీవాత్మనాం భవేత్ ॥ 18-35**

విశ్వమాయా విలక్షణుడైన ఈ పరమాత్ముడు విశ్వమునంతటినీ ప్రకాశింపజేయుచున్ననూ, స్వయంజ్యోతిస్వరూపుడైన తాను జీవాత్మలందరిలోను ప్రకాశించుచున్నాడు.

ఇతి పరమాత్మస్థలం పరిసమాప్తమ్ ।

పరమాత్మస్థలము ముగిసినది.

### *75.* అథ నిర్దేహాగమస్థలమ్

### నిర్దేహాగమస్థలము

**దేహినోఽపి పరాత్మత్వ-**
**భావినో నిరహంకృతేః ।**
**నిరస్తదేహధర్మస్య**
**నిర్దేహాగమ ఉచ్యతే ॥ 18-36**

పరమాత్మతత్త్వమును భావించు(అనుభవించు శివ)యోగి తాను దేహమును ధరించివున్ననూ, (స్థూలత్వ,కృశత్వాది) దేహధర్మములను పరిహరించుకుని నిరంహకారస్థితిలో వున్నందున ఆ యోగి 'నిర్దేహాగము'డని పిలువబడినాడు.

**గలితే మమతాహంతే**
**సంసారభ్రమకారణే ।**
**పరాహంతా ప్రవిష్టస్య**
**కుతో దేహః కుతో రతిః ॥ 18-37**

సంసారభ్రమకు కారణమైన అహంకార మమకారములు పూర్తిగా తొలగిపోయినపుడు, పరాహంతాస్థికి చేరుకున్న యోగికి దేహము గాని, ఆ దేహముపైన ప్రేమగాని ఎట్లు వుండును?

**కేవలే నిష్ప్రపంచౌఘే**
**గంభీరే చిన్మహోదధౌ ।**
**నిమగ్నమానసో యోగీ**
**కథం దేహం విచింతయేత్ ॥ 18-38**

చరాచరాత్మకమైన ప్రపంచ ప్రవాహములేని, అగాధమైన (గంభీరమైన) చైతన్య(జ్ఞాన)మనే మహాసముద్రములో మునిగిన మనసు గల యోగి (తన) దేహమును గురించి ఎలా ఆలోచించగలడు?

**అపరిచ్ఛేద్యమాత్మానమ్**
**చిదంబరమితి స్మరన్ ।**



**దేహయోగేఽపి దేహస్థైః**
**వికారైర్న విలిప్యతే ॥ 18-39**

తనను అపరిచ్ఛేద్యమైన (దేశ-కాల-వస్తు పరిచ్ఛేదములు లేని అఖండమైన) చిదాకాశముగా భావించు ఈ యోగికి దేహసంబంధమున్ననూ, దేహమునకు సంబంధించిన (షడ్భావ) వికారముల వలన గాని, ఇంద్రియ వికారముల వలన గాని కప్పివేయబడడు (ప్రభావితుడుకాడు).

**అఖండసంవిదాకారమ్**
**అద్వితీయం సుఖాత్మకమ్ ।**
**పరమాకాశమాత్మానమ్**
**మన్వానః కుత్ర ముహ్యతి ॥ 18-40**

అఖండజ్ఞానస్వరూపము, అద్వితీయము, ఆనందస్వరూపము పరమాకాశస్వరూపము అయిన పరమాత్ముడే తానని తెలుసుకున్న యోగి ఏ దేహము పట్ల మోహితుడవుతాడు?

**ఉపాధివిహితా భేదా**
**దృశ్యంతే చైకవస్తుని ।**
**ఇతి యస్య మతిః సోఽయమ్**
**కథం దేహమితో భవేత్ ॥ 18-41**

ఒక్కటే అయిన అఖండవస్తువునందు (వివిధ) ఉపాధుల చేతనే భేదములు కనపించుచున్నవి. అని తెలుసుకున్న యోగి ఎలా దేహాదుల చేత

పరిచ్ఛిన్న(తాను వేరను)భావనను పొందగలడు? (అఖండమైన ఆకాశము ఘటమఠాది ఉపాధుల చేత వేరువేరుగా వ్యవహరించబడినట్లే దేహాది ఉపాధులచేత, ఆత్మకూడా వేరువేరుగా లోకమున వ్యవహరించబడుచున్నదని తెలుసుకొనవలెను).

**భేదబుద్ధిః సమస్తానామ్**
**పరిచ్ఛేదస్య కారణమ్ ।**
**అభేదబుద్ధౌ జాతాయామ్**
**పరిచ్ఛేదస్య కా కథా ॥ 18-42**

(జీవులు) అందరికీ వారియందలి భేదబుద్ధియే పరిమిత వ్యవహారమునకు కారణమగుచున్నది. (పరమాత్మ స్వరూపమును తెలుసుకొని) అతనితో ఐక్య(అభేద)బుద్ధి కలిగిన తరువాత (పరిచ్ఛేదము) పరిమితమను మాటకు చోటెక్కడ?

**శివోఽహమితి యస్యాస్తి**
**భావనా సర్వగామినీ ।**
**తస్య దేహేన సంబంధః**
**కథం స్యాదమితాత్మనః ॥ 18-43**

'నేను శివుడ'ను భావన ఏ యోగికి కలుగుచున్నదో అటువంటి అఖండ పరమాత్మస్వరూపుడైనవానికి దేహసంబంధమెట్లు కలుగును?

ఇతి నిర్దేహాగమస్థలం పరిసమాప్తమ్ ।
నిర్దేహాగమస్థలము ముగిసినది.



## 76. అథ నిర్భావాగమస్థలమ్

### నిర్భావాగమస్థలము

**వ్యతిరేకాత్ స్వరూపస్య**
**భావాంతరనిరాకృతే ।**
**భావో వికారనిర్ముక్తో**
**నిర్భావాగమ ఉచ్యతే ॥ 18-44**

(ఇంతకు ముందు నిర్దేహాగమస్థలమునందు చెప్పిన) తన స్వరూపమునకు వ్యతిరేకములయిన ఇతర భావములచేత నిరాకరించబడిన మరియు ఇంద్రియవికారముల నుండి విడువడిన భావము ఏది కలదో అదియే 'నిర్భావాగమ'స్థలమని చెప్పబడినది.

**అహం బ్రహ్మేతి భావస్య**
**వస్తుద్వయసమాశ్రయః ।**
**ఏకీభూతస్య చిద్వ్యోమ్ని**
**తదభావో వినిశ్చితః ॥ 18-45**

'అహం బ్రహ్మాస్మి' (నేనే బ్రహ్మమైవున్నాను) అను భావము నందు 'అహం' మరియు 'బ్రహ్మ' అను రెండు వస్తువులున్నవి. అయితే చిదాకాశములో ఐక్యుడైన ఈ యోగికి ఆ భావముయొక్క అభావము నిశ్చయంగా తెలిసివుండును (అంటే 'అహం బ్రహ్మాస్మి', 'శివోఽహం' అను భావనలు లేని ఆ యోగియొక్క స్థితియే 'నిర్భావాగమస్థితి'యని తెలియవలెను.)

**ఏకభావనిరూఢస్య**
**నిష్కలంకే చిదంబరే ।**
**క్వ జాతివాసనాయోగః**
**క్వ దేహిత్వం పరిభ్రమః ॥ 18-46**

నిష్కలంకమైన చిదాకాశములో తాదాత్మ్యభావనను పొందిన నిర్భావాగమయోగికి జాతివాసనల సంబంధమెలా కలుగుతుంది? అలాగే దేహధారికి వుండే జననమరణరూపసంసారచక్రభ్రమణమెలా వుంటుంది? (వుండదు అని తాత్పర్యం).

**శూన్యే చిదంబరే స్థానే**
**దూరే వాఙ్మానసాధ్వనః ।**
**విలీనాత్మా మహాయోగీ**
**కేన కిం వాఽపి భావయేత్ ॥ 18-47**

మనోవాక్కులకు (అందని) దూరంలో అగోచరమైన, శూన్యమైన చిదాకాశములో తాదాత్మ్యతను పొందిన మహాయోగి దేని నుండి దేనిని భావించవలెను?

**అవిశుద్ధే విశుద్ధే వా**
**స్థలే దీప్తిర్యథా రవేః ।**
**పతత్యేవం సదాద్వైతీ**
**సర్వత్ర సమవృత్తిమాన్ ॥ 18-48**



అది పరిశుద్ధప్రదేశమైనా అపరిశుద్ధప్రదేశమైనా అన్ని చోట్లా ఎలా సూర్యుడు తన కిరణాలను సమానముగా ప్రసరింపచేయుచున్నాడో అలాగుననే శివాద్వైతి కూడా ఎల్లప్పుడు అన్ని చోట్లా ఒకే విధమైన ప్రవృత్తిని కలిగివుంటాడు.

**న బిభేతి జరామృత్యోః**
**న క్షుధాయా వశం వ్రజేత్ ।**
**పరిపూర్ణనిజానందమ్**
**సమాస్వాదన్ మహాసుఖీ ॥ 18-49**

ఈ నిర్భావాగమయోగి ముసలితనమునకు మరణమునకు వెరువడు. ఆకలిదప్పులవశం కాడు. పరిపూర్ణమైన నిజానందమును ఆస్వాదించుచూ మహాసుఖమునను భవించుచూ వుంటాడు.

**కుతో భావః కుతశ్చిత్తమ్**
**కుతః సంకల్పవాసనా ।**
**నిస్తరంగే చిదాంబోధౌ**
**విలీనస్య మహాత్మనః ॥ 18-50**

క్షుధ – తృష్ణ–హర్ష–విషాద–జనన–మరణమను (షడూర్మలు) అలలు లేని చైతన్య సముద్రములో విలీనుడైన (మునిగిన) మహాత్ముడయిన యోగికి భావమెక్కడిది? చిత్తమెక్కడిది? సంకల్పవాసనలు మాత్రం ఎలా కలుగుతాయి?

ఇతి నిర్భావాగమస్థలం పరిసమాప్తమ్ ।
నిర్భావాగమస్థలము ముగిసినది.

## 77. అథ నష్టాగమస్థలమ్

### నష్టాగమస్థలము

**భేదశూన్యే మహాబోధే**
**జ్ఞాత్రాదిత్రయహీనకః ।**
**జ్ఞానస్య నష్టభావేన**
**నష్టాగమ ఇహోచ్యతే ॥ 18-51**

భేదశూన్య (రహిత)మయిన (శివాద్వైతరూపమయిన) మహాజ్ఞానమునందు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను త్రిపుటి వ్యవహారముండదు. ఇట్లు త్రిపుటిభావనలు నశించిన ఆ జ్ఞానము 'నష్టాగమ'మని పిలువబడుచున్నది.

**అద్వైతవాసనావిష్ట-**
**చేతసాం పరయోగినామ్ ।**
**పశ్యతామంతరాత్మానమ్**
**జ్ఞాతృత్వం కథమన్యథా ॥ 18-52**

అద్వైతవాసన (అంతా శివమయమనుజ్ఞానము)తో నిండిన మనసును గలిగి, తన హృదయమునందు తన స్వరూపమునే దర్శించుకొను పరమయోగులకు మరో జ్ఞాతృత్వం ఎలా కలుగుతుంది?

**అకర్తాఽహమవేత్తాఽహమ్**
**అదేహోఽహం నిరంజనః ।**



**ఇతి చింతయతః సాక్షాత్**
**సంవిదేవ ప్రకాశతే ॥ 18-53**

నేను కర్తను కాను, నేను ప్రపంచమును తెలిసినవాడను కాను, నేను దేహమును కాను, నేను నిరంజనుడను (దోషరహితుడను)' అని నిరంతరము భావించు ఈ నష్టాగమస్థలయోగికి కేవలం సాక్షాత్తు శివజ్ఞానమొక్కటే ప్రకాశించు చుండును.

**నిరస్తభేదజల్పస్య**
**నిరీహస్య ప్రశామ్యతః ।**
**స్వే మహిమ్ని విలీనస్య**
**కిమన్యజ్జ్ఞేయముచ్యతే ॥ 18-54**

వాద-జల్ప-వితండములను భేదములతో కూడుకున్న వాగ్వ్యవహారము లేనివాడు, కోరికలు లేనివాడు, ప్రశాంతచిత్తుడు, తనలో తాను లీనమైన ఈ యోగికి వేరు జ్ఞేయము (తెలియదగినది)ఏమి వుండును?

**ఏకీభూతే నిజాకారే**
**సంవిదా నిష్ప్రపంచయా ।**
**కేన కిం వేదనీయం తత్**
**వేత్తా కః పరిభాష్యతే ॥ 18-55**

నిరాకారుడు, నిష్ప్రపంచరూపుడు అయిన పరమాత్మనియందు తన జ్ఞానముచే ఏకీభూతుడయిన(సమరసుడయిన) యోగికి తెలియదగిన దేమున్నది? తెలుసుకొనువాడెవ్వడు? తెలియజేయు వాడెవ్వడు?

(జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములను త్రిపుటి నశించును).

**మహాసత్తా మహాసంవిద్**
**విశ్వరూపా ప్రకాశతే ।**
**తద్వినా నాస్తి వస్త్వేకమ్**
**భేదబుద్ధిం విముంచతః ॥ 18-56**

భేదబుద్ధిని (పూర్తిగా) వదలిపెట్టిన యోగికి మహాసత్తా (సద్రూపము) రూపమైన, మహాసంవిద్రూపమైన బ్రహ్మచైతన్యమే విశ్వరూపముగా ప్రకాశించును. అతనికి ఒక్క బ్రహ్మచైతన్యము దప్ప మరియొక వస్తువు (వుండనే) వుండదు.

*ఇతి నష్టాగమస్థలం పరిసమాప్తమ్ ।*
నష్టాగమస్థలము ముగిసినది.

## *78.* అథ ఆదిప్రసాదిస్థలమ్

### ఆదిప్రసాదిస్థలము

**సర్వాధిష్ఠాతృకః శంభుః**
**ఆదిస్తస్య ప్రసాదతః ।**
**ఆదిప్రసాదీత్యుక్తోఽయమ్**
**నిర్వికారపదే స్థితః ॥ 18-57**

సమస్తవిశ్వమునకు అధిష్ఠాతృవయినవాడు శంభువు. అలాగే అన్నిటికీ ఆదికూడా అతనే. అతని ప్రసాదమే (అనుగ్రహమే) ఆదిప్రసాదము. ఆ ఆదిప్రసాదమును పొంది నిర్వికారస్థితిలో వున్న యోగియే ఆదిప్రసాది అనబడుచున్నాడు.



**అనేకజన్మశుద్ధస్య**
**నిరహంకారభావినః ।**
**అప్రపంచస్యాదిదేవః**
**ప్రసీదతి విముక్తయే ॥ 18-58**

అనేకజన్మములందు చేసిన సాధనతో పరిశుద్ధు (దేహాభిమానశూన్యు) డై, నిరహంకారభావముతో అప్రపంచి (ప్రాపంచిక భేదభావరహితుడు) అయిన యోగికి ముక్తిని ప్రసాదించటానికి ఆదిదేవుడయిన ఆ పరమాత్ముడు ప్రసన్నుడౌతాడు.

**శివప్రసాదసంపత్త్యా**
**శివభావముపేయుషి ।**
**శివాదన్యజ్జగజ్జాలమ్**
**దృశ్యతే న చ దృశ్యతే ॥ 18-59**

శివుని ప్రసాదసౌభాగ్యము చేత శివభావమును సిద్ధింపచేసుకున్న ఈ యోగికి జగజ్జాలమంతా శివుని కన్నా వేరైనదిగా కనిపించదు. అతడు (కూడా) శివస్వరూపముగానే కనబడతాడు.

**శంభోః శివప్రసాదేన**
**సంసారచ్ఛేదకారిణా ।**
**మోహగ్రంథిం వినిర్భిద్య**
**ముక్తిం యాంతి వివేకినః ॥ 18-60**

వివేకవంతు(శివాద్వైతజ్ఞానసంపన్ను)లైనవారు, సంసార నివృత్తిని ప్రసాదించు శివుని మంగళకరమైన అనుగ్రహముచేత మోహగ్రంథులను త్రెంచుకొని ముక్తిని పొందుచున్నారు.

**వినా ప్రసాదమీశస్య**
**సంసారో న నివర్తతే ।**
**వినా సూర్యోదయం లోకే**
**కుతః స్యాత్ తమసో లయః ॥ 18-61**

లోకమున సూర్యోదయము కానిదే చీకటి ఎలా తొలగదో, అటులనే శివుని ప్రసాదము లేనిదే సంసారము తొలగదు.

**సర్వానుగ్రాహకః శంభుః**
**కేవలం కృపయా ప్రభుః ।**
**మోచయేత్ సకలాన్ జంతూన్**
**న కించిదిహ కారణమ్ ॥ 18-62**

అందరినీ అనుగ్రహించువాడు శంభువు. అతడు కేవలం తన కృపచేతనే జీవులందరికీ ముక్తిని ప్రసాదించుచున్నాడు. ఈ (ముక్తిని ప్రసాదించు) విషయములో మరో కారణమంటూ లేనే లేదు.

ఇతి ఆదిప్రసాదిస్థలం పరిసమాప్తమ్ ।
ఆదిప్రసాదిస్థలము ముగిసినది.



## *79.* అథ అంత్యప్రసాదిస్థలమ్
### అంత్యప్రసాదిస్థలము

**లయః సర్వపదార్థానామ్**
**అంత్య ఇత్యుచ్యతే బుధైః ।**
**ప్రసాదోఽనుభవస్తస్య**
**తద్వానంత్యప్రసాదవాన్ ॥ 18-63**

అన్ని పదార్థములు ఎందులో లయమగుచున్నవో దానినే (వీరశైవ)శాస్త్రజ్ఞులు 'అంత్యమని' అన్నారు. ఆ అంత్యతత్త్వము యొక్క స్వాత్మరూపమైన అనుభవమే అంత్యప్రసాదము. దానిని పొందినవాడే అంత్యప్రసాది.

**దేవతిర్యఙ్మనుష్యాది**
**వ్యవహారవికల్పనా ।**
**మాయాకృతా పరే తత్త్వే**
**తల్లయే తత్క్షయో భవేత్ ॥ 18-64**

దేవతలు, పక్షులు, మనుష్యులు వంటి వ్యవహారభేదములు మాయ చేత కల్పించబడినవి. ఈ మాయ కూడా పరతత్త్వములో లయమైనపుడు ఇక భేదవ్యవహారమూ నాశనమగును.

**సాక్షాత్కృతే పరే తత్త్వే**
**సచ్చిదానందలక్షణే ।**

**క్వ పదార్థపరిజ్ఞానమ్**
**కుతో జ్ఞాతృత్వసంభవః ॥ 18-65**

సచ్చిదానందలక్షణమైన పరతత్త్వము (పరశివబ్రహ్మము) సాక్షాత్కారమైనపుడు తెలుసుకొనవలసిన పదార్థముల పరిజ్ఞానముగాని, తెలుసుకొనువాడు (జ్ఞాతృత్వము) వుండుట గాని ఎట్లు సంభవించును?

**పదార్థాః స్వప్నసందృష్టా**
**యథా బోధే లయం గతాః ।**
**తథా సంసారజాః భావా**
**లీయంతే బ్రహ్మబోధతః ॥ 18-66**

కలలో కనిపించిన వస్తువులు మేలుకున్న వెంటనే ఎలా మాయ (లయ)మగుచున్నవో అలాగుననే సంసారమువలన కలిగిన భావములు బ్రహ్మజ్ఞానము సిద్ధించిన మరుక్షణమే మాయ(లయ)మగుచున్నవి.

**సుషుప్తస్య యథా వస్తు**
**న కించిదపి భాసతే ।**
**తథా ముక్తస్య జీవస్య**
**న కించిద్వస్తు దృశ్యతే ॥ 18-67**

గాఢనిద్రలోనున్న మనిషికి బాహ్యప్రపంచమునందలి ఏ వస్తువు ఎలా కనిపించదో, అలాగుననే ముక్తుడైన జీవునికి ఏ వస్తువూ కనిపించదు.



**యథాకాశమవిచ్ఛిన్నమ్**
**నిర్వికారం స్వరూపతః ।**
**తథా ముక్తస్య జీవస్య**
**స్వరూపమవశిష్యతే ॥ 18-68**

ఆకాశము స్వరూపతః అవిచ్ఛిన్నముగా నిర్వికారముగా వున్నటులే ముక్తుడైన జీవుని యొక్క స్వరూపము కూడా అటులనే వుండును.

**న కించిదపి ముక్తస్య**
**దృశ్యం కర్తవ్యమేవ వా ।**
**సుఖస్ఫూర్తిస్వరూపేణ**
**నిశ్చలా స్థితిరుచ్యతే ॥ 18-69**

ముక్తుడైన జీవికి దృశ్యము (చూడవలసినది) కాని, కర్తవ్యము (చేయవలసినది) గాని ఏదీ వుండదు. అయితే అతడు పరిపూర్ణమైన ఆనందస్వరూపముతో నిశ్చలస్థితిలో వుండును.

**శివాద్వైతపరిజ్ఞాన-**
**శిథిలాశేషవస్తునః ।**
**కేవలం సంవిదుల్లాస -**
**దర్శినః కేన కో భవేత్ ॥ 18-70**

శివాద్వైతజ్ఞానప్రాప్తితో ప్రాపంచికవస్తువుల భేదభ్రాంతి శిథిలమై (తొలగి)పోగా నిరంతరము (సంవిదుల్లాసమును) జ్ఞానోత్కర్షతను అనుభవించు ఈ అంత్యప్రసాదికి ఎవరివల్లను ఏ ప్రయోజనము వుండదు.

ఇతి అంత్యప్రసాదిస్థలం పరిసమాప్తమ్ ।

అంత్యప్రసాదిస్థలము ముగిసినది.

## *80.* అథ సేవ్యప్రసాదిస్థలమ్

### సేవ్యప్రసాదిస్థలము

**సేవ్యో గురుః సమస్తానామ్**
**శివ ఏవ న సంశయః ।**
**ప్రసాదోఽస్య పరానంద-**
**ప్రకాశః పరికీర్త్యతే ॥ 18-71**

అందరికీ సేవ్యుడైన గురువు సాక్షాత్ శివుడే అయివున్నాడు. ఇందులో ఎటువంటి సందేహము లేదు. అతని ప్రసాదమే సేవ్యప్రసాదము. ఆ ప్రసాదము పరానందప్రకాశరూపమున నుండును.

**సేవ్యో గురుః స్మృతో హ్యస్య**
**ప్రసాదోఽనుభవో మతః ।**
**తదేకావేశరూపేణ**
**తద్వాన్ సేవ్యప్రసాదవాన్ ॥ 18-72**

శివస్వరూపుడైన గురువు అందరికీ సేవించదగినవాడు (సేవ్యుడు). ఇటువంటి గురువుయొక్క (ఉపదేశ) అనుభవము 'ప్రసాద'మని పిలువబడినది.



ఇటువంటి గురువును మరియు అతని ప్రసాదమును ఒకేవిధముగా చూడగలిగి, అనుభవించగలిగినవాడే 'సేవ్యప్రసాది' అని పిలువబడుచున్నాడు.

**గురుదేవః పరం తత్త్వమ్**
**పరతత్త్వం గురుః స్మృతః ।**
**తదేకత్వానుభావేన**
**న కించిదవశిష్యతే ॥ 18-73**

గురుదేవుడే పరతత్త్వము. పరతత్త్వమే శ్రీగురుదేవుడు. అందువలన ఆ రెండింటినీ ఐక్యానుసంధానం చేయుట వలన ఆ శివయోగికి (తాను తప్ప) వేరేదీ మిగలదు (వుండదు).

**అపరిచ్ఛేద్యమాత్మస్థమ్**
**అవాఙ్మనసగోచరమ్ ।**
**ఆనందం పశ్యతాం పుంసామ్**
**రతిరన్యత్ర కా భవేత్ ॥ 18-74**

మాటకు మనస్సుకు గోచరము కాని (తెలియని), పరిచ్ఛేదము కాని (అఖండమైన), ఆత్మానందమును అనుభవించు యోగికి మరొక వస్తువు పట్ల ఇష్టమెటుల ఏర్పడును?

**జ్ఞానామృతేన తృప్తస్య**
**కిమన్యైర్భోజ్యవస్తుభిః ।**
**జ్ఞానాదేవ పరానందమ్**
**ప్రకాశయతి సచ్ఛివః ॥ 18-75**

జ్ఞానామృతముచేత సంతృప్తుడైన యోగికి ఇతర భోజ్యవస్తువులవలన ప్రయోజనమేమి? అందువలన జ్ఞానము వలననే పరానందము ప్రకాశించునని శివుడే శ్రుతులయందు చెప్పియున్నాడు.

**ముక్తిరేవ పరా తృప్తిః**
**సచ్చిదానందలక్షణా ।**
**నిత్యతృప్తస్య ముక్తస్య**
**కిమన్యైర్భోగసాధనైః ॥ 18-76**

సచ్చిదానందాత్మకమైన ముక్తియే పరమోన్నతమైన (ఆనందము) తృప్తిని కలుగజేయును. అలా నిత్యతృప్తుడై ముక్తుడైన యోగికి ఇతర భోగసాధనముల వలన ఏమి ప్రయోజనము?

**న బాహ్యం కర్మ తస్యాస్తి**
**న చాంతర్నైవ కుత్రచిత్ ।**
**శివైక్యజ్ఞానరూఢస్య**
**దేహభ్రాంతిం విముంచతః ॥ 18-77**

శివైక్యజ్ఞానముతో దేహభ్రాంతిని పోగొట్టుకున్న యోగికి బాహ్యకర్మలు గాని, అంతరంగకర్మలు గాని లేదా ఇతరములయినయే కర్మలుగాని వుండనే వుండవు.

**న కర్మబంధే న తపోవిశేషే**
**న మంత్రయోగాభ్యసనే తథైవ ।**
**ధ్యానే న బోధే చ తథాత్మతత్త్వే**
**మనఃప్రవృత్తిః పరయోగభాజామ్॥ 18-78**

– (ఉపేంద్రవజ్రా)



పరశివబ్రహ్మముతో సామరస్యతను పొందిన ఈ సేవ్య ప్రసాదికి ఎటువంటి కర్మబంధములందుగాని, విశేషమైన తపస్సునందుగాని, మంత్ర–లయ–హఠ–రాజయోగముల వంటి యోగాభ్యాసముల యందుగాని, ధ్యానమునందుగాని మరియు ఎటువంటి బోధనాత్మకమైన వ్యవహారము నందుగాని మనఃప్రవృత్తి ఉండదు.

ఇతి సేవ్యప్రసాదిస్థలం పరిసమాప్తమ్ ।
సేవ్యప్రసాదిస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ ప్రాణలింగిస్థలాంతర్గత నవవిధలింగస్థలప్రసంగోనామ అష్టాదశః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో ప్రాణలింగిస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగమను పదునెనిమిదవ పరిచ్ఛేదము ముగిసినది.



# ఏకోనవింశః పరిచ్ఛేదః

## పంతొమ్మిదవ పరిచ్ఛేదము

*శరణస్థలాంతర్గతద్వాదశవిధలింగస్థలప్రసంగః*

శరణస్థలాంతర్గతద్వాదశవిధలింగస్థలప్రసంగము

**(97 శ్లోకములు)**

*V. అథ శరణస్థలమ్*
శరణస్థలము

*అగస్త్య ఉవాచ :*

స్థలభేదాః సమాఖ్యాతాః
ప్రాణలింగిస్థలాశ్రయాః ।
కథయ స్థలభేదం మే
శరణస్థలసంశ్రితమ్ ॥ 19-1

**అగస్త్యులవారి ప్రశ్న :**

(ఓ రేణుకగణేశ్వరుడా! లింగస్థలమునకు చెందిన) ప్రాణలింగిస్థలమునకు సంబంధించిన అవాంతర స్థలభేదములు చక్కగా తెలియుచేయుబడినవి. ఇపుడు శరణస్థలమునకు సంబంధించిన అవాంతరస్థలభేదములను నాకు వివరించవలసినదిగా కోరుతున్నాను.

*శ్రీరేణుక ఉవాచ :*

శరణస్థలమాశ్రిత్య
స్థలద్వాదశకం మయా ।
ఉచ్యతే నామ సర్వేషామ్
స్థలానాం శృణు తాపస ॥ 19-2

దీక్షాపాదోదకం పూర్వమ్
శిక్షాపాదోదకం తతః ।
జ్ఞానపాదోదకం చాథ
క్రియానిష్పత్తికం తతః ॥ 19-3

భావనిష్పత్తికం చాథ
జ్ఞాననిష్పత్తికం తతః ।
పిండాకాశస్థలం చాథ
బింద్వాకాశస్థలం తతః ॥ 19-4

మహాకాశస్థలం చాథ
క్రియాయాశ్చ ప్రకాశనమ్ ।
భావప్రకాశనం పశ్చాత్
తతో జ్ఞానప్రకాశనమ్ ।
స్వరూపం పృథగేతేషాం
కథయామి యథాక్రమమ్ ॥ 19-5

**శ్రీరేణుకులవారి సమాధానము :**

ఓ తాపసీ! శరణస్థలమునందు పంౖడెండు (అవాంతర) స్థలములున్నవి. వాటిని పేరుపేరున చెప్పబోవుచున్నాను ఆలకించుము. మొదటిది దీక్షాపాదోదకస్థలము. రెండవది శిక్షాపాదోదకస్థలము, మూడవది జ్ఞానపాదోదకస్థలము, నాలుగవది క్రియానిష్పత్తి స్థలము, అయిదవది భావనిష్పత్తి స్థలము, ఆరవది జ్ఞాననిష్పత్తి స్థలము, ఏడవది పిండాకాశస్థలము, ఎనిమిదవది బింద్వాకాశస్థలము, తొమ్మిదవది మహాకాశస్థలము, పదవది క్రియాప్రకాశస్థలము, పదకొండవది - భావప్రకాశస్థలము, పంౖడెండవది జ్ఞానప్రకాశస్థలము. వీటి స్వరూపములను వరుసగా చెప్పెదను.

## *81.* అథ దీక్షాపాదోదకస్థలమ్

### దీక్షాపాదోదకస్థలము

**దీక్షాయాఽపగతద్వైతమ్**
**యజ్జ్ఞానం గురుశిష్యయోః ।**
**ఆనందస్యైక్యమేతేన**
**దీక్షాపాదోదకం స్మృతమ్ ॥ 19-6**

సద్గురువుల నుండి సంప్రాప్తమైన చిన్మయదీక్షాప్రభావముతో గురుశిష్యులలోని ద్వైతభావన తొలగిపోయి వారిలో అంకురించిన అద్వైతజ్ఞానమువలన వారిద్దరిలోను ప్రకాశించు నిజానందపు ఐక్యస్థితి దీక్షాపాదోదకమని పిలువబడినది. (గురుశిష్యులు సమానమైన సామరస్యస్థితిని అనుభవించుస్థలము దీక్షాపాదోదకస్థలము).



**అథవా పాదశబ్దేన**
**గురురేవ నిగద్యతే ।**
**శిష్యశ్చోదకశబ్దేన**
**తయోరైక్యం తు దీక్షయా ॥ 19-7**

లేదా 'దీక్షాపాదోదక' శబ్దమునందలి 'పాద' శబ్దమునకు గురువు అని 'ఉదక' శబ్దమునకు శిష్యుడు అని అర్థములు చెప్పవలెను. వారిద్దరి ఐక్యము (ఏకత్వము) చిన్మయ దీక్ష(శబ్దము)వలన కలుగుచున్నది.

**పరమానంద ఏవోక్తః**
**పాదశబ్దేన నిర్మలః ।**
**జ్ఞానం చోదకశబ్దేన**
**తయోరైక్యం తు దీక్షయా ॥ 19-8**

'పాద' శబ్దమునకు నిర్మలమైన పరమానందమని, 'ఉదక' శబ్దమునకు జ్ఞానము అని అర్థము చెప్పబడినది. ఈ రెంటి ఐక్యము 'దీక్ష' (శబ్దము) వలన సిద్ధించుచున్నది.

**పరసంవిత్ప్రకాశాత్మా**
**పరమానందభావనామ్ ।**
**అధిగమ్య మహాయోగీ**
**న భేదం క్వాపి పశ్యతి ॥ 19-9**

దీక్షాపాదోదక సంపన్నుడైన మహాయోగి అతిశ్రేష్ఠమైన జ్ఞాన ప్రకాశాత్మకమైన ఆనందస్థితిని పొంది భేదభావమునెక్కడా చూడదు. (భేదబుద్ధిని తొలగించుకుంటాడు).

**దేశకాలాద్యవచ్ఛేద -**
**విహీనం నిత్యనిర్మలమ్ ।**
**ఆనందం ప్రాప్య బోధేన**
**నాన్యత్ కాంక్షతి సంయమీ ॥ 19-10**

శివాద్వైతబోధచేత దేశ-కాల-వస్తు పరిచ్ఛేదములేని, (అఖండమైన) నిత్యము నిర్మలము అయిన పరమానందస్వరూపము పొంది, సంయమి అయిన దీక్షాపాదోదకస్థలీయ యోగి లోకమునందు ఏ వస్తువును అపేక్షించదు.

**జ్ఞానామృతమపి స్వచ్ఛమ్**
**గురుకారుణ్యసంభవమ్ ।**
**ఆస్వాద్య రమతే యోగీ**
**సంసారామయవర్జితః ॥ 19-11**

గురుకరుణచే లభించిన నిర్మలమైన జ్ఞానామృతమును ఆస్వాదించిన ఈ యోగి సంసారరోగము నుండి ముక్తుడై ఆనందముననుభవించుచుండును.

ఇతి దీక్షాపాదోదకస్థలం పరిసమాప్తమ్ ।
దీక్షాపాదోదకస్థలము ముగిసినది.



## *82.* అథ శిక్షాపాదోదకస్థలమ్

### శిక్షాపాదోదకస్థలము

**గురుశిష్యమయం జ్ఞానం**
**శిక్షా యోగినమీర్యతే ।**
**తయోః సమరసత్వం హి**
**శిక్షాపాదోదకం స్మృతమ్ ॥ 19-12**

శ్రీగురుని ఉపదేశాత్మకమైన శిక్షణ వలన గురుశిష్యులిరువురి యందు జనించిన సామరస్యజ్ఞానమే శిక్షాపాదోదకమనబడుచున్నది.

**మథితాచ్ఛాస్త్రజలధేః**
**యుక్తిమంథానవైభవాత్ ।**
**గురుణా లభ్యతే బోధ-**
**సుధా సుమనసాం గణైః ॥ 19-13**

శివాగమశాస్త్రమను సముద్రమును యుక్తిరూపమైన మందరపర్వతమను కవ్వముతో చిలికినపుడు శిక్షాగురువు (అనే బృహస్పతి) ద్వారా శుద్ధమనస్కులైన (దీక్షాపాదోదకస్థలీయులైన) యోగులను దేవతలకు శివాద్వైతజ్ఞానమను అమృతము లభించును. (శిక్షాగురువుతో శాస్త్రచింతనము చేసినపుడు శివాద్వైతజ్ఞానము సిద్ధించును).

**జ్ఞానచంద్రసముద్భూతామ్**
**పరమానందచంద్రికామ్ ।**

**పశ్యంతి పరమాకాశే**
**ముక్తిరాత్రౌ మహాధియః ॥ 19-14**

మహాధీమంతులైన శిక్షాపాదోదకస్థలయోగులు ముక్తి అను రాత్రిలో జ్ఞానచంద్రుని నుండి వెలువడిన పరమానందరూపమైన వెన్నెలను పరమాకాశరూపమైన తమ హృదయాకాశములో చూచు చుందురు.

**దృష్టే తస్మిన్ పరానందే**
**దేశకాలాదివర్జితే ।**
**ద్రష్టవ్యం విద్యతే నాన్యత్**
**శ్రోతవ్యం జ్ఞేయమేవ వా ॥ 19-15**

దేశకాలపరిచ్ఛేదములు లేనటువంటి పరమానందరూపమైన వెన్నెలను చూచిన ఆ యోగులకు చూడవలసిన వస్తువులుగాని, వినవలసిన జ్ఞానము కాని ఏదీ వుండదు.

**ఆత్మానందేన తృప్తస్య**
**కా స్పృహా విషయే సుఖే ।**
**గంగాజలేన తృప్తస్య**
**కూపతోయే కుతో రతిః ॥ 19-16**

ఆత్మానందముతో సంతృప్తులైన యోగులకు శబ్దస్పర్శాది సుఖముల పట్ల కోరికలెలా కలుగుతాయి? గంగాజలముతో సంతృప్తుడైన మానవునికి బావినీరు ఇష్టమగునా?

**యస్మిన్నప్రాప్తకల్లోలే**
**సుఖసింధౌ నిమజ్జతి ।**



**సామరస్యాన్మహాయోగీ**
**తస్య సీమా కుతో భవేత్ ॥ 19-17**

(రాగద్వేషములను)అలలు లేని (నిజానంద) సుఖసాగరములో సామరస్యభావముతో మునకలు వేయు మహాయోగికి ఎల్లలెలా వుంటాయి? అతడు నిస్సీముడై వుంటాడు.

**గురుప్రసాదచంద్రేణ**
**నిష్కలంకేన చారుణా ।**
**యన్మనః కుముదం నిత్యమ్**
**బోధితం తస్య కో భ్రమః ॥ 19-18**

నిష్కలంకుడు, సుందరుడు అయిన గురుప్రసాదచంద్రుని కిరణములచేత ఎవరి మనోకుముదము (కలువ) నిత్యము వికసించి వుండునో అటువంటి యోగికి భ్రమలెట్లు కలుగును?

ఇతి శిక్షాపాదోదకస్థలం పరిసమాప్తమ్ ।
శిక్షాపాదోదకస్థలము ముగిసినది.

### 83. అథ జ్ఞానపాదోదకస్థలమ్
### జ్ఞానపాదోదకస్థలము

**తదైక్యసంపదానంద-**
**జ్ఞానం జ్ఞానగురుర్మతః ।**

**తత్సామరస్యం శిష్యస్య**
**జ్ఞానపాదోదకం విదుః ॥ 19-19**

పరాత్పరవస్తువుయొక్క ఆనందస్వరూపమును తన అపరోక్షజ్ఞానముతో సంపాదించుకున్నవాడు 'జ్ఞానగురువని' పిలువబడినాడు. అటువంటి గురువు నుండి జ్ఞానమును పొందిన శిష్యుడు జ్ఞానవిషయమున గురువుతో సామరస్యస్థితిలో నుండు స్థితియే 'జ్ఞానపాదోదకస్థల'మని చెప్పబడినది.

**అవిద్యారాహునిర్ముక్తో**
**జ్ఞానచంద్రః సునిర్మలః ।**
**ప్రకాశతే పరాకాశే**
**పరానందమహాద్యుతిః ॥ 19-20**

శివాద్వైతజ్ఞానమను చంద్రుడు అవిద్య అను రాహువుయొక్క గ్రహణము నుండి విడువడినపుడు సునిర్మలము, పరమానందమను మహోజ్జ్వలమైన కాంతితో హృదయాకాశమున ప్రకాశించును.

**అజ్ఞానమేఘనిర్ముక్తః**
**పూర్ణజ్ఞానసుధాకరః ।**
**ఆనందజలధేర్వృద్ధిమ్**
**అనుపశ్యన్ విభాసతే ॥ 19-21**

శివాద్వైతజ్ఞానమను పూర్ణచంద్రుడు అజ్ఞానమను మేఘము నుండి వెలువడినవాడై, నిజానంద సముద్రమును వర్ధిల్లచేయుచూ ప్రకాశించును.



**జ్ఞానచంద్రోదయే జాతే**
**ధ్వస్తమోహతమోభరాః ।**
**పశ్యంతి పరమాం కాష్ఠామ్**
**యోగినః సుఖరూపిణీమ్ ॥ 19-22**

జ్ఞానచంద్రుడు ఉదయించినపుడు మోహమను చీకటి తొలగిపోగా (జ్ఞానపాదోదక)యోగులు పరమానందరూపమైన స్వస్వరూపములను చూచుకొను (దర్శించు)చున్నారు.

**మాయారజన్యా విరమే**
**బోధసూర్యే ప్రకాశితే ।**
**నిరస్తసర్వవ్యాపారః**
**చిత్రం స్వపితి సంయమీ ॥ 19-23**

మాయ అను చీకటి తొలగిపోగా, శివాద్వైతజ్ఞానసూర్యుని ప్రకాశముతో సంయమి అయిన యోగి తన సర్వబాహ్యేంద్రియ వ్యాపారములను కట్టి పెట్టి చక్కగా నిదురించుచున్నాడు. ఇదేమి చిత్రం? (ఆశ్చర్యం కదా!)

**అనాద్యవిద్యావిచ్ఛిత్తి-**
**వేలాయాం పరయోగినః ।**
**ప్రకాశతే పరానందః**
**ప్రపంచేన వినా కృతః ॥ 19-24**

అనాది అయిన అవిద్య తొలగిపోయినపుడు ఈ పరయోగికి ప్రపంచమేలేని ఆ స్థితిలో పరానందమే ప్రకాశించును.

**నిత్యానందే నిజాకారే**
**విమలే పరతేజసి ।**
**విలీనచేతసాం పుంసామ్**
**కుతో విశ్వవికల్పనా ॥ 19-25**

నిత్యానందము, నిజస్వరూపము, నిర్మలము అయిన పరశివబ్రహ్మతేజస్సులో మునిగిన చిత్తము గల వారికి (యోగులకు) ప్రాపంచిక కల్పనెలా కలుగుతాయి?

**కుతో బ్రహ్మ కుతో విష్ణుః**
**కుతో రుద్రః కుతో రవిః ।**
**సాక్షాత్కృతపరానంద-**
**జ్యోతిషః సామ్యకల్పనా ॥ 19-26**

పరమానందస్వరూపము, జ్యోతిస్వరూపము అయిన పరబ్రహ్మ తత్త్వమును అపరోక్షముగా సాక్షాత్కరించుకున్న యోగికి బ్రహ్మగాని, విష్ణువుగాని, రుద్రుడుగాని, సూర్యుడుగాని, వీరెవరూ అతనికి సమానులు కాజాలరు, కారు.

**అపరోక్షపరానంద-**
**విలాసస్య మహాత్మనః ।**



**బ్రహ్మవిష్ణ్వాదయో దేవా**
**విశేషాః సుఖబిందవః ॥ 19-27**

అపరోక్షమైన పరానందములో విహరించు (జ్ఞానపాదోదక సంపన్నుడైన) ఈ మహాత్ముని ఎదుట బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలందరు కేవలము చిన్న చిన్న సుఖబిందువులు మాత్రమే!

**యన్మాత్రాసహితం లోకే**
**వాంఛంతి విషయం నరాః ।**
**తదప్రమేయమానందమ్**
**పరమం కో న వాంఛతి ॥ 19-28**

ఈ లోకములో మానవులందరూ ఆ బ్రహ్మానందములోని ఒక చిన్న అంశతో రూపొందిన విషయసుఖములనే కోరుకొనుచున్నారు. కాని అంతులేని మహోన్నతమైన పరమానందమును ఎవరూ కోరుకొనుట లేదు.

ఇతి జ్ఞానపాదోదకస్థలం పరిసమాప్తమ్ ।
జ్ఞానపాదోదకస్థలము ముగిసినది.

## *84.* అథ క్రియానిష్పత్తిస్థలమ్
### క్రియానిష్పత్తిస్థలము

**పరకాయే క్రియాపత్తిః**
**కల్పితైవ ప్రకాశతే ।**

రజ్జౌ భుజంగవద్ యస్మాత్
క్రియానిష్పత్తిమానయమ్ ॥ 19-29

పరబ్రహ్మస్థితిని పొందిన పరకాయుడైన ఈ యోగి చేయు క్రియలు (కర్మలు), రజ్జువు (త్రాటి) యందలి పాము వలె కల్పితములై కనిపించును. ఇటువంటి కల్పితక్రియలు కలిగినవాడే 'క్రియానిష్పత్తిమాన్' అనబడినాడు.

జ్ఞానినాం యాని కర్మాణి
తాని నో జన్మహేతవః।
అగ్నిదగ్ధాని బీజాని
యథా నాంకురకారణమ్ ॥ 19-30

నిప్పులో కాల్చిన విత్తనములు మొలకెత్తుటకెలా సమర్థములు కావో (పనికిరావో) అలాగుననే శివాద్వైతజ్ఞాని చేయు కర్మలు అతని పునర్జన్మకు కారణములు కాజాలవు.

కర్మణా కిం కృతేనాపి
జ్ఞానినో నిరహంకృతేః ।
విక్రియా ప్రతిబింబస్య
కిం కరోతి హిమద్యుతేః ॥ 19-31

ప్రతిబింబములో కనిపించు కదలికలు (వికారములు) బింబరూపమైన చంద్రునిలో కనిపించనట్టుగానే, మూలాహంకారరహితుడైన ఈ క్రియానిష్పత్తి స్థలీయుడైన యోగి ఆచరించు కర్మలు, అతనికి ఎటువంటి ఫలములను కలిగింపజాలవు.



చంద్రస్య మేఘసంబంధాత్
యథా గమనకల్పనా ।
తథా దేహస్య సంబంధాత్
ఆరోప్యా స్యాత్ క్రియాఽఽత్మనః ॥ 19-32

ఆకాశములో కదులుతున్న మేఘముల సంబంధము వలన చంద్రుడు కదలుచున్నాడను భ్రమను కలుగచేసినట్టుగానే, ఈ క్రియానిష్పత్తిస్థలయోగి యొక్క సర్వకర్మలు అతని దేహసంబంధము వలన అతనిపైన ఆరోపించబడుచున్నవి.

జ్ఞానీ కర్మనిరూఢోఽపి
లిప్యతే న క్రియాఫలైః ।
ఘృతాదినా యథా జిహ్వా
భోక్త్రీ చాపి న లిప్యతే ॥ 19-33

నేయివంటి జిడ్డు పదార్థములను భుజించినను నాలుకకు జిడ్డుపదార్థములు అంటుకొననట్టుగానే, క్రియానిష్పత్తిస్థలీయుడైన యోగి కర్మలనాచరించిననూ వాటి ఫలములు అతని కంటవు.

నిరస్తోపాధిసంబంధే
జీవే యా యా క్రియాస్థితిః ।
సా సా ప్రతీతిమాత్రేణ
నిష్ఫలా చాత్ర లీయతే ॥ 19-34

మూలాహంకారరూపమైన ఉపాధిసంబంధము లేని యోగియొక్క కర్మలన్నియూ పైకి కనిపించునవి (ప్రతీతి)గా మాత్రమే వుండి, నిష్ఫలములై (అవి) అతనిలోనే లయమగును.

**గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్ వాఽపి**
**న నిష్కర్మాస్తి కశ్చన ।**
**స్వభావో దేహినాం కర్మ**
**జ్ఞానినాం తత్తు నిష్ఫలమ్ ॥ 19-35**

ప్రాణులకు నడవటం, నిలబడటం, నిదురించడం వంటి కర్మలు స్వాభావికములు (సప్రయోజనములు). లోకములోని ఏ జీవీ కర్మ (కదలిక) లేకుండా వుండదు. అయితే జ్ఞానులు చేయు కర్మలు మాత్రం వారికెటువంటి ఫలముల నివ్వజాలవు.

**పరిపూర్ణమహానంద-**
**భావినః శుద్ధచేతసః ।**
**న భవేత్ కర్మకార్పణ్యమ్**
**నానాభోగఫలప్రదమ్ ॥ 19-36**

శుద్ధచైతన్యుడు, శుద్ధాంతఃకరణుడు, పరిపూర్ణమైన మహానందము ననుభవించు ఈ క్రియానిష్పత్తిస్థలయోగికి నానావిధములైన భోగఫలములను కలుగజేయు కర్మకార్పణ్యము (పీడ) వుండదు.

ఇతి క్రియానిష్పత్తిస్థలం పరిసమాప్తమ్ ।
క్రియానిష్పత్తిస్థలము ముగిసినది.



## 85. అథ భావనిష్పత్తిస్థలమ్

### భావనిష్పత్తిస్థలము

**భావః ప్రతీయమానోఽపి**
**పరకాయే తు కల్పితః ।**
**శుక్తౌ రజతవద్ యస్మాత్**
**భావనిష్పత్తిమానయమ్ ॥ 19-37**

పరబ్రహ్మశరీరుడైన యోగిలో భావము (క్రియాసంబంధమైన భావనాత్మకమానసికవృత్తి) ఉన్నట్లు కనిపించినా, (అది) ముత్తెపుచిప్పలోని వెండి వలె కాల్పనికమైనది. అందువలన అతనిని భావనిష్పత్తివంతుడు అంటారు.

**భావేన నాస్తి సంబంధః**
**కేవలజ్ఞానయోగినః ।**
**తథాఽపి భావం కుర్వీత**
**శివే సంసారమోచకే ॥ 19-38**

కేవలం శివజ్ఞాని అయిన యోగికి భావముతో ఎటువంటి సంబంధము వుండదు. అయినా సంసారముక్తిని కలిగించు శివునికి సంబంధించిన భావము మాత్రం అలాగే వుంటుంది.

**పరిపూర్ణప్రబోధేఽపి**
**భావం శంభౌ న వర్జయేత్ ।**

**భావో హి నిహితస్తస్మిన్**
**భవసాగరతారకః ॥ 19-39**

పరిపూర్ణమైన అపరోక్షజ్ఞానమును పొందిన తరువాత కూడా భావనిష్పత్తిస్థలీయయోగి, 'శివోऽహం' అను భావనను ఏ పరిస్థితులలోనూ వదలిపెట్టరాదు. ఎందువలననగా శివుని యందుంచిన ఆ భావము నిశ్చయముగా భవసాగరతారకమైనది.

**నివర్త్య జన్మజం దుఃఖమ్**
**భావః శైవో నివర్తతే ।**
**యథా కాష్ఠాదికం దగ్ధ్వా**
**స్వయం శామ్యతి పావకః ॥ 19-40**

కట్టెలను కాల్చిన అగ్ని తనకు తానే ఎలా ఉపశమించునో, అలాగుననే భావనిష్పత్తిస్థలమునందలి యోగి మనసులోని 'శివోऽహం' భావన జన్మసంబంధమైన దుఃఖమును తొలగించి తనకు తానే ఉపశమించును.

**ప్రకాశితే శివానందే**
**తద్భావైః కిం ప్రయోజనమ్ ।**
**సిద్ధే సాధ్యే చిరేణాపి**
**సాధనైః కిం ప్రయోజనమ్ ॥ 19-41**

ఇలా దుఃఖమును పరిహరించి శివానందమును ప్రకాశింపచేసిన తరువాత 'శివోऽహం' అను భావనతో ఏమి ప్రయోజనము? చాలాకాలము



నుండి కోరుకున్న సాధ్యము (లక్ష్యము) సిద్ధించిన తరువాత సాధనముతో ఏమి ప్రయోజనము? ('శివోऽహం' భావన సాధనము. శివుడు కావడం సిద్ధి).

**ఏకీకృతే శివే భావే**
**జ్ఞానేన సహ సంయమీ ।**
**విస్మితాత్మసమావేశః**
**శివభావే విభాసతే ॥ 19-42**

సంయమి అయిన యోగి పరోక్షజ్ఞానముతో కూడిన తన భావనను శివునిలో ఐక్యము (ఒక్కటి) చేసి, ఆశ్చర్యకరమైన స్వాత్మానుభూతిని అనుభవిస్తాడు.. ఈ స్థితిలో యోగి శివభావముతోనే ప్రకాశిస్తాడు.

**న భావేన వినా జ్ఞానమ్**
**న భావో జ్ఞానమంతరా ।**
**మోక్షాయ కారణం ప్రోక్తమ్**
**తస్మాదుభయమాశ్రయేత్ ॥ 19-43**

భావము లేకుండా జ్ఞానముండదు. జ్ఞానమును వదలి భావము వుండదు. అందువలన భావజ్ఞానములు రెండూ మోక్షమునకు కారణములని చెప్పబడినవి. అందుకు సాధకుడు భావ-జ్ఞానములు రెండింటిని ఆశ్రయించవలెను.

ఇతి భావనిష్పత్తిస్థలం పరిసమాప్తమ్ ।
భావనిష్పత్తిస్థలము ముగిసినది.

**86.** అథ జ్ఞాననిష్పత్తిస్థలమ్

జ్ఞాననిష్పత్తిస్థలము

**జ్ఞానస్య వ్యవహారేఽపి**
**జ్ఞేయాభావాత్ స్వభావతః ।**
**స్వప్నవజ్జ్ఞాననిష్పత్త్యా**
**జ్ఞాననిష్పన్న ఇత్యసౌ ॥ 19-44**

భావనిష్పత్తిస్థలమునందున్న యోగిలో జ్ఞానము యొక్క వ్యవహారము జరుగుతున్ననూ (అక్కడ స్వస్వరూపము తప్ప) మరొక జ్ఞేయ (తెలియవలసిన) పదార్థము లేనందున అతని జ్ఞానము స్వప్నజ్ఞానం వలెనే వుండును. ఇటువంటి జ్ఞానమును కలిగివున్న వానిని 'జ్ఞాననిష్పన్ను'డని అంటారు. (జాగ్రదవస్థలో వుండు ఈ యోగియొక్క జ్ఞానవ్యవహారాలు స్వప్నజ్ఞానములాగే అస్థిరములని తెలియవలెను).

**స్వప్నజాతం యథా జ్ఞానమ్**
**సహ స్వార్థైర్నివర్తతే ।**
**తథాత్మని ప్రకాశే తు**
**జ్ఞానం జ్ఞేయం నివర్తతే ॥ 19-45**

స్వప్నము నందు కలిగిన జ్ఞానము మేలుకొన్న వెంటనే తన సమస్త విషయములతో పాటు ఎట్లు తొలగిపోవునో అలాగుననే స్వస్వరూప ప్రకాశముతో జాగ్రదవస్థలోని జ్ఞానము మరియు జ్ఞేయము రెండూ తమకు తామే నిష్క్రమించును.



**పరిపూర్ణే మహానందే**
**పరమాకాశలక్షణే ।**
**శివే విలీనచిత్తస్య**
**కుతో జ్ఞేయాంతరే కథా॥ 19-46**

మహానందస్వరూపము, పరమాకాశరూపము పరిపూర్ణము అయిన పరమశివుని యందు చిత్తవృత్తిని విలీనం చేసిన యోగికి మరియొక జ్ఞేయవిషయమెట్లు వుండును?

**అఖండానందసంవిత్తి -**
**స్వరూపం బ్రహ్మ కేవలమ్ ।**
**మిథ్యా తదన్యదిత్యేషా**
**స్థితిర్జ్ఞానమిహోచ్యతే ॥ 19-47**

అఖండము, చిదానందస్వరూపము అయిన బ్రహ్మ ఒక్కటే సత్యము. సత్యము కంటే వేరైనదంతయూ మిథ్యారూపమైనది అన్న ఎరుకయొక్క స్థితియే 'జ్ఞానము' అని చెప్పబడింది.

**సత్తాత్మనాఽనువృత్తం యద్**
**ఘటాదిషు పరం హి తత్ ।**
**వ్యావర్తమానా మిథ్యేతి**
**స్థితిర్జ్ఞానమిహోచ్యతే ॥ 19-48**

ఘటపటాది వస్తువులలో ఏది సద్రూపముతో ఓతప్రోతముగా వుంటున్నదో అదియే పరబ్రహ్మము. అదియే సత్యము. అయితే వ్యావర్తకములై వేరువేరుగా కనబడు ఘటపటాదుల నామరూపాదులు మిథ్య అని తెలుసుకొనుటయే 'జ్ఞానము'.

**అకారణమకార్యం యత్**
**అశేషోపాధివర్జితమ్ ।**
**తద్బ్రహ్మ తదహం చేతి**
**నిష్ఠా జ్ఞానముదీర్యతే ॥ 19-49**

పరబ్రహ్మము కారణము కాదు, అది కార్యము కాదు. అలాగే అది సమస్త ఉపాధుల చేతను త్యజించబడినది. 'అటువంటి పరబ్రహ్మమే నేను' అను దృఢమైన ఎరుకయే 'జ్ఞానము' అని పిలువబడినది.

**జ్ఞాతాప్యహం జ్ఞేయమిదమ్**
**ఇతి వ్యవహృతిః కుతః ।**
**అభేదబ్రహ్మస్వారస్యే**
**నిరస్తాఖిలవస్తుని ॥ 19-50**

తనలో నామరూపాత్మకప్రపంచములేని ఆ పరబ్రహ్మముతో సమరసస్థితిని సాధించిన జ్ఞాననిష్పత్తిస్థలమునందలి యోగికి, 'తాను తెలుసుకొనువాడు' అను జ్ఞాతృత్వవ్యవహారముగాని 'ఇది తెలియబడునది' అను జ్ఞేయవ్యవహారముగాని ఎలా కలుగును?



ఇతి జ్ఞాననిష్పత్తిస్థలం పరిసమాప్తమ్ ।
జ్ఞాననిష్పత్తిస్థలము ముగిసినది.

## *87. అథ పిండాకాశస్థలమ్ ।*

### పిండాకాశస్థలము

**యథా పిండస్య ఆకాశః**
**తథాత్మా పూర్ణ ఉచ్యతే ।**
**ఏతదర్థవివేకో యః**
**పిండాకాశస్థలం విదుః ॥ 19-51**

'పూర్ణమైన ఆకాశము పిండము(శరీరము)నందున్నట్లే పిండము నందలి ఆత్మకూడా పూర్ణముగానే వుండును' అను అర్థవివేక(జ్ఞానము)ము ఎవరికి వుండునో అతనినే 'పిండాకాశస్థలి'యని జ్ఞానులు చెప్పుచున్నారు.

**ఘటోపాధిర్యథాకాశః**
**పరిపూర్ణః స్వరూపతః ।**
**తథా పిండస్థితో హ్యాత్మా**
**పరిపూర్ణః ప్రకాశతే ॥ 19-52**

ఘటము(కుండ)ను ఉపాధిగా గలిగిన ఆకాశము (ఎలా తన) స్వరూపముచేత పరిపూర్ణముగా వున్నట్లే, పిండ(శరీర)మునందున్న ఈ ఆత్మకూడా పరిపూర్ణముగానే ప్రకాశించును.

**అంతఃస్థితం పరాకాశమ్**
**శివమద్వైతలక్షణమ్ ।**
**భావయేద్ యః సుమనసా**
**పిండాకాశః స ఉచ్యతే॥ 19-53**

చిదాకాశరూపము అద్వైతలక్షణము కలిగిన పరమశివుని ఎవరు తన హృదయాకాశమునందున్నవానిగా మనసులో భావించుచున్నాడో వాడే 'పిండాకాశస్థలుడ'ని చెప్పబడినాడు.

**శివాగారమిదం ప్రోక్తమ్**
**శరీరం బోధదీపితమ్ ।**
**షట్త్రింశత్తత్త్వఘటితమ్**
**సుమనః పద్మపీఠకమ్ ॥ 19-54**

ముప్పదియారు తత్త్వములతో నిర్మించబడి, హృదయమనే కమల పీఠముపై (ఆసీనమై), తత్త్వజ్ఞానదీపముతో ప్రకాశించు ఈ శరీరము శివా(దేవా)లయమని చెప్పబడినది.

**పరాకాశస్వరూపేణ**
**ప్రకాశః పరమేశ్వరః ।**
**హృదాకాశగుహాలీనో**
**దృశ్యతేఽంతః శరీరిణామ్ ॥ 19-55**



పరాకాశస్వరూపుడైన పరమేశ్వరుడు జీవుల హృదయాకాశమను గుహలో దాగివుండి జ్ఞానులైన వారికి ప్రకాశరూపమున కనబడుచున్నాడు.

**ఏతచ్ఛివపురం ప్రోక్తమ్**
**సప్తధాతుసమావృతమ్ ।**
**అత్ర హృత్పంకజం వేశ్మ**
**సూక్ష్మాంబరమనోహరమ్॥ 19-56**

సప్తధాతువులతో నిర్మించబడిన ఈ శరీరము శివపురమని చెప్పబడినది. ఈ దేహము నందలి హృదయకమలమే రాజప్రాసాదము. అందులోని సుందరమైన సూక్ష్మాకాశమే అంతఃపురము.

**తత్ర సన్నిహితం సాక్షాత్**
**సచ్చిదానందలక్షణమ్ ।**
**నిత్యసిద్ధః ప్రకాశాత్మా**
**జలస్థాకాశవచ్ఛివః ॥ 19-57**

ఆ అంతఃపురము నందు సచ్చిదానందలక్షణుడు, నిత్యసిద్ధుడు అయిన పరశివుడు నీటిలో ప్రతిబింబించు ఆకాశమువలె ప్రకాశించుచున్నాడు.

**అంతరాకాశబింబస్థమ్**
**అశేషోపాధివర్జితమ్ ।**
**ఘటాకాశ ఇవ చ్ఛిన్నం**
**భావయేచ్చిన్మయం శివమ్ ॥ 19-58**

అఖండమయిన ఆకాశము ఘటరూపమైన ఉపాధిచేత 'ఘటాకాశ'మని పిలువబడినట్లే, సకలోపాధిరహితుడు చిన్మయుడు అయిన శివుడు శరీరమను ఉపాధిచేత పిండరూపమున భావించబడుచున్నాడు.

ఇతి పిండాకాశస్థలం పరిసమాప్తమ్ ।
పిండాకాశస్థలము ముగిసినది.

## *88. అథ బింద్వాకాశస్థలమ్*
## బింద్వాకాశస్థలము

**యథాకాశో విభుర్జ్ఞేయః**
**సర్వప్రాణ్యుపరి స్థితః ।**
**తథాత్మేత్యుపమానార్థమ్**
**బింద్వాకాశస్థలం విదుః ॥ 19-59**

సమస్తప్రాణులకు లోపలా వెలుపలా వ్యాపించివున్న ఆకాశము ఏ విధముగా విభువు అని పిలువబడుచున్నదో, అదేవిధముగా ఆత్మకూడా ఆకాశమును ఉపాధిగా చేసుకుని (సర్వత్ర) అంతటా వ్యాపించియున్నదని ఉపమానముతో తెలియజేయు స్థలమే బింద్వాకాశస్థలము. (బిందురూపుడైన శివుడు సర్వప్రాణులయొక్క ఆత్మరూపుడై ఆకాశమువలె వ్యాపించి వున్నాడని తెలుపుటయే బింద్వాకాశస్థలమని తాత్పర్యము).

**యథైకో వాయురాఖ్యాతః**
**సర్వప్రాణిగతో విభుః ।**



**తథాత్మా వ్యాపకః సాక్షాత్**
**సర్వప్రాణిగతః స్వయమ్ ॥ 19-60**

ఎలాగైతే ఒక్కటే అయిన వాయువు అన్ని ప్రాణులలోను వ్యాపించి విభువుగా ఉన్నట్టే, ఆత్మకూడా అన్ని ప్రాణులలోను స్వయముగా వ్యాపించియున్నది.

**యథా వహ్నిరమేయాత్మా**
**సర్వత్రైకోఽపి భాసతే ।**
**తథా శంభుః సమస్తాత్మా**
**పరిచ్ఛేదవివర్జితః ॥ 19-61**

అమేయమైన (కొలవడానికి వీలుగాని) అగ్ని ఒక్కడే అయినా అన్ని చోట్లా ప్రకాశించుచున్నాడు. అటులనే సమస్తప్రాణులలోను ఆత్మరూపుడైన శంభువు కూడా పరిచ్ఛేదరహితుడై ప్రకాశించుచున్నాడు.

**సర్వేషాం దేహినామంతః**
**చిత్తతోయం ప్రకాశతే ।**
**తస్మిన్ ప్రతిఫలత్యాత్మా**
**శివో దర్పణవద్ విభుః ॥ 19-62**

ప్రతి జీవాత్ముని యొక్క అంతరంగములోను చిత్తమను నిర్మలజలం వుంటుంది. ఆ చిత్తజలములో విభువైన శివుడు దర్పణమునందలి ప్రతిబింభమువలె ప్రతిఫలించుచున్నాడు.

**ఏకో వశీకృతః సంవిత్**
**ప్రకాశాత్మా పరాత్పరః ।**
**సర్వప్రాణిగతో భాతి**
**తథాపి విభురుచ్యతే ॥ 19-63**

సంవిత్ప్రకాశరూపుడు, పరాత్పరుడు, ఒక్కడే అయిన శివుడు అన్ని ప్రాణుల హృదయకమలములందు వశీకృతుడైనట్లు కనబడతాడు. అయితే అతడు విభువుగానే(ఇతరులతో) పిలువబడతాడు.

**ఏక ఏవ యథా సూర్యః**
**తేజసా భాతి సర్వగః ।**
**తథాత్మా శక్తిభేదేన**
**శివః సర్వగతో భవేత్ ॥ 19-64**

ఒక్కడే అయిన సూర్యుడు తన తేజఃప్రకాశముతో అంతటా ప్రకాశమాను డయినట్లే శివుడు తన శక్తులలోని (ఇచ్ఛా-జ్ఞాన-క్రియా) భేదముల వలన సర్వత్రా వ్యాపించియున్నాడు.

*ఇతి బిన్ద్వాకాశస్థలం పరిసమాప్తమ్।*
బిన్ద్వాకాశస్థలము ముగిసినది.

## *89.* అథ మహాకాశస్థలమ్

### మహాకాశస్థలము

**పిండాండస్థం యథాకాశమ్**
**న భిన్నం తద్వదాత్మనః ।**



**అభిన్నః పరమాత్మేతి**
**మహాకాశస్థలం విదుః ॥ 19-65**

పిండాండమునందలి ఆకాశము మహాకాశము కన్నను వేరైనది ఎట్లు కాదో, అదేవిధముగా పిండాండమునందలి ఆత్మ పరమాత్మతో అభిన్నము (ఐక్యము)గా వున్నాడని తెలుసుకొనుటయే మహాకాశస్థలము.

**యథా న భిన్నమాకాశమ్**
**ఘటేషు చ మఠేషు చ ।**
**తథాండేషు చ పిండేషు**
**స్థితో హ్యాత్మా న భిద్యతే ॥ 19-66**

ఘటములోను మఠములోను ఉండు ఆకాశము ఎలాగైతే వేరువేరు కాదో అలాగే అండములోను పిండములోను ఉండు ఆత్మ కూడా వేరువేరు కాదు.

**అనిర్దేశ్యమనౌపమ్యమ్**
**అవాఙ్మనసగోచరమ్ ।**
**సర్వతోముఖసంపన్నమ్**
**సత్తానందం చిదాత్మకమ్ ॥ 19-67**

**కాలాతీతం కలాతీతమ్**
**క్రమయోగాదివర్జితమ్ ।**

**స్వానుభూతిప్రమాణస్థమ్**
**జ్యోతిషాముదయస్థలమ్ ॥ 19-68**

**శివాఖ్యం పరమం బ్రహ్మ**
**పరమాకాశలక్షణమ్ ।**
**లింగమిత్యుచ్యతే సద్భిః**
**యద్వినా న జగత్స్థితిః ॥ 19-69**

చూపుటకు వీలుకానిది, దానివంటి వస్తువు మరొకటి లేనిది, మాటకు మనసుకు అందనిది, అంతటా వ్యాపించియున్నది, సత్-చిత్-ఆనంద స్వరూపమును కలిగినది, కాలతత్త్వమునకు, కలాతత్త్వమునకు అతీతమైనది, ఉత్పత్త్యాదిక్రమములు లేనిది, స్వానుభవప్రమాణము చేతనే తెలియదగినది, జ్యోతులన్నిటికీ ఉదయ (ఆరంభ) స్థానమమయినది, శివుడు అను శబ్దముతో వ్యవహరించబడునది, పరమాకాశలక్షణమును గలిగిన ఆ పరబ్రహ్మమే లింగ(మహాలింగ)మని సత్పురుషులచేత చెప్పబడినది. ఈ మహాలింగములేకున్న ప్రపంచమునకు అస్థిత్వమే వుండదు.

**పరమాకాశమవ్యక్తమ్**
**ప్రబోధానందలక్షణమ్ ।**
**లింగం జ్యోతిర్మయం ప్రాహుః**
**లీయంతే యత్ర యోగినః ॥ 19-70**



పరమాకాశస్వరూపము, అవ్యక్తము, చిదానందస్వరూపము అయిన లింగము జ్యోతిర్లింగమని చెప్పబడినది. ఈ(మహా)లింగము నందే యోగులు ఐక్యమును పొందుచున్నారు.

**సంవిదేవ పరా కాష్ఠా**
**పరమానందరూపిణీ ।**
**తామాహుః పరమాకాశమ్**
**మునయో ముక్తసంశయాః ॥ 19-71**

సంశయలేశరహితులైన (వసిష్ఠాది) మునులు ఏ తత్త్వమును మహాకాశమని చెప్పుచున్నారో, అదే పరమానందస్వరూపము, సర్వోత్కృష్టము అయిన్న చైతన్యము అయియున్నది.

**తరంగాది యథా సింధోః**
**స్వరూపాన్నాతిరిచ్యతే ।**
**తథా శివాచ్చిదాకాశాత్**
**విశ్వమేతన్న భిద్యతే ॥ 19-72**

సముద్రము నందలి అలలు సముద్రపు నీటిస్వరూపము కంటే ఎట్లు భిన్నములు(వేరు)కావో, అటులనే ఈ విశ్వము కూడా చిదాకాశరూపుడైన శివునికన్నా వేరుకాదు.

**యథా పుష్పపలాశాది**
**వృక్షరూపాన్న భిద్యతే ।**

**తథా శివాత్ పరాకాశాత్**
**జగతో నాస్తి భిన్నతా ॥ 19-73**

వృక్షముయొక్క ఆకులు, పూలు, ఆ వృక్షమునుండి ఎట్లు వేరు కావో, అలాగుననే పరాకాశరూపుడైన శివుని కన్ననూ ఈ జగత్తు వేరుగా నుండదు.

**యథా జ్యోతీంషి భాసంతే**
**భూతాకాశే పృథక్ పృథక్ ।**
**తథా భాంతి పరాకాశే**
**బ్రహ్మాండాని విశేషతః ॥ 19-74**

ఆకాశమను మహాభూతములో నక్షత్రములు ఎట్లు వేరువేరుగా ప్రకాశించుచున్నవో, అలాగుననే పరాకాశరూపమైన పరబ్రహ్మలో అనేక బ్రహ్మాండములు విశేషముగా వెలుగుచున్నవి.

**నిరస్తోపాధిసంబంధమ్**
**నిర్మలం సంవిదాత్మకమ్ ।**
**పరాకాశం జగచ్చిత్ర-**
**విలాసాలంబభిత్తికమ్ ॥ 19-75**

ఎటువంటి ఉపాధులసంబంధములేనిది, నిర్మలమైనది, జ్ఞానస్వరూపమైనది, పరాకాశరూపమైన పరబ్రహ్మమే జగజ్జాలరూపమైన చిత్రమునకు (బొమ్మకు) ఆధారమైన గోడవలె వున్నది.



ఇతి మహాకాశస్థలం పరిసమాప్తమ్ ।
మహాకాశస్థలము ముగిసినది.

## *90. అథ క్రియాప్రకాశస్థలమ్*
### క్రియాప్రకాశస్థలము

**శివస్య పరిపూర్ణస్య**
**చిదాకాశస్వరూపిణః ।**
**ఆత్మత్వేనానుసంధానాత్**
**క్రియాద్యోతనవాన్ యమీ ॥ 19-76**

పరిపూర్ణుడు, చిదాకాశస్వరూపుడు అయిన పరమశివుని తన ఆత్మ స్వరూపముతో అనుసంధానము చేయు యమి(యోగి)యే 'క్రియాప్రకాశసంపన్ను'డని పిలువబడినాడు.

**నిష్కలంకచిదానంద**
**గగనోపమరూపిణః ।**
**శివస్య పరిపూర్ణస్య**
**వృత్తిశ్చైతన్యరూపిణీ ॥ 19-77**

కలంకరహితుడు, చిదానందరూపుడు, ఆకాశస్వరూపుడు మరియు పరిపూర్ణుడు అయిన పరమశివుడే నేనను అనుసంధానాత్మకమైన మనోవృత్తియే చైతన్యరూపమగుచున్నది.

**నిష్కలంకే నిరాకారే**
**నిత్యం పరమతేజసి ।**
**విలీనచిత్తవృత్తస్య**
**తథా శక్తిః క్రియోచ్యతే ॥ 19-78**

నిష్కలంకము, నిరాకారము, నిత్యము అయిన మహాతేజస్సులో చిత్తవృత్తిని విలీనముచేసుకున్న ఆ యోగి యొక్క క్రియాశక్తికూడా పరమతేజో రూపమగుచున్నది.

**సర్వజ్ఞః సర్వకర్తా చ**
**సర్వగః పరమేశ్వరః ।**
**తదైక్యచింతయా యోగీ**
**తాదృశాత్మా ప్రకాశతే ॥ 19-79**

సర్వజ్ఞుడు, సర్వకర్త (పంచకృత్యకారుడు), సర్వవ్యాపి అయిన పరమశివునితో ఐక్యభావనను పొందిన యోగి ఆ పరమాత్మరూపునిగానే ప్రకాశించుచున్నాడు.

**సర్వేంద్రియాణాం వ్యాపారే**
**విద్యామానేఽపి సంయమీ ।**
**ప్రత్యున్ముఖేన మనసా**
**శివం పశ్యన్ ప్రమోదతే ॥ 19-80**



సంయమి అయిన యోగిలో సర్వేంద్రియవ్యాపారము (సాధారణముగానే) జరుగుచున్ననూ అతడు ప్రత్యఙ్ముఖమైన (అంతర్ముఖమైన) మనసుతో శివుని చూచుచు ఆనందించు చుండును.

**కూటస్థమచలం ప్రాజ్ఞమ్**
**గుణాతీతం గుణోత్తరమ్ ।**
**శివతత్త్వం స్వరూపేణ**
**పశ్యన్ యోగీ ప్రమోదతే ॥ 19-81**

గుణోత్తరుడు (జ్ఞానవైరాగ్యాదిగుణములచే శ్రేష్ఠమైనవాడు), ప్రాజ్ఞుడు (కుశలుడు), కూటస్థుడు (సాక్షిరూపుడు), గుణాతీతుడు (మాయిక, సత్త్వాది గుణరహితుడు), అచలుడు అయిన పరశివుని తన స్వరూపముగా దర్శించు యోగి ఆనందమున నోలలాడును.

**పరాత్మని క్రియా సర్వా**
**గంధర్వనగరీముఖా ।**
**ప్రకాశత ఇతి ప్రోక్తమ్**
**క్రియాయాస్తు ప్రకాశనమ్ ॥ 19-82**

పరశివస్వరూపుడైన యోగియొక్క సమస్తక్రియలు ఆకాశమునందలి గాంధర్వనగరమువలె ప్రకాశించును అని జ్ఞానులచే చెప్పబడినది. ఇదియే క్రియాప్రకాశస్థలము.

*ఇతి క్రియాప్రకాశస్థలం పరిసమాప్తమ్ ।*

క్రియాప్రకాశస్థలము ముగిసినది.

## 91. అథ భావప్రకాశస్థలమ్
భావప్రకాశస్థలము

**తరంగాద్యా యథా సింధౌ**
**న భిద్యంతే తథాత్మని ।**
**భావా బుద్ధ్యాదయః సర్వే**
**యత్తద్ భావప్రకాశనమ్ ॥ 19-83**

సముద్రము నందలి తరంగములు సముద్రము కన్నా ఎలా వేరుకావో అలాగుననే యోగి మనసునందలి పరశివుని గురించిన బుద్ధి భావనలు శివుని కన్నా (భిన్నమైనవి) వేరైనవి కావన్న ఎఱుకయే భావప్రకాశస్థలము.

**శివ ఏవ జగత్సర్వమ్**
**శివ ఏవాహమిత్యపి ।**
**భావయన్ పరమో యోగీ**
**భవదోషైర్న బాధ్యతే ॥ 19-84**

జగత్తు అంతయూ శివస్వరూపమే. అందువలన నేను కూడా శివుడనే అని భావించు యోగి భవ(సాంసారిక)దోషముల చేత బాధించబడడు.

**శివభావే స్థిరే జాతే**
**నిర్లేపస్య మహాత్మనః ।**



**యే యే భావాః సముత్పన్నాః**
**తే తే శివమయాః స్మృతాః ॥ 19-85**

నిర్లిప్తుడు (విషయలేపరహితుడు) అయిన మహాత్మునిలో శివభావము దృఢముగా స్థిరమైనపుడు, అతనిలో మెదలు భావములన్నీ శివమయములే అని తెలియబడినవి.

**అద్వితీయశివాకార -**
**భావనాధ్వస్తకర్మణా ।**
**న కించిద్భావ్యతే సాక్షాత్**
**శివాదన్యన్మహాత్మనా ॥ 19-86**

అద్వితీయమైన (సమానసమరసరూపమైన) శివాకారభావనతో తమతమ కర్మలను ధ్వంసము చేసుకొన్న మహాత్ములు సాక్షాత్ శివుని కన్నా వేరైన దానిని (వస్తువును) భావించలేరు.

**గలితాజ్ఞానబంధస్య**
**కేవలాత్మానుభావినః ।**
**యత్ర యత్రేంద్రియాసక్తిః**
**తత్ర తత్ర శివాత్మతా ॥ 19-87**

అజ్ఞానరూపమైన బంధములను త్రెంచుకుని, కేవలం ఆత్మానుభావులైన యోగుల ఇంద్రియములు ఏఏ విషయముల యందు

ప్రసరించునో ఆయా విషయములన్నియు శివస్వరూపములే అగును.

**రాగద్వేషాదయో భావాః**
**సంసారక్లేశకారణమ్ ।**
**తేషాముపరమో యత్ర**
**తత్ర భావః శివాత్మకః ॥ 19-88**

రాగద్వేషాదిభావములు సంసారదుఃఖమునకు కారణాలగుచున్నవి. అటువంటి రాగద్వేషములు ఏ యోగిలో ఉపరమించు(శాంతించు)చున్నవో అటువంటి శివయోగి భావనలన్నీ శివాత్మకములే అగును

**యథా సూర్యసమాక్రాంతౌ**
**న శక్నోతి తమః సదా ।**
**తథా ప్రకాశమాత్మానమ్**
**నావిద్యాక్రమతి స్వయమ్ ॥ 19-89**

సూర్యుని కప్పివేయుటకు (ఆక్రమించుటకు) చీకటికి ఎట్లు సాధ్యము కాదో అలాగుననే ప్రకాశస్వరూపుడైన ఈ (ఆత్మ)యోగిని ఆవిద్య ఏనాడు కప్పివేయ(ఆక్రమించ)జాలదు.

ఇతి భావప్రకాశస్థలం పరిసమాప్తమ్ ।

భావప్రకాశస్థలము ముగిసినది.



## 92. అథ జ్ఞానప్రకాశస్థలమ్

### జ్ఞానప్రకాశస్థలము

**ముఖ్యార్థేఽసంభవే జాతే**
**లక్షణాయోగసంశ్రయాత్ ।**
**తజ్జ్ఞానయోజనం యత్తత్**
**ఉక్తం జ్ఞానప్రకాశనమ్ ॥ 19-90**

ముఖ్యార్థము (వాచ్యార్థము) పొసగనపుడు (లక్షణాయోగముచేత) లక్షణార్థమునాశ్రయించి ఆ జ్ఞానమును తెలియు విధానమే జ్ఞానప్రకాశ(స్థల)మని చెప్పబడినది. [అవిద్యను ఉపాధిగా గలిగినది జీవాత్మ (అంగము). శుద్ధమాయను ఉపాధిగా గలిగినది పరమాత్మ (లింగము). ఈ రెంటి ఐక్యతను 'తత్త్వమసి' అను మహావాక్యార్థముతో బోధించుట కుదరదు. ఎందువలననగా రెండు ఉపాధులు వేరువేరు గుణములు కలిగినవైనందున ముఖ్యార్థమును ఆ రెండింటి ద్వారా బోధించుట వీలుకాదు. అయితే లక్షణార్థమునునుసరించి, రెండు ఉపాధులను వదలిపెట్టి, వాటి ఉపమేయములైన రెండు చైతన్యముల నడుమ ఐక్యతను (అభేధమును) బోధించుటకు సాధ్యమవుగును. ఈవిధంగా అంగలింగముల నడుమ సమరసబోధ, వాచ్యార్థము ద్వారా వీలుకానపుడు లక్షణార్థముతో లింగాంగసామరస్యమును (ఐక్యతను) తెలుసుకొను విధానమే జ్ఞానప్రకాశస్థలము అనబడినది].

**ముక్తస్య జ్ఞానసంబంధో**
**జ్ఞేయాభావః స్వభావతః ।**

**ఉపాధిసహితం జ్ఞానమ్**
**న భేదమతివర్తతే ॥ 19-91**

జీవన్ముక్తుడైన యోగికి (లక్ష్యార్థరూపమైన) జ్ఞానసంబంధము స్వాభావికమైనది. అందువలన ఆ జీవన్ముక్తునికి జ్ఞేయము (తెలుసుకొనవలసినది) ఏదీ వుండదు. ఉపాధులతో కూడుకున్న జ్ఞానము భేదములకతీతముగా వుండదు. అందువలన ఉపాధులను తొలగించుకొనుటయే సామరస్య సాధనకు మూలకారణమగును. అందువలన జ్ఞానముచేత ఉపాధులను తొలగింప చేసుకొను విధానమే జ్ఞానప్రకాశము.

**జ్ఞానమిత్యుచ్యతే సద్భిః**
**పరిచ్ఛేదోఽపి వస్తునః ।**
**పరాత్మన్యపరిచ్ఛేదే**
**కుతో జ్ఞానస్య సంభవః ॥ 19-92**

అంగము, లింగము అను పరిచ్ఛిన్నములయిన వస్తువుల పరస్పరభేదజ్ఞానమే ద్వైతజ్ఞానమని చెబుతారు. ఉపాధులు లేనటువుంటి పరమచైతన్యములో పరిచ్ఛేదము (అంటే ఖండత్వము) సంభవించుట అసాధ్యమైనప్పుడు (ద్వైత) జ్ఞానమెట్లు సంభవము?

**జ్ఞానస్యావిషయే తత్త్వే**
**శివాఖ్యే చిత్సుఖాత్మని ।**
**ఆత్మైకత్వానుసంధానమ్**
**జ్ఞానమిత్యుచ్యతే బుధైః ॥ 19-93**



జ్ఞానము స్వయంప్రకాశమైనందున అది వేరొక జ్ఞానమునకు విషయము కాజాలదు. జ్ఞానరూపము, సుఖరూపము అయిన ఆ పరశివతత్త్వమును తన ఆత్మతో ఏకత్వానుసంధానము చేయునదే జ్ఞానమని విజ్ఞులు చెబుతారు.

**అపరిచ్ఛిన్నమానందమ్**
**సత్తాకారం జగన్మయమ్ ।**
**బ్రహ్మేతి లక్షణం జ్ఞానమ్**
**బ్రహ్మజ్ఞానమిహోచ్యతే ॥ 19-94**

అపరిచ్ఛిన్నము, ఆనందస్వరూపము, సత్తాకారము, జగన్మయము అయినదే బ్రహ్మ అని లక్షణముల ద్వారా బ్రహ్మను తెలుసుకొనుటయే బ్రహ్మజ్ఞానమని చెప్పబడినది.

**బ్రహ్మజ్ఞానే సముత్పన్నే**
**విశ్వోపాధివివర్జితే ।**
**సర్వం సంవిన్మయం భాతి**
**తదన్యన్నైవ దృశ్యతే ॥ 19-95**

విశ్వోపాధివివర్జితమైన (విశ్వము శివుని కన్నా వేరైనది అను భేద భ్రాంతిలేని) బ్రహ్మజ్ఞానము వుదయించినపుడు సమస్తవిశ్వము జ్ఞానమయముగా ప్రకాశించును. అందువలన జ్ఞాని అయినవానికి అటువంటి జ్ఞానముతప్ప వేరేదీ కనిపించదు.

**తస్మాదద్వైతవిజ్ఞానమ్**
**అపవర్గస్య కారణమ్ ।**
**భావయన్ సతతం యోగీ**
**సంసారేణ న లిప్యతే ॥ 19-96**

అందువలన అద్వైతవిజ్ఞానమే (అనుభవాత్మకమైక శివాద్వైతజ్ఞానమే) మోక్షమునకు కారణము. అందువలన అనుభవాత్మకమైన జ్ఞానమును పొందిన యోగి సంసారబంధముచేత బంధించబడడు.

**నిత్యే నిర్మలసత్త్వయోగిషు పరే నిర్వాసనే నిష్కలే**
**సర్వాతీతపదే చరాచరమయే సత్తాత్మని జ్యోతిషి ।**
**సంవిద్వ్యోమ్ని శివే విలీనహృదయస్తద్భేదవైముఖ్యతః**
**సాక్షాత్సర్వగతో విభాతి విగలద్విశ్వః స్వయం సంయమీ ॥19-97**

– (శార్దూలవిక్రీడితం)

నిత్యులు, నిర్మలులు, సాత్త్వికులు అయిన యోగుల హృదయ కమలములలో సదా నివసించేవాడు, సర్వవిధవాసనాశూన్యుడు, నిష్కలుడు, సర్వోత్కృష్టుడు, పరమోన్నతస్థానపరుడు, చరాచరప్రపంచమునందంతటను వ్యాపించివున్నవాడు, జ్యోతులకే జ్యోతిస్వరూపుడు, జ్ఞానాకాశరూపుడు అయిన పరశివుని యందు ఎవరి మనస్సు ఐక్యమైయున్నదో అటువంటి సంయమి అయిన యోగి, పరశివుని దప్ప మరొక వస్తువును దర్శించని కారణమున జగత్తుయొక్క భేదభ్రాంతిశూన్యుడై సర్వవ్యాపకుడై అంతా తానెయై ప్రకాశించును.



ఇతి జ్ఞానప్రకాశస్థలం పరిసమాప్తమ్ ।

జ్ఞానప్రకాశస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ శరణస్థలాంతర్గత ద్వాదశవిధలింగ స్థలప్రసంగోనామ ఏకోనవింశతితమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో శరణస్థలాంతర్గత ద్వాదశవిధలింగస్థల ప్రసంగమను పంతొమ్మిదవ పరిచ్ఛేదము ముగిసినది.



# వింశః పరిచ్ఛేదః

# ఇరువదవ పరిచ్ఛేదము

## ఐక్యస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగః

## ఐక్యస్థలాంతర్గతనవవిధలింగస్థలప్రసంగము

**(88 శ్లోకములు)**

**VI. అథ ఐక్యస్థలమ్**

**ఐక్యస్థలము**

*అగస్త్య ఉవాచ :*

**స్థలభేదాస్త్వయా ప్రోక్తాః**
**శరణస్థలసంశ్రితాః ।**
**ఐక్యస్థలగతాన్ బ్రూహి**
**స్థలభేదాన్ గణేంద్ర మే ॥ 20-1**

**అగస్త్యుల వారి ప్రశ్న :**

ఓ రేణుకగణేంద్రా ! శరణస్థలమునకు సంబంధించిన స్థలభేదములన్నిటినీ చక్కగా తెలియజేసినారు. ఇపుడు ఐక్యస్థలమునకు సంబంధించిన స్థలభేదములను నాకు తెలియజేయండి.

*శ్రీరేణుక ఉవాచ :*

**స్థలానాం నవకం చైక్య-**
**స్థలేఽస్మిన్ పరికీర్త్యతే ॥ 20-2**

**తత్ర స్వీకృతప్రసాదైక్య-**
**స్థలమాదౌ ప్రకీర్తితమ్ ।**
**శిష్టోదనస్థలం చాథ**
**చరాచరలయస్థలమ్ ॥ 20-3**

**భాండస్థలం తతః ప్రోక్తమ్**
**భాజనస్థలముత్తమమ్ ।**
**అంగాలేపస్థలం పశ్చాత్**
**స్వపరాజ్ఞాస్థలం తతః ॥ 20-4**

**భావాభావవినాశం చ**
**జ్ఞానశూన్యస్థలం తతః ।**
**తదేషాం క్రమశో వక్ష్యే**
**శృణు తాపస లక్షణమ్ ॥ 20-5**

**శ్రీరేణుకుల వారి సమాధానము :**

ఓ తపస్వీ ! ఐక్యస్థలమునకు సంబంధించి తొమ్మిది స్థలములు ఉన్నవి. అవి – మొదటిది స్వీకృతప్రసాదిస్థలము. రెండవది శిష్టోదనస్థలము.

మూడవది చరాచరలయస్థలము. నాలుగవది భాండస్థలము. అయిదవది భాజనస్థలము. ఆరవది అంగాలేపస్థలము. ఏడవది స్వపరాజ్ఞస్థలము. ఎనిమిదవది భావాభావవినాశస్థలము. తొమ్మిదవది జ్ఞానశూన్యస్థలము. వీటన్నిటి లక్షణములను వరుసగా తెలియజేసెదను. ఆలకించుము.

## 93. అథ స్వీకృతప్రసాదిస్థలమ్

### స్వీకృతప్రసాదిస్థలము

**ముఖ్యార్థో లక్షణార్థశ్చ**
**యత్ర నాస్తి చిదాత్మని ।**
**విశృంఖలతయా తస్య**
**ప్రసాదః స్వీకృతో భవేత్ ॥ 20-6**

ఏ చిదాత్మవిషయమున ముఖ్యార్థముగాని, లక్షణార్థముగాని వుండవో (ఉపకరించవో) అటువంటి చిదాత్మయొక్క ప్రసాదమును విశృంఖలముగా (ఎటువంటి అడ్డంకులు లేకుండా ) ఏ యోగి స్వీకరిస్తాడో అతడే 'స్వీకృతప్రసాది' అనబడతాడు. [అంగలింగములకు ఔపాధికభేదమును తెలిపేది ముఖ్యార్థము. ఉపాధిరహితములైన అంగలింగముల చైతన్యముల సామరస్యాన్ని బోధించేది లక్షణార్థము. ఈ ముఖ్యార్థ, లక్షణార్థములను తెలుసుకుని లక్ష్యమును (ఐక్యజ్ఞానమును) తెలుసుకున్న తరువాత, లింగాంగసామరస్యముయొక్క అనుభవాత్మకమైన ప్రసాదమును పొందడమే 'స్వీకృతప్రసాదిస్థల'మని తాత్పర్యము. ]

**మాతృమేయప్రమాణాది-**
**వ్యవహారే విహారిణీమ్ ।**



**సంవిత్సాక్షాత్కృతిం లబ్ధ్వా**
**యోగీ స్వాత్మని తిష్ఠతి ॥ 20-7**

ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయాది త్రిపుటాత్మకమయిన ప్రాపంచిక వ్యవహారాదులలో విహరించుచు సంవిత్సాక్షాత్కృతి అయిన చిచ్ఛక్తిని (అనుభవాత్మకమైన సాక్షాత్కారమును)పొందిన యోగి తనలో తాను సుస్థిరుడౌతాడు.

**అద్వైతబోధనిర్ధూత-**
**భేదావేశస్య యోగినః ।**
**సాక్షాత్కృతమహాసంవిత్**
**ప్రకాశస్య క్వ బంధనమ్ ॥ 20-8**

అద్వైతబోధ(శివాద్వైతజ్ఞానం)తో అంగ-లింగముల భేదభావమును వదలిపెట్టి, మహాసంవిత్ (చిచ్ఛక్తి) ప్రకాశమును సాక్షాత్కరింపచేసుకున్న (అనుభవాత్మకజ్ఞానమును సంపాదించుకున్న) యోగికి బంధమెక్కడిది?

**చిదాత్మని శివే న్యస్తమ్**
**జగదేతచ్చరాచరమ్ ।**
**జ్ఞాయతే తన్మయం సర్వమ్**
**అగ్నౌ కాష్ఠాదికం యథా ॥ 20-9**

అగ్నిలో వేసిన కొయ్యలాంటి పదార్థములు తన్మయము (అగ్నిమయము) అయినట్లే చిద్రూపుడైన శివునియందలి ఈ చరాచరజగత్తు కూడా చిద్రూపమే అవుతుందని స్వీకృతప్రసాది తెలుసుకుంటాడు.

**న భాతి పృథ్వీ న జలమ్**
**న తేజో నైవ మారుతః ।**
**నాకాశో న పరం తత్త్వమ్**
**శివే దృష్టే చిదాత్మని ॥ 20-10**

చిద్రూపు(చిదాత్ము)డైన శివుడు సాక్షాత్కరించిన తరువాత, పృథివీ, జల, తేజో, వాయువులుగాని మరియు సర్వభూతాలలో శ్రేష్ఠమైన ఆకాశతత్త్వముగాని శివుని కన్నా భిన్నముగా(వేరుగా) కనబడవు. ('ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం' అన్న ఉపనిషద్వాక్యానుసారము సర్వమునకు కారణమైన పరశివుని తెలుసుకున్న తరువాత సర్వమూ అతని స్వరూపముగానే కనబడుతుంది.)

**జ్యోతిర్లింగే చిదాకారే**
**జ్వలత్యంతర్నిరంతరమ్ ।**
**విలీనం నిఖిలం తత్త్వమ్**
**పశ్యన్ యోగీ న లిప్యతే ॥ 20-11**

తన అంతరంగమునందలి హృదయకమలములో నిరంతరం ప్రకాశించు చిదాకారమైన జ్యోతిర్లింగమున ఏ యోగి సమస్త (శివాది



భూమ్యంతములయిన 36) తత్త్వములను లయం చేసుకొని దర్శించునో, అతడు ప్రపంచము చేత ప్రభావితుడు కాడు.

**అంతర్ముఖేన మనసా**
**స్వాత్మజ్యోతిషి చిన్మయే ।**
**సర్వానప్యర్థవిషయాన్**
**జుహ్వన్ యోగీ ప్రమోదతే ॥ 20-12**

అంతర్ముఖమైన మనస్సుతో చిన్మయమైన స్వాత్మజ్యోతి (హోమం)లో సమస్త పదార్థములను విషయములను (తాదాత్మ్యభావనతో) సమర్పించు యోగి ఆనందమయుడౌతాడు.

**సచ్చిదానందజలధౌ**
**శివే స్వాత్మని నిర్మలః ।**
**సమర్ప్య సకలాన్ భుంక్తే**
**విషయాన్ తత్ప్రసాదతః ॥ 20-13**

నిర్మలుడైన స్వీకృతప్రసాదిస్థల యోగి సచ్చిదానంద సాగరుడైన పరశివునిలో శబ్దాదిసకలపదార్థములను తాదాత్మ్యభావముతో సమర్పించి, వాటిని శివప్రసాదరూపమున అనుభవించుచుండును.

ఇతి స్వీకృతప్రసాదిస్థలం పరిసమాప్తమ్ ।
స్వీకృతప్రసాదిస్థలము ముగిసినది.

## 94. అథ శిష్టోదనస్థలమ్

### శిష్టోదనస్థలము

**ప్రకాశతే యా సర్వేషామ్**
**మాయా సైవోదనాకృతిః ।**
**లీయతే తత్ర చిల్లింగే**
**శిష్టం తత్పరికీర్తితమ్ ॥ 20-14**

సమస్త జీవరాశులను (తను, కరణ, భువన, భోగాది రూపములలో) ఏది ప్రకాశింప చేయుచున్నదో మరియు ఏది అంతకాలమున చిల్లింగమునందు లయమగుచున్నదో అటువంటి మాయను శిష్టమని అన్నారు. ఆ శిష్టమైన మాయ యోగికి ఓదనమ (భక్ష్యరూపమైన అన్నము)యినందున దానిని శిష్టోదనమని అన్నారు.

**జగదంగే పరిగ్రస్తే**
**మాయాపాశవిజృంభితే ।**
**స్వాత్మజ్యోతిషి బోధేన**
**తదేకమవశిష్యతే ॥ 20-15**

మాయాపాశముతో విజృంభించిన (కలాతత్త్వముతో ఆరంభించి భూమితత్త్వము వరకు గల 30 తత్త్వములతో నిర్మితమైన) జగద్రూపమయిన శరీరము (అంగము)నందలి ఆత్మజ్యోతియొక్క బోధన (ప్రకాశము) ఆవరించినపుడు మాయాతత్త్వమొక్కటే అశేషముగా మిగిలిపోతుంది.



**అఖండసచ్చిదానంద-**
**పరబ్రహ్మస్వరూపిణః ।**
**జీవన్ముక్తస్య ధీరస్య**
**మాయా కైంకర్యవాదినీ ॥ 20-16**

అఖండము, సచ్చిదానందస్వరూపము అయిన పరబ్రహ్మతత్త్వమును తన స్వరూపముగా తెలుసుకున్న ధీరుడు, జీవన్ముక్తుడు అయిన యోగికి అవశిష్టమైన మాయ సేవాభావముతో లొంగిపోతుంది.

**విశ్వసంమోహినీ మాయా**
**బహుశక్తినిరంకుశా ।**
**శివైకత్వముపేతస్య**
**న పురః స్థాతుమీహతే ॥ 20-17**

అనేకవిధములైన శక్తులతో విశ్వమునంతటినీ సమ్మోహనము చేయు, నిరంకుశమైన మాయ శివునితో ఐక్యతను (సమాన సమరసభావమును) పొందిన యోగిముందు నిలుచుటకు ఇష్టపడదు.

**జ్యోతిర్లింగే చిదాకారే**
**నిమగ్నేన మహాత్మనా ।**
**భుజ్యమానా యథాయోగమ్**
**నశ్యంతి విషయాః స్వతః॥ 20-18**

చిద్రూపమైన జ్యోతిర్లింగములో నిమగ్నుడై మహాత్ముడైన యోగిచేత (అర్పణావిధానములో క్రమంగా) భోగ్యపదార్థములయిన శబ్దాదివిషయములు తమకు తామే నశించిపోతాయి.

**శబ్దాదయోऽపి విషయా**
**భుజ్యమానాస్తదింద్రియైః ।**
**ఆత్మన్యేవ విలీయంతే**
**సరితః సాగరే యథా ॥ 20-19**

శిష్టోదనస్థలీయుడైన యోగి తన ఇంద్రియముల ద్వారా శబ్దాది విషయములను అనుభవించుచున్ననూ, నదులు సముద్రములో కలిసిపోయినట్లుగా ఆ విషయములు, అతని ఆత్మలోనే ఇమిడిపోవును.

**అర్థజాతమశేషం తు**
**గ్రసన్ యోగీ ప్రశామ్యతి ।**
**స్వాత్మనైవాస్థితో భానుః**
**తేజోజాలమశేషతః ॥ 20-20**

సూర్యుడెలా తన సమస్తకిరణములను (చివరికి) తనలోనే ఇనుమడింపచేసుకొనుచున్నాడో, అలాగుననే సమస్తమైన శబ్దాది విషయసమూహమును నిశ్శేషంగా గ్రహించి యోగి పరమశాంతుడౌతాడు.

ఇతి శిష్టోదనస్థలం పరిసమాప్తమ్ ।
శిష్టోదనస్థలము ముగిసినది.



## *95.* అథ చరాచరలయస్థలమ్
## చరాచరలయస్థలము

**లింగైక్యే తు సమాపన్నే**
**చరణాచరణే గతే ।**
**నిర్దేహీ స భవేద్యోగీ**
**చరాచరవినాశకః ॥ 20-21**

చరాచరాత్మకమైన ప్రపంచముతోపాటు నిర్దేహి అయిన ఈ యోగి మహాలింగమునందు తాదాత్మ్యమును పొందినపుడు అతడే చరాచరవినాశకుడనబడతాడు.

**అనాద్యవిద్యామూలా హి**
**ప్రతీతిర్జగతామియమ్ ।**
**స్వాత్మైకబోధాత్ తన్నాశే**
**కుతో విశ్వప్రకాశనమ్ ॥ 20-22**

ఈ ప్రపంచమిలా వుండటానికి (తెలియదానికి) అనాది అయిన అవిద్యయే కారణమైయున్నది. తాను మరియు పరమాత్మ ఒక్కటే అన్న స్వాత్మైకబోధతో ఆ అవిద్య నాశనమయితే, (దానివలన రూపొందిన) విశ్వమెక్కడ వుంటుంది?

**యథా మేఘాః సముద్భూతాః**
**విలీయంతే నభస్థలే ।**

**తథాఽఽత్మని విలీయంతే**
**విషయాః స్వానుభావినః ॥ 20-23**

ఆకాశంలో పుట్టే మేఘములు (ఆకాశములోనే) ఎలా లీనమైపోతాయో అలాగుననే స్వప్నరూపానుభావి అయిన శివయోగి యొక్క ఆత్మలోనే అన్ని విషయాలు లయమవుతాయి.

**స్వప్నే దృష్టం యథా వస్తు**
**ప్రబోధే లయమశ్నుతే ।**
**తథా సాంసారికం సర్వమ్**
**ఆత్మజ్ఞానే వినశ్యతి ॥ 20-24**

స్వప్నములో కనిపించిన వస్తువులు మేల్కొన్న వెంటనే లయ (మాయ)మై పోయినట్టే, సాంసారికములయిన సమస్తవస్తువులు ఆత్మజ్ఞానము కలిగిన వెంటనే (అందులోనే) లయమవుతాయి.

**జాగ్రత్స్వప్నసుషుప్తిభ్యః**
**పవరా స్థాముపేయుషః ।**
**కిం వా ప్రమాణం కిం జ్ఞేయమ్**
**కిం వా జ్ఞానస్య సాధనమ్ ॥ 20-25**

జాగ్రత్ - స్వప్న - సుషుప్తి అవస్థలకతీతమైన పరావస్థను (తురీయావస్థ) సాధించు(చేరు)కున్న యోగికి ప్రమాణము (జ్ఞానవిధానము) గాని, జ్ఞేయపదార్థము (తెలియబడువస్తువు)గాని, జ్ఞానసాధనముగాని ఏవీ వుండనే వుండవు.



**తుర్యాతీతపదం యత్తద్**
**దూరం వాఙ్మనసాధ్వనః ।**
**అనుప్రవిశ్య తద్యోగీ**
**న భూయో విశ్వమీక్షతే ॥ 20-26**

వాఙ్మార్గము (వాక్కు), మనోమార్గములకన్ననూ అతీతమైన (దూరమైన) తురీయాతీత పథమును ప్రవేశించిన యోగి మరలా ఈ విశ్వమును కనలేదు, చూడలేదు.

**నాన్యత్ పశ్యతి యోగీంద్రో**
**నాన్యజ్జానాతి కించన ।**
**నాన్యచ్ఛృణోతి సందృష్టే**
**చిదానందమయే శివే ॥ 20-27**

చిదానందస్వరూపుడైన శివుని దర్శించిన యోగిశ్రేష్ఠుడు, తనకన్నా భిన్నమైన (వేరైన)దానిని దేనినీ చూడడు, వినడు, తెలుసుకొనడు.

**అసదేవ జగత్ సర్వమ్**
**సదివ ప్రతిభాసతే ।**
**జ్ఞాతే శివే తదజ్ఞానమ్**
**స్వరూపముపపద్యతే ॥ 20-28**

ఈ సమస్తప్రపంచము అసద్రూపమే అయిననూ సద్రూపములాగే

(శివుని కన్నా వేరుగా) ప్రతిభాసమౌతుంది. పరశివుని తెలుసుకున్న తరువాత అజ్ఞానము నశించి యోగికి సర్వము స్వస్వరూపముగానే కనబడుతుంది.

ఇతి చరాచరలయస్థలం పరిసమాప్తమ్ ।
చరాచరలయస్థలము ముగిసినది.

## *96.* అథ భాండస్థలమ్
### భాండస్థలము

**బ్రహ్మాండశతకోటీనామ్**
**సర్గస్థితిలయాన్ ప్రతి ।**
**స్థానభూతో విమర్శో యః**
**తద్భాండస్థలముచ్యతే ॥ 20-29**

శతకోటి బ్రహ్మాండముల ఉత్పత్తికి, స్థితికి, లయకి కారణమై, ఆశ్రయస్థానమై ఏ విమర్శాశక్తి యున్నదో అదియే 'భాండస్థల'మనబడినది.

**విమర్శాఖ్యా పరాశక్తిః**
**విశ్వోద్భాసనకారిణీ ।**
**సాక్షిణీ సర్వభూతానామ్**
**సమింధే సర్వతోముఖీ ॥ 20-30**

విమర్శాశక్తియని పిలువబడే పరాశక్తి(బిందుశక్తి)యే విశ్వోత్పత్తికి కారణమైయున్నది. ఇదియే సమస్త భూతములకుసాక్షిరూపముగాను, సర్వతోముఖ ప్రకాశముగాను భాసించుచున్నది.



**విశ్వం యత్ర లయం యాతి**
**విభాత్యాత్మా చిదాకృతిః ।**
**సదానందమయః సాక్షాత్**
**సా విమర్శమయీ కలా ॥ 20-31**

ఎందులో ఈసమస్తవిశ్వము లయించుచున్నదో, ఏది చిత్స్వరూపమైన ఆత్మగా ప్రకాశమానమౌతున్నదో, ఏది సాక్షాత్తూ ఆనందమయముగా నున్నదో అదియే విమర్శాకళ లేదా విమర్శాశక్తి.

**పరాహంతా సమావేశ -**
**పరిపూర్ణవిమర్శవాన్ ।**
**సర్వజ్ఞః సర్వగః సాక్షీ**
**సర్వకర్తా మహేశ్వరః ॥ 20-32**

పరాహంతా సంబంధముతో పరిపూర్ణమైన విమర్శాస్వరూపమును పొందిన మహేశ్వరుడు సర్వజ్ఞుడని, సర్వవ్యాపకుడని, సర్వసాక్షి అని, సర్వకర్త అని పిలువబడుచున్నాడు.

**విశ్వాధారమహాసంవిత్**
**ప్రకాశపరిపూరితమ్ ।**
**పరాహంతామయం ప్రాహుః**
**విమర్శం పరమాత్మనః ॥ 20-33**

ప్రపంచమునకు ఆధారము, పరిపూర్ణప్రకాశము, మహాజ్ఞానరూపము అయిన పరశివుని విమర్శాశక్తినే శివాద్వైతశాస్త్రజ్ఞులు 'పరాహంతా' అని వ్యవహరించుచున్నారు.

**విమర్శభాండవిన్యస్త-**
**విశ్వతత్త్వవిజృంభణః ।**
**అనన్యముఖసంప్రేక్షీ**
**ముక్తః స్వాత్మని తిష్ఠతి ॥ 20-34**

విశ్వతత్త్వముల విజృంభణకు (శక్తితత్త్వముతో ప్రారంభమై పృథ్వీతత్త్వము వరకు గల వివిధ తత్త్వముల వికాసమునకు) విమర్శాశక్తియే(భాండస్థలమై) ఆధారమైయున్నది. ఈ భాండస్థలమునందలి యోగి (సమస్త తత్త్వములను భాండరూపమైన విమర్శాశక్తిలో లయింపజేసి) ముక్తుడై ఎటువంటి ఆలోచనలు లేకుండా తనలోతానే వుండిపోతాడు.

*ఇతి భాండస్థలం పరిసమాప్తమ్ ।*
భాండస్థలము ముగిసినది

### *97.* అథ భాజనస్థలమ్

**భాజనస్థలము**

**సమస్తజగదండానామ్**
**సర్గస్థిత్యంతకారణమ్ ।**
**విమర్శో భాసతే యత్ర**
**తద్భాజనమిహోచ్యతే ॥ 20-35**



సమస్త భువనబ్రహ్మాండముల సృష్టి, స్థితి మరియు లయలకు కారణమైన 'విమర్శ'యను పేర వ్యవహరించబడుతున్న పరబిందువు శివునితో కలిసి ఏ తిరోధానశక్తిగా ప్రకాశించుచున్నదో, అటువంటి తిరోధానశక్తిని కలిగిన పరశివబ్రహ్మమే భాజన (స్థల)మని పిలువబడినది.

**విమర్శాఖ్యా పరాశక్తిః**
**విశ్వవైచిత్ర్యకారిణీ ।**
**యస్మిన్ ప్రతిష్ఠితా బ్రహ్మ**
**తదిదం విశ్వభాజనమ్ ॥ 20-36**

చిత్రాతిచిత్రమైన విశ్వోత్పత్తికి కారణమైన 'విమర్శ' యను పరాశక్తి ఎందులో అవినాభావసంబంధముతో ప్రతిష్ఠితమైయున్నదో ఆ పరశివబ్రహ్మమునే విశ్వభాజన(స్థల)మని తెలియవలెను.

**అంతఃకరణరూపేణ**
**జగదంకురరూపతః ।**
**యస్మిన్ విభాతి చిచ్ఛక్తిః**
**బ్రహ్మభూతః స ఉచ్యతే ॥ 20-37**

శివునిలో అవినాభావసంబంధముతో కలిసి వున్న చిచ్ఛక్తి (విమర్శాశక్తి) విశ్వమను అంకుర (మొలక) రూపమునను అలాగే అంతఃకరణరూపమునను ఏ శివునిలో భాసించుచున్నదో అటువంటి ఆ శివుడే బ్రహ్మ అని పిలువబడినాడు.

**యథా చంద్రే స్థిరా జ్యోత్స్నా**
**విశ్వవస్తుప్రకాశినీ ।**
**తథా శక్తిర్విమర్శాత్మా**
**ప్రకాశే బ్రహ్మణి స్థితా ॥ 20-38**

చంద్రుని వెన్నెల స్థిరముగా (ఒకేచోట) వున్ననూ విశ్వమందలి సమస్త వస్తువులను ప్రకాశింపచేసినట్టుగానే పరశివబ్రహ్మయందున్న ఈ విమర్శాశక్తి తనలోని (కేవలం) ఒక్క అంశతో సకల జగత్తును వ్యాపించి ప్రకాశింప చేయుచున్నది.

**అకారః శివ ఆఖ్యాతో**
**హకారః శక్తిరుచ్యతే ।**
**శివశక్తిమయం బ్రహ్మ**
**స్థితమేకమహంపదే ॥ 20-39**

'అ' అను అక్షరంచేత 'శివుడు' చెప్పబడినాడు. 'హం' అను అక్షరం చేత దృక్-క్రియాత్మకమైన 'శక్తి' చెప్పబడినది. ఇలా 'అహం' అనే ఒకే పదము నందు శివశక్తిమయమైన పరబ్రహ్మము స్థితమైయున్నది.

**అహంతాం పరమాం ప్రాప్య**
**శివశక్తమయీం స్థిరామ్ ।**
**బ్రహ్మభూయంగతో యోగీ**
**విశ్వాత్మా ప్రతిభాసతే ॥ 20-40**



శివ-శక్తిమయమైన, స్థిరమైన, సర్వోత్కృష్టమైన అహంతా (పరహంతా) స్థితిని పొందిన బ్రహ్మస్వరూపుడైన యోగి విశ్వాత్మగా ప్రకాశిస్తాడు.

**వృక్షస్థం పత్రపుష్పాది**
**వటబీజస్థితం యథా ।**
**తథా హృదయబీజస్థమ్**
**విశ్వమేతత్ పరాత్మనః ॥ 20-41**

వటబీజమునందు ఆ వృక్షముయొక్క ఆకులు పూవులు ఎలా అణిగిమణిగి వున్నాయో అలాగే ఈ భాజనస్థలము నందలి యోగియొక్క హృదయమనే విత్తులో సమస్త విశ్వమూ అణిగి వుంటున్నది.

*ఇతి భాజనస్థలం పరిసమాప్తమ్ ।*

భాజనస్థలము ముగిసినది.

## *98. అథ అంగాలేపస్థలమ్*

## అంగాలేపస్థలము

**దిక్కాలాద్యనవచ్ఛిన్నమ్**
**చిదానందమయం మహత్ ।**
**యస్య రూపమిదం ఖ్యాతమ్**
**సోఽంగాలేప ఇహోచ్యతే ॥ 20-42**

దిక్కు-కాలము-దేశముల చేత పరిచ్ఛిన్నము (వేరుచేయడానికి వీలు)కానివాడు, (అన్ని దిక్కుల్లో, అన్ని కాలాల్లో, అన్ని దేశాలలో ఎల్లప్పుడూ

వుండేవాడు), చిదానందమయుడు, మహత్తరుడు, అయిన పరశివబ్రహ్మరూపమును పొందిన యోగి ఇక్కడ 'అంగాలేపు'డని పిలువబడతాడు. (ఇతనికి శరీరమునకు సంబంధించిన ఎటువంటి క్రియాకలాపముల బంధ(లేప)ము ఉండదు.)

**సమస్తజగదాత్మాఽపి**
**సంవిద్రూపో మహామతిః ।**
**లిప్యతే నైవ సంసారైః**
**యథా ధూమాదిభిర్నభః ॥ 20-43**

తనయందలి పొగ, మేఘముల వంటి వాటి వలన ఆకాశము ప్రభావితము కానట్టే మహామతి, సమస్తప్రపంచమునకు ఆత్మస్వరూపుడు, సంవిద్రూపుడు (చిద్రూపము) అయిన ఈ యోగి సంసారదోషముల చేత (బంధించబడదు) ప్రభావితుడు కాడు.

**న విధిర్న నిషేధశ్చ**
**న వికల్పో న వాసనా ।**
**కేవలం చిత్స్వరూపస్య**
**గలితప్రాకృతాత్మనః ॥ 20-44**

మాయాసంబంధము, కర్మప్రవృత్తులు లేని, కేవలం జ్ఞానస్వరూపుడుగానున్న యోగికి, విధ్యుక్త ధర్మాచరణముగాని, నిషిద్ధకర్మల పరిత్యాగముగాని, 'అదియా, ఇదియా' అన్న సంశయ(వికల్ప)ములుగాని, కర్మవాసనలు గాని వుండవు.



**ఘటాదిషు పృథగ్భూతమ్**
**యథాకాశం న భిద్యతే ।**
**తథోపాధిగతం బ్రహ్మ**
**నానారూపం న భిద్యతే ॥ 20-45**

ఘట, మఠాది ఉపాధులచేత ఆకాశము ఎలా వేరుచేయబడదో, అటులనే దేవ దానవ మానవులు అను ఉపాధులచేత బ్రహ్మము అనేక విధములుగా కనబడుచున్ననూ నిజస్థితిలో ఎటువంటి భేదమును కలిగి వుండదు.

**అనశ్వరమనిర్దేశ్యమ్**
**యథా వ్యోమ ప్రకాశతే ।**
**తథా బ్రహ్మాఽపి చైతన్యమ్**
**అత్ర వైశేషికీ కలా ॥ 20-46**

ఆకాశము వినాశరహితముగాను, చూపుటకు వీలుకానిదిగాను వున్నట్టే బ్రహ్మము కూడా చైతన్యరూపములో ప్రకాశించుచుండును. అయితే ఆ బ్రహ్మము దృక్-క్రియాశక్తి రూపమైన కళలతో కూడుకొని వుండుటయే దాని వైశిష్ట్యమై యున్నది.

**న దేవత్వం న మానుష్యమ్**
**న తిర్యక్త్వం న చాన్యథా ।**
**సర్వాకారత్వమాఖ్యాతమ్**
**జీవన్ముక్తస్య యోగినః ॥ 20-47**

జీవన్ముక్తుడైన యోగికి దేవత్వముగాని, మనుష్యత్వముగాని, పశుపక్ష్యాది రూపత్వముగాని, ఎటువంటి ఇతర రూపములుగాని ఉండవు. అయితే అతడు అందరిలోను పరిపూర్ణమైన చిదాకాశరూపములో ప్రకాశిస్తూ వుంటాడు.

**అఖండసంవిదానంద-**
**పరబ్రహ్మస్వరూపిణః ।**
**జీవన్ముక్తస్య ధీరస్య**
**మాయాకైంకర్యవాదినీ ॥ 20-48**

అఖండుడు, జ్ఞానానందమయుడు, పరబ్రహ్మస్వరూపుడు, ధీరుడు అయిన జీవన్ముక్తునికి మాయ సేవకురాలిగా వ్యవహరిస్తుంది.

*ఇతి అంగాలేపస్థలం పరిసమాప్తమ్ ।*
అంగాలేపస్థలము ముగిసినది.

## 99. అథ స్వపరాజ్ఞస్థలమ్

### స్వపరాజ్ఞస్థలము

**అప్రమేయే చిదాకారే**
**బ్రహ్మణ్యద్వైతవైభవే ।**
**విలీనః కిం ను జానాతి**
**స్వాత్మానం పరమేవ వా ॥ 20-49**

పరిమితిలేని (ప్రమాణములకు అందని) చిద్రూపమైన పరబ్రహ్మముతో అద్వైతస్థితిలో విలీనుడయిన యోగి తనను గాని, ఇతరులను గాని, బ్రహ్మముకన్నా వేరుగా ఎలా తెలుసుకుంటాడు?



**యత్ర నాస్తి భిదాయోగాత్**
**అహం త్వమితి విభ్రమః ।**
**న సంయోగో వియోగశ్చ**
**న జ్ఞేయజ్ఞాతృకల్పనా ॥ 20-50**

పరబ్రహ్మములో సమానసమరసభావముతో ఐక్యమును పొందిన తరువాత అక్కడ ఎటువంటి భేదభావమునకు చోటు వుండదు. నేను, నీవను భ్రమ వుండదు. సంయోగ వియోగములుండవు. జ్ఞేయజ్ఞాతృకల్పనలు కూడా వుండవు.

**న బంధో న చ ముక్తిశ్చ**
**న దేవాద్యభిమానితా ।**
**న సుఖం నైవ దుఃఖం చ**
**నాజ్ఞానం జ్ఞానమేవ వా ॥ 20-51**

ఆ ఐక్యస్థితిలో బంధనము వుండదు. మోచనము వుండదు. దేవతాభిమానము వుండదు. సుఖదుఃఖములు వుండవు. అజ్ఞానము వుండదు. జ్ఞానము వుండదు.

**నోత్కృష్టత్వం న హీనత్వమ్**
**నోపరిష్టాన్న చాప్యధః ।**
**న పశ్చాన్నైవ పురతో**
**న దూరే కించిదంతరే ॥ 20-52**

అదేవిధముగా ఐక్యస్థితిలో శ్రేష్ఠత్వము, హీనత్వము అను స్థితులుగాని, పైన క్రింద అను భావనలు గాని, ముందు వెనుకలు అను జ్ఞానము గాని, దూరము దగ్గరలను వ్యవహారములు గాని వుండవు.

**సర్వాకారే చిదానందే**
**సత్యరూపిణి శాశ్వతే ।**
**పరాకాశమయే తస్మిన్**
**పరే బ్రహ్మణి నిర్మలే ॥ 20-53**

**ఏకీభావముపేతానామ్**
**యోగినాం పరమాత్మనామ్ ।**
**పరాపరపరిజ్ఞాన**
**పరిహాసకథా కుతః ॥ 20-54**

సర్వస్వరూపము, చిదానందము, సత్యస్వరూపము, శాశ్వతము, పరాకాశరూపము, నిర్మలము అయిన ఆ పరశివబ్రహ్మములో (సామరస్యముతో) ఐక్యభావనను పొంది పరమాత్మస్వరూపులైన యోగులకు పర, అపర (నీవాడు నావాడు) అను పరిజ్ఞానపు పరిహాసాస్పదమైన మాటలు ఎలా వస్తాయి?

**దేశకాలానవచ్ఛిన్న-**
**తేజోరూపసమాశ్రయాత్ ।**
**స్వపరజ్ఞానవిరహాత్**
**స్వపరాజ్ఞస్థలం విదుః ॥ 20-55**



దేశకాలాదులచే పరిచ్ఛిన్నముకాని, అంతటా వ్యాపించివున్న జ్ఞానప్రకాశమును పొందిన ఆ యోగికి, నేను, అతడు అను భేదజ్ఞానము లేనందున దీనికి 'స్వపరాజ్ఞస్థల'మని శివాగమశాస్త్రజ్ఞులు తెలియజేసినారు.

ఇతి స్వపరాజ్ఞస్థలం పరిసమాప్తమ్।
స్వపరాజ్ఞస్థలము ముగిసినది

## 100. అథ భావాభావలయస్థలమ్
### భావాభావలయస్థలము

**త్వంతాహంతావినిర్ముక్తే**
**శూన్యకల్పే చిదంబరే ।**
**ఏకీభూతస్య సిద్ధస్య**
**భావాభావకథా కుతః ॥ 20-56**

నీవు, నేనను భేదభావము తొలగిపోయి, శూన్యసదృశమైన చిదాకాశముతో సామరస్యమును (ఐక్యము) పొందిన స్వపరాజ్ఞస్థల సిద్ధునికి భావ, అభావ ప్రసంగములు మాత్రము ఎలా కలుగుతాయి? (నేను అన్న పరిచ్ఛిన్నదేహభావము గాని, ఆత్మలేదను అభావముగాని ఎలా కలుగుతాయి? (కలుగవని అర్థము.)

**అహంభావస్య శూన్యత్వాత్**
**అభావస్య తథాఽఽత్మనః ।**
**భావాభావవినిర్ముక్తో**
**జీవన్ముక్తః ప్రకాశతే ॥ 20-57**

శరీరమే నేనను 'అహం' భావము, ఆత్మ లేదను అభావము, ఈ రెండూ శూన్యములయినందున భావాభావముల నుండి ముక్తుడయిన యోగి జీవన్ముక్తుడై ప్రకాశిస్తాడు.

**సుఖదుఃఖాదిభావేషు**
**నాభావో భావ ఏవ వా ।**
**విద్యతే చిత్స్వరూపస్య**
**నిర్లేపస్య మహాత్మనః ॥ 20-58**

చిత్(చైతన్య)స్వరూపుడు, నిర్లేపుడు (భేదములు లేనివాడు), మహాత్ముడు అయిన యోగి మనసులో సుఖదుఃఖములకు సంబంధించిన (నేను దుఃఖిని అను) భావము గాని లేదా (నేను సుఖిని కాదు అన్న) అభావము గాని (ఏదీ) ఉండదు.

**యస్మిన్ జ్యోతిషి చిద్రూపే**
**దృశ్యతే నైవ కించన ।**
**సద్రూపం వాప్యసద్రూపమ్**
**భావాభావం విముంచతః ॥ 20-59**

భావమును అభావమును రెంటినీ వదలిపెట్టిన యోగికి చిద్రూపమైన పరంజ్యోతిలో సద్రూపముగాని, అసద్రూపముగాని ఏదీ కనిపించదు. ('ఉన్నది' అన్న భావవ్యవహారంగాని, 'లేదు' అన్న అభావ వ్యవహారము గాని ఈ యోగికి వుండవు).



**ప్రతీయమానౌ విద్యేతే**
**భావాభావౌ న కుత్రచిత్ ।**
**లింగైక్యే సతి యత్తస్మాత్**
**భావాభావలయస్థలమ్ ॥ 20-60**

లింగైక్యరూపమైన సామరస్యస్థితిని పొందిన యోగికి ఎక్కడా భావాభావముల జ్ఞానమే వుండదు. అందువలననే దీనిని భావాభావలయస్థలమని వ్యవహరించారు. (సామాన్యజీవులలో కనిపించే భావాభావముల వ్యవహారము లింగైక్యునిలో వుండవు).

*ఇతి భావాభావలయస్థలం పరిసమాప్తమ్ ।*
భావాభావలయస్థలము ముగిసినది.

### *101.* అథ జ్ఞానశూన్యస్థలమ్

**జ్ఞానశూన్యస్థలము**

**పరాపరసమాపేక్ష -**
**భావాభావవివేచనమ్ ।**
**జ్ఞానం బ్రహ్మణి తన్నాస్తి**
**జ్ఞానశూన్యస్థలం విదుః ॥ 20-61**

పర మరియు అపరములను అవలంబించి ఉత్పన్నమగు భావ, అభావముల వివేకరూపమైన భేదజ్ఞానము, పరబ్రహ్మస్థితిని పొందిన ఈ యోగికి వుండనే వుండదు. ఇందుకే దీనిని 'జ్ఞానశూన్యస్థల'మని అన్నారు.

**జలే జలమివ న్యస్తమ్**
**వహ్నౌ వహ్నిరివార్పితమ్ ।**
**పరే బ్రహ్మణి లీనాత్మా**
**విభాగేన న దృశ్యతే॥ 20-62**

నీటిలో నీరు కలిసినట్టు, నిప్పులో నిప్పు అణిగినట్టు, పరబ్రహ్మలో ఐక్యమైన యోగి పరబ్రహ్మము కన్నా వేరుగా కనబడదు. (పరబ్రహ్మమే అవుతాడు).

**సర్వాత్మని పరే తత్త్వే**
**భేదశంకావివర్జితే ।**
**జ్ఞాత్రాదివ్యవహారోత్థమ్**
**కుతో జ్ఞానం విభావ్యతే ॥ 20-63**

భేదశంకకు అవకాశము లేని, సర్వాత్మ అయిన ఆ పరతత్త్వ విషయమున (జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ అను త్రిపుటితో) వుత్పన్నమగు జ్ఞానమునకు చోటెక్కడ వున్నది? (జ్ఞానమునకు అవకాశమే లేదని అర్థము).

**నిర్వికారం నిరాకారమ్**
**నిత్యం సీమావివర్జితమ్ ।**
**వ్యోమవత్పరమం బ్రహ్మ**
**నిర్వికల్పతయా స్థితమ్ ॥ 20-64**



**న పృథ్వ్యాదీని భూతాని**
**న గ్రహా నైవ తారకాః ।**
**న దేవా న మనుష్యాశ్చ**
**న తిర్యంచో న చాపరే ॥ 20-65**

**తస్మిన్ కేవలచిన్మాత్ర -**
**సత్తానందైకలక్షణే ।**
**త్వంతాహంతాదిసంరూఢమ్**
**విజ్ఞానం కేన భావ్యతే ॥ 20-66**

నిర్వికారము (అస్తి-జాయతే- వర్ధతే- విపరిణమతే- అపక్షీయతే- వినశ్యతి అను ఆరువిధములయిన వికారములకు లోనుకాని), నిరాకారము, నిత్యము, ఆకాశము వలె ఎల్లలు లేని, నిర్వికల్పమైన బ్రహ్మములో పృథివ్యాదిభూతములు గాని, సూర్యాదిగ్రహములుగాని, అశ్విన్యాది నక్షత్రములుగాని, విష్ణ్వాది దేవతలుగాని, మనుష్యులుగాని, పక్షిజంతువులుగాని, మరి ఏవైనా గాని అవి వేరు వేరుగా కనబడవు. అటువంటి సచ్చిదానందస్వరూపము, చిన్మాత్రము అయిన కేవలపరబ్రహ్మస్థితిలో త్వం (నీవు), అహం (నేను), అనుజ్ఞానము ఎలా కలుగుతుంది?

**జ్ఞేయాభావాద్విశేషేణ**
**శూన్యకల్పం విభావ్యతే ।**
**జ్ఞాతృజ్ఞేయాదిభిః శూన్యమ్**
**శూన్యం జ్ఞానాదిభిర్గుణైః ॥ 20-67**

**ఆదావంతే చ మధ్యే చ**
**శూన్యం సర్వత్ర సర్వదా ।**
**ద్వితీయేన పదార్థేన**
**శూన్యం శూన్యం విభావ్యతే ॥ 20-68**

ఇటువంటి పరబ్రహ్మములో తెలియవలసిన మరొక (జ్ఞేయ) వస్తువు లేనందున ఇది జ్ఞానశూన్యసదృశముగానుండును. అటులనే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయాది త్రిపుటి వ్యవహారము కూడా శూన్యమే. ఈ పరబ్రహ్మములో జ్ఞానాదిగుణములు కూడా శూన్యములే. ఆది-మధ్య-అంతము, అన్నిచోట్లను అది ఎప్పుడూ శూన్యముగానే వుంటున్నది. ఆ పరబ్రహ్మము తప్ప, రెండవ పదార్థము లేనందున అది శూన్యముగానే ప్రతీతి కలుగుచున్నది.

**కేవలం సచ్చిదానంద-**
**ప్రకాశాద్వయలక్షణమ్ ।**
**శూన్యకల్పం పరాకాశమ్**
**పరబ్రహ్మ ప్రకాశతే ॥ 20-69**

కేవల సచ్చిదానందస్వరూపము, ప్రకాశరూపము, అద్వయ స్వరూపము, పరాకాశరూపము అయిన పరబ్రహ్మము శూన్యరూపములోనే ప్రకాశిస్తుంది.

**శూన్యజ్ఞానాదిసంకల్పే**
**శూన్యసర్వార్థసాధనే ।**
**జ్యోతిర్లింగే చిదాకారే**



**స్వప్రకాశే నిరుత్తరే ।**
**ఏకీభావముపేతస్య**
**కథం జ్ఞానస్య సంభవః ॥ 20-70**

జ్ఞానాది సంకల్పములచేత శూన్యమైన, ధర్మ-అర్థ- కామ-మోక్షములను సర్వార్థసాధనాశూన్యమైన, స్వయంప్రకాశరూపమైన, చిద్రూపమైన, అన్నిటికీ అంతమునందున్న, ఆ జ్యోతిర్లింగము (నందు) సామరస్యపూర్వకమైన ఐక్యభావనను పొందిన ఈ యోగికి జ్ఞానమెలా సంభవిస్తుంది?

**యస్య కార్యదశా నాస్తి**
**కారణత్వమథాపి వా ।**
**శేషత్వం నైవ శేషిత్వం**
**స ముక్తః పర ఉచ్యతే ॥ 20-71**

ఏ యోగికి కార్యకారణముల భావముగాని మరియు శేషశేషీభావములుగాని వుండవో అటువంటి పరాత్పరుడయిన యోగి ముక్తుడు అని చెప్పబడతాడు.

**ఏతావదుక్త్వా పరమప్రబోధమ్**
**అద్వైతమానందశివప్రకాశమ్ ।**
**దేవ్యై పురా భాషితమీశ్వరేణ**
**తూష్ణీమభూద్ధ్యానపరో గణేంద్రః ॥ 20-72**

– (ఇంద్రవజ్రా)

ఇట్లు పూర్వము పార్వతీదేవికి పరమేశ్వరుడు ఉపదేశించిన అద్వితీయము, ఆనందరూపము, శివప్రకాశము, పరమబోధరూపము అయిన (పిండస్థలముతో ఆరంభమై జ్ఞానశూన్యస్థలము వరకు గల వీరశైవ) శాస్త్రమును అగస్త్యునకు ఉపదేశించి గణేంద్రుడయిన శ్రీరేణుకుడు మౌనముదాల్చి ధ్యానాసక్తచిత్తుడైనాడు.

ఇతి జ్ఞానశూన్యస్థలం పరిసమాప్తమ్
జ్ఞానశూన్యస్థలము ముగిసినది.

**శాస్త్రోపసంహారః**
**శాస్త్రోపసంహారము**

**అథ శివైక్యస్థలమ్**
**శివైక్యస్థలము**

**ఏవముక్త్వా సమాసీనమ్**
**శివయోగపరాయణమ్ ।**
**రేణుకం తం సమాలోక్య**
**బభాషే ప్రాంజలిర్మునిః ॥ 20-73**

ఈ విధంగా ఉపదేశించి మౌనమునుదాల్చిన శివయోగ పరాయణుడైన శ్రీరేణుకగణేశ్వరుని చూసి, అంజలిబద్ధుడై అగస్త్యుడిలా చెప్పసాగాడు.

**శివయోగవిశేషజ్ఞ**
**శివజ్ఞానమహోదధే ।**



**సమస్తవేదశాస్త్రాది**
**వ్యవహారధురంధర ॥ 20-74**

**ఆలోకమాత్రనిర్ధూత-**
**సర్వసంసారబంధన ।**
**స్వచ్ఛందచరితోల్లాస**
**స్వప్రకాశాత్మవచ్ఛివ ॥ 20-75**

**అవతీర్ణమిదం శాస్త్రమ్**
**అనవద్యం త్వదాననాత్ ।**
**శ్రుత్వా మే మోదతే చిత్తమ్**
**జ్యోతిః పశ్యే శివాభిధమ్ ॥ 20-76**

ఓ రేణుక గణేశ్వరా ! నీవు శివయోగరహస్యమును చక్కగా ఎరిగినవాడవు. నీవు శివజ్ఞానసాగరుడవు. సకలవేద-ఆగమ-పురాణాది శాస్త్రములలో నీవు అత్యంత ప్రవీణుడవు. కేవలం నీ కృపాదృష్టిచేతనే జీవుల సంసారబంధములను ఛేదించు సామర్థ్యము కలవాడవు. నీవు సర్వతంత్ర స్వతంత్రుడవు. స్వయంప్రకాశరూపుడైన శివుడే నీవైయున్నావు. పరమపవిత్రమైన (ఏకోత్తరశతస్థలాత్మకమైన) ఈ శాస్త్రము నీ ముఖకమలము నుండి వెలువడినది. దీనిని ఆలకించి నా చిత్తము ఆనందముతో నిండిపోయినది. నేను శివుడనుజ్యోతిని చూచుచున్నాను.

**అద్య మే సఫలం జన్మ**
**గతో మే చిత్తవిభ్రమః ।**

**సంజాతా పాశవిచ్ఛిత్తిః**
**తపాంసి ఫలితాని చ ॥ 20-77**

**ఇదానీమేవ మే జాతమ్**
**మునిరాజోత్తమోత్తమమ్ ।**
**ఇతః పరం మయా నాస్తి**
**సదృశో భువనత్రయే ॥ 20-78**

**శాస్త్రం తవ ముఖోద్గీర్ణమ్**
**శివాద్వైతపరం పరమ్ ।**
**మాం వినా కస్య లోకేషు**
**శ్రోతుమస్తి తపః శుభమ్ ॥ 20-79**

**తపసాం పరిపాకేన**
**శంకరస్య ప్రసాదతః ।**
**ఆగతస్త్వం మహాభాగ**
**మాం కృతార్థయితుం గిరా ॥ 20-80**

ఓ గణేంద్రుడా! నేటికి నాజన్మము సఫలమైనది. నా మనసులోని సంశయభ్రాంతులు తొలగిపోయినవి. నా పాపములు విచ్ఛేదములైనవి. నా తపస్సు ఫలించిది. సర్వోత్తముడైన మునీంద్రుడను ప్రఖ్యాతి ఇప్పుడే నాకు లభించినది. త్రిభువనములలో నా వంటి (అదృష్టవంతుడు) వాడు ఎవరూ వుండరు. ఎందువలననగా మీ ముఖారవిందము నుండి వెలువడిన



శివాద్వైతపరము సర్వశ్రేష్ఠము అయిన ఈ శాస్త్రమును ఆలకించు అవకాశము నాకు దక్కుట నా పవిత్రతపఃఫలమని నమ్ముతున్నాను. నేను చేసిన తపఃఫలము వలనను, శివుని అనుగ్రహము వలనను మీ ఉపదేశముతో నన్ను కృతార్థుని చేయుటకు మహామహిమాన్వితులైన మీరు ఇక్కడికి ఏతెంచినారు (అని అగస్త్యుల వారు శ్రీ రేణుక భగవత్పాదులను స్తుతించారు).

**ఇతి స్తువంతం వినయాత్**
**అగస్త్యం మునిపుంగవమ్ ।**
**ఆలోక్య కరుణాదృష్ట్యా**
**బభాషే స గణేశ్వరః ॥ 20-81**

**అగస్త్య మునిశార్దూల**
**తపఃసిద్ధమనోరథ ।**
**త్వాం వినా శివశాస్త్రస్య**
**కః శ్రోతుమధికారవాన్ ॥ 20-82**

**పాత్రం శివప్రసాదస్య**
**భవానేకో న చాపరః ।**
**ఇతి నిశ్చిత్య కథితమ్**
**మయా తే తంత్రమీదృశమ్ ॥ 20-83**

**స్థాప్యతాం సర్వలోకేషు**
**తంత్రమేతత్ త్వయా మునే ।**

ఈదృశం శివబోధస్య
సాధనం నాస్తి కుత్రచిత్ ॥ 20-84

రహస్యమేతత్ సర్వజ్ఞః
సర్వానుగ్రాహకః శివః ।
అవాదీత్ సర్వలోకానామ్
సిద్ధయే పార్వతీపతిః ॥ 20-85

తదిదం శివసిద్ధాంత
సారాణాముత్తమోత్తమమ్ ।
వేదవేదాంతసర్వస్వమ్
విద్యాచారప్రవర్తకమ్ ॥ 20-86

వీరమాహేశ్వరగ్రాహ్యమ్
శివాద్వైతప్రకాశకమ్ ।
పరీక్షితేభ్యో దాతవ్యమ్
శిష్యేభ్యో నాన్యథా క్వచిత్ ॥ 20-87

ఏతచ్ఛ్రవణమాత్రేణ
సర్వేషాం పాపసంక్షయః ।
అవతీర్ణం మయా భూమౌ
శాస్త్రస్యాస్య ప్రవృత్తయే ।



ప్రవర్తయ శివాద్వైతమ్
త్వమపి జ్ఞానమీదృశమ్ ॥ 20-88

ఇలా వినయపూర్వకముగా స్తుతించిన మునిపుంగవుడైన అగస్త్యుని చూచి తన కారుణ్యదృష్టితో శ్రీరేణుకగణేశ్వరులిలా చెప్పసాగారు. మునిశ్రేష్ఠుడా! తపస్సుతో మనోరథములను సిద్ధింపచేసుకున్న ఓ అగస్త్య మహర్షీ! ఈ శివాద్వైత శాస్త్రమును ఆలకించు యోగ్యత నీకుదప్ప వేరెవరికున్నది? భూలోకమున శివప్రసాదప్రాప్తికి నీవొక్కడవే అర్హుడవు, వేరెవరూ కారు అని నిశ్చయించుకున్న తరువాతనే ఈ వీరశైవసిద్ధాంతశాస్త్రమును నీకు ఉపదేశించితిని. శివుని యదార్థస్వరూపమును తెలుసుకొనుటకు ఈ తంత్రసిద్ధాంతము తప్ప మరో మార్గము లేదు. అందువల్ల ఓ మహర్షీ! నీవు కూడా ఈ తంత్రమును లోకమంతటా ప్రసారము చేయుము. లోకము నందలి సమస్త జీవుల కల్యాణసిద్ధి కొరకు సర్వజ్ఞుడు, సర్వానుగ్రహసమర్థుడు, పార్వతీపతి అయిన శివుడు రహస్యమైన ఈ సిద్ధాంతశాస్త్రమును ఉపదేశించినాడు. శివుడుపదేశించిన ఈ శాస్త్రము శైవసిద్ధాంత సారభూతమైనది. సర్వోత్కృష్టమైనది. ఇది వేదోపనిషత్తుల సారరూపము, సర్వస్వము అయియున్నది. అలాగే జ్ఞానమును ఆచారమును రెండింటినీ బోధించుచున్నది. వీరమాహేశ్వరుల చేత అధ్యయన యోగ్యము, శివాద్వైతసిద్ధాంతప్రతిపాదకము అయిన ఈ శాస్త్రమును పరీక్షచేయబడిన శిష్యులకు మాత్రమే బోధించవలెను. ఇతరులకు (పరీక్షించనిదే) బోధించరాదు. ఈ శివాద్వైతసిద్ధాంతమును విన్నంతమాత్రముననే జీవులందరి పాపములు తొలగిపోవును. ఈ శాస్త్రమును భూలోకమున ప్రవర్తింప చేయుటకే నేను

అవతరించినాను. ఓ అగస్త్యుడా! నీవు కూడా ఈ శివాద్వైతజ్ఞానమును లోకమంతటా ప్రచారము చేయము.

ఇతి శివైక్యస్థలం పరిసమాప్తమ్ ।

శివైక్యస్థలము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ ఐక్యస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగోనామ వింశతితమః పరిచ్ఛేదః ।***

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీ సిద్ధాంతశిఖామణిలో ఐక్యస్థలాంతర్గత నవవిధలింగస్థల ప్రసంగమను ఇరువదవ పరిచ్ఛేదము ముగిసినది.



# ఏకవింశః పరిచ్ఛేదః

## ఇరువది యొకటవ పరిచ్ఛేదము

## విభీషణాభీష్టప్రదానమ్

## విభీషణాభీష్టప్రదానము

**(55 శ్లోకములు)**

**ఇత్యుక్త్వా పశ్యతస్తస్య**
**పురస్తాదేవ రేణుకః ।**
**అంతర్దధే మహాదేవమ్**
**చింతయన్నంతరాత్మనా ॥ 21-1**

ఈ విధముగా అగస్త్యమహర్షికి శాస్త్రోపదేశమునున చేసిన శ్రీరేణుకులు తన అంతరంగమున మహాదేవుని స్మరించుచూ అందరూ చూచుచుండగనే అంతర్ధానమైనారు.

**అంతర్హితే తదా తస్మిన్**
**మునిరాశ్చర్యసంకులః ।**
**తచ్ఛాస్త్రప్రవణో భూత్వా**
**సమవర్తిత సంయమీ ॥ 21-2**

ఇలా శ్రీ రేణుక గణేశ్వరుడు అంతర్ధానముకాగా సంయమి అయిన అగస్త్యముని ఆశ్చర్యముతో కూడుకున్నవాడై, గణేశ్వరునిచే ఉపదేశించబడిన శాస్త్రముయొక్క అనుష్ఠానమునందు ఆసక్తిగలవాడయ్యెను.

**యః ఇదం శివసిద్ధాంతమ్**
**వీరశైవమతం పరమ్ ।**
**శృణోతి శుద్ధమనసా**
**స యాతి పరమాం గతిమ్ ॥ 21-3**

సర్వోత్కృష్టమైన వీరశైవమతమునకు సంబంధించిన ఈ శివసిద్ధాంత శాస్త్రమును ఎవరు పరిశుద్ధమైనమనసుతో అధ్యయనము చేయుదురోవారు పరమోన్నతగతిని (లింగాంగ సామరస్యమును) పొందెదరు.

**స్వచ్ఛందాచారరసికః**
**స్వేచ్ఛానిర్మితవిగ్రహః ।**
**ఆససాద పురీం లంకామ్**
**రేణుకో గణనాయకః ॥ 21-4**

తన ఇచ్ఛానుసారము ఆకారములను దాల్చగలిగినవాడు, స్వేచ్ఛగా సంచరించుటకిష్టపడువాడు అయిన గణములకధినాయకుడైన శ్రీ రేణుకులవారు లంకానగరమును చేరుకున్నారు.

**తమాగతం మహాభాగమ్**
**సర్వాగమవిశారదమ్ ।**
**విభీషణః సమాలోక్య**
**గేహం ప్రావేశయన్నిజమ్ ॥ 21-5**



సకలాగమవిశారదుడు, మహనీయుడు అయిన శ్రీరేణుకులవారి రాకను గమనించిన విభీషణుడు వారిని తన అంతఃపురములోనికి ఆహ్వానించి తీసుకొనివెళ్ళాడు.

**భద్రాసనే నిజే రమ్యే**
**నివేశ్య గణనాయకమ్ ।**
**అర్ఘ్యపాద్యాదిభిః సర్వైః**
**ఉపచారైరపూజయత్ ॥ 21-6**

సుందరము మంగళమయము అయిన తన సింహాసనముపై కూర్చుండజేసి అర్ఘ్య పాద్యాదులతోను ఇతరసమస్తములైన ఉపచారములతోను విభీషణుడు ఆ గణశ్రేష్ఠుని పూజించినాడు.

**పూజితేన ప్రసన్నేన**
**రేణుకేన నిరూపితః ।**
**నిషసాద తదభ్యాసే**
**స నిజాసనమాశ్రితః ॥ 21-7**

పూజలతో ప్రసన్నుడైన శ్రీ రేణుకులవారి ఆదేశానుసారము విభీషణుడు సమీపమునందున్న తన ఆసనము నలంకరించెను.

**ఆబభాషే గణేంద్రం తమ్**
**కృతాంజలిర్విభీషణః ।**

**మానుషాకారసంపన్నమ్**
**సాక్షాచ్ఛివమివాపరమ్ ॥ 21-8**

మానవాకారమున ఏతెంచిన సాక్షాత్తు అపరశివునివలె ప్రకాశించుచున్న శ్రీరేణుకగణేశ్వరులతో విభీషణుడు చేతులు జోడించి ఇలా విన్నవించుకొనెను.

**రేణుక త్వం గణాధీశ**
**శివజ్ఞానపరాయణ ।**
**అవతీర్ణం మహీమేనామ్**
**ఇతి సమ్యక్ శ్రుతం మయా ॥ 21-9**

శివజ్ఞానపరాయణులైన శ్రీరేణుక గణాధీశులారా! మీరు భూలోకమునందు అవతరించినట్టుగా ఇంతకుముందే తెలుసుకున్నాను.

**మద్భాగ్యగౌరవాదద్య**
**సమాయాస్త్వం పురీమిమామ్ ।**
**కథం భాగ్యవిహీనానామ్**
**సులభాః స్యుర్భవాదృశాః ॥ 21-10**

ఇపుడు నా సౌభాగ్యవిశేషమువలన మీరు ఈ నగరమునకు ఏతెంచినారు. మీ వంటి మహానుభావులు భాగ్యహీనులైన సామాన్య జనావళికి సులభముగా ఎట్లు లభింతురు?



**మత్సమో నాస్తి లోకేషు**
**భాగ్యాతిశయవత్తయా ।**
**యస్య గేహం స్వయం ప్రాప్తో**
**భవాన్ సాక్షాన్మహేశ్వరః ॥ 21-11**

సాక్షాత్తు మహేశ్వరులైన మీరు స్వయముగా నారాజ ప్రాసాదమునకు దయచేసినందున నాతో సమానమైన భాగ్యవంతులు ఈ లోకములో ఎవరూ వుండరు.

**కృతార్థా మే పురీ హ్యేషా**
**కృతార్థో రాక్షసాన్వయః ।**
**జీవితం చ కృతార్థం మే**
**యస్య త్వం దృష్టిగోచరః ॥ 21-12**

మీరు మా దృష్టిగోచరులయినందున (మాకు దర్శనయోగ్యులయినందున) ఈ నా నగరము కృతార్థమైనది. నా రాక్షసవంశము ధన్యమైనది. నా జీవనము సఫలమైనది.

**ఇతి బ్రువాణం కల్యాణమ్**
**రాక్షసేంద్రం గణేశ్వరః ।**
**బభాషే సస్మితో వాణీమ్**
**విశ్వోల్లాసకరీం శుభామ్ ॥ 21-13**

ఈ విధముగా పలికిన మంగళమయుడు రాక్షసేంద్రుడు అయిన విభీషణుని గురించి శ్రీరేణుకగణేశ్వరులు విశ్వమునకంతటికీ ఆనందమును కలుగజేయు చిరునగువుతో ఇలా చెప్పసాగారు.

**విభీషణ మహాభాగ**
**జానే త్వాం ధర్మకోవిదమ్ ।**
**త్వాం వినా కస్య లోకేషు**
**జాయతే భక్తిరీదృశీ ॥ 21-14**

మహాభాగ్యశాలి అయిన విభీషణుడా! నీవు ధర్మకోవిదుడవని నేను ఎరుగుదును. నీలో తప్ప, ఈ లోకమున ఇటువంటి భక్తి వేరెవరియందుండును?

**సమస్తశాస్త్రసారజ్ఞమ్**
**సర్వధర్మపరాయణమ్ ।**
**అధ్యాత్మవిద్యానిరతమ్**
**ఆహుస్త్వాం రాక్షసేశ్వర ॥ 21-15**

ఓ రాక్షసేశ్వరుడైన విభీషణుడా! నీవు సర్వశాస్త్రసారములను తెలుసుకున్నవాడివని, సర్వధర్మపరాయణుడవని, ఆధ్యాత్మవిద్యయందు నిష్ఠకలిగినవాడవని లోకులందరూ చెప్పుచున్నారు.

**త్వదీయధర్మసంపత్తిమ్**
**శ్రుత్వాఽహం విస్మితాశయః ।**



**వ్రజన్ కైలాసమచలమ్**
**త్వదంతికముపాగతః ॥ 21-16**

కైలాసపర్వతమునకు వెళుతున్న నేను నీ ధర్మసంపదను గురించి విని ఆశ్చర్యచకితుడనై నీ వద్దకు వచ్చినాను.

**ప్రీతోఽస్మి తవ చారిత్రైః**
**శోభనైర్లోకవిశ్రుతైః ।**
**దాస్యామి తే వరం సాక్షాత్**
**ప్రార్థయస్వ యథేప్సితమ్ ॥ 21-17**

జగత్ప్రసిద్ధము, మంగళకరము అయిన నీ నడవడికచేత ఉత్తమమైన ఆచరణచేతను నేను సంతుష్టుడనైనాను. నీకిష్టమైన వరమును యథేచ్ఛగా కోరుకొమ్ము. దానిని నీకు ప్రసాదించెదను.

**ఇతి ప్రసాదసుముఖే**
**భాషమాణే గణేశ్వరే ।**
**ప్రణమ్య పరయా ప్రీత్యా**
**వ్యాజహార విభీషణః ॥ 21-18**

ఇలా ప్రసన్నవదనముతో శ్రీరేణుకగణేశ్వరులు పలుకగా విభీషణుడు అత్యంతప్రేమతో నమస్కరించి ఇలా చెప్పసాగాడు.

**ఆగమానుగ్రహాదేవ**
**భవతః శివయోగినః ।**

**దుర్లభాః సర్వలోకానామ్**
**సమపద్యంత సంపదః ॥ 21-19**

ఓ గణశ్రేష్ఠుడా! శివయోగులైన మీ ఆగమనరూపమైన అనుగ్రహము వలననే సమస్తలోకులకు దుర్లభములైన సంపదలు లభించుచున్నవి.

**తథాపి ప్రార్థనీయం మే**
**కించిదస్తి గణేశ్వర ।**
**సుకృతే పరిపక్వే హి**
**స్వయం సిద్ధ్యతి వాంఛితమ్ ॥ 21-20**

ఓ గణేశ్వరుడా! అయిననూ నేను కోరుకొనవలసినది కొంతవున్నది. సుకృతము(పుణ్యము) పరిపక్వమయినపుడు ఆపేక్షించిన కోరికలు తమకుతామే సిద్ధించును.

**రావణో హి మమ భ్రాతా**
**మాహేశ్వరశిఖామణిః ।**
**అదృష్టశత్రుసంబాధమ్**
**శశాస హి జగత్త్రయమ్ ॥ 21-21**

నా సోదరుడైన రావణుడు మాహేశ్వరుని భక్తశిరోమణిగా వుండేవాడు. ఎటువంటి శత్రుబాధలేకుండా ఈ ముల్లోకములను శాసించినాడు.



**యస్య ప్రతాపమతులమ్**
**సోఢుమక్షతశక్తయః ।**
**ఇంద్రాదయః సురాః సర్వే**
**రాజ్యలక్ష్మ్యా వియోజితాః ॥ 21-22**

అసమానమైన అతని పరాక్రమము నెదుర్కొనుటలో అసమర్థులయిన ఇంద్రాది సమస్తదేవతలు తమ రాజ్యలక్ష్ములను పోగొట్టుకున్నారు.

**స తు కాలవశేనైవ**
**స్వచరిత్రవిపర్యయాత్ ।**
**రణే విష్ణ్వవతారేణ**
**రామేణ నిహతోఽభవత్ ॥ 21-23**

అటువంటి రావణుడు తన కాలవశముచేతను, విపర్యాసమైన చరిత్ర వలనను యుద్ధభూమిలో విష్ణువు అవతారమైన రామునిచేత చంపబడినాడు.

**స తు రామశరావిద్ధః**
**కంఠస్ఖలితజీవితః ।**
**అవశిష్టం సమాలోక్య**
**మామవాదీత్ సుదుఃఖితః ॥ 21-24**

యుద్ధరంగములో రామబాణమునకు గురియై, కొనవూపిరితోనున్న రావణుడు రాక్షసవంశములో మిగిలివున్న నన్ను చూసి అత్యంత దుఃఖముతో ఇలా చెప్పాడు –

**విభీషణ విశేషజ్ఞ**
**మహాబుద్ధే సుధార్మిక ।**
**అవశిష్టోఽసి వంశస్య**
**రక్షసాం భాగ్యగౌరవాత్ ॥ 21-25**

ఓ విభీషణా! నీవు ధర్మతత్పరుడవు, బుద్ధిమంతుడవు, వివేకవంతుడవు! రాక్షస వంశము చేసుకున్న సౌభాగ్యమువలన నీవొక్కడివే జీవించివున్నావు.

**వయమజ్ఞానసంపన్నా**
**మహత్సు ద్రోహకారిణః ।**
**ఈదృశీం తు గతిం ప్రాప్తా**
**దుస్తరా హి విధిస్థితిః ॥ 21-26**

అజ్ఞానులమయిన మేము మహాత్ములకు ద్రోహము చేసి ఇటువంటి దుర్గతిని పొందినాము. విధివిధానమును దాటుటకష్టము కదా!

**నవకం లింగకోటీనామ్**
**ప్రతిష్ఠాప్యమిహ స్థలే ।**



**ఇతి సంకల్పితం పూర్వమ్**
**మయా తదవశిష్యతే ॥ 21-27**

ఈ లంకానగరములో తొమ్మిదికోట్ల శివలింగములను ప్రతిష్ఠించవలెనని ఒకప్పుడు నేను సంకల్పించితిని. అది (పూర్తిగా నెరవేరక) కొంత మిగిలివున్నది.

**కోటిషట్కం తు లింగానామ్**
**మయా సాధు ప్రతిష్ఠితమ్ ।**
**కోటిత్రయం తు లింగానామ్**
**స్థాపనీయమతస్త్వయా॥ 21-28**

నా సంకల్పానుసారము ఆరు కోట్లలింగములను నేను చక్కగా ప్రతిష్ఠించగలిగితిని. మూడుకోట్లలింగముల ప్రతిష్ఠాపనము మిగిలివున్నది. అందువలన ఆ (మూడుకోట్ల లింగముల ప్రతిష్ఠాపన)కార్యమును నీవు నెరవేర్చవలెను.

**ఇతి తస్య వచః శ్రుత్వా**
**దీనబుద్ధేర్మరిష్యతః ।**
**తథా సాధు కరోమీతి**
**ప్రతిజ్ఞాతం మయా తథా ॥ 21-29**

ఇలా మరణసమయములో దీనబుద్ధితో పలికిన నా సోదరుని మాటలను విని 'సోదరా! నీ సంకల్పమును తప్పక నెరవేర్చెద'నని నాచే ప్రతిజ్ఞ చేయబడినది.

**యుగపచ్ఛివలింగానామ్**
**కోటిత్రయమనుత్తమమ్ ।**
**ప్రతిష్ఠాప్యం యథాశాస్త్రమ్**
**ఇతి మే నిశ్చయోఽభవత్ ॥ 21-30**

శ్రేష్ఠములైన మూడుకోటిశివలింగములను ఏకకాలమున శాస్త్రవిధిననుసరించి ప్రతిష్ఠింపచేయవలెనని నిశ్చయించుకున్నాను.

**లింగకోటిత్రయస్యేహ**
**యుగపత్ స్థాపనావిధౌ ।**
**అవిదన్నేకమాచార్యమ్**
**అహమేవమవస్థితః ॥ 21-31**

అయితే ఒకే ముహూర్తమున మూడుకోటిలింగములను ప్రతిష్ఠింప చేయగల సమర్థుడైన ఆచార్యుని గానక ఊరకనే ఇలా కూర్చొని ఉన్నాను.

**శివశాస్త్రవిశేషజ్ఞ**
**శివజ్ఞాననిధిర్భవాన్ ।**
**ఆచార్యభావమాసాద్య**
**మమ పూరయ వాంఛితమ్ ॥ 21-32**

శివశాస్త్రరహస్యములను చక్కగా తెలుసుకున్న ఓ రేణుక భగవత్పాదులారా! మీరు శివజ్ఞానమునకు సముద్రమువంటివారు.



అందువలన మీరు ఆచార్యభావమును స్వీకరించి నా ఇష్టార్థమును నెరవేర్చగలరు.

**తస్యేతి వచనం శ్రుత్వా**
**రాక్షసేంద్రస్య ధీమతః ।**
**తథేతి ప్రతిశుశ్రావ**
**సర్వజ్ఞో గణనాయకః ॥ 21-33**

ధీమంతుడు రాక్షసేంద్రుడు అయిన విభీషణుని ఈ మాటలను విన్న సర్వజ్ఞుడైన శ్రీరేణుకగణనాయకుడు 'అలాగు'ననేయని అందుకంగీకరించినాడు.

**తతః సంతుష్టచిత్తస్య**
**పౌలస్త్యస్యేష్టసిద్ధయే ।**
**కోటిత్రయం తు లింగానామ్**
**యథాశాస్త్రం యథావిధి ।**
**త్రికోట్యాచార్యరూపేణ**
**స్థాపితం తేన తత్క్షణే ॥ 21-34**

తరువాత సంతుష్టచిత్తుడు, పులస్త్యబ్రహ్మకుమారుడు అయిన విభీషణుని ఇష్టార్థసిద్ధికి శ్రీరేణుకగణేశ్వరుడు లంకలో మూడుకోట్ల ఆచార్యుల రూపములను ఏకకాలమున ధరించి శాస్త్రవిధానము ననుసరించి ఒకే క్షణమున మూడుకోట్ల లింగములను ప్రతిష్ఠింపచేసెను.

**తాదృశం తస్య మాహాత్మ్యమ్**
**సమాలోక్య విభీషణః ।**
**ప్రణనామ ముహుర్భక్త్యా**
**పాదయోస్తస్య విస్మితః ॥ 21-35**

ఇటువంటి అద్భుతమైన రేణుకగణేశ్వరుని మాహాత్మ్యమును చూసి ఆశ్చర్యచకితుడైన విభీషణుడు అత్యంతభక్తితో అతని పాదములకు మరల మరలా నమస్కరించినాడు.

**ప్రణతం వినయోపేతమ్**
**ప్రహృష్టం రాక్షసేశ్వరమ్ ।**
**అనుగృహ్య స్వమాహాత్మ్యాత్**
**రేణుకోఽన్తర్హితోఽభవత్ ॥ 21-36**

ఇలా సంతోషముతో వినయముతో ప్రణామములర్పించిన రాక్షసేశ్వరుడైన విభీషణుని అనుగ్రహించి రేణుకగణేశ్వరుడు తన మహిమాశక్తితో అంతర్ధానమయ్యెను.

**విభీషణోఽపి హృష్టాత్మా**
**రేణుకస్య ప్రసాదతః ।**
**శివభక్తిరసాసక్తః**
**స్థిరరాజ్యమపాలయత్ ॥ 21-37**



విభీషణుడు కూడా శ్రీరేణుకగణేశ్వరుని ప్రసాదముతో సంతోషించినవాడై శివభక్తిరసాసక్తుడై తన రాజ్యమును చిరకాలము సుస్థిరముగా పాలించినాడు.

**రేణుకోఽపి మహాతేజాః**
**సంచరన్ క్షితిమండలే ।**
**ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ**
**పరమాద్వైతభావితః ॥ 21-38**

**కాంశ్చిద్ దృష్టినిపాతేన**
**కరుణారసవర్షిణా ।**
**అపరానుపదేశేన**
**శివాద్వైతాభిమర్శినా ॥ 21-39**

**అన్యాంశ్చ సహవాసేన**
**సమస్తమలహారిణా ।**
**కృతార్థయన్ జనాన్ సర్వాన్**
**కృతినః పక్వకర్మిణః ॥ 21-40**

**దర్శయిత్వా నిజాధిక్యమ్**
**శివదర్శనలాలసః ।**
**ఖండయిత్వా దురాచారాన్**
**పాషండాన్ భిన్నదర్శనాన్ ॥ 21-41**

**యంత్రమంత్రకలాసిద్ధాన్**
**విమతాన్ సిద్ధమండలాన్ ।**
**విజిత్య స్వప్రభావేణ**
**స్థాపయిత్వా శివాగమాన్ ।**
**ఆజగామ నిజావాసమ్**
**కొల్లిపాక్యభిధం పురమ్ ॥ 21-42**

**తత్ర సంభావితః సర్వైః**
**జనైః శివపరాయణైః ।**
**సోమనాథాభిధానస్య**
**శివస్య ప్రాప మందిరమ్ ॥ 21-43**

మహాతేజస్సంపన్నుడైన శ్రీరేణుక గణేశ్వరుడు సదా శివాద్వైతభావభరితుడై ప్రచ్ఛన్నము (గుప్తము)గాను, కొన్ని సమయములలో ప్రత్యక్షముగాను భూమండలమున సంచరించుచూ, కొంతమందిని కరుణాకటాక్షములతో అనుగ్రహించుచూ, మరికొంతమందిని శివాద్వైతజ్ఞానోపదేశముతో కృతార్థులను చేయుచూ, కొంతమందిని మలత్రయనివారకమైన తన సహవాసముతో సంతుష్టులను చేయుచూ, మిగిలిన మరికొంతమందిని కర్తవ్యకుశలురుగాను, పక్వకర్ములుగాను మార్చుచూ, తన ఆధిక్యమును ప్రదర్శించుచూ, దురాచారులైన పాషండు(నాస్తికు)లను ఖండించుచూ, యంత్రమంత్రవిద్యలలో సిద్ధులైన, పరమతములకు చెందిన



సిద్ధులసమూహములను తన ప్రభావముతో జయించుచూ శివాగమోక్త సిద్ధాంతమును స్థాపించి, శివదర్శనాభిలాషియై తనవాసస్థానమైన కొల్లిపాక యను పురమున కేతెంచెను. అక్కడున్న సమస్త శివభక్తులతో సత్కరించబడినవాడై అక్కడి సోమనాథ మందిరమును చేరుకొనెను.

**పశ్యతాం తత్ర సర్వేషామ్**
**భక్తానాం శివయోగినామ్ ।**
**తన్వానో విస్మయం భావైః**
**తుష్టావ పరమేశ్వరమ్ ॥ 21-44**

ఆ సోమనాథమందిరమున తనను చూచుచున్న శివయోగులకు, భక్తులకు విస్మయముకలుగునట్లు తన ఉత్కృష్టభావనలతో పరమేశ్వరుని ఇలా స్తుతించెను –

**దేవదేవ జగన్నాథ**
**జగత్కారణకారణ ।**
**బ్రహ్మవిష్ణుసురాధీశ**
**వంద్యమానపదాంబుజ ॥ 21-45**

**సంసారనాటకభ్రాంతి –**
**కలానిర్వహణప్రద ।**
**సమస్తవేదవేదాంత –**
**పరిబోధితవైభవ ॥ 21-46**

సంసారవైద్య సర్వజ్ఞ
సర్వశక్తినిరంకుశ ।
సచ్చిదానంద సర్వస్య
పరమాకాశవిగ్రహ ॥ 21-47

సమస్తజగదాధార
జ్యోతిర్లింగవిజృంభణ ।
సదాశివముఖానేక-
దివ్యమూర్తికలాధర ॥ 21-48

గుణత్రయపదాతీత
మలత్రయవినాశన ।
జగత్రయవిలాసాత్మన్
శ్రుతిత్రయవిలోచన ॥ 21-49

పాహి మాం పరమేశాన
పాహి మాం పార్వతీపతే ।
త్వదాజ్ఞయా మయైతావత్
కాలమాత్రం మహీతలే ।
అచారి భవదుక్తానామ్
ఆగమానాం ప్రసిద్ధయే ॥ 21-50



అతః పరం స్వరూపం తే
ప్రాప్తుకామోఽస్మి శంకర ।
అంతరం దేహి మే కించిత్
అనుకంపావిశేషతః ॥ 21-51

ఓ దేవదేవుడైన జగన్నాథుడా! విశ్వకారణమునకు కారణమైనవాడా! బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులచే నమస్కరించబడిన పాదముల కలవాడా! సంసారమను నాటకభ్రాంతిని తొలగించువాడా! సమస్త వేదవేదాంతములచేత పొగడబడిన వైభవముగలవాడా! భవరోగవైద్యుడా! సర్వజ్ఞుడా! సర్వకర్తృత్వాది మహాశక్తులను గలిగినవాడా! నిరంకుశుడా! సచ్చిదానందస్వరూపుడా! చిదాకాశమునే దేహముగా గలవాడా! సకల జగత్తుకు ఆధారమైనవాడా! జ్యోతిర్లింగరూపమున కనిపించువాడా! సదాశివాది అనేక లీలామూర్తులను ధరించినవాడా! గుణత్రయముల కతీతమైనవాడా! మలత్రయవినాశకుడా! ముల్లోకములకు సంబంధించిన పంచకృత్యములను లీలలుగా చూపినవాడా! మూడు వేదములను మూడు కన్నులుగా కలిగినవాడా! పార్వతీపతి అయిన పరమేశ్వరుడా! నన్ను రక్షించు! నన్ను రక్షించు! నీ ఆజ్ఞానుసారము నేను ఇన్నంతవరకు భూమిపై మీచే ఉపదేశించబడిన శివాగమములను ప్రసారము ప్రచారము చేయుటకై సంచరించితిని. ఓ శంకరా! ఇక నీ నిజరూపమును పొందవలెనను కోరికతో వున్నాను. అందువలన అనుకంపతో నీయందు లయమగు అవకాశమును ప్రసాదించుము!

**ఇత్యుక్తే గణనాయకేన సహసా లింగాత్తతః శాంకరాద్**
**వత్సాగచ్ఛ మహానుభావ భవతో భక్త్యా ప్రసన్నోఽస్మ్యహమ్।**
**ఇత్యుచ్చైరగదాద్వచస్తనుభృతామాశ్చర్యమాసీత్ తదా**
**దివ్యో దుందుభిరాననాద గగనే పుష్పం వవర్షుర్గణాః ॥ 21-52**

-(శార్దూలవిక్రీడితమ్)

ఈ విధముగా శ్రీరేణుకగణేశ్వరులు శివుని స్తుతించగా, తక్షణమే ఆ సోమేశ్వరమహాలింగము నుండి 'ఓ మహితాత్ముడవైన వత్సా! రమ్ము! నీ భక్తికి నేను ప్రసన్నుడనైనాను' అను పలుకులు వెలువడెను. ఆ ధ్వనిని విన్న అక్కడి జనులు ఆశ్చర్యచకితులైరి. అదేసమయమున దేవతలు దేవదుందుభులు మ్రోగించగా శివగణములు పుష్పవృష్టిని కురిపించినవి.

**శ్రుత్వా లింగాద్వచనముదితం శాంకరం సానుకంపమ్**
**సంహృష్టాత్మా గణపతిరథో జ్యోతిషా దీప్యమానః ।**
**జాతోత్కంఠైః పరమనుచరైః యోగిభిః స్తూయమానో**
**జ్యోతిర్లింగం పరమనువిశత్ స్వప్రకాశం తదానీమ్ ॥21-53**

- (మందాక్రాంతా)

అనుకంపముతో శివలింగమునుండి వెలువడినపలుకులను విన్న రేణుకగణేశ్వరుడు అత్యంత సంతుష్టాంతరంగుడై తేజస్సుతో ప్రకాశించసాగాడు. అప్పుడు అతని సహచరులైన శివయోగులందరు ఆశ్చర్యముతో ఆనందముతో అతనిని స్తుతులతో ప్రార్థించుచుండగా ఆ జ్యోతిర్లింగము సామరస్యముతో ప్రవేశించి ఐక్యుడయ్యాడు.



**లీనే తస్మిన్ శాంకరే స్వప్రకాశే**
**దివ్యాకారే రేణుకే సిద్ధనాథే ।**
**సర్వో లోకో విస్మితోఽభూత్ తదానీమ్**
**శైవీ భక్తిః సప్రమాణా బభూవ ॥ 21-54**

- (ఇంద్రవజ్రా)

దివ్యదేహధారులైన సిద్ధులకందరికీ నాయకుడైన రేణుక గణేశ్వరుడు ఇలా స్వప్రకాశముతో సోమేశ్వరలింగములో ఐక్యముకాగా, సమస్తజనులు అచ్చెరువందిరి. అపుడు శివభక్తి, సర్వోత్కృష్టమైనదను విషయము కూడా ప్రత్యక్షప్రమాణముతో నిరూపించబడినదయ్యెను.

**శ్రీవేదాగమవీరశైవసరణిం శ్రీషట్స్థలోద్యన్మణిమ్**
**శ్రీజీవేశ్వరయోగపద్మతరణిం శ్రీగోప్యచింతామణిమ్ ।**
**శ్రీసిద్ధాంతశిఖామణిం లిఖయితా యస్తం లిఖిత్వా పరాన్**
**శ్రుత్వా శ్రావయితా స యాతి విమలాం భుక్తిం చ ముక్తిం పరామ్॥21-55**

-(శార్దూలవిక్రీడితమ్)

శ్రీవేదాగమములయందు ప్రతిపాదించబడిన వీరశైవమార్గమును నిరూపించునట్టిది, షట్స్థలమార్గమును ప్రకాశింపజేయుకాంతివంతమైన రత్నమువంటిది, జీవేశ్వరుల ఐక్యత అను తామరపూవుకు సూర్యుని వంటిది, శివాద్వైతజ్ఞానమను గుప్తనిధికి చింతామణి వంటిది, సకలసిద్ధాంతములకు శిరోరత్నమువలె నున్న శ్రీ సిద్ధాంతశిఖామణియను శివాద్వైతశాస్త్రమును

ఎవడు తాను వ్రాయుచు, ఇతరులచేత వ్రాయింపచేయుచున్నాడో, ఎవడు తాను వినుచూ ఇతరులకు వినిపింపచేయుచున్నాడో, వాడు నిర్మలములైన ఐహిక సుఖభోగములను మరియు సర్వోత్కృష్టమైన మోక్షమును పొందుచున్నాడు.

ఇతి విభీషణాభీష్టప్రదానం పరిసమాప్తమ్ ।

విభీషణాభీష్టప్రదానము ముగిసినది.

***ఓం తత్సత్ ఇతి***

***శ్రీ శివగీతేషు సిద్ధాంతాగమేషు శివాద్వైతవిద్యాయాం, శివయోగశాస్త్రే శ్రీరేణుకాగస్త్యసంవాదే వీరశైవధర్మనిర్ణయే, శ్రీశివయోగి శివాచార్యవిరచితే శ్రీసిద్ధాంతశిఖామణౌ విభీషణాభీష్టప్రదానం-నామ ఏకవింశతితమః పరిచ్ఛేదః।***

**శ్రీసిద్ధాంతశిఖామణిశ్చ సమాప్తః ॥**

ఓం తత్ సత్ ఇతి.

శ్రీ శివునిచే ఉపదేశించబడిన సిద్ధాంతాగమములందలి శివాద్వైతవిద్యాస్వరూపము, శివయోగశాస్త్రము, శ్రీరేణుకాగస్త్య సంవాదాత్మకము, వీరశైవధర్మనిర్ణయము, శ్రీశివయోగి శివాచార్య విరచితము అయిన శ్రీసిద్ధాంతశిఖామణిలో విభీషణాభీష్టప్రదానమను ఇరువది యొకటవ పరిచ్ఛేదము ముగిసినది.

శ్రీసిద్ధాంతశిఖామణి గ్రంథము ముగిసినది





## శ్రీసిద్ధాంతశిఖామణేః ఆరార్తిక్యమ్

## శ్రీ సిద్ధాంతశిఖామణి ఆరతి

జయ రేణుకగీతే మాతః । జయ రేణుకగీతే ।
రేణుక హృదయవిహారిణి జయ జయ శివగీతే ॥ ప ॥

శ్రీసిద్ధాంతశిఖామణి నామ్నా విఖ్యాతే ।
భక్తాగస్త్యమహర్షేః సుకృతైరవతీర్ణే । ॥ 1 ॥

అధ్యాయైర్వింశతిభిః ఏకేన చ గీతే ।
శివయోగి శివాచార్యైః స్వర్ణాక్షర రచితే । ॥ 2 ॥

అష్టావరణవిధాయిని షట్స్థలసోపానే ।
పంచాచారవిమర్శిని తత్త్వత్రయగీతే । ॥ 3 ॥

గురుచరలింగసపర్యా దీక్షావిఖ్యాతే ।
శతశతభక్తసుగీతే విద్యే బ్రహ్మపరే । ॥ 4 ॥

శరణాగత కరుణారస ఘటశోభితహస్తే ।
నిశ్చలభక్తివిధాయిని మలహారిణిగంగే । ॥ 5 ॥

శ్రీ శివయోగిసువేద్యే శైవాగమవిద్యే ।
షడధికత్రింశద్ బుద్బుద శివసాగరరమ్యే । ॥ 6 ॥

కాశీ పీఠాధీశైః కాంక్షితదిగ్విజయైః ।
ప్రపచనమాలాగ్రథితా భూమండలధార్యా । ॥ 7 ॥

జ్ఞానామృతపరితప్తైః కోటిజనైర్వంద్యే ।
సా త్వం భగవతి మాతః ! జయరేణుకగీతే । ॥ 8 ॥

## క్షమాపణస్తోత్రమ్

యదక్షరపదభ్రష్టమ్
మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ
శ్రీరేణుక గణేశ్వర ॥

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు ।
ఓం సర్వేషాం శాంతిర్భవతు ।
ఓం సర్వేషాం శివం భవతు

ఓం శాంతిః శాంతిః శాంతిః



## శ్లోకార్ధానుక్రమణికా

